
విషయానుక్రమణిక

## చిత్రపటముల వివరణము

త్రివర్ణ చిత్రములు:—శ్రీగాయత్రి, నూర్జహాను గానామృతము-జహంగీరు పరవశత.

సాధారణ చిత్రములు:—స్టాఫర్డు దొరగారి సతీమణి, శ్రీ పాండురంగరావుగారి సతీమణి, శ్రీ న్యాయమూర్తి సదాశివయ్యరుగారి సతీమణిగారులు, శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు, అఖిలభారత ప్రాచ్యవిద్వత్పరిషత్తు, వారిచే సమ్మానింపబడిన పండితబృందము; ఆంధ్ర చిత్రకారులు శ్రీ దామెర్ల రామారావుగారు, శ్రీ చామకూర భాష్యకార్లురావుగారు, శ్రీ వరదా వెంకట రత్నంగారు - రాజమహేంద్రవరము; ౩౯ వ అఖిల భారత జాతీయమహాసభా స్వచ్ఛంద సేవాయువతీబృందము.

ముఖపటము—భీ. రామసోమయాజులుగారు. గతసంచిక ముఖపటము—దామెర్ల రామారావుగారు.






చెన్నపట్టణము, ఫిబ్రవరి ౧౯౨౪

సంపుటము ౧.   రక్తాక్షి సంవత్సరము మాఘమాసము   సంఖ్య ౧.


పురాణస్మృతితరంగిణి

# అగ్నిపరీక్ష


శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు


౧

శ్రీకరాలోకు లుత్తమ శ్లోకు లగుచు, సార్థకాగ్నిపరీక్షలో జయము గన్న
కీర్తిమూర్తుల నక్షరాకృతిగఁ జేయు, ధీరకవిలేఖినికి నమస్కారశతము.

సీ. సములలో నుత్తమత్వము సుస్థిరంబుగాఁ, గాంచి లోకము మెచ్చఁ గన్నవారు
ధర్మపద్ధతి నసిధారావ్రతంబుగాఁ, గాంచి యచ్చపుఁ ద్రోవఁ గన్నవారు
ఒడలు జీవముఁ బరార్థోపయుక్తంబుగాఁ, గాంచి పున్నెపుఁబంటఁ గన్నవారు
సంపద్విపత్తులసత్యమే యూఁతగాఁ, గాంచి శాంతిపదంబుఁ గన్నవారు
చన్నవారయ్యు జగతిలో నున్నవారు, కాలకాలాంతరముల మే ల్గన్నవారు
మానఘనులైనవా రెవ్వ రే నొకప్పు, డుజ్జ్వలాగ్నిపరీక్షలో నున్నవారె.

నరుగువాఁడిన బొగ్గు వజ్రమే యగుఁగాక, యగ్నిపరీక్షయం దవతరించి
పట్టువాఁడిన పొగ వసదమే యగుఁగాక, యగ్నిపరీక్షయం దారి తేఱి
గరుసువాఁడిన మట్టి కనకమే యగుఁగాక, యగ్నిపరీక్షయం దడుగు పెట్టి
అసలువాఁడిన రసం బమృతమే యగుఁగాక, యగ్నిపరీక్షయం దాఁగి నిలిచి
గౌరవమెయున్న నెంతయో ఘనతయున్నఁ, గలిమి యేయున్న నెంతయో బలిమియున్నఁ
సార్థకాగ్నిపరీక్షలో జయము గనక, మర్త్యుఁ డేనాఁటికైన సమర్థుఁ డగునె?

మ. సిరితోఁ బుట్టిన నేమి, మోహనకళాశ్రీకుండు గానేమి; సుం
దరరేఖాంచితుఁ డైన నేమి; విబుధాధారుండు గానేమి, బం
ధురవృత్తంబును గన్న రాజకులచంద్రుం డైన నేమియా, విన
శ్వరకీర్తిం గను టెట్లు పావకపరీక్షాసిద్ధి గాకున్నచోన్.

సీ. కనకాచలం బైనఁ గరఁగి నీరగుఁ గాని, తలఁగునే నిశ్చల ధైర్యలక్ష్మి
వారాకరం బైన వట్టి బీడగుఁ గాని, ప్రిదులునే విపులగాంభీర్యమహిమ
గ్రహరాజమణి యైన గతి తప్పి చనుఁ గాని, సడలునే నిర్మల సత్యదీక్ష
తారామండలం బైన పసి చెడి పడుఁ గాని, జాఱునే సత్క్రియా సహనశక్తి
పుణ్యపాపసుఖాసుఖ భోగరోగ, మిత్రశత్రుశుభాశుభ మిళితమైన
జగతి నగ్నిపరీక్షలోఁ దగులువేళ, మతము విడఁబోరు పడఁబోరు మానఘనులు.

సీ. చల్లగా వినవచ్చు సత్యసంగీతముల్, కల్యాణ విజయ శంఖములలోనఁ
బ్రియముగాఁ గనవచ్చుఁ బ్రేమరత్నంబులు, ఘనమంగళారాత్రికములలోన
దనివిగాఁ గొనవచ్చు దానకంకణములు, ప్రవిమలోదాత్తపాత్రములలోన
హాయిగాఁ దినవచ్చు నమృతఫలంబులు, పావనభాగ్యకల్పములలోన
అగ్నిసాక్షికముగ నాత్మసర్వస్వంబు, విశ్వహితము గోరి వ్రేల్చునట్టి
యజ్ఞదీక్షఁ గొన్న యఖిలపావనమూర్తు, లున్నచోట, జయము గన్నచోట.

చ. కనకధరాధరేంద్ర మొక గవ్వయుఁ గాదు; సురేంద్రలోకనం
దనవనవైభవం బొకతృణంబును గాదు; ప్రకృష్టభోగజీ
వన మొకలెక్క గాదు; భవపావనపావకసత్పరీక్షలో
ననితరలోకలభ్య విజయాభ్యుదయంబులు గోరువారికిన్.

సీ. ఘోరదుస్సహఘనాసార మైనను సరే, సిద్ధచారణపుష్పసేచనం బె
దారుణజ్వాలాసమీర మైనను సరే, సౌరభాచలమంద మారుతం బె

గ్రీష్మప్రచండతాపోష్మమైనను సరే, సితచంద్రచంద్రికాశీతలంబె
భీషణాశనివినిర్ఘోష మైనను సరే, ఖేచరీమధురసంకీర్తనంబె
వాంఛనీయస్వధర్మని ర్వాహమునకుఁ, భావనాగ్నిపరీక్షలోఁ బాలుగొన్న
యచలదీక్షాపరుల కద్వయాత్మకులకు, భీకర శ్రీకరంబు లేకాకరములె.

సీ. అకలంకచరితుల నాపన్నులుగఁ జేయఁ,బూని విశ్వామిత్రు లైన నేమి
పావనవ్రతుల దుష్పథదూషితులఁ జేయ,నెంచి రాక్షసవృత్తిఁ గాంచ నేమి
సద్ధర్మనిరతులఁ జలచిత్తులుగఁ జేయఁ, దలఁచి దయ్యపురూపుఁదాల్ప నేమి
పరిశుద్ధహృదయులఁ బరిశోధనముఁ జేయ, యత్నించి యుద్దండు లైన నేమి
తథ్యమిథ్యావివాద మధ్యస్థపావ, నాద్భుతాగ్నిపరీక్షలో నైనఘనుల
సత్యనిర్మలచరితంబు శాశ్వతముగ, నవని వెలయించువారు బంధువులె కారె.

చ. కలుషము లొందలేవు, మమకారము లందఁగలేవు, దుఃఖసం
కలితకరాళభౌతికవికారము లూఁపఁగలేవు, నిత్యచం
చలవిషయప్రలోభగుణజాలము లాఁపఁగలేవు, వీరులై
యలఘుపదంబుఁ జూఱఁగొన నగ్నిపరీక్షలఁ జేరుధీరులన్.

సీ. ఆనందనందనోద్యానంబునం దైన, సంతానపత్రముల్ సంస్కరించి
మానసకాసారమధ్యంబునం దైన, స్వర్ణాబ్జసూత్రముల్ సంతరించి
సత్కళాసంపూర్ణశశిబింబమం దైన, సిద్ధామృతరసంబు సేకరించి
చారురోహితశక్ర చాపంబునం దైన, సదమలవర్ణముల్ సంగ్రహించి
సార్థకాగ్నిపరీక్షలో జయము గన్న, విశ్వనుతకీర్తులకుఁ గీర్తి విజయపత్ర
సత్కృతులఁ గూర్చి వెలయించు శాశ్వతముగ, సత్కవిబ్రహ్మమంగళా శాసనములు.






కాశీ సోమయాజుల సుందరరామమూర్తి గారు, ఎం. ఏ.

## ఆశయము

శ్రీయుత శ్రీ విక్రమదేవవర్మ మహాశయులు గారు, విశాఖపట్టణము.

శ్రీ విజయనగర మహారాజుగారి కలాశాలో పాధ్యాయులు నాంగ్ల పద్యకావ్యరచనా నిపుణులునగు శ్రీయుత పండిత కాశీ సోమయాజుల రామమూర్తి, ఎమ్. ఏ. గారు సావిత్రీచరిత్రమునందలి తుదిభాగమును, హరిశ్చంద్ర చరిత్రమునందలి తుదిభాగమును గ్రామ్యాంధ్ర భాషయందు రెండు నాటకములుగ రచించి నాకు వినిపింపఁగ విని కడు మోద మొందితిని. తదభినయమును వీక్షింపఁ గుతూహలము గలవాఁడను.

శ్రావ్యప్రబంధము కేవల గ్రాంథిక భాషతోడను దృశ్య ప్రబంధము మాత్రము పాత్రోచిత గ్రామ్యభాషతోడను వెలయవలెనను నాశయముగల నాకు నామూలాగ్రమును గ్రామ్యభాషాభూయిష్ఠమగు నుపరికథితదృశ్య ప్రబంధద్వయము గడుమోద మొదవించుటకుఁ గారణములు తత్సందర్భశుద్ధియు, నాటకోచిత వచనరచనయుఁ బాత్రపోషణమును, రసపూర్ణమునై యున్నవి. ఉపరిలిఖితకారణచతుష్టయమును గ్రహించి నామనము తద్భాషా గ్రామ్యతను గణింపలేదు. విచిత్ర చరిత్ర శ్రోతలు రచనాలోపములను సుస్వాదుఫలరసాస్వాదకులు వలుసులను లెక్కింపరుగదా! ఏతత్కవిగారు గ్రాంథిక భాష నెఱుంగనివారు గారు. అట్లయ్యు నాధునికజనసామాన్యరంజనముకొఱకు నట్టి భాషను బాటించిరి. కవులు స్వీయసమయజనరుచి నాదరించుట క్రొత్తది గాదు. ఉక్త నాటకద్వయము సాధారణ జనులు వాడుకొను చిన్నచిన్న మాటలతోడనే శ్రోతల చిత్తములఁ గరంగించుచు నిజకరుణారసప్రధానతను స్థిరపఱచుటయే కాక, తద్రచయితయొక్క నేర్పునెంతయుం జాటుచున్నది.

ఆనాటకద్వయము ముద్రితమయి ప్రకటితమగునేని, యనేకజనులు సంతోషించుటకు వీలగును.

## గ్రంథకర్త విజ్ఞప్తి

సంభాషణ, పద్యరూపకముగాను, సంగీతరూపకముగాను, లేకుండా, పాత్రోచితవ్యావహారికభాషను ఉంటే, తెలుగునాటకాలు రక్తికట్టవా? అది శోధించడానికే నేనీనాటకాలు వ్రాసినాను. అంతేగాని కావ్యభాషయందు అనాదరణచేత కాదు. రాజసభల

లోనూ, శాస్త్రచర్చలలోనూ పండితశ్రేష్ఠులు కూడా ఉపయోగించేభాష రంగస్థలములో కూడదట. అట్టి సభలకంటే, రంగస్థలానికి వచ్చినకొమ్ము లేమిటి? ఈ పాతికముపైని యేళ్లబట్టి, ఆంధ్రనాటకరచయితలు పెట్టుకొన్న నియమములు రసపోషణకట. అయితే భావపూరితమై, పండితపామరవేద్యమైనవ్యావహారికభాషలో అన్నిరసములూ పుష్కలముగా వస్తే? శ్రోతలకు కన్నీళ్లువచ్చేటట్టు చేయగలుగుతే? నాకు, కావ్యభాషకంటె, రసవంతమైన వ్యావహారికభాష వ్రాయడమే కష్టమని తోచినది. ఆంధ్ర, గీర్వాణ, ఉత్కళ సారస్వతములలో ఆరితేరిన పండితవర్యులు, రసగ్రహణధురీణులు, శ్రీయుత శ్రీవిక్రమ దేవవర్మ మహాశయులు, ప్రోత్సహించినందున, నేను ఈనాటకాలు వెల్లడిచేయడానికి సాహసించినాను. హరిశ్చంద్ర, సావిత్రి సుప్రసిద్ధమైన చరిత్రలు గనుక, రసపట్టైన చివర భాగములనే వ్రాసినాను.

విజయనగరము,
21—11—1924. } కా. సుందరరామమూర్తి.

# హరిశ్చంద్ర

## మొదటిరంగము

కాలకౌశికునియిల్లు; ప్రవేశము తిరగలివద్ద చంద్రమతి.

చంద్ర :—మధ్యాహ్నమనగా వెళ్లినాడు లోహితాస్యుడు. ఇంకారాలేదు! ఎనిమిది గంటలవేళకాదూ ఇప్పుడు? నిన్నా, మొన్నా, దీపాలవేళకే వచ్చినాడే. నేడేమి ఈ యాలస్యం? ఏమి జరిగిందోగదా, ఈశ్వరా? వెళ్లింది అడివామెను. ఏమైనా అవుతుంది. ఏకబురు వింటానో గదా? నాపసికూనవంతు నన్నేల పంప కూడదు, యజమాని? ఏపులో నన్ను వేసుకపోతే, ఈ కష్టాలే పాయె. దేనికీ, జననీ, అన్నపూర్ణా, నీవేఉన్నావు. (పిండి విసురుచు) అయ్యో! వేళ్లు మండిపోతున్నాయి! నడ్డి పడిపోతూంది! మెడలు నిలవకుండా ఉన్నాయి! కాళ్లు తిమ్మిరెక్కిపోతున్నాయి! అంట్లు తోమితోమి చేతులు పొక్కలెక్కినాయి! ఈ పిండి ఎలాగు విసరను? గంపెడు గోధుమ లెక్కడ? నేను విసరడమెక్కడ? బాగా ఎండనైనా ఎండినాయా? తెల్లవారేసరికి ఇయ్యవలెనట! ఎలాగు తెములుతుంది, ఈశ్వరా? తిరగలి ఇంతబరువేమిటి? ఒక్కచుట్టు తిప్పేసరికి నరాలు తోడుకపోతాయిట! విసరకుంటే, చెవులువేడిగాల్పు లొచ్చేటట్టు తిట్లాయె! విసురుదామంటే, చేతులు రాకపోయె! ఇది చాలనట్టు, చలిఒకటి! వంటినిండా బట్టలేదు! తలుపులు వేసుకొందామంటె గదికాదు! ఈపంచను ఎంతరాత్రివరకూ వజవజలాడుతూ విసరవలెనో గదా, దైవమా? అన్ని బాధలకంటే ఎక్కువ, లోహితాస్యుడు ఇంకారాకపోవడం! నేనేమైతే నేమి! పిల్లవాడు, కొనసాగవలసినకొమ్మ,

వంశవర్ధనుడు, చక్కనిచుక్క, గుణాల పోగు, ఏమయ్యాడోగదా? ఏమైనాడోగదా? —ఆఁ, ఏమిటాచప్పుడు? అడుగుల చప్పుడులాగున్నది! అవచ్చేది బాబయ్యే మిటిచెప్మా? బాబా, లోహితాస్యా!— సరి, నా కా అంత టిఅదృష్టం? ఏమి వినవలసున్నదో? కాని, కూడా అందరు పెద్దకుర్రవాళ్లున్నారే? చాలా మంచివాళ్లటే? నాబిడ్డణిచూస్తే చాలా ప్రేమటే? ప్రమాదం రానిస్తారా?— అయ్యో, ఏమిటీవెర్రి? వాళ్లేంచేయ గలరు, పెద్దపులో, పామో, వస్తే?— అదుగో, మళ్లీ అడుగులచప్పుడవుతూందే! నాన్నా, లోహితాస్యా!

లోహితాస్యుడు ప్రవేశించును.

లోహి:—చిత్తం, అమ్మాజీ.

చంద్ర! — (దిగ్గునలేచి, ఎదురుగుండా వెళ్లి, ఎత్తుకొనివచ్చి, గుండెలకు అదుముకొని, తిరగలివద్ద పిల్ల వానిని కాలుమీదకూర్చుండ బెట్టుకొనును). నాతండ్రీ, నిజంగావచ్చావోయ్? నానాన్న రావోయ్! నాబాబు రావోయ్! నాచిట్టి, రావోయ్! ఏమి, నాన్నా ఇంతాలస్యం చేశావ్? నీకోసం తపించిపోయినానోయ్, బాబా!

లోహి:—ఎందుకమ్మాజీ, తపించిపోవడం!

చంద్ర:—ఇంతాలస్య మైనదనీ, ఏమైనదో అని తల్లడిల్లిపోయినానోయ్, తండ్రీ!

లోహి:—ఎనిమిదిగంటలైనదో, లేదో, ఇదే ఆలస్యమా, అమ్మాజీ!

చంద్ర:—ఈ రెన్నాళ్లిలా వేగముగా వచ్చినావే? నేడేమి ఇంతాలస్యం, నాయనా?

లోహి:— ఈదినం శుక్రవారమని మాతాన్నపూర్ణకు కుంకుమపూజ చేసుకొన్నాను! ఇంతవేళైంది, రావడానికి.

చంద్ర:—కుంకుమెక్కడిదీ? ఎవరిచ్చినారు?

లోహి:—నాజట్టుదారుడు, పార్వతీశం.

చంద్ర:—ఎంతపుణ్యం చేసుకొన్నావోయ్, తండ్రీ, లోకమాతపూజచేయడానికి!

లోహి:—ఆ పూజారి ఎంతమంచివాడోగాని, అమ్మాజీ, నన్నే స్వయంగా పూజచేయనిచ్చినాడు. అతడు నామములు చెప్పడమూ, నేను పూజచేయడమూ, సహస్రనామాలు అయేవరకూ! "వాళ్లకి ఎవరికీ శలవివ్వక, పూజచేయడానికి నాకెందుకిచ్చినావ్?" అన్నాను.

చంద్ర:—అంటే ఏమన్నాడు?

లోహి:—"నీవు హరిశ్చంద్రచక్రవర్తియొక్క కుమారుడవు కావా?" అన్నాడు. "నీ కెలాగు తెలుసును?" అన్నాను. "కాకుంటే ఈముఖ మెవరికుంటుం"దన్నాడు.

చంద్ర:—అన్నాడోయ్, తండ్రీ? (వాని ముఖము ముద్దు పెట్టుకొనును.)

లోహి:— ఇంకా వినుదురో, ఏమన్నాడో. "మీ గోత్రనామాలతో ప్రతిదినమూ మేము మాతాన్నపూర్ణపూజ చేస్తాంటామ"న్నాడు. అలాగెందుకు చేస్తారమ్మాజీ? బాబయ్య చక్రవర్తనా?

చంద్ర:—అవును, బాబా! నేను కాశీలో ఉన్నానన్నమాటేగాని, ఒక గంగలో స్నానమా? మాతాన్నపూర్ణ దర్శనమా? విశ్వేశ్వరుని దర్శనమా? యజమాని గుమ్మం దిగనివ్వడుగదా!

లోహి:—అమ్మాజీ, గంగ ఎక్కడో ఉన్నదా? మాతాన్నపూర్ణ ఎక్కడో ఉన్నదా? తమరే వారు. వారి దర్శనం చేయలేదని విచార మెందు కమ్మాజీ, తమకూ?

చంద్ర:—నీ కెవరు చెప్పినారోయ్, బాబా, ఈ మాటలు?

లోహి:—కామేశ్వరం అన్నాడూ, "లోహి తాస్యా, మీ తల్లేమిటి? అన్నపూర్ణే మిటి? ఒక్కమారు వారి దర్శనంచేస్తే, చాలదోయ్ జన్మకూ?" అన్నాడు.

చంద్ర:—నా చిట్టివాడి కెంతభక్తోయ్, నేనంటే! కాని, తండ్రీ, వెన్నుకి కడుపు అంటుక పోయిందోయ్, ఎంత ఆకలితో ఉన్నావోగాని! ప్రొద్దున్ననగా తాగిన గంజి, ఎలాగు భరించినావోయ్, నాయనా అంత ఆకలి?

లోహి:—చాలా ఆకలిగానే ఉన్నది, అమ్మాజీ! ఈ మూన్నాళ్లూ ఆకలి చాలా బాగా వేస్తూంది. కష్టపడి పనిచేస్తే కణ కణ లాడుతూ ఆకలేస్తుంది. తినడానికి ఉండాలిగాని, నాగభూషణం అన్నాడూ, "ఎప్పుడు చూచినా, సవుకర్ల చేతుల్లోనే కాదూ, గొప్పవాళ్ల పిల్లలూ? ఒక్కమారు కాలు కింద పెట్టనివ్వరు గదా? ఎప్పుడూ ఏదో ఒకటి తింటునే ఉంటారు. వారికి ఆకలి వేయుమంటే, ఏంవేస్తుంది?" అన్నాడు.

చంద్ర:—ఎన్ని నేర్చుకొన్నావోయ్, తండ్రీ, ఈ మూన్నాళ్లలోనూ!

లోహి:— ఇంకా ఎన్ని నేర్చుకొంటానో? కష్టాలవంటి గురువు లేడన్నాడు కృష్ణమ్మ.

చంద్ర:—నిజమే, తండ్రీ-కాని మాటల కేమి? ముందు గంజితాగు.

లోహి:—(త్రాగి) ఆకలి ఏమీ తీరలే దమ్మాజీ. మరి లేదూ?

చంద్ర:—నాగంజికూడా ఇచ్చివేసినానోయ్, నాయనా, మరెక్కడిదీ?

లోహి:—ఏమమ్మాజీ, మీ గంజికూడా ఇచ్చివేసినారా?

చంద్ర:—అవును, తండ్రీ, ఆకలితో వస్తావనీ.

లోహి:—ఆమాట ముందేల చెప్పలేదూ?

చంద్ర:—చెప్పి ఉంటే?

లోహి:—తాగడం మానివేతునూ. నా గంజి కూడా తమకే ఇచ్చివేతునూ.

చంద్ర:—నా చిట్టివాడా, నీ మాటలు వింటూంటే, బాధలన్నీ మరిచిపోతానోయ్! నీ ఆకలి ఎలాగు చూడగలను, బాబా?

లోహి:—తమ ఆకలి నేను మాత్రమూ చూడగలను?

చంద్ర:—అందరికీ అన్నంపెడుతూ, నా పసి బిడ్డకు మూకుడు గంజి లేకపోయెనా, తల్లి,

అన్నపూర్ణా? లేకపోవడమేమి? మేమేమి చేసుకొన్నామో? అనుభవించక తీరుతుందా?

లోహి:—ఏడవకం డమ్మాజీ, ఏడవకండి. (తనచొక్కా తీసి వేస్తున్నాడు)

చంద్ర:—చొక్కా ఏల తీసివేస్తావు, బాబా, చలి పక్కలు వంచుకపోతూంటే?

లోహి:—ఎందుకా? ఇందుకూ. (దానితో తల్లి కన్నీళ్లు తుడుచును) మరేమున్నది తుడవడానికి?

చంద్ర:—నా కన్నీళ్లు నీనుంచేనోయ్; నీబాధ చూడలేకేనూ-

లోహి:—అందుకే నాబాధ ఎప్పుడూ చెప్పను.

చంద్ర:—కాని, బాబా, నీవు గోచితో వెళ్లినావే, నీ కాచొక్కా, ఆలాగూ ఎక్కడివి?

లోహి:—నారాయణిచ్చాడు ఈ రెండున్నూ. ఎంతమంచివా డంటా రమ్మాజీ, అతడు!

చంద్ర—అయ్యో! పట్టుబట్టతప్ప మరేమి కట్టి ఎరుగని ఈ యువరాజు, ఈ ఆగర్భ శ్రీమంతుడు, ఎవరో అట ఒక చింకి చొక్కా, చింకిలాగూ ఇచ్చినారని పొంగి పోతున్నాడు! హా, విశ్వేశ్వరా!

లోహి:—అమ్మాజీ, మనవిచేస్తాను, చిత్తగించండి. అదొక వేషం, ఇదొక వేషం. గోచీతో, ఈ చలిలో, అడివికి వెళ్ళేవానికి, ఈ చొక్కా, ఈలాగూ గొప్పవి కావూ? పట్టుమాత్రం ఇంతకంటె చలి బాగా ఆగుతుందా? ఎప్పటివో వెనుకటి పట్టుబట్టల మాటెందుకు? ఇప్పటి ఈ గోచీపాతరాయనికి ఇది ఎంతో లాభం అనుకోవలెను. తమకుకూడా కప్పుకోవడానికి ఎవరినైనా అడిగి తేవలెను.

చంద్ర:—హా, జ్ఞానికి కష్టము లంటవుగదా? వయస్సుతో ఏంపని?— బాబా, ఎంత దూరము అడివి?

లోహి:—రానూ పోనూ, ఒక ఆమడ ఉంటుందట.

చంద్ర:—నడవ గలిగినావా?

లోహి:—తమరు అంట్లుతోమగలిగే తోముతున్నారా? ఎక్కడి కమ్మాజీ? బాధ పడ్డాను నడవలేక. అదిచూచి జాలిపడి విశ్వపతిశాస్త్రి నన్ను చంకపెట్టుకోబోయినాడు. నేనే వద్దన్నాను.

చంద్ర:—ఎందు కన్నావు, కన్నా?

లోహి:—ఎందు కెత్తుకోవలెను? ఒకరికి శ్రమెందుకియ్యవలెను?

చంద్ర:—నిజమే, కాని అతడే ఎత్తుకొంటానన్నాడే, నీవడగకుండా?

లోహి:—అయితే మాత్రం, శ్రమ ఏమవుతుంది? అతడూ నావంటివాడే-

చంద్ర:—ఎలాగవుతా డోయ్, బాబా? వాళ్లకలవాటూ, దూరంనడవడం. నీకేం అలవాటున్నది?

లోహి:—నాకూ అవుతుంది, నడుస్తూంటే. నడవకుంటే, ఎప్పటికీ కాదు. అమ్మాజీ, నాకింకా ఎన్నాళ్లున్నదో ఈ దాస్యము? అలవాటు చేసుకోవద్దూ నడవడం?

చంద్ర:—(తనలో) ఆహా, ఏమి ఈపసికూన జ్ఞానం! వీని ఓర్పు!

లోహి:—కాని, అమ్మాజీ, దూరమైతే అయిందిగాని, ఆ అడివిలో ఉన్నంతసేపూ, శ్రమంతా మరిచిపోవడమేగదా? ఆ పరిమళమూ, ఆ ఆకులూ, ఆ పువ్వులూ, ఆ కాయలూ, పాలవెల్లికి కట్టినట్టు, చెట్లని ఆ కమలాఫలాలు-

చంద్ర:—ఆ పళ్లేమైనా తిన్నావా ఆకలికి?

లోహి:—ఏలాగు తినేది, అమ్మాజీ, మనవి కానప్పుడు? సమిదెలూ, ఆకులూ తెస్తున్నామంటే, దానివల్ల ఎవరికీ నష్టంలేదు. పళ్లు అలాంటివా? ఎవరికి నష్టంవస్తుందో మేము తింటే?

చంద్ర:-(వానిని గుండెలకదుముకొని, ముఖానికి ముఖముచేర్చి) అవును, తండ్రీ ఆనీతి ఎప్పుడూ మరిచిపోకు. కాని, ఏదీ చూతాం, బాబా, పాదాలు పొక్కలెక్కినాయేమో, అయ్యో, తండ్రీ, ఎంతబాధ పడుతున్నావోయ్, నాకడుపున పుట్టీ! (పాదాలు చూచును)

లోహి:—ఆఁ! ఆఁ! ఆపాదం ముట్టుకోకండి అమ్మాజీ! ఆఁ! ఆఁ! వద్దు వద్దు!

చంద్ర:—ఏం తండ్రీ, పాదం ఇలావాచిందీ? అయ్యో, కొడకా!

లోహి:—ముల్లుగుచ్చుకొంది, పాదంలో-

చంద్ర:—ఇదుగో పైకి కనిపిస్తూందే!

లోహి:—చాలా లోతుగా దిగిపోయింది. పెద్దముల్లు—

చంద్ర:—ఏమీ, దానితోనే ఇంతదూరం నడిచినావా, తండ్రీ?

లోహి:—అవునమ్మాజీ, ఏం చేసేది? అడివిలో కర్రవాళ్లు తీయబోతే, వచ్చింది కాదు, రక్తమే వచ్చింది.

చంద్ర:—అయ్యో, కొడకా! నేనేంచేతునూ? ఎలాగు తీయడం?

లోహి:—ఏమి చేయ నక్కరలేదమ్మాజీ. చీము పోస్తే, చులాగ్గా అదే వస్తుంది.

చంద్ర:—నాన్నా, ఈ ముల్లు, నీపాదంలో కంటే లోతుగా నాహృదయంలో నాటినట్టున్నదోయ్!

లోహి:—ఏడవకం డమ్మాజీ, ఏడవకండి. నాకీ నొప్పికంటె ఎక్కువబాధ తమయేడ్పు చూడడం. తమరు నాబాధ చూడలేరనే, తమతో చెప్పలేదు.

చంద్ర:—ఏమి ఈపసికూన ప్రేమ! వీని మాటలు విన్నకొలదీ, నా విచారమునకు వన్నె వస్తున్నదే! ఇంతప్రేమను బయలుపెట్టే విచారము నిజముగా కోరదగినదే! ప్రేమ ఈశ్వరుని స్వరూపము. అట్టి ప్రేమను విస్తారముగా బయలుపెట్టే విచారము ఏమైఉండవలెను? చేదు వేపచిగుళ్లు ఆరోగ్యమును ఎక్కువ చేసినట్టు, కష్టాలు ప్రేమను వృద్ధిచేయునే! పంకములోనుంచి పద్మం పుట్టినట్టు, కష్టంలోనుంచి ప్రేమ పుట్టడమా? దైవభక్తి ఎక్కువ చేయడమా? ఏమి, కష్టాల మహిమ! "ఈకష్టందాటించు, దైవమా!"

అన్నట్టు, "ఈసుఖం నిలబెట్టు ఈశ్వరా" అని అనేవాళ్లున్నారా? వశిష్ఠ భగవాన్లువారు కనిపించినా, నాభర్తను కలుసుకొన్నా — మళ్ళీ కలుసుకొంటామా? ఎలాగున్నారో గదా? ఆచండాలసేవలో ఏమిబాధలు పడుతున్నారో గదా, ఈశ్వరా?

లోహి:— జ్ఞానికి కష్టా లంటవని తమరే అన్నారే?

చంద్ర:— అవును, బాబా- కాని, ముల్లుంచి వేయకూడదు-

లోహి:— తమచిత్తం, అమ్మాజీ! (తల్లి ముల్లు పెరికి వేయును) హా, శంకరా! హా, రక్షకా, విశ్వనాథా!

చంద్ర:— తండ్రీ, ఎన్నికష్టాలువచ్చినా, భగవంతుని మరిచిపోకు. వాడే దిక్కు. కాని, ఎంతరక్తం వచ్చినదోయ్, నాయనా, ముల్లుతో!

లోహి:— అమ్మాజీ, తమకు తెలియనిది నేనేమి మనవిచేయగలను? రాచబిడ్డకు భయమేమిటి రక్తమంటే? యుద్ధములో రక్తము జుర్రేవానికి, రక్తమంటే భయమా? వానికి నొప్పిఅనగా ఏమి? — ఆఁ! ఆఁ! గాయం తుడవకండి, అమ్మాజీ!

చంద్ర:— తుడవడానికి గుడ్డైనా లేక—

లోహి:— కొంగుతో తుడవకండి, పాడైపోతుంది—

కాలకౌశికుడు:— (లోపలనుంచి) ఎవడ్రా, గాడిదలాగు, ఆ కేకలు? ఆఁచింబోతులాగు తిని ఆటంద్ర బెట్టడమేమిరా, నాగమ్మా! పట్టక పట్టక కునుకుపట్టితే, ఆ కేకలేమిరా! తులువా? తిండి వంటపడుతూందిరా; ఆఁ!

లోహి:— పొరపాటు, స్వామీ, పొరపాటు, తమనిద్ర భంగంచేయడం. క్షమించండి, మరి కేకలు వేయను.

చంద్ర:— అమ్మో, బాధతీరా ఏడ్వడానికైనా నోచుకోమైతిమా, విశ్వేశ్వరా?

రెండవరంగము

కాలకౌశికునియిల్లు; ప్రవేశము, సోఫామీదకలహకంఠి, ఎదురుగా చేతులుజోడించుకొని చంద్రమతి.

కల:— ఏమీ, చంద్రమతీ, నీకొడుకు పాము కరిచిపోయినాడనా అన్నావు?

చంద్ర:— అవునమ్మా.

కల:— అందరిలోనూ నీకొడుకే కానొచ్చినాడా పాముకి? నిన్న వెళ్లి కాలులో పెద్దముల్లువిరుచుకో వచ్చాడు, నేడుచచ్చాడు.

చంద్ర:— ముల్లుగుచ్చుకొందని ఇంట్లో కూర్చున్నాడా? కాలు మెద్దుకొంటూ పాపం మళ్లీ అడివికి వెళ్లుమనగానే వెళ్లినాడు, పసికూన—

కల:— ఎవడికోసమని వెళతాడు? పసికూనలు! నిలువెడు పిల్లవాడు పసికూన!

చంద్ర:— గాయంలోకి ఇసక వెళ్లకుండా కట్టడానికి చిన్నగుడ్డ అడిగితే, వినలేని తిట్లు తిట్టినారు. నాచీరలో చింపి కట్టి పంపినాను.

కల:—ఎవరికా ఉద్ధరింపు?

చంద్ర:—పిల్లవానివంతు నేను వెళతానంటే కేకలువేసి బుగ్గపోట్లు పొడిచినారు.

కల:—ఇంట్లో పనులన్నీ నీయబ్బ ఎవరుచేస్తా రనుకొన్నావు? నీకొడుకు చావుకాదు గాని, నా బండెడుసొమ్మూ గంగలో కలిసింది—

చంద్ర:— ఆయనా అలాగే అన్నారు—

కల:—ఎవరైనా అంటారు, అనరూ? సొమ్మా మన్నా? అయితే ఏమంటావు? నీకొడుకును వెతికి తెప్పించుమంటావేమిటి?

చంద్ర:—నేనేవెళ్లి వెతుక్కొంటాను, శలవు దయచేయండి.

కల:—వాణ్ణి వెతకడానికి ఈ రాత్రి వేళవెళ్లి నీవుకూడా చస్తే? ఆదండుగకూడానా? చాలుచాలు! సిగ్గులేక ఏమని అడిగావు?

చంద్ర:—అమ్మా, సంస్కారముచేసి వెంటనే వస్తాను. ఆయన్ను అడుగుతే, తమర్ని అడుగుమన్నారు. శలవియ్యండి. మీకు చాలా పుణ్యం వుంటుంది.

కల:—సరే. కాళ్లుపట్టి వెళ్లు.

చంద్ర:—చిత్తం. (కాళ్లుపట్టును)

కల:—నీకొడుకు చచ్చాడని, మామూలు మరిచిపోయినావూ? పాడుతూపట్టు.

(చంద్రమతి ఇలాగు పాడుతూ కాళ్లు పట్టును:)

(నటుమని కిష్టమువచ్చినపాట, శివస్తోత్రముగాని, దేవీస్తోత్రముగాని, పాడవచ్చును. కరుణారసమైన రాగ మువిూదని శ్రేష్ఠము.)

కల:—మరివెళ్లు. అక్కడపనికాగానే వెంటనే రావలెను సుమా!

చంద్ర:—చిత్తం. (తెర)

మూడవ రంగము

స్మశానము; ప్రవేశము హరిశ్చంద్రుడు, లోహితాస్యుని శవముతో చంద్రమతి.

హరి:—అక్కడెవరో శవము దహనము చేయడానికి మంటచేస్తున్నట్టున్నది. ఎవరక్కడ?

చంద్ర:—ఎవరా అడిగేది?

హరి:—నేను, కాటికాపుని.

చంద్ర:—నాపిల్లవాడు అడివిలో సర్పదష్టుడైపోయినాడు. సంస్కారము చేయడానికి వచ్చినాను.

హరి:—ఇంతరాత్రి వేళనేమి? ఇప్పుడు కాపెవరూ ఉండరనుకొని దొంగతనముగా దహనముచేతామని వచ్చినావేమి?

చంద్ర:—దొంగతనముగా చేయవలసిన అవసరమేమి? అడవిలో ఎక్కడోపడియున్న పిల్లవాన్ని వెతికి వెతికి, చితుకులుఏరి ఇక్కడికివచ్చేసరికి ఇంత వేళయినది.

హరి:—సుంకము తెచ్చినావా?

చంద్ర:—సుంకమియ్యవలెనా?

హరి:—అవును. ఇయ్యకుండా సంస్కారము చేయకూడదే ఈస్మశానములో.

చంద్ర:—ఏమీ లేనిదానను క్షమించి-

హరి:—ఎవరినైనా అడిగి తీసుకొనిరా. లేకుంటే ఇక్కడ సంస్కారము చేయ

నివ్వను. ఆ మండుతూన్న కర్రలు వెంటనే తీసివేయి.

చంద్ర:—బ్రతికి చెడ్డదానను, దయఉంచి, సంస్కారము చేయనీ.

హరి:—మండుతున్న కర్రలు ఇంకా తీసివేయ కుండా మాట్లాడుతున్నావా?

(అక్కడికి వెళ్లి శవమును తిరగదోసి కర్రలు తీసివేయును.)

చంద్ర:—నీకేమి జాలిలేదా? శవమును కిందికి తిరగదోస్తావా? (శవమును కాలు మీద పెట్టుకొని) నాయనా, ప్రాణము పోయినా, నీవొళ్లు ఎంత మృదువుగా ఉన్న దోయ్! ఇన్నికష్టములొచ్చినా, నాగుండె గట్టిపడనట్టు, నీశరీరము గట్టిపడలేదు తండ్రీ! ఈఉదయం నీవులేవడం ఆలస్యం అయినదని యజమాని నిన్ను నామీద తోసివేస్తే, కంటతడిపెట్టినావుకావు. నీతల తగిలి నాచెయ్యి ఎంతో నొప్పెట్టినది. నీతల ఎంతనొచ్చియుండునో, నాయనా? మరి కేకలు వేయనని, నిన్న రాత్రి అన్నా వనా, ఏడవలేదు, బాబా? ఇప్పుడు నిన్ను ఈకాటికాపు తోసివేస్తే, నీకు నొప్పితెలి యకపోయినా, నాకెంతనొప్పిగా ఉన్న దోయ్, తండ్రీ! (గుండెలకు శవమును అదుముకొనును)

హరి:—(తనలో) ఈస్త్రీ ఎవరై ఉండునో? అడవిలో వెతకడము, ఇంత రాత్రివేళ స్మశానమునకు రావడము, ఏమి సాహ సము! ఆ మాసినగుడ్డ, ఆ చింకిరితల, ఆ ఖేదము, ఆ ముఖానికి ఆ మంటల వెలుగున ఎంత భయంకరమైన అంద మిస్తున్నవో! ఆమె వైఖరిచూచినా, ఆమె మాటలు విన్నా, అగ్రజాతి స్త్రీఅయి ఉండవలెను- నీవెవరవు?

చంద్ర:—ఒకరింట పనిచేస్తున్న దాసిన దానను.

హరి:—(తనలో) అంతచక్కనిది దాసినదా! ధూళికప్పిన ముఖమును కన్నీళ్లు కడిగి, ఆ కాలువలలో ఆమె స్వచ్ఛమైన స్ఫూర్తిని ఎలాగు కనపర్తున్నవో, బంగారు చెక్కలో ఉలితో నాటువేస్తే కనబడేటట్టు! నీ పిల్లవాడు 7-8 సంవత్స రములకంటె ఎక్కువున్నట్టు తోచదు. అంత చిన్నవయస్సులో అడివికి ఏమని పంపినావు?

చంద్ర:—పెద్దపిల్లవాళ్లతో వెళ్లినాడు. మూడుదినములు వెళ్లి, ఈదినమే పాము కరిచి పోయినాడు. ఈ సాయంత్రము దీపాలవేళ పిల్లవాళ్లు వచ్చి నాతో చెప్పి నారు. ఎంతో బ్రతిమాలుకొంటే, సంస్కా- రము చేసి వేగముగా రమ్మని యజమాను లు శలవిచ్చినారు.

హరి:—(తనలో) దాసితనమూ, తల్లి కొడుకూ, ఆముఖములూ, ఆవయస్సూ, ఆమాటలపొందికా, ఆమె—

చంద్ర:—నేను తిరిగీ ఇంటికి వేగముగా వెళ్ల వలెను. సంస్కారము చేయడానికి వెంటనే శలవియ్యి, నీకు చాలా పుణ్యం ఉంటుంది.

హరి:—నీకెనిమిటి లేడా?

చంద్ర:—(తనలో) ఏమయినారో తెలియ దాయె. ఏమిచెప్పేది? నావద్ద లేరు.

హరి:—సరే, నీవు వెంటనే వెళ్లి నీయజమాన్ని అడిగి సుంకం తీసుకొనిరా.

చంద్ర:—పిల్లవాడు అడివిలో ఎక్కడో చచ్చి పోయినాడని నేనంటే, "వాడుపోతే, నీకేం పోయింది? వాని సంరక్షణే పాయె, బ్రతి కావు. కాని వాడు చావడంవల్ల నాకెంత డబ్బు గంగలో కలిసిందో చూడు! మీాయి ద్దరిని బండెడు సొమ్మిచ్చి కొనుకొన్నాను. దానికేం అంటావు?" అన్నాడు యజ మాని. అతడిస్తాడని ఏలాగనుకొనేది?

హరి:—నేనేమిచేయగలను? సుంకం ఇవ్వ కుంటే దహనము చేయనివ్వను.

చంద్ర:—అయ్యో, ఎంతవానికుమారునికి ఎంత వచ్చినది! ఎంతగతిలేనివాని శవమై నాదహనము కాకుండా ఉండిపోయిందా? తండ్రీ, నీగతి ఈలాగుపట్టినదా? నిన్న రాత్రే, ముల్లుతో రక్తంవస్తే, "యుద్ధంలో రక్తం జార్రేవానికి రక్తమంటే భయమే మి?"టన్నావు, కొడుకా! ఇప్పుడు నన్నేమని ఓదారుస్తావు. నాయనా! నీవు పోయినావని ఏడ్చేదా? నీ శవం దహనంచేయలేనంత లేనిదానననని ఏడ్చేదా? సరి, ఏడుస్తూంటే, ఏమున్నది? పోయి సుంకంకొరకు ప్రయత్నించవలెను. కాని, ఈ శవాన్ని ఏమిచేసేది? శ్రమైతే అయింది, తీసుకొనివెళ్లి ప్రయత్నం చేతా మంటే, ఏవరూ చేరనీయరేమో? ఉంచి వెళదామంటే, మళ్లీ వచ్చేసరికి, ఏమవు తుందో? కాటికాపు చూస్తాడా? శవాన్ని తిరగదోసినవాడు, వానికేంపట్టింది? కానీ, ప్రభో, విశ్వేశ్వరా, నీవు స్మశానవాసివి. నేను వచ్చేవరకు, నాపిల్లవాని శవమును చూస్తూండవా? నేనే పతివ్రతనైనయెడల శవము, నేనుంచినట్లె ఉండుగాక! తండ్రీ! నీ దేహము, దహనము లేకుండానే, ఎంత మన్నయినదో! దహింపబడేది గనుక దేహమన్నారు. నీపట్ల ఆయర్థము వ్యర్థ మయినదా, నాయనా! (మన్నుదులిపి క్షితి పైనిపెట్టును)

హరి:—మన్ను కావలసి ఉన్న శవానికి మన్ను దులుపుతూంది! మాతృప్రేమకు మేర ఉన్నదా? ఆమాటలు వింటూంటే, నా కడుపులో మంట పుట్టుచున్నదేమీా? "ఎంతవాని కుమారున కెంతవచ్చినది!" అన్నది; నాయంతవాని కుమారునకు దాస్యము వచ్చినది! ఇదికూడా ఏల రాకూడదు? "యుద్ధములో రక్తంజార్రే వాడ"ట! క్షత్రియబిడ్డ కావలెను, ఆమాటలు అనడానికి. "మిమ్మల్ని బండెడు సొమ్మిచ్చి కొనుకొన్నాను"— నాలోహి తాస్యుడై ఉండవలెను. నాచేతులారా నేనే అమ్ముకొన్నాను. ఆమెకు భర్త దగ్గిర లేడట. నేను చంద్రమతిదగ్గిర లేనే? "నేనే పతివ్రతనైతే"—కారుచిచ్చు భయ పడి తోవ ఇచ్చివేసినది చంద్రమతి పాతి వ్రత్యముచూచి. ఇప్పుడు శవముజోలికి జంతువులు రాకుండా శాసించలేదా ఆ బలము? అయినా, అడిగి చూడవలెను.

—నీవు చంద్రమతివి కావూ? నిన్ను కొన్నవాడు కాలకౌశికుడు కాడూ?

చంద్ర:—(తనలో) ఈమనిషి నాభర్తవలె ఆజానుబాహు, నీచవృత్తిలో అటువంటి వాడు ఉండునా? ఆయన్ని వీరబాహుడు కొన్నాడు. కాటికాపుగా నియమించి ఉండును. అయినా జాగ్రత్తగా మాట్లాడవలెను:—నన్ను పోల్చుకొన్న బుద్ధిశాలికి నానాథునిజాడ తెలుసునా!

హరి:—నేనే నీ భర్తను, హరిశ్చంద్రుడను!

చంద్ర:—ఆఁ! ఆఁ! (వానిమీద పడును. వారిద్దరు ఆలింగనము చేసుకొందురు)

హరి:—మనము ముగ్గురమూ, ఇలాగున, ఇక్కడ, ఇప్పుడు కలుసుకొన్నామా? స్థితి, స్థలము, కాలము—ఆహా! (శవము వద్దకువెళ్లి) లోహితాస్యా, కాలులో ముల్లు గుచ్చుకొన్న గాయముండగానే, మళ్ళీ అడవికి వచ్చినావోయ్? యుద్ధములో రక్తం జుర్రడమూ, వత్సా! నీ కెవరు చెప్పినారోయ్? నీరక్తమే చెప్పినదా? ఎవరితో యుద్ధముచేసినావు, బాబా! (శవమునుకాలుమీద కూర్చుండబెట్టుకొనును) నీబాధ చూడలేక మీ అమ్మ దుఃఖస్తుందని, నీ దుఃఖముతో యుద్ధముచేసి అణచివేసినావా, తండ్రీ? యుద్ధములో శత్రువును గెలవడంకంటె కష్టమయినపని చేసినావా? కాశికి వచ్చేతోవలో, ఎత్తుకొంటానంటే, నీశ్రమను దాచుకొని, వద్దన్న వీరుడవు, మీ అమ్మయెడల—

చంద్ర:—తాను నన్ని కష్టాలుపడుతూ, నన్ను ఓదార్చేవాడు, నాచిట్టివాడు.

హరి:—ఏలాగు శుష్కించి పోయినావోయ్, తండ్రీ!

చంద్ర:—మనము వేరైన ఈ పదిరోజులలో తమరు పోలిక తగలకుండా శుష్కించి పోయినారు, నాథా!

హరి:—ఇన్నాళ్లూ నాకు నిద్రాహారములు రెండూలేవు. బ్రహ్మయజ్ఞము, పితృతర్పణములేకుండా భోజనము చేయనుగదా? అవి, ఈస్మశానములో, చండాల సేవలో ఏలాగుచేయను?

చంద్ర:—మహాదేవ!

హరి:—కాని, బాబయ్యముఖాన్ని ఆనవ్వేమిటి? విశ్వేశ్వరుని ధ్యానిస్తూ ప్రాణం విడిచిపెట్టినావా, నాన్నా? లేకుంటే, ప్రాణంపోయినా, ముఖాన్ని ఆనవ్వేమిటి?

చంద్ర:—బాగా పోల్చినారు, నాథా! ఆకుర్రవాళ్లన్నారు, "అమ్మాజీ, బాబయ్యా, విశ్వేశ్వరా!" అంటూ ప్రాణం విడిచిపెట్టినాడట. "మీరు చాలామంచివాళ్లు, మా అమ్మాజీని ఏలాగు ఓదార్తారో?" అన్నాడట, నాతండ్రి! నాయనా, నీవుపెట్టినచిచ్చు, ఎవరు ఆర్పగలరోయ్?

హరి:—బాబా, నీకు నవ్వూ, మాకు ఏడ్పూనా? నీకష్టాలు గట్టెక్కినాయి, నీకు నవ్వుకాకేమి? బాధములేని మా విచారముచూచి నవ్వవలసినదే.

ద్ర:—బాబా, ఇక్కడ గంజివిడిచిపెట్టి, స్వర్గములో నీవు అమృతం సేవిస్తూ అమృతాన్నిమించిన నిన్నువిడిచిపెట్టి, మమ్మల్ని మాకన్నీళ్లే తాగుమన్నావా? బాబా, నిన్ను కృష్ణమ్మ భోజనానికి పిలుస్తే, "మా అమ్మాజీ చాలీ చాలని గంజి తాగుతూ ఎలాగో ప్రాణాలు నిలబెట్టుకొంటూంటే, మీయింట పిండివంటలు నానోటికి ఏలాగు పోతాయి?" అన్నావే. ఇప్పుడు నన్ను విడిచిపెట్టి స్వర్గ సౌఖ్యం ఎలాగు అనుభవిస్తున్నావు, తండ్రీ! అమ్మకు నీవద్ద చోటిప్పించవూ?

హరి:—ఏమీ; గంజీ తాగేవాడు, బాబయ్య?

చంద్ర:—అదైనా, కడుపునిండా ఎక్కడ? "బాబాజీని ఎప్పుడు చూస్తాము? ఎప్పుడెప్పుడ" నేవాడవు, చూడకుండా వెళ్లిపోయినావా. కొడకా! ఒక్కమారు నిన్ను కాలుమీద కూర్చోపెట్టుకొని ముద్దులాడుతే, అడివికివెళ్లివచ్చిన కష్టమంతా నా చేతుల్లో పోయిందన్నావు. నేను నాకష్టాలన్నీ మరిచి పోయేదానను. తండ్రీ! కష్టాలవంటిగురువు లేడన్నావు. కాని, నీవుపెట్టినకష్టం, ఏమినేర్పుతుంది, బాబా? యజమానిసేవలో ప్రాణమైనా పెట్టవలెననా? నీవు అలాగే చేసినావు. నీవుప్రాణముమాత్రమే విడిచిపెట్టినావు. ఆయజమానిసేవలో, నా ప్రాణముకంటె ఎక్కువ వస్తువును, నిన్ను, విడిచిపెట్టినాను. నేను ఎక్కువకాదు, బాబా? నాథా, 'నన్ను తిరిగీ వేగమే రావలెనని యజమానిఆజ్ఞ. యజమాని ఆజ్ఞను అతిక్రమించకూడదని బాబు శరీరము జ్ఞాపకంచేస్తున్నది, తమ పౌరుష్యం జ్ఞాపకంచేస్తున్నది. నేనువెళ్లి సుంకంకొరకు ప్రయత్నించవద్దా?

హరి:—తప్పకుండా చేయవలసినదే.

చంద్ర—పోయివస్తానని అనడానికి అధికారములేదు. వస్తే, ఏలాగు వస్తానో?

హరి:—వెళతానంటే, మంచిది అనడానికి నోరురాదు! ఈకీకారణ్యం దాటించడానికి అధికారములేదు! బాబయ్యలేని ప్రపంచములో ఇక మనకేమున్నది, సత్యసేవానందముతప్ప? మనకు సత్యమే స్వర్గము. మనకు ఇంతకంటే మరేమిచేటు రాగలదు? మరి నీవువెళ్లు, (చంద్రమతి నిష్క్రమించును) ఏలాగు తిరిగిచూస్తూ వెళుతున్నదో! (తెర)






నడిమిరేయిని కలలోన నాకునీవు
కానుపింపగ మేల్కాంటిఁ గలఁతఁ జెంది
మాయమైపోతి వింతలోనే యెచటికో ?
పక్కపై నొక్కనిని నన్నుఁ బాఱవైచి.

గీ. దూరమున హోరుమను నకూపారరవము
చేరువను గానవచ్చు నాచెట్టుమీఁద
ఘూకములభీకరంబగు కూతదప్ప
లోకమున నెట్టిధ్వని విన రాకయుండె.

గీ. విజనసంచారమైన యీ వీథులందు
వ్యర్థముగ నేరికొఱకో ? యీ యర్ధరాత్రి
విమలశీతలచంద్రికా సముదయంబుఁ
గాయుచున్నాఁడు యామినీ కాముకుండు.

గీ. ఇట్టిచల్లనిరాత్రి నీయింటియందు
నిర్విచారంబుగా నీవు నిద్రపోవ
నొక్కఁడను బిక్కుబిక్కునఁ బక్కపైన
నిన్నుఁదలపోసికొనుచుఁ గూర్చున్నవాఁడ.

గీ. ఱెక్కలేయున్న నాకిప్డె ఱివ్వుమనుచు
నంతరిక్షాన కెగిరి నీ చెంత వ్రాలి
నిదురలో వింత చెలువంబు నెగడునీదు
సుందరాస్యంబు ముద్దాడియుందునుగద.

గీ. నిన్ను నెడబాసి విరహార్తి ఖిన్నుఁడైన
నాయెడ జాలిఁజెంది స్వప్నాననైన
దర్శనంబిచ్చునంతటి దయయుఁ గలిగెఁ
జాలు; పదివేలుసుమ్ము నాపాలి కిదియు.

---

## ఊఁచ బియ్యము

దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు

ముంగురుల్ చెదరి గుంపులుగట్టి నెమ్మోము, దమ్మి ముమ్మరముగఁ గ్రమ్మి కొనఁగ
ముద్దులమురిపెంపు మొగమున మొలకెత్తి, కొమరుఁ జెక్కులఁ జిఱుచెమట జాఱ
తుఱిమిన తంగేడువిరులతోఁ గూడ, నం దంపుధమ్మిల్లబంధము నటింప
శ్రీకారములతోడఁ జెలిమిఁజేసెడు కర్ణ, ముల నొప్పు పల్లేరు పూలు గదలఁ
గీ. దానుబాడెడు మోటు పదంబునకును, కంకణంబులు చెలఁగి పొంకముగఁ దాళ
మానములు గొల్పఁ గూర్చుండి మంచెమీఁద, నబల యోర్తుక ఊఁచ బియ్యంబు గొట్టె.



# ముక్కు తిమ్మనార్యుఁడు

పుండలేఖుల వేంకట శాస్త్రి గారు, బి. ఏ., యల్. టి.

ఆంధ్రభోజుఁడని విఖ్యాతిఁబడసిన శ్రీకృష్ణదేవరాయల కాలమున సామ్రాజ్యలక్ష్మి ననుసరించి కవితాలక్ష్మియు, వాసియు వన్నెయుఁ గాంచి మించినది. అష్టదిగ్గజములను ప్రశస్తివడసిన కవినాథులెనమండ్రు విద్వత్ప్రభుని యాశ్రయము నవలంబించి యుండిరి. ఆకాలమునఁ గవితాప్రపంచమునఁ బ్రబంధరచనయే మిన్నదై యుండుటచేతను, శ్రీకృష్ణదేవరాయలు పండితుఁడగుటచేతను, వాని యభిరుచి ననుసరించి, కవులందఱును ప్రబంధరత్నములతో నాతనిఁ బూజించి ప్రశస్తి వడసిరి. అట్లొనరించిన వారిలోఁ బారిజాతాపహరణ కర్తయగు ముక్కుతిమ్మనార్యుఁడు కడుఁ బ్రసిద్ధుఁడు. మృదుమధుర రసభరితమగు శైలిఁగలవాఁ డగుటచే "ముక్కుతిమ్మనార్యు ముద్దుపల్కు" అని సార్థకబిరుదము నొందెను. "నానా సూనవితాన వాసనల నానందించు" అనుచక్కని, ముద్దులుమూట గట్టు పద్యమును రచించుటచే నితని ముక్కుతిమ్మనార్యుఁడని లోకము వాడుచుండుట యెల్లరకుఁ దెలిసిన విషయము.

ప్రబంధకవులలో నితఁడు సుప్రసిద్ధుఁడు. ప్రబంధములసరణి ననుసరించియు, వానిలోఁ దలతిక్కగానుండి, పాఠకుల హృదయములకు విసుగుగలిగించు కొన్ని లక్షణముల నితఁడు తొలఁగించి, తన రచించిన "పారిజాతాపహరణము"ను నిర్దుష్టము గావించుకొనెను. అందుచే నితని కవిత్వ మన్నిఘట్టములందును మిగుల రసభరితముగ నుండును. సాధారణముగఁ బ్రబంధములలోఁ గథాసరణి మృగ్యము. కథావేగము మొదలే లేదని కూడఁ గొందఱు విమర్శకులు సహేతుకముగ యోచింతురు. ప్రబంధములకు నిర్ణీతములగు వర్ణనలను జేయుటకుఁ గథాసందర్భ ముపయోగింపఁబడునుగాని కథ ప్రధానము గాదని తేలుచున్నది. ఈగ్రంథ మీవిషయమునను దదితరవిషయములందును భిన్నముగ నున్నది. దీనియందుఁ గథయును గథావేగమును బ్రధానములు. ప్రారంభమునుండి, ముగియువఱకును కథాధోరణి యొక్కవిధముగనే చెప్పఁబడినది గాని, సందర్భశూన్యములగు వర్ణనలు కథావేగమునకు భంగముఁ గలిగించలేదు. అందుచేఁ బాఠకుల కిందలియాసక్తి యధికమగుచున్నది. మఱియొక విషయము గలదు. సామాన్య... మునఁ బ్రబంధములయందలిపాత్రము... నొకేవిధముగ నుండును. ఆన... టికి స్వాభావికములగు... బడక మనుష్యస్వ...

తీరుగనుండి, యంత వైచిత్ర్యరహితమా యని యనిపించుచుండును. కారణమేమన, వానిని రచించిన కవులు సాధారణముగఁ బండితులు. కావున గ్రంథసముగు విషయమును నే గ్రహించి యుందురుగాని, సృష్టినుండి విషయములను దామే తొలిసారి గ్రహించినవారు కారు. అందువలన, నాటక, శృంగారాద్యవసరములయందు, పాత్రము లన్నియు నొకేవిధముగ, సంభాషించుచు, ప్రవర్తించుచు నుండును. ఈ గ్రంథమున గల ప్రధాన పాత్రము లట్లుండలేదు. శ్రీకృష్ణుఁడు, రుక్మిణి, సత్యభామ, నారదుఁడు ఇత్యాదులు స్వతంత్రములగు పాత్రములు. అనగాఁ దమంతటతాము నిలచునవి. ఆయాయవసరములందు వారి ప్రవర్తనము సముచితమని యంగీకరింప వలసినట్లుండును. ఇరువురుగాని, యధికముగ గాని కళత్రములుగల యాతఁ డేయవసరములయందెట్లుసంచరించునో శ్రీకృష్ణుఁ డట్లే ప్రవర్తించియుండెను. నారదుఁ డొసఁగిన పారిజాతము నూహించి శ్రీకృష్ణుఁడు:

మ. "ఇది భోజాత్మజ కిచ్చినన్ గినుకతో సేమంచు
నూహించునో, మఱి సాత్రాజితి? దానికే నిపుడు
ప్రేమంబంపినన్ దీనిసెల్లిదమున్ జేసిన జాడ దోఁచు
నొకో? యాలె; మ్ముందు నేమన్కి చెల్లదువో యేరికిఁ
బంపఁగా; ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్.

ఇచ్చుట సమంజసమని యోచించెను.

... స్వాభావికముగ నున్నది? అట్టి
...ధర్మ మనుథ వైకవేద్యమని నాము
... సమయోచిత ప్రవ
...ములును వేఱొకభోఁ

తిక్కనసోమయాజి నాఁ టనుండి యు స్వప్నవృత్తాంతమును దెలుపుచుండుట వాడుకలోఁ జేరినది. కవిబ్రహ్మయగు తిక్కన కాలమున నీవృత్తాంతము రసవంతముగ నుండినను దాని ననుకరించుటయే ప్రధానముగఁ దలఁచినయితరుల వృత్తాంతములు రసభరితములుగ నుండలేదు సరికదా; పాఠకులకు విసుగు గలిగించున ట్లుండును. తమ గ్రంథములయెడ గౌరవాతిశయము గలిగించుకొనుట కిదియొక పన్నగడ యని విమర్శకులు కొందఱూహించఁ దగియున్నది. అట్టి స్వప్నవృత్తాంత మిందుఁ జొన్పఁబడి యుండలేదు. మఱియుఁ జర్వితచర్వణముగ నాచరింపఁబడుసుకవిస్తుతియును గుకవినిందయు నీతని కృతియందు గానరావు. కవితఁ జెప్పఁ దొడఁగిన ప్రతివారును గుకవినింద సేయుచు వచ్చినచో, నిందకుఁ బాత్రులగు నీకుకవు లెవ్వరని సందేహించఁదగి యున్నది. తిమ్మనార్యుఁ డిదియెల్ల నప్రస్తుతప్రసంగ మనియు, తన గ్రంథమున బాఠకుఁకుఁ గలుగఁగల యాదరమునకు భంగము గలిగించుననియు నూహించి వీనిని లోపింపఁజేసి స్తుతిపాత్రుఁ డయ్యెను.

ప్రబంధములనుగాని, యితర పద్యకావ్యములఁగాని రచించినకవి నాథులందఱును దప్పక కవివంశానుక్రమణికను దెలుపుచుఁ బెక్కు పద్యముల వ్రాయువాడుక గలదు. కవీశ్వరులిందు స్వగుణాతిశయమును, బాండిత్యోత్కర్షయును గూడ వర్ణించుకొనుట సహజము. తిమ్మనార్యుఁ డిది యనుచితమని తలఁచెఁ గావలయు. ఏలనన, కుకవులనుపేరిట నితరుల

నిందించుచు, స్వగుణంబులి నుగ్గడించుట సత్పురుషలక్షణమని యూహించుటకు వీలుకాదు. శ్రీకృష్ణదేవరాయలను గృతిపతిగాఁ దానే నిర్ణయించి కృతియొసఁగినట్లు తోఁచునుగాని, మనుచరిత్రాదులవలెఁ బ్రభువు తన్నుఁగోరుటయే యీకావ్యరచనకుఁ గారణమైనట్టులు గానరాదు. లేనిచోఁ గర్పూరతాంబూలాద్యుపచారములతోఁ గవిని బూజించి ప్రార్థించుట యిందునఁ గానఁబడియుండెడిని. కృతిపతియే తన పేరఁ గృతి రచింపుమని కవిని ప్రార్థించుట కన్న, కృతిరచించి యుత్తమనాయకుని వరించి యర్పించుట యధికరసవంతముగఁ దోఁచుచున్నది. మఱియుఁ గృతిపతి వంశానుక్రమణికయును, కృతినాయకుని వర్ణనమును దిమ్మనార్యుఁడు కడుసంగ్రహముగను, మిగుల హృద్యముగను జేసియుండెను. కృతిపతి వంశమునఁ బ్రసిద్ధులగు నీశ్వరనృపతిని, నరసభూవిభుని, వీరు చూపిన బలపరాక్రమములను, కవిగడు సమంజసముగ వర్ణించియున్నాఁడు. నిర్నిమిత్తములగు విషయముల యందనావశ్యకములగు నతిశయోక్తులతో వర్ణించినచోఁ గవీశ్వరుని పాండిత్యబలమును గూర్చి సంతసించినను, భావనాబలము లేమిచే హృదయాకర్షకముగ నుండలేదని విమర్శకు లూహించవలసియున్నది. వాని నితఁడు పూనకుండుటఁ జేసి యీ భాగమును గూడ హృద్యముగఁ జేసెను. ఈశ్వరనృపతిని వర్ణించుచు మహేశ్వరుని యందుఁగల లోపము లితనియందుఁ గానఁబడక పోవుటయే కాక యితఁడు బలదర్పము లధికముగఁ గలవాఁడని వర్ణించిన పద్యముఁ జూడుఁడు :

ఉ. తామసవృత్తి లేదు; పలలంబును మెక్కఁడు గాఁడు;
బౌరుషం, బేమియు వెఱ్ఱిగాదు; తనకెందునఁ బై
పఱిరాజు లేఁడు; సం, గ్రామములోన నొక్కఁడును
గాసికి వాసిఁదొలంగఁ డీశ్వర, క్ష్మాహితావనీ
హరుని పోలెడు యీశ్వరుఁ డెన్నిభంగులన్."

ఈశ్వరవిభుని తనయుండగు నరసవిభుని వర్ణించు ఘట్టము మఱియుఁ జక్కఁగ నున్నది. కృష్ణదేవరాయలు రాజ్యాధిపత్యము వహించెనని వ్రాయుచుఁ దొల్లి యదువంశమున నవతరించిన శ్రీకృష్ణుఁడు తనచరితమునఁ గల లోపముల నవరించుకొని లోకమున విఖ్యాతినొందనిట్టువచ్చెననుచు వర్ణించెను. మఱియొకచో నీ రెండు అవతారము లన్నిలక్షణములతోడను సమానములని తెల్పెను. చూడుఁడు :

సీ. యాదవవ్వమున సింహాసనస్థుఁడుగామి సింహాసనస్థుఁ
డై చెన్ను మెఱయ, గొల్లయిల్లాండ్రతోఁ గ్రీడింపు
టఁ జేసి పరకామినీ సహోదరతఁ జూప, మఱి బరా
ఫలమునకై మధుర డించుఁ జేసి పరదుర్గదుర్గముల్
బోయిఁగొనఁగ, పారిజాతము సాహసి పట్టి తెచ్చుట
నౌదార్యమున దానికడుగువఱుప,

గీ. గోరి తొలుమేనఁ దనకైన కొదువలెల్ల, మాన్పుకొన
వచ్చి, భువనైకమాన్యలీల, నవతరించిన కృష్ణుఁడో యనఁగ
మించె, నరసవిభు కృష్ణరాయభూనాయకుండు."

సీ. చక్రవర్తి మహోపశక్తి నాఁడును నేఁడు చెలఁగె ధర్మ
క్రమస్థితిఘటించె,భూభృదుద్ధర విస్ఫూర్తి నాఁడును
నేఁడు గోరక్షఖ్యాతి నదురుపఱచె, సాధు బృందా
వనసరణి నాఁడును నేఁడు వంశానురంగు వఱలఁ
జెయ్యె, సత్యభామాభోగసక్తి నాఁడును నేఁ నా
కల్పమవని నింపార నిలిపె,

గీ. నాఁడు నేఁడును గూడి నాన్వయమునందు, జనవమందెను
వసుదేవమనుజ విభుని, కృష్ణుఁ డను పేర నరసేంద్రు
కృష్ణదేవరాయఁడను పేర నాదినారాయణుండు."

కృతిపతిని వర్ణించు నవసరమునఁ గూడ నించుకేని రసభంగము గాకుండ నెట్లు

వ్రాసెనో కనుఁగొనుఁడు: కొన్ని గ్రంథములందలి వర్ణన లెప్పుడు ముగియునా యని విసుగు గలిగించును. కల్పనా విశేషములతోడ నితఁడు కొన్ని వర్ణనలు సలిపెను. మఱియుఁ గృష్ణరాయని బాహుబలమును, పరాక్రమము నీ క్రింది పద్యమున వర్ణించిన విధముఁ జూడుఁడు. విజయపరంపరను దెలుపుపట్టిక నొకదానిఁ గూర్చి, ఛందోబద్ధము గావించుట సామాన్యకవుల పద్ధతి. మఱి యితఁడన్ననో, ప్రతిపద్యమును భావగర్భితముగను, రసభరితముగను ఉండునట్లు రచించెను.

సీ. "ఉదయాద్రివేగ నత్యుద్ధతి సాధించె వినుకొండ మాట
మాత్రన హరించె, గూటముల్ పెనరఁగఁ గొండవీ
డగలించె బెల్లముకొండ యుబ్బెల్లఁ దెఱచె, దేవరకొండ
యుప్పత్తిభంగముచేసె జల్లిపల్లె సమగ్రశక్తిఁగూల్చె,
గినుక మీఱు ననంతగిరి క్రిందుపడఁ జేసె గంబంబుమెట్టు
గ్రక్కున గదల్చె"

పై పద్యము క్రిందఁ గీతలిడిన భాగములయందలి చమత్కారములు గ్రహించఁదగియున్నవి. ఆవీరునిచేత మెఱసిన కౌక్షేయకమును వర్ణించినవిధము స్తుత్యతరము. ఇతని శైలియు, కథాధోరణియు పాత్రోచితముగ జరుగు సంభాషణములు, మొదలగునవి, యింకొకతఱి నరయుదము. ఈవర్ణనలన్నియు నిరువది పద్యములకు లోఁబడియుండునట్లుచేసి కథలోనికి దిగెను. ఈభాగమును జదివినపాఠకులకు గ్రంథమంతయు నెట్లు వ్రాయఁబడినదని తెలుసుకొనునాస, సహజముగఁ గలుగును. తన ప్రబంధధోరణి కన్నివిధముల నియ్యది మచ్చుగా నొసఁగెనని యూహించఁదగి యున్నది. సర్వజన సామాన్యముగ సుబోధకమగు శైలిగూడఁ దన కమరియుండుట స్తుతిపాత్రమై యున్నది. క్లిష్టపద భూయిష్ఠముగను, అనావశ్యకములగు కల్పనావిశేషములతోడను, గ్రంథమును పాఠకుల హృదయమునకు దూరీకృత మొనరించి యుండినచోఁ దిమ్మనార్యునిఁ గూర్చి వ్రాయుట యస్మదాదులకు దుర్లభంబు. ఇదివఱ కీభాగమును సవిమర్శకదృష్టితోఁ బరిశీలించిన వారి కీనానుడులు సత్యములని తోఁచును. అతిశయోక్తిగలదని యూహించువా రొకసారి పైవిధముగ యోచించి, విమర్శించి, నాయభిప్రాయము ననువదింతురుగాక!





# రతివిలాపము

త్రిపురాన వేంకట సూర్య ప్రసాదరాయ కవిగారు

ప్రస్వాయం పాలితుం భానో
ర్నిమే శ్లోకాః కవే ర్వచః;
అవతారో యయోః పృథ్వ్యాం
దంపతీ తౌ నమామ్యహమ్.

† ఉ. నెట్టన కంటిమంట మరు
నీఱుగఁ జేయు మహాతపస్వి దా,
నెట్టి యవస్థపాల్పడియె
నిమ్మెడ నౌర యటంచు నవ్వుచు,
న్నట్టులు సొంపునింపు గిరి
జాంగవిభూతిసితాననంబులౌ,
గట్టులఱేనిపట్టి చను
గట్టుల కేను నమస్కరించెదన్.

ద్విపద

నిటలాక్షు నేత్రాగ్ని నిజనాథు పైకిఁ
దటుకున నేతేరఁ దా మూర్ఛనొంది
వివశయై పడియున్న విరివిల్తు వెలఁది
యవిషహ్యవేదనం బైనవైధవ్య
మావహిల్లఁగఁ జేయు నదియైన ప్రబల
దైవమ్ము చెల్లుని దగమూర్ఛ దేఱె.
ఘనమూర్ఛ దేఱి యక్కలకంఠకంఠి
కనుల నల్లనవిచ్చి కలయంగఁ జూచెఁ
దనివోనికనులకుఁ దన ప్రియుం డింకఁ
గనరానిదశ నుక్కఁ గానలేదయ్యె.

"జీవితేశ్వర! నీవు జీవించియుంటె;
నావలపులపంట! నాథ! యెందుంటి?"
వనిపల్కి దిగ్గన నటనుండి లేచి
వనజాక్షి నిజపురోభాగమ్మునందు
గిరిశకోపానల కీలలం గాలి
పురుషాకృతిని నున్న బూడిదం గనియె.
మరలఁ జేష్టలు దక్కి మరురాణి యపుడు
ధరణిపైఁ బొరలుచుఁ దన చన్నుదోయి
గడుఘనసరద్యుతి గాఁగఁ బెన్నెఱులు
విడివడి జీరాడ విపినభూస్థలిని
దనతోడ సరిగ వంతను మునుచునట్లు
వెనుఁబాటుమై నిట్లు విలపింపఁ దొడఁగె.

అయ్యయో! నాథ! యిట్లైతివే నీవు
దయ్యమ్ము నినుఁ బాపఁదలఁచెనే నేఁడు
నెయ్యమ్ము కృపయును నీ కెందుఁబోయె
నియ్యరణ్యమున నన్నిటు డించితివి తె.
పన్నగాభరణుతోఁ బంతమ్ము మున్న
నిన్ను నీకోలఁది గణింపవై తనుచు
నన్నన్న నీప్రాక్క కడలి నీతోడ
నన్నంతమాటయు నయ్యెనే తుదకు.
పెఱతాపసులఁ గిట్టి బెదరించినట్లు
వెఱ పొకింతయులేక విశ్వసంహారుఁ

† "తపస్వీ కాంగతో౽వస్థా, మితి స్మేరాననావివ, గిరిజాయాః స్తనౌ వందే భవభూతి సితాననౌ" భవభూతి.

కలకంఠునిం గాలకాలుని రుద్రు
నలక పైకొని తాఁకు టూరకే చనునె.

గిరిరాజతనయను గిరిశుతోఁ గూర్చి
వరదుని మెప్పించి వరములు వడసి
యరుసమ్ము నింతువం చాసించియుండఁ
బరము కోపాగ్నిచే భస్మంబ వైతె.

ఒరపుగల్గెడువారి కుపమానమగుచు
వఱలు నీయెడ లీ యవస్థపాల్పడఁగ
నెడఁద వ్రయ్యలుగా దదేమొకో నాకుఁ
గడుఁ గఠినాత్మలు గా రె చేడియలు.

నినుఁ జూడకున్నట్టి నిముసమ్ము నాకుఁ
గనుపట్టు నొక దివ్యకల్పమ్ముగాఁగ
నిరవధిమైన యీ నీవియోగార్తి
స్మర! యింక నే నెట్లు సైరించుదాన.

కట్టవాసినజలౌఘము దమ్మికీవ
నట్టె తా విడనాడి యరుగుచందమున
నిముసమ్ములో మన నెయ్యమ్ము దొఱఁగి
రమణ! నీ శౌడిదే బ్రతుకుగామనెడు
నబలను నన్ను నిట్లాఱడివుచ్చి
ప్రబలార్తి నిడి యెందఁ బాఱిపోయితివి.

ఎందైన ననుఁ గూడి యేఁగుదీ వెపుడు
నిందు నర్ధ దిగనాడి యెట్లేఁగినావు
మందభాగ్యను నన్ను మఱచినావేమొ
యిందిరాపుత్ర! యింకే నెందుఁ జొత్తు.

నేను నీకును నాకు నీవు నెన్నఁడును
నోనాథ! యప్రియ మొనరింపలేదు
కృపపుట్టనేర్చు నీ ప్రియ కకారణమ
యిపుడు నీ దరిసెనం బీ వదేమిటికి.

కవవాసి నొగులు జక్కవపెంటివోలె
నవిరళశోకార్తి నడలు న న్గనవొ
యెవ రింక దిక్కు న న్నిటులొంటి ఘోర
దవము పాల్సేయ నా తప్పేమి చెపుమ.

చెలువుఁడ! వే ఱొక్క చెలిపేర నన్నుఁ
బిలుచుచో నీమీఁదఁ బెనురోసమూని
మొలనూలిత్రాళ్లతో మొగమోటమూలి
కలయు ని న్గట్టిన కత లెంచినావొ
యలరులేయ కరువు లక్షులంగలఁపఁ
గలువవ్రాఁపుల వ్రేయు గతు లెంచినావొ

తప్పుగల్గిన నన్ను దండించుటకును
నొప్పులకుప్ప! వేఱొకదారి లేదె
యిప్పాట నిహలోక మెడలి నన్నిట్లు
ముప్పు మున్నీటిలో ముంచి పోవుదువె.

"ఎడనుండనీ" వంచు నీ వన్న మాట
మదన! యిచ్చకముగా మది నెంతుఁ జావె
యెద నుంటినేని నీ విటు బాదిగాఁగ
బ్రదికి యే నెట్లుందుఁ బ్రాణేశ! చెపుమ.

శరనైపుణిని శైలజాశివాంగముల
నరుదార నొకటిగా నదికింతు నంటి
మదన! యొక్కటిమైన మనయంగకముల
యదుకూడ్చి యకట! వేఱైతివే నాకు.

పరమేశ్వరుఁడు కృపాపాథోధియండ్రు
హరిహరీ! యెట్లు కోపాగ్ని నీ గాల్చెఁ
బరమపాపిని నాయభాగ్యమ్ము హరుని
గరుణకుం దప్పించెఁ గాఁబోలు నాథ!.

జగదేకరక్షా విచక్షణస్వాంతుఁ
డగుశౌరి తనమిత్త్రుఁ డైయుండ శూలి

దెగి తత్సుతుని నిన్నుఁ దెగఁజూచె మిత్తి
మొగ మెట్లుసూతు నన్నోగమోట లేదొ.

కడఁకఁ గ్రొవ్విరిఁగాల్పఁ గాలాగ్ని యేల
కడవేళ లోకముల్ గాల్పఁ బాల్పడిన
కడిఁది చిచ్చుటకంటి గాటంపుమంట
మృదుఁడేలపటపె నీమెత్తనౌమేన.

ఆఁడుదానను గోల నబల నేనల్గి
వాఁడిచూపులఁ జూడ వణఁకిపోవుదువు
శ్రీకంఠునుగ్రాక్షి శిఖిశిఖాపటలి
పైకొన్న నీ వెంత భయమొందినావొ.

పువనల్లఁగ నిన్నుఁ గన్నతల్లి కిని
గాలి కడుపులోఁ జిచ్చు వెట్టితివె
కడుభాగ్యశాలిని గలుములపొలఁతి
గడఁక నెట్లోర్చు నీగర్భశోకమ్ము.

మది నన్నుఁ బ్రాణమ్ము మాఱుగా నెంచు
నది వధూవత్సల యత్త శ్రీదేవి
దలపెడ్డ నాదు దుర్దశను భావించి
వలనేది తా నెంత వంతపాల్పడునొ.

అత్యంతభక్తి నే నడుగుల కెఱఁగ
"నిత్యసౌభాగ్యవై నెగడుమాయమ్మ!"
యని నన్నుదీవించు నాదేవిమాట
యనృతమై పోయెనే యక్కటా! నేఁడు.

ఎడప కిప్పుడ దివికేఁగెడు నీదు
నడుగుల వెంబడి నరుదెంతు నేను
నాకయిచింతింప నామనోనాథ!
లోకమ్ము కొఱకునై లోనఁ జింతింతు
నైహికజనము దైవాహతంబయ్యె
దేహిసౌఖ్యము నీయధీనమ్ము కాదె.

రెయినిప్లగ్రమ్ము పురీమార్గమందు [ల
భయదహానుఱముచే భయమొందు ప్రియ
సరగఁ గాముకనివాసములు చేర్పంగ
స్మర! నీవుదక్కంగ శక్తుఁడింకెవఁడు.

బాలయల్కఁ బెడమొగమ్ములు గాఁగ శయ్య
మలఁగి నాథులతోడ మాటాడకున్న
నలరుములుకులఁ జుఱుక్కన నాటి చెలులఁ
గలక దేర్చెడువాఁడు గలఁడె వేఱొకఁడు.

తగు లెఱుంగక వినూతనసంగమముల
మొగిని లజ్జాభయమ్ముల పెర్మిఁగొంకు
ముగుదకన్నెలకు నేర్పులు నేర్పి తేర్చి
మగలఁగూర్చెడువాఁడు మఱియెవ్వఁడింక.

కడునెఱ్ఱవాఱెడు కనులు ఘూర్ణిల్ల
నుడువులు సారెకుం దొట్రుపడంగ
బ్రమగొల్పునదియ యా వారుణీమదము
ప్రమదల కీఁకవిడంబనయ నీవేమి.

సరసుండవైన నీ చావుచే జగము
సరసత్వమును బాసి చప్పనై పోయె
విరసమై సృష్టిప్రవృత్తి గీడ్పడియె
స్మర! నీవులేకున్న సర్గమే లేదు.

అనుఁగుఁజుట్టమవు నీ వతనుండ వగుట
విని నిజోదయ మింక వృథయంచు నెంచి
బహుళమ్ము సనినను బహుళదుఃఖమునఁ
దుహినమయూఖుండు దొఱఁగుఁగార్శ్యమ్ము
ఎఱుపుపచ్చనిచాయ నెసలారుతోడిమ
వఱలఁ గోకిలకల ధ్వనులచేఁ దెలియు
నెలమావిపూవు నేఁ డెవ్వాని కింక
నలుఁగానొ చెప్పుమా యలరువిల్కాఁడ!.

వెలిదమ్మిక్రొవ్విరి వెలవెలంబాఱె
లలితహా నీలోత్పలము బొగ్గువడియె
ఫలశూన్యములయి నిన్ బాయుటంబూవు
ములుకులన్నియు నేఁడు మొఱవోయెనకట!.

పలుమాఱుఁగొనయంపుఁ బనుల నీపనుపు
నలిపినయీ తేఁటి చాలు శోకార్తి
విలపించు ననుఁగూడి విపులదైన్యంపు
టులి వెసంగఁగ నేడ్చుచున్నట్టులుండె.

వలరాజ! నీవేమి వగపునంబోలె
బలుఁగులరొదలవా పోవుచుండఁగాఁ,
బువుఁదేనెకన్నీరు బొటబొటఁగాఱ
నవనీజములు నేడ్చునట్లుండె నకట!.

కనుఁబండువైన నీ కాయమ్ము మగుడఁ
గొనిలేచి తియ్యఁబల్కుల సాజమైన
గరునమ్ముగల ప్రోడగండుఁగోయిలను
సురతదాత్యమునందుఁ జొనుపవే నాథ!.

పాలుపునింపెడు నీదుముద్దునెమ్మోము
గలుములీనెడు నీదుకడగంటిచూపు
గొనమోవి నోలయు నీ కులుకు లే నగవు
గనులఁ గట్టినయట్లు గనుపట్టు నాకు.

తలపోఁక మ్రొక్కి యెంతయు వేఁడి కంప
మెలరార నిడిన నీ యిఱగవుంగిళుల
నెలమిఁ బైకొన్న నీ యేకాంతరతులఁ
దలపోయ శాంతిఁజెందఁగ నాకు వశమె.

పెదవిఁ బల్మొన నొక్కి బెదరించినంతఁ
బదసరోజము లంటి బతిమాలుకొనుచుఁ
బాదివి చెక్కుల బల్మి ముద్దాడు జెన్న
మదన! నా కడుపు చుమ్మలువాఱు నకట!

సురతపండిత! నీవ సారిదిమై నిడిన
సురుచిరవాసంతసుమభూష లివిగో
కనుపట్టుచున్నవి గాని యానీదు
కనువిందయినమేను గానరా దకట!.

నెమ్మిఁ జన్గవఁ దీర్చు నీ పత్త్రరచన
నెమ్మేన నీవలందిన చందనమ్ము
దడియాఱె నింక సుందరమైన నీదు
నొడలాఱిపోయె నయ్యో! మనోరమణ!

ప్రియ! నాదువామాంఘ్రిఁ బ్రీతి నీయిడిన
కయినేఁత పరిపూర్తి గాకుండనిన్ను
దారుణాత్ములు సురల్ దలఁచి రాకొ[illegible]
బూరింపఁగా వేగముగ రాఁగనయ[illegible]

వలనేర్పడఁగఁ గూలివానిచేఁ బాము
బలిమిఁ గొట్టించు నేర్పరి యయ్యె వజ్రి
మెఱమెచ్చులకు నుబ్బుమీఱి యాతంత్ర
మెఱుఁగలేవై తమాయికుఁడ వీ వకట!

నినుఁ గన్నకన్నుల నిర్జరాంగనలు
దనుఁ జూడకున్న సుత్రాముండు గనలి
నిను నిట్టి మిషవెట్టి నిటలలోచనుని
కనుమంట గొప్పించి కసిదీర్చుకొనియె.

దివియందు జాణలౌ దేవకామినులు
దివిరి నిన్ లోఁగొని తివియకమున్న
శలభమార్గమున నేఁ జనుదెంచి మోద
మొలయంగ మగుడ నీయొడిఁ జేరుకొందు.

అతివేగముగ నిన్ను ననుగమించుటకు
యతనమ్ము మైనుంటి నట్లైనఁగాని
రతి కాముఁబాసి యర్ధతృణమైన
బ్రతికెదన్ దూఱు తప్పదు నాకు రమణ!

మఱియు నీకిట నంత్యమండనంబైన
నుదు కాఱి నేనెట్టు లొనరింపనేర్తు
నొడలితో నసువుతో నొకటనే నీవు
గడు నతర్కితమైనగతిఁ బొందినావు.

ఒడిలోన విల్లుంచి యొగిఁ బూవుటమ్ము
దొడికి తానంక లొత్తుచు నీవు మధునిఁ
గడగంటిచూపులం గని లేఁతనగవు
వెడల ముచ్చటలాడువిధము నేఁ దలఁతు.

ఎటనున్నవాఁడో నీ కెపుడుఁ బూవిండ్లు
ఘటియించు నెచ్చెలికాఁడు మాధవుఁడు
అతితీవ్రకోపుఁడౌ హరునిచే మిత్రు
గతిని దానును బూది గాఁడుగా నేఁడు.

అని రతివిలపించు నాపల్కు లెడఁద
మొనసి పెన్విసపుటమ్ములు వోలె నాట
విపులశోకార్త నవ్వెలఁది నూరార్ప
నపుడ మాధవుఁడు ప్రత్యక్షమై తోఁచె.

ఘను మధుం గాంచి యక్కాంత బిట్టేడ్చెఁ
జను లుబ్బడఁగ నురస్స్థలి బాఁదుకొనియె
నిలను జుట్టముల కట్టెదుర శోకమ్ము
దలుపుదీసినయట్లు దాఁ బొంగిపొరలు.

వసటమై మధు నిట్లుపలుకు నక్కలికి
గనుమన్న! నీచెలికాని దుర్దశను
బొడివి కపోతకర్బురభస్మరాశి
నిదె గాలు లిట్టట్టు నెగఁ జిమ్ముచుండె.

స్మర! వేగ నీదు దర్శన మీవె రావె
కర మీమధుఁడు నిన్నుఁ గన వేడ్కపడెడుఁ
బొలఁతులందుఁ జలించుఁ బురుషులప్రేమ
చలియింపదుగదయ్య! సన్మిత్రులందు.

అలఁతిసోఁదుల దారమల్లెయుం బూవు
లలుఁగులునైన నీదగువింటి పనుపు
రహి సర్వజగమందు రమణ! చెల్లించె
సహచరుండగు నీవసంతుండ కాఁడె.

అనిలవేగాహతంబగు దివ్వెవోలెఁ
జనినాఁడు నేఁడు నీసఖుఁ డింక రాఁడు
పగఁ దదీయంబైన వత్తిచందమునఁ
బొగమూరియున్ననన్ బొడగాంచుమనఘ!

విరివిల్తుఁ జంపి నన్ విడనాడుదైవ
మరచావు ఘటియించె నకట! నా కిపుడు
అరయంగ ననపాయి నాశ్రయద్రుమముఁ
గరి గూల్చెనేని తీఁగయుఁ గూలుఁగాదె.

కాన నీవిటమీఁదఁ గరుణించి నాకుఁ
బూని బాంధవకృత్యమును జేయవలయు
ననలమ్ము నాకిడి యటవిరహార్త
నను నాదు నాథుచెంతకుఁ జేర్పు మనఘ!

నెల వోయెనేని వెన్నెలగూడఁ బోవు
మెఱపు క్రొమ్మొగులుతో మెఱపునుం బోవు
బొలఁతులు పతితోన పోవువారనుచు
నిల నచేతనములు నెఱిఁగెడుంగాదె.

పాలుపారు ప్రియుమేని బూది నే యిచట
నెలమిఁ జన్దోయిఁ గెం పెసలార నలఁది
పనివడి చివురుల పాన్పునంబోలె
ననలమ్మునందు నాయంగమ్ముఁ జేర్తు.

పలుమాఱు సౌమ్య! పూర్వము నీవు మాకు
నలరుఁబాన్పులకూర్పునందుఁ దోడ్పడితి
విపుడు కేల్మోడ్చి నిన్నిదె వేడుకొందుఁ
గృపమీఱ సొద గూర్పవే వేగ నాకు.

వలనొప్పు నాకిదు వహ్నిఁ దోఁత్తోన
మలయానిలములచే మండింపుచున్న !
ననుఁ బాసి నిముసమైనను నీయనుంగు
మనలేమి యెఱుఁగవా మాధవా! నీవు.

ఇటు చేసి యవల మాయిరువుర కొకట
యిటుఁ బూవుఁ దేనెదోయిలి యీఁగదయ్య!
సరగ నీసఖుఁడు పంచకయ నాతోడఁ
బరలోకమున దానిఁ బానంబు సేయ.

మరునికై మఱియు నో మాధవా! నీవు
పరలోకవిధిఁ జలత్పల్లవంబులగు
నెలమావిపూగుత్తులిమ్ము నీచెలికి
నెలమావిపూలపై నెంత యో ప్రీతి;

అని మైవిడువనున్న యారతిదేవి
ననుకంప నూరార్చె నాకాశవాణి
మడువింకఁ గొందలం పడుగండుమీనుఁ
గడుఁగృపం దేర్చు తొల్కరివానవోలె.

రతిదేవి! నీమనో రమణుఁ డింతటన
బ్రతికి నీతోఁగూడి ప్రమదమ్ము నించు
మృడునికన్మంటలో మిడుతయై యతఁడు
పడుటకుం గతమేమొ వచియింతు వినుము.

పరమేష్ఠి దనకూఁతుపై మరుల్కొనఁగ
మరుఁడు ప్రేరేఁచె బ్రహ్మయు నవ్వికృతిని
దలఁగి ప్రేరకునిఁ గందర్పు శపించె
నలరాయఁ డాశాపఫల మిందుఁ బొందె.

ధర్మప్రజాపతి దను వేఁడుకొనఁగ
నిర్మలబుద్ధి వాణీవిభుం డపుడు
"తపమును మెచ్చి భూధరరాజకన్య
నెపుడు పెండ్లాడి మహేశ్వరుం డలరు
నపుడ వెండి యనంగు సాంగునిం జేయుఁ
గృప" నంచు శాపాంత మిట్లు వాక్రుచ్చె
నశనిపాతమునకు నమృతవృష్టికిని
వశులు మేఘములును నలఁతులౌఁగాదె.

కాన నీప్రియునితోఁ గలయంగలట్టి
యాసీదు నెమ్మని నీకఁ గావుమమ్మ!
తరణిదీప్తుల నింకు తటిని దొల్కరిని
మరల వెల్లువఁగూడి మలసెడుంగాదె.

అనిపల్కియుడిపె న య్యాకాశవాణి
మనసిజాతునినాతి మరణనిశ్చయము
మధుఁడు నంబరవాణి మాటలక్ నమ్మి
మధురవాక్ఫణితి నమ్ముగన నూరార్చె.

చెలువేది వగమేను సిక్క నమ్మరుని
లలన శాపాంతకాలము వేచియుండెఁ
గరసంతతులఁ బాసి కనుమూసి పగలు
మురువేదుశశిలేఖ మునిమాపుఁబోలె.



# ఛందశ్శాస్త్రవిమర్శనము

వాసా సూర్యనారాయణశాస్త్రిగారు

పారనంది రామశాస్త్రిగారు "భారతి" శ్రావణ మాససంచికలో "ఛందశ్శాస్త్రము" అనే శీర్షికతో నొక వ్యాసమును ప్రకటించిరి. దాని నామూలాగ్రముగా చదివినవారికి దానిలో ఛందోవిషయము ప్రతిపాద్యము కావనిన్నీ, ఉపక్రమోపసంహారములు అత్యంతాననురూపములనిన్నీ ఈవ్యాసమునకు "ఛందశ్శాస్త్ర" మని పేరిడుట నేతిబీరవలె నిరర్థకమనిన్నీ, స్ఫురింపక మానదు. అయినను శాస్త్రిగారి ప్రవృత్తికి ప్రయోజనము లేకపోలేదు. అది దూరస్థులగు చదువరులకుమాత్రము గోచరింపదు. కాన ముఖ్యాంశము దానిని నేను వివరించెదను. ఈ గంజాంమండలమందు కళింగ వైశ్యశాఖ యొకటి గలదు. వారికోర్కె ననుసరించి వారి కర్మల యుపయోగమునకై "పౌరాణికప్రయోగ పద్ధతి" యను నొక గ్రంథమును నేను సంతరించితిని. అందలి యుపనయన ప్రకరణములో "సర్వచైతన్య" అనే దేవీభాగవతనాందీశ్లోకమును పౌరాణిక గాయత్రిగా నుద్ధరించితిని. నా గ్రంథము శ్రీమహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు మున్నగు మహాపండితులచే నామోదింపబడినది. నాపద్ధతి ననుసరించి కొందరు వైశ్యులు ఉపనయనాది సంస్కారములను పొందుచున్నారు. ఈదృశ్యము రామశాస్త్రిగారికి కిట్టదు. ప్రత్యక్షముగా దీనిని ఖండించుటకు ధైర్యసాహసములు లేక మారుపేరుతో వ్యాసములను ప్రకటించి నాయుద్యమధ్వంసమును చేయుటకు వీరు యత్నించుచున్నారు. ఇది దీనిలోగల దేవరహస్యము. నేను ఈవ్యాసమును విమర్శింపబూనుట పాండిత్యాభిమానముచేగాని, పత్రికలలో ముద్రితమయిన నామాక్షరముల జూచి సంతసించుటకుగాని యెంతమాత్రము గాదు. కేవలము నాయుద్యమసంరక్షణకే ప్రవర్తించుచున్నాను.

ముఖ్యాంశము శాస్త్రిగారి వ్యాసమును తిలకించి నావిమర్శనమును పరిశీలించుటకు చదువరులను వేడుచున్నాను.

"వైదిక ఛందస్సులు గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, మొదలయినవి వేదములలోనే చెప్పఁబడియున్నవి"

అని శాస్త్రిగారు వ్రాసిరి.

గాయత్ర్యాది ఛందస్సులు కేవల వేదములలో లక్షణస్వరూపాదికథనపూర్వకముగా చెప్పబడినవనియా, లేక, వాడబడినవనియా, వీరి యాశయము? ప్రథమపక్షమున పింగళాదికృత ఛందశ్శాస్త్రములలో కూడా తల్లక్షణాదులు చెప్పబడినవి. కావున "వేదములలోనే" అనే యవధారణ సంగతి యెట్లగును? ద్వితీయపక్షములో వేదభిన్న తాంత్రికాది మంత్రములలో గూడా ఈ గాయత్ర్యాదివైదికఛందస్సులు వాడబడ్డవి. కావున అవధారణ సంగతమెట్లు? వేదపదము తాంత్రికాద్యుపలక్షక మందురేని వారి యభీష్టము సిద్ధింపదు. సర్వథా "వేదములోనే" యనుట కేవల మసంగతమేయగును.

"అవి యెన్నియో? యెవ్వియో? యేయే మంత్ర మేయేఛందస్సునకుఁ జెందినదియో? తెలుపునట్టి శాస్త్రముయొక్క ప్రచారము లేకపోవుటచేత నది తెలియఁబడదు" అని వ్రాసిరి.

ఛందస్సును తెలుపు అనుక్రమణిక, ప్రాతిశాఖ్యలు, సమగ్రముగా ప్రచారములోనున్నది. పింగళఛందస్సు 1వ సూత్రము మొదలు "అత్ర లౌకికం" అనేవరకున్నూ వైదికఛందోలక్షణములు సమగ్రముగా నిరూపింపబడ్డవి. ఆశాస్త్రజ్ఞులు ప్రతిమంత్రమునకున్నూ నిర్వివాదముగా అనాయాసముగా ఛందస్సులను చెప్పితీరగలరు. నేడు విద్వాన్ శిరోమణి కక్ష్యలలో ఛందశ్శాస్త్రము పాఠ్యగ్రంథముగానున్నది. కూపకూర్మములవలె నొకచోట నిలిచియుండి లోకశాస్త్రములయొక్క స్వరూపాదులను గుర్తెరుంగజాలక మన యజ్ఞతను పండిత

లోకమున కంతకు నాశోపింప సమకట్టుట మహాఘోరము.

"ఆమహర్షులు ననుసరించినవి లౌకిక ఛందస్సులే. వైదిక ఛందస్సులతో నామసామ్యముమాత్ర మున్నను లక్షణము వేరుగానున్నది." అని వ్రాసిరి.

వ్యాసాదులు లౌకికమునే వాడిరనుటకు వీని గమకమును చూపరైరి. ఇది కేవలము సత్యదూరమయినది. అనుష్టుభాది ఛందస్సులు వేదములో లేవనే భ్రమచే వీరిట్లు వ్రాసియుందురు.

పింగళ. సూ. 23 "అనుష్టుప్ గాయత్రైః."

వ్యాఖ్య. చతుష్పా దిత్యనువర్తతే. గాయత్రైః= అష్టాక్షరైః పాదైః. చతుష్పాత్ ఛందః అనుష్టుప్ సంజ్ఞం భవతి. యథాయజుర్వేదే: సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్, సభూమిం విశ్వతోవృత్వా, అత్యతిష్ఠద్దశాంగులమ్, ఇతి. పాదమునకు 8 అక్షరములు. అట్టివి నాలుగుపాదములుగల ఛందస్సు అనుష్టుప్ ఛందస్సనియు అది వేదములో కలదనియు దీనిచే స్పష్టముగా విశదమగును. కఠ, ఈశావాస్య, శ్వేతాశ్వతర, ముండక మహానారాయణాదులు కొన్నియుపనిషత్తులు ఛందోబద్ధము లయియున్నవి. లౌకికములోగూడ నీయనుష్టుప్ ఛందస్సు ఇట్లే వాడబడియుండగా "నామసామ్యమే" యని మీరు చెప్పుట అనభిజ్ఞతామూలకమే యని చెప్పక తప్పదు. మహర్షులు వైదిక ఛందస్సులనే ప్రాయికముగా వాడిరనుటకు ప్రబలనిదర్శనములు కానవచ్చుచున్నవి. మార్కండేయపురాణాంతర్గత సప్తశత్యాది మంత్రగ్రామమునకు వైదికగాయత్ర్యాది ఛందోవిభాగము స్పష్టముగా నిరూపితమైనది. ఇట్లే భగవద్గీతాదులకు అనుష్టుప్ ఛందస్సువాడబడినది. ఈ విషయమున వేనవే లుదాహరణములను చూపవచ్చును.

"వైదిక గాయత్రీ ఛందస్సు పాదమునకు ఎనిమిదక్షరములు గలిగియున్నది" అని వ్రాసిరి.

ఇచ్చట గాయత్రీ ఛందఃపాదమునకు అష్టాక్షరవత్త్వమును లక్షణముగా జెప్పిరి. దైవీ, ఆర్షీ యాజుషీ బ్రాహ్మీ, ఇత్యాది బహువిధగాయత్రీఛందస్సులు వేదమందే కనబడుచుండ వాటిని జారవిడచి యొక గాయత్రీ ప్రభేదమునకు లక్షణమును నిరూపించినమాత్రాన సామాన్యోపక్రమము సార్థకమగునా?. ఎట్లయినను తాము చెప్పిన లక్షణమును న్యూనతాపత్తిరూపదోషమే దిగమ్రింగును. వాటికి సహించినను ఈయష్టాక్షరవత్త్వలక్షణము దుష్టమనుట నిర్వివాదము. ఆర్ష్యాది ఛందస్సులలో పాదమునకు ఆరక్షరము లుండుటచే నీలక్షణమవ్యాప్తిదోషగ్రస్తము. అనుష్టుప్ ఛందస్సులో పాదమున కెనిమిది యక్షరములుండుటచే అతివ్యాప్తి దోషగ్రస్తము. అవ్యాప్తి నెట్లో వారించినను అతివ్యాప్తి దుర్నివారమేయగును. తద్వారణకై పాదత్రయవత్త్వమును లక్షణఘటకముగా నంగీకరింతురేని త్రిపాత్ ఛందస్సు అనుచోట "త్రిపాన్మంత్రమునకయిన ఛందస్సు" అనే యర్థమునకై పడినప్రయాసము నిష్ఫలమేయగును. చివరకు ప్రభాతఘట్టకుటీ న్యాయానుసారము తాము త్రోసివేసిన యర్థమే తమకు శరణ్యమగును. "అష్టాక్షరా గాయత్రీ" అని వేదములోనుండుటచే తమ లక్షణము నిర్దుష్టమని యందురేని యచ్చట గాయత్రీపదము పాదపరమా- లేక, ఛందః పరమా? ఛందః పరమంటే వారికి నభీష్టసిద్ధి కాదు. పాదపరమంటే లక్షణైకదేశమే యగునుగాని సంపూర్ణలక్షణముగాదు. యాజుష సంధ్యావందనములో "చతుర్విగ్ం శత్యక్షరా త్రిపదా షట్కుక్షిః" అని స్పష్టముగా నున్నది. "త్రిపదా గాయత్రీ" అనికూడ శ్రుతిగలదు. కాబట్టి మీరుచెప్పిన లక్షణము దుష్టమే యగును.

"దీని ఛందస్సు "గాయత్రి" అనియే చెప్పఁబడినది. దీనిని పూర్వులు "త్రిపాచ్ఛంద"స్సని యన్నారు. దాని యభిప్రాయము త్రిపాన్మంత్రమునకైన ఛందస్సని కానోపును. పిమ్మట వారు "మూడుపాదములుగల ఛంద"స్సని దీనినే త్రిపాదిగా దలంచుచున్నారు. ఛందస్సునకు పాదనియమముగలదా? అది పద్యరూపముగానే యుండవలయునా?" అనిరి.

శాస్త్రిగారు ఛందస్సునకు పాదనియమములేదని చెప్పి "త్రిపాచ్ఛందస్సనగా త్రిపాన్మంత్రమునకైన ఛంద"స్సని షష్ఠీతత్పురుష పరముగా చెప్పుచున్నారు. ఇచ్చట పాదనియమశబ్దము తత్సంఖ్యానియమపరమా? లేక తత్సద్భావనియమపరమా? ఈరెండుపక్షములను శాస్త్రిగారు లంగీకరింపరు. (చూ. పింగళసూత్రములు 3 అధ్యాయము.) "ఆద్యం చతుష్పాదృతుభిః" "క్వచిత్త్రిపాదృషిభిః" "షట్కసప్తకయోర్మధ్యేఽష్టావితి పాద

నివృత్" "ద్వ్యేనవకౌ షట్కశ్చ నాగీ" "విపరీతా వారాహీ" "షట్కసప్తకాష్టకై ర్వర్ధమానా" విపరీతా ప్రతిష్ఠా" "తృతీయం ద్విపాజ్జాగత గాయత్రాభ్యాం." ఈ సూత్రములలో ఆద్యంతసూత్రములచే చతుష్పాత్త్వ ద్విపాత్త్వములున్నా, మధ్యసూత్రములచే త్రిపాత్త్వమున్నా, గాయత్రీఛందఃప్రభేదములకు నియమితమైయుండు పాదసంఖ్యానియమము లేదని చెప్పుటకు నోరెట్లాడును? పాదసద్భావనియమము లేక పాదసంఖ్యానియమ మెట్లు పొసగును? "పాదః" అ. 3 సూ. "పాదశ్చతుర్భాగః" అ. 4. సూ 10 అని పాదసద్భావమును నియమించు సూత్రములకు జలాంజలి నివ్వ రివ్వగలరు? కాన త్రిపాచ్ఛందః, అనేచోట కర్మధారయసమాసము గాని తత్పురుషసమాసము కాదు. "తత్సవితు ర్వరేణ్యం" "కాత్యాయనాయవిద్మహే" ఇత్యాదులు త్రిపాచ్ఛందస్సులు. చూ. పింగల. 3 అధ్యా. 7 సూ. "ఏకద్విత్రిచతుష్పాదుక్తపాదం." వ్యాఖ్య. ఏభి శ్చతుర్భి ర్లక్షణై రుక్తః పాదః యస్య తదుక్తపాదం. యస్యఛందసోయాదృశః పాదః పరిభాషితః తచ్ఛంద స్తేనైవ పాదేన క్వచిదేకపాత్, క్వచిద్ద్విపాత్, క్వచిత్త్రిపాత్, క్వచిచ్చతుష్పాత్ భవతి. గాయత్రీచత్రిపాదేవ. చతుర్భి రష్టాక్షరైః పాదై రనుష్టు భేవ భవతి".

ఈ సూత్రవ్యాఖ్యలవల్ల మూడుపాదములుగల ఛందస్సు గాయత్రి యని కర్మధారయసమాసార్థమే స్పష్టమగును. కాని తత్పురుష సమాసార్థము కాదు.

కొన్ని లౌకికవైదికఛందస్సులకు నామసామ్యమున్నను లక్షణము వేరుగనున్నదని చెప్పి దానికి నుదాహరణముగా వైదికగాయత్రీఛందః పాదమునకు ౮ అక్షరములనిన్నీ, లౌకిక గాయత్రీఛందః పాదమునకు ౬ అక్షరములనిన్నీ చూపినారు. నేను లక్షణసామ్యమును కూడా చూపినచో శాస్త్రిగారు తమ సిద్ధాంతమునకు స్వస్తి చెప్పవలసియుండునుగదా!

చూ. పింగల. సూ. "ఆద్యం చతుష్పాదృతుభిః" "అత్ర లౌకికం" "ఆత్రిష్టుభాచ్చ యదార్షం." వ్యా॥ అయమర్థః. గాయత్ర్యాది త్రిష్టుప్ పర్యంతంయదార్షం ఛందోజాతం వైదికే ఖ్యాతం. లౌకికే౽పి తత్తథైవ ద్రష్టవ్యం"—ఈ సూత్రములుకొన్ని వైదికలౌకికఛందస్సులయందు లక్షణసామ్యమును కూడా నిరూపించుచున్నవి. ఈ పింగలఛందస్సునయినను గమనింపక ఛందోవ్యాసమును వ్రాసి యపసిద్ధాంతములను జేసి చదువరులకు భ్రమను గలిగించుట కేవలాజ్ఞానమో, లేక, మోహమో నేను నిరూపింపజాలను.

త్రిపాన్మంత్రమునకయిన ఛందస్సని శాస్త్రిగారు క్రొత్తవ్యాఖ్యానము నొకదానిని బయలుదీసి పరమతములో "ఛందస్సుకు పాదనియమముగలదా?...పింగలాది ఛందస్సులు సూత్రరూపమున లేవా?" అనునవి మొదలుగా ప్రశ్నవర్షమును కురిపించిరి. వారి శైలి ననుసరించి వారి మతములో నేనిట్లు ప్రశ్నించుచున్నాను. మంత్రములకు పాదనియమముగలదా? అవి పద్యరూపముగానే యుండవలయునా?

"హుం," ఫట్, "స్వాహా," ఇత్యాదియాజుష మంత్రములకు పాదనియమముగలదా? పంచాక్షరీ షడక్షరీద్వాదశాక్షర్యాదిమంత్రములు పాదబద్ధములా? "శేషే యజుశ్శబ్దః" అనేజైమినిసూత్రము యాజుష మంత్రములన్నియు పాదబద్ధములు కావని చెప్పలేదా? "సో౽చింతయ త్తదా తత్ర మమ త్వా కృష్టచేతనః" ఇత్యాది సప్తశతీ మంత్రములు ద్విపాదులును, త్రిపాదులున్నూ అయియుండలేదా? వీటిని ఏకపాది, ద్విపాది, త్రిపాదిమంత్రము లనవలయునా? ఈ మంత్రములే వాక్యరూపమున నుండరాదా? ఉన్నప్పుడు వాటికి పాదనిర్ణయ మెట్లు? ఈప్రశ్నలకు వారి మంత్రపక్షములో వారెట్లు సమాధానమిత్తురో ఛందఃపక్షములో నే నట్లేసమాధానము నిత్తును. పరమతములో తాము చూపిన జొన్నగంటి ప్రశ్నపరంపర స్వమతమును గూడ నాక్రమించుచున్నదని వీరెఱుంగరు కాబోలు!—ఈ వ్యాసములో ప్రతిపాద్యవిషయము గాయత్ర్యాది ఛందస్సు గాని తత్ప్రతిపాదకశాస్త్రము గాదు. అట్టిశాస్త్రము ఏరూపమునన్నను ఎవ్వరికిని తగవులేదు. అట్టివిషయము నధిక్షేపించుట యనవసరము.

శ్రు. "త్రిపదా గాయత్రీ." "త్రిపదా షట్కుక్షిః" అని త్రిపాదవత్త్వమును గాయత్రీలక్షణఘటకముగా చెప్పుచున్నది. కావున శాస్త్రిగారు "త్రిపాచ్ఛందస్సు" అనేచోట బహుప్రయాసములో సాధించిన తత్పురుషార్థము సర్వప్రమాణబహిష్కృతము.

"విష్ణుభాగవతము, దేవీభాగవత"మని రెండుగలవు. ఈ రెంటిని జూచి విచక్షణులు నిష్పక్షపాతబుద్ధితో నిరూపింపవలసి యున్నది..."

"వ్యాసప్రోక్తమ్మే మహాపురాణము. మహాపురాణమునకే గౌరవాతిశయమని తలంచిన యుపోద్ఘాతకారులు వ్యాఖ్యాతలును తామవలంబించిన దానికే గౌరవాతిశయముగోఱ కట్లు వ్రాయుట యాచారమే" అని వ్రాసిరి.

ఈ యుపక్రమమును బట్టి యేది మహాపురాణమో ? యేయుపోద్ఘాత కర్తపొరబడెనో నిరూపించెదరను కొంటిమి గాని యట్లుచేయ లేదు. విష్ణుభాగవతమునుండి మచ్చుకైనను ఒకపదమును స్పృశించలేదు. పూర్వోపక్రమమునకు ఉపసంహారము విచక్షణులకెత్తి పైనుంచబడినది. వీరిపంక్తులలో సత్యమెట్లున్నదో చూడండి. దేవీభాగవతోపోద్ఘాతకారుడు దేవీభాగవతమే మహాపురాణము, విష్ణుభాగవత మట్టిదికాదని నుడివినట్లు వ్రాసియున్నారు. దీనిని బట్టి వీ రుపోద్ఘాతమునయినను సమగ్రముగా చదువలేదని ఖండితముగా చెప్పవచ్చును.

చూ. "వస్తుతస్తు ద్వయోరపి భాగవతయో ర స్మన్మతే ప్రమాణత్వాత్ విష్ణుభాగవతపక్షపాతినాం వచనానా మస్మాకం విరోధాభావేన తల్లాపనే ప్రయోజనాభావఏవ, తథాచ నారదీయాదిపురాణమతేన శ్రీ విష్ణుభాగవతం మహాపురాణం. దేవీభాగవతంతు తన్మతే ఉపపురాణం. శైవమాత్స్యపురాణాది మతేతు దేవీభాగవతం మహాపురాణం. విష్ణుభాగవత మర్థా దుపపురాణమితిసిద్ధం." అని యుపోద్ఘాతసమాప్తిలో వారి సిద్ధాంతము నిరూపింపబడినది. నారదీయాది పురాణమతములో విష్ణుభాగవతము మహాపురాణము, దేవీభాగవతము ఉపపురాణము. శైవమాత్స్యపురాణాది మతములలో దేవీభాగవతము మహాపురాణము. విష్ణుభాగవతము ఉపపురాణము. నా మతములో రెండుపురాణములున్నూ ప్రమాణములేయని, దేవీభాగవతోపోద్ఘాతకర్త ఉపసంహారములో వ్రాసియుండ వారిప్రమాణబుద్ధిని, నిష్పక్షపాతత్వమును, ఔదార్యమును, అపహ్నవించి దోషారోపణముచేయుట మోసము, మహాదోషము, విశృంఖలత్వమేయగును. కొందరిచే నుపపురాణములుగా పరిగణింపబడిన నారదశైవ వాయువ్యాదిత్యపురాణములు వ్యాసప్రోక్తములైయున్నవి. మిగిలిన యుపపురాణములన్నియు మహర్షికృతములేకాని సామాన్య పండితకృతములు కావు. మహాపురాణోపపురాణములన్నియును మహర్షిప్రోక్తములగుటచే వాటికి ప్రమాణతారతమ్యమును తన్మూలకగౌరవ తారతమ్యమును నే పండితుడున్నూ చెప్ప నుద్యోగింపడు. మొదట నుద్భవించినవి మహాపురాణములు. వానినుండి ప్రవర్తించినవి యుపపురాణములని గాని ప్రామాణ్యాదితారతమ్యములచే గాదు.

మత్స్యపురాణములో శ్లో. "అష్టాదశభ్యస్తు పృథక్పురాణం యత్ప్రదృశ్యతే, విజానీధ్వం ద్విజశ్రేష్ఠా స్తథా తేభ్యో వినిర్గతం." ఈ వచనము పై యర్థమునే నిరూపించినది. శాస్త్రిగారి కరుణాకటాక్షము ప్రసరింపనంతమాత్రమున దేవీభాగవతము వ్యాసప్రోక్తపురాణత్వమును ప్రామాణ్యగౌరవాతిశయములను గోల్పోదు. ప్రతిపక్షులున్నూ దేవీభాగవతమునకు మహాపురాణత్వమునే అపలపింప జూచిరిగాని వ్యాసప్రోక్త పురాణత్వాదులను అపలపింపలేకపోయిరి. శాస్త్రిగారు ఆ కార్యమును నిర్వహించెదరు కాబోలు! చూతము.—

"వారుచూపిన ప్రమాణము లెవ్వియనగా దేవీభాగవతోపోద్ఘాతమందు; "మాత్స్యే:" "యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః; వృత్రాసురవధోపేతం తద్భాగవత మిష్యతే." దేవీ. "త్రిపదా గాయత్రీ"తి గాయత్రీలక్షణం శ్రూయతే, తేన త్రిపాచ్ఛందశ్చ దేవీభాగవతే ప్రథమశ్లోకే." సర్వచైతన్య రూపాంతామాద్యాం విద్యాంచ ధీమహి బుద్ధిం యా నః ప్రచోదయాత్." ఇతి. నవిష్ణుభాగవతే తచ్ఛందో ౭ స్తి. "గాయత్ర్యాచ సమారంభ స్తద్వై భాగవతం విదు"రితి. "మంత్రాః పుండే వతాః ప్రోక్తాః విద్యాః స్త్రీదేవతాః స్మృతా." యద్వ్యాఖ్యానికపుస్తకేషు క్వచిచ్చతుశ్చరణ శ్లోకో ౭ పిదృశ్యతే. తథాపిన క్షతిస్తు స్తవతీటీకా కారైః త్రిపాచ్ఛ్లోకస్యైవ వ్యాఖ్యాతత్వాత్ సఏవ సాంప్రదాయికః పాఠఇతిబోధ్యం" అని వ్రాసియున్నారు. వీరిట్లువ్రాసినను దేవీభాగవతగ్రంథకర్త యభిప్రాయము "సర్వచైతన్య" అను శ్లోకము గాయత్రీమంత్రపరమనియా? దేవతాపరమనియా? అనునది మనకు విచారణీయము. ఆ శ్లోకములో "ధీమహి"

"నః" "ప్రచోదయాత్" అనే మూడుపదములు మాత్రము వేదగాయత్రీమంత్రస్థములుగా గాన్పించుచున్నవి. తక్కిన నెవ్వియును లేవు. లేకున్న నామమాత్రముచేతనే యాశ్లోకము గాయత్రీమంత్రముగా గ్రంథకర్త యభిప్రాయమయినచో దేవీ. భా. స్కం. ౧౨. అ. ౧ శ్లో. యే గాయత్రీగతా వర్ణాః......తత్పదంపాతుమూర్ధానం...తకారవ్యంజనం చైవ సర్వాంగం మే సదావతు." ఇట్లు చెప్పుచున్న గ్రంథకర్త "సర్వచైతన్య" అను శ్లోకమును గాయత్రీమంత్రముగా నెట్లు చెప్పును?.

గాయత్రీమంత్రము సకారముతో నారబ్ధమని గ్రంథకర్త యభిప్రాయపడునా? ఉపోద్ఘాతకారులు తాము పొందిన విభ్రాంతి పాఠకులకును గలుగునట్లు వ్రాసియుందురు. వారివిభ్రాంతికి కారణము. "యత్రాధికృత్య గాయత్రీం" అనుదానిలో "అధికృత్య గాయత్రీం" అనుదానికి గాయత్రినధికరించుట యారంభమనుగాని "గాయత్ర్యాదిసమారంభః" అను దానికి "గాయత్రీ మంత్రముతో నారంభమని యర్థముచేసికొనుటయే యయియుండును. ఒకభ్రాంతి మరియొక భ్రాంతిని పుట్టించును." అని విపులంగా వ్రాసినారు.

ఈ శాస్త్రిగారు దేవీభాగవతోపోద్ఘాతకర్త యొక్క వాక్యముల నుదాహరించుటలో గొప్పవ్యత్యాసమును జేసి పూర్వాపరగ్రంథసందర్భములను పోనాడి పాఠకమహాశయులకు ఉపోద్ఘాతకర్త వచనములయందు రోతపుట్టించుటకున్నూ, స్వపక్షాభిముఖ్యమును కలిగించుకొనుటకున్నూ, ఒకగొప్ప మహేంద్రజాలమును జేసిరి. ముందు పాఠకప్రత్యయమునకుగాను ఉపోద్ఘాతగత వాక్యక్రమమును ఉదాహరించుచున్నాను. "శ్లో. యత్రాధికృత్య...ఇష్యతే ఇతి" మాత్స్యవచనమపి దేవీభాగవతస్యైవ మహాపురాణత్వం బోధయతి. వేదే త్రిపదా గాయత్రీతి గాయత్రీలక్షణం శ్రూయతే. తేనచ త్రిపాచ్ఛందోఽధికృత్య యత్ర ధర్మవిస్తరో వర్ణ్యతే తద్భాగవత మితి తదర్థః. త్రిపాచ్ఛందశ్చ దేవీభాగవతే ప్రథమ శ్లోకే. సర్వచైతన్య...ప్రచోదయాదితి శ్రూయతే. నవిష్ణుభాగవతే తచ్ఛందోఽస్తి. మత్స్యోక్తసంభవే...... ఉదాసీనే మాత్స్యవాక్యేతు ముఖ్యవిషయసంభవే సామంచితా యద్యప్యాధునికపుస్తకేషు.... సపీవ సాంప్రదాయికః పాఠ ఇతిబోధ్యం. యత్తుగాయత్ర్యర్థశ్చ.... స్తావకమేవేతి. కించ. శ్లో. హయగ్రీవ బ్రహ్మవిద్యా... గాయత్ర్యాదిసమారంభ స్తద్వై భాగవతం విదురితి" పురాణాంతర వాక్యమపి......ఉభయ భాగవత సాధారణ మితిచేన్న. నారదీయే; శారదాతిలకాది గ్రంథేషుచ: మంత్రాః పుందేవతాః ప్రోక్తా విద్యాః స్త్రీదేవతాః స్మృతాః? ఇతి" ఇట్లు ఉపోద్ఘాతగ్రంథక్రమమునుబట్టి "గాయత్ర్యాదిసమారంభః" అనే దానికి పూర్వమందున "యద్యప్యాధునిక"...ఇత్యాది గ్రంథముండగనయును. "మంత్రాః పుందేవతాః" అనే వచనము నుదాహరించి దానిని విచారింపకుండ విడచుటకు కారణమేమో తెలియరాదు. "వేదే త్రిపదా గాయత్రీతి గాయత్రీ శ్రూయతే" దీని తరువాయియున్న "తేనచ త్రిపాచ్ఛందోఽధికృత్య యత్ర ధర్మవిస్తరో వర్ణ్యతే తద్భాగవత మితి తదర్థః" అనేవాక్యము నేల జారవిడచిరో తెలియదు. ఈ శాస్త్రిగారు ఉపోద్ఘాతకర్త యొక్క యభిప్రాయమును పరిగ్రహింపక యకాండతాండవము నాచరించియున్నారు. "గాయత్ర్యాదిసమారంభః" "యత్రాధికృత్య గాయత్రీం" అనే రెండుస్థలములయందున్నూ ఉపోద్ఘాతకర్త గాయత్రీ పదమును ఛందఃపరముగా ఘంటాఘోషముతో చెప్పియున్నాడు. మంత్రపరమని చెప్పియుండలేదు. అట్టి స్థితిలో "దేవతాపరమా? మంత్రపరమా" యని మీరు వికల్పించుటకు అవకాశమే కానరాదు మంత్రపరత్వమే. అభిప్రేతమయినచో "త్రిపాచ్ఛందోఽధికృత్య" అనుచోట "త్రిపాన్మంత్ర మధికృత్య" అనిన్నీ "త్రిపాచ్ఛందశ్చ దేవీభాగవతే" అనుచోట "త్రిపాన్మంత్రశ్చ" అనిన్నీ, "తచ్ఛందోఽస్తి" అనుచోట "తన్మంత్రశ్చ" అనిన్నీ, వ్రాసియుండును.

(సశేషము)




అధికార్ల సూర్యనారాయణ రావు గారు, బి. ఏ., బి. యల్.,

సుందరాంగుల నెందర చూచియున్న
జానకీ! ఆత్మనిల్చు నీ ధ్యానమందె!
చోద్యముగ మింట నలరారు చుక్కలున్న
చందమామయె మదికెక్కు చందమునను. ౧

చిత్తసీమ జీకటిరీతి చింతగప్ప
వలపువెన్నెల బచరించి తొలగజేతు,
వాకసంబును దలపులు తాకుచుండ
హృదయ ముప్పొంగు జలనిధి యేచులీల! ౨

చెలియ! నీయాత్మ నలరారు వలపుకలిమి
లలితపూ పూలవాసనవలె చెలంగు,
సంతసమొసంగు చంద్రునికాంతివోలె
చల్లనై హాయికలిగించు నుల్లమునకు. 3

పక్షిపలుకులు తెలుపు నీ పలుకుతీపి
జిగివసంతంబుతెల్పు నీ సొగసుతెరగు
వెన్నెలలుతెల్పు నీయెదనున్న కరుణ
పరిమళముతెల్పు సఖియ! నీవలపుపొలుపు. ౪

కడు మనోహారమగునట్టి కథలయందు
తనువు మరువంగఁజేయు నందములయందు
విమలమాధురీకలితగానములయందు
మానినీ! తోచుచుందువు మానసమున. ౫

అలఘుసుఖమిడు నీపైని కలుగుతలపు
నిర్మలంబగు నీయందు నిలుచువలపు
చెలియ! నినుఁగూర్చికలిగెడు తెలివికలలు
నతిపవిత్రము లతిమనోహారములోను. ౬

తరుణి! నాచిత్తమనియెడు దర్పణమున
బింబితంబగునీముఖబింబ మెపుడు
తలపు లేవేళ యెన్ను నీ వలపుకలిమి
చేడెరో! నీదుప్రేమయే జీవనంబు! ౭

మది నిను న్నిల్ప శోకంబు మాయమగును
స్వాంతమున నిండు నొక వింతసంతసంబు
పొడము నుత్సాహ, మవ్వేళ పూని సేతు
గొప్పకార్యంబులను సానుకూలముగను! ౮

# నెలపూర్ణమ్మ




ఆ. రంగస్వామి సరస్వతి గారు, బి. ఏ.

(కిందటిసంపుటము ౧౧ వ సంచిక తరువాయి)

౯. విజయనగరము — ఈ విజయనగరయుగము నందు ద్రవిడభాషలలోనికొన్ని గ్రంథములయందలి ఆంధ్రులవిషయ మిచ్చటచూపఁబడును. విజయనగర చరిత్రారంభమున దక్షిణదేశముపై దండెత్తి యప్పుడు మధురయొద్ద నొక చిన్న రాజ్యముగా నేర్పడియుండిన మహమ్మదీయ రాజ్యమును రూపుమాపి శ్రీరంగము మొదలగు ప్రాచీనదేవాలయములపునఃప్రతిష్ఠ విజయనగరచక్రవర్తులు చేసిన దండయాత్రను తెలిపినవిషయమే కదా. అట్లు చేసిన విజయనగర దండనాథులలో ముఖ్యుండు సాళువమంగరాజు. ఈసాళ్వమంగునిగూర్చి యతనివంశమున బుట్టినరాజుల కంకితమీయఁబడిన రాజనాథడిండిమకవి సాళువాభ్యుదయము పిల్లలమఱ్ఱిపినవీరభద్రకవి జైమినిభారతము మొదలగు గ్రంథములయందు విస్తారమైన వర్ణన కలదు. ఈ సాళువ మంగరాజుయొక్క మనుమలలో నొకఁడు సాళువ గోప దండనాథుఁడు. ఈ సాళువగోపరాజున కిరువురు కొడుకులు. సాళువతిరుమలరాజు సాళువతిప్పరాజు. వీరికే శాసనములందు గోప తిప్పరాజు గోపయ తిరుమలరాజు అని పేరులుండెను. వీరిరువురును కవిత్వము చెప్పుటచేతను కవులనాదరించుటచేతను ప్రసిద్ధులు. సాళువగోప తిప్ప రాజు సంస్కృతమున వామనుని కావ్యాలంకార సూత్రములకు కామధేనువనువ్యాఖ్యను, సంగీతశాస్త్రమున తాళదీపికయను గ్రంథమును, నాట్యశాస్త్రమున మరొక గ్రంథమును రచించెను. ఈగ్రంథములనుగూర్చి యతఁడే కావ్యాలంకారకామధేనువున నిట్లు చెప్పుచున్నాడు.

ప్రబన్ధం తాళానాం ఘనమతి మిమీతే తమనఘ యః
శిరాఙ్గప్రాకారా నటనకరణానా మపిభిదాః;
సవృత్తే ర్వ్యాఖ్యానం పరిశరచనం వామనకృతేః
విధత్తే గోపేంద్రత్రిపురహర భూపాలతిలకః

ఇతనితమ్ముఁడు గోపతిమ్మరాజు ద్రవిడదేశమందు విజయనగరచక్రవర్తికి ప్రతినిధిగా నుండెను. అంపలి కవుల ననేకుల నాదరించి వారిచే స్తోత్రము చేయఁబడెను. కాలమేఘుప్పులవర్, అనుకవికిని యీతిరుమలరాయలకును జరిగిన కథలు కొన్ని కలవు. తిరుమలరాయల సభకుఁ జేరకపూర్వము కవి యీ క్రింది అరవపద్యమును వ్రాసి పంపెనట.

తూదైన్దునాప్జికై యిలాఱు నాప్జికైయి నిల్
పలశన్దమాలై కోలవుమ్
మూప్జులావన్దాది యేప్జునాప్జిగైయి నిల్
టోగై పెఱవ నత్తోదవుమ్
పాతలు జెమ్మడల్ కోవై పత్తు నాప్జిగైయి నిల్
పకరక్కొడిక్కట్టినేన్
శీతఙ్గ యన్తోళ్ మార్బినా నితూలికై
తెరిన్ద తిరుమలై రాయన్మున్

శిలేడోవాఱు కవిపాడుదర్కు దిర్వరు
తిఱట్టుక్కవిప్పులవరై.
కాదుమ్ ఘేశిత్తు క్కవిత్తు కదుప్పిల్
కా ఱిట్టిడిత్తు ముడుగిల్

కలశై వైత్తే ముగక్కాశివాళ మిక్టేలు
కవికాళమేగనానే

ఈపద్యములో కాలమేఘకవి తనకవిత్వశక్తి నధికముగా వర్ణించుచు, తూదు, పలశోద్దమాలై, అంతాది, తోగై, మడల్, కోవై, మున్నగు ద్రవిడప్రబంధముల వరుసగా, నైదు, ఆరు, ఏడు, పదిగడియలలో చెప్ప గలిగినట్లు చెప్పుకొని ఇయల్, ఇశై, అనఁబడు రెండు విధముల కావ్యముల నెఱిఁగిన తిరుమలరాయలయొద్దకు వచ్చినట్లును తనతో వాదము చేసి యెదుర్కొను దొంగ కవుల ననేకవిధములుగా నవమానింతుననియు చెప్పుకొనెను. పైగ్రంథమున కవిచేసికొన్న యాత్మశ్లాఘయందు నమ్మకముపుట్టక ననేకవిధముల నతని కఠినపరీక్షలకు లోఁబఱచెననియు, వానిలోనెల్ల నారితేరిన కవికి చాలసంతోషించి యనేక బిరుదులును, వరుసలును మున్నగు గౌరవచిహ్నములతో చాల ద్రవ్యమిచ్చి యతనికుబేరతుల్యుని చేసెనట. ఇట్లు తనదారిద్ర్యమును బోఁగొట్టిన తిరుమలరాయలపైఁగవి యీక్రిందిపద్యములఁ జదివెనట.

"ఇన్దిరక్కా కలై శూరెయె వ్రుగన్దిరున్దాన్
అగ్నిని యుదరమ్ విగట్టిగలాన్
ఎమనై నైక్కారుదావల నెనక్కారుది
నిరుతివన్దెన్నైయె స్తుహ్యాన్
అన్దమామ్ వరుణ నిరుక నీర్వట్టగలాన్
ఆకత్తులు పక్కాళుమ్ యానుమ్
అనిలమదాగు మమదినై కొక్కాళ్వామ్
ఆరనై యులగిని లోహ్వార్
శత్తరమిన్ద వనినై యే పెట్ట్రు
తద్దిర రాశైనై వాశ్గిత్
తలైనైయుమె న్నైనిలై శెయ్య కల్యాణిప్
చాళువ తిరుమలై రాయన్
మన్తరబుయనాన్ గోప్పయనుదవు
మధిపతి విరరారామన్
వాక్కినా ఉక్కాచేరవాక్కినా నవనే
మాశిలీ శాన నావానే".

ఈకాలమందే యఱవమున షణ్ముఖుని (స్కాన్దుని) పైతిరుప్పుగళ్ అను గొప్పగ్రంథమును వ్రాసిన 'అరుణగిరినాథుఁ'డను కవి తనగ్రంథములో నప్పటి చక్రవర్తియైన ప్రౌఢదేవరాయని నుదాహరించి యున్నాఁడు. ఆతఁడుదాహరించిన పద్యమిది:

"ఉదయ దామమార్బన ప్రభుడదేవమారాజ
నుళమునాడవాప్ప దేవర్బరమాళే"

'అప్పుడుపుష్పించినపూలనుధరించినవాఁడును ప్రౌఢదేవమహారాజు హృదయమందుండునట్టియు దేవదేవుఁడు'

ఇఁక విజయనగరచక్రవర్తులందఱిలో నధికప్రఖ్యాతిగన్నది కృష్ణరాయలుంగదా. ఇతని ప్రజాపరిపాలనము, రాజనీతి, కవిజనసన్మానము, కవిత్వము, మొదలగు ననేకవిషయములఁగూర్చి క్రొత్తగాఁ జెప్పవలసిన విషయము లధికముగా లేవు. అయిన నిచ్చట క్రొత్తగాఁ జెప్పవలసినది కొంతగలదు. ఇతఁడు సంస్కృతమునందును ఆంధ్రమునందు నెట్లు ప్రఖ్యాతిగా కవులనాదరించి గ్రంథములఁగొనెనో అట్లే కన్నడమునందును, ద్రవిడమునందును ప్రసిద్ధుఁడు. కన్నడమునందు వ్యాసభారతము నాతని యాస్థానమందలి యొకకవి కన్నడించి యాగ్రంథమునకు 'కృష్ణరాయభారతము'ని పేరిడెను.

చిన్నన్న ద్విపద కెఱఁగును
పన్నగ పెదతిరుమలన్న పదముల కెఱఁగున్
మిన్నంది మెఱయును నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్య శ్రేణిన్.

అను తాళ్లపాక కవులపై చాటుపద్యములోని పెదతిరుమలన్న యీకాలమందే తిరుపతివెంకటేశ్వరులపై ననేకవేల గ్రంథపరిమితిగల పాటల నొనర్చెను. ఈవంశము వారి కందువలన సంకీర్తనాచార్యులని పేరువచ్చెను. తిరుపతిలో నేటికిని వెంకటేశ్వరుల పొన్నసేవసమయమున తాళ్లపాకవంశమునఁబుట్టినవారే పాడుచున్నారు. ఈ పాటలన్నియు తాటాకులపైఁగాక శాశ్వతముగా నుండుటకు రాగిరేకులపైఁ జెక్కఁబడి తిరుపతిదేవాలయములో నుంచఁబడియున్నవి. ఈ తాళ్లపాకవారివలెనే కన్నడమందును భక్తిపరవశులై భగవంతునిపైఁ బదములఁ బాడిన కవిశ్రేష్ఠులుఁ గొందఱుండిరి. వారిలో ముఖ్యుఁడు పురందరవిఠ్ఠలుఁ డను నామాంతరముగల పురందరదాసు. ఈ పురందరదాసు బ్రాహ్మణుఁడు. మొట్టమొదట నధి

కైశ్వర్యమందుండి భగవత్సంకల్పముచే నైహికసుఖముల నశ్వరత్వమెఱింగి, ధనసంపదను విడనాడి అప్పటికే ప్రసిద్ధుఁడైయుండిన వ్యాసతీర్థులను నాచార్యునొద్దకుఁ జేరెను. అటుపిదప భగవంతునిపై వసవరలము సంకీర్తనమందే కాలము గడిపెను. పురందరదాసు వ్రాసిన కీర్తనలు కొన్ని వేలు గలవు. తాళ్లపాకవారి పదములవలెఁ గాక యివి నేఁటికిని వాడుకలోనున్నవి.

అఱవమునందును కృష్ణరాయలగూర్చి క్రొత్తగా తెలుగఁదగినది చాలవిషయమున్నది. కుమారసరస్వతి యని యొక ద్రవిడకవి రాయలయాస్థానమున నుండెనట. రాయలు కళింగదేశమును జయించి యాదేశపు రాజైన గజపతిసుతుఁ బెండ్లాడినప్పుడీకవి యీక్రింది యఱవపద్యమును జెప్పెనట.

కళిఙ్గ మిప్పను మదిక్కై చ్చుఙ్గనోట్టు
మెయ్ద్ద కటక న్నష్టువనిట్టాళ్ మకీద్దవలర్
పొన్నిట్టమాన కృష్ణభూపాలా వున్దనక్కు
ప్పిన్నిట్ట మానవొడ్డియన్ పొఱ్పె.

ఈపద్యమందు కళింగదేశపురాజగు గజపతి కూఁతురికి సతిని రాజ్యలక్ష్మికి సైశ్యముకల్పింపబడి యిరువురునుఁ గృష్ణరాయలచే బలిగాఁ బరిగ్రహింపబడిరని యందముగా వర్ణింపఁబడినది,

అఱవమునఁ బ్రసిద్ధమైన 'చూడామణి' యను నిఘంటువును వ్రాసినమండల పురుషుఁడను జైనకవి కృష్ణరాయలయాస్థానమందే యుండెనని కొందఱియభిప్రాయము. ఇందులకాధారముగా నాకవి తనగ్రంథములో నీక్రిందిపద్యమునుఁ జెప్పియున్నాఁడు.

"పడైమయక్కట్టిపోదుమ్పడైమడమొయ్త్తిలాదాన్
మడైకెటకటకత్తోశాన్ పతిష్ఠు డైమన్నగర్తన్నన్
గడిమన్నర్వణఙ్గున్దాళాన్ కిరుట్టినరాయన్ కైపోర్,
కొడైమడమెన్నతిమ్మనత్తై యీడుకోడు ట్టిలాపే"

దీనికర్థము ప్రత్యర్థిసేనలెన్ని యెదిరించినను వరా-ఁడుకానట్టియు, కటకము అంగదముగల భుజము-డు, ధవళచ్ఛత్రముగలరాజును, గడిమన్నలు నమ-స్కరము చేయు పాదములు కలవాఁడు నైన కృష్ణ రాయని చేతివలె సకలమైనవారికి దానము చేయుటకే "కొడమడం" అని పేరు.

అయిన నిందుదహరించిన కృష్ణరాయఁడు విజయనగరచక్రవర్తి కాదనియు నంతకుఁ బాలపూర్వముండిన రాష్ట్రకూటకృష్ణరాయలనియు నితరులయభిప్రాయము. ఈవిషయమై యింకను ద్రవిడమునను నాంగ్లమునను పత్రికలలో నుత్తరప్రత్యుత్తరములుగా వ్యాసములు వచ్చుచున్నవి.

కృష్ణరాయలపై 'మంజరిపా' యను నొకప్రబంధమును 'జ్ఞానప్రకాశర్' అను శైవాళవంశమునఁ బుట్టినకవి పాడినట్లు 'తొండైమండలశతకమ్' అనుగ్రంథమున నొక పద్యమున్నది. ఆపద్యమిది :

"జ్ఞానప్రకాశప్పుకష్ణకిరుట్టి రాయర్ మేల్ మంజరిప్పా
కానప్రకాశప్పగఙ్గైయ్యద్ద కచ్చిక్కులంబ కజ్ఞైయ్
జ్ఞానప్రకాశగురురాయ న్నాప్పేర్ న్దునలజ్ఞెఅద్ద
మానప్రకాశముడై యోర్పశర్ తొణ్డమణ్డలమే."

కచ్చిక్కలంబక మనుగ్రంథమును వ్రాసిన జ్ఞానప్రకాశగురురాయఁడు కృష్ణరాయనిపై 'మంజరిపా' అను గ్రంథమును వ్రాసెననియు నతఁడు తొండమండలమునఁ బుట్టెననియు నీపద్యమున కర్థము.

ఆకాలమున 'తిరువారూర్' అను ప్రసిద్ధశైవక్షేత్రమున నర్చకులు చక్కగా పనిచేయక దేవునిత్యపూజా నిరోహణము కాకుండిన దానిఁజూచి దుఃఖించిన శైవాచార్యుఁడైన తత్త్వప్రకాశకవి ఈ క్రిందిపద్యములను వ్రాసి రాయలకంపెనట.

"మరువుపుగఴ్ కృష్ణమహారాశరాజై
అరియవడిమునై యారాజై తిరువారూర్ప్
పాగత్తొండియెఱుప్పార్ పాదన్ తిరువాళై
త్యాగక్కొండి యిరక్కుండే"
ఉష్ణితులుక్కెల్ల వోడ్డిమూన్ తానవల్ల
పీష్టితులుక్కువన్దు మేల్కట్టియాష్టి
శిరన్ద తిరువారూర్ త్యాగరుడైప్పూశై
ఇఅన్దదే కట్టినరాయా"

ఈపద్యములయందు స్వామిపూజను సరిగా జరుపని పూజారులను 'తుదకలు'గా తిట్టియున్నది. త్యాగ

రాజస్వామి పూజనిలుచుటకు కారణము, వట్టెతురకలు నుగారు, ఒడ్డియన్ (ఓడ్రరాజును) గాదు. శ్రీస్థియన్ గ్రామమందలి తురకలలో షమాములను పూజారులు అని తిట్టియున్నది. ఈతురకలచే స్వామిపూజ కాబంకము కలిగెను అని ఈపద్యములను చదివి కృష్ణరాయ లాయూరి పూజారులను మార్చివైచెనట. పిదప దేవునిపూజ యథాప్రకారముగాఁ జఱిగెనట. అప్పు డీకవియే యీక్రింది పద్యమును చెప్పెను.

"ఉణ్ణవయిట్టెలు మిక్కొ-న్దలిట్టదే
తొణ్ణరేవిష్ణులుక్కు-కే-పణ్ణెల్లామ్
అప్పమువలె న్నదిరసము న్దోశైగళుమ్
కప్పవముపోచ్చే కవిఞ్ఞ"

ఇందు కవి శిక్షకపూర్వము పూజారు లుండిన స్థితియు, ఆకాలమున వీరికి వచ్చుఅప్పములు, అటుకులు, అతిరసములు, దోసెలు పోయినవే అని హేళనము చేసెను. ఈతిరువారూర్ దేవాలయమందే యింకొక కాలమునందు నాగరసనంబి యను వాఁ డధికారిగా నుండినట్లును, అతఁడు దౌర్జన్యముచే నాలయమందుండిన 'అటువత్తుమూవర్' అను అఱువదిమువ్వుర విగ్రహములలో రెంటిని గఱఁగడీసెనట. ఈసమాచారమును ఒకపద్యముగా వ్రాసినట్లును ఆపద్యమొక చిలుకకు నేర్పియా చిలుకను రాయలకు బహుమానముగా నీయ నాచిలుక చెప్పిన పద్యముచే రాజునకర్థమెఱింగించి యా 'నాగరసనంబి' యుద్యోగమునుండి తొలగింపఁబడెననియు నొక యైతిహ్యము కలదు. చిలుకకు నేర్పిన పద్యమిదియుట:

"మున్నాళఱుబత్తు మూవరిరున్దారవరిల్
ఇన్నాళిరండు పేరేగినార్-కన్నాన్
వరుక్కొన్ఞాన్ విట్టువిట్ట నాగరసనంబి
ఇరుక్కొన్ఞాన్ కిట్టినరాయా."

ఈపద్యమునకు పూర్వము దేవాలయమున నఱువదిమువ్వు రుండిరనియు ఇప్పుడు వారిలో నిద్దఱేగి రనియు కంసాలికరగబెట్టు చున్నాఁడనియు వారికిమ్మైన నాగరసనంబి యున్నాఁడనియు నర్థము. శైవవైష్ణవవాదములనుగూర్చి 'ఇరుశమయవిళక్కమ్' అని యొక గ్రంథము కలదు. దానికి కర్త 'హరిదాసు' అను నొకకవి. ఈ హరిదాసు కృష్ణరాయలకాలమం దుండిన ట్లాగ్రంథావతారిక పద్యములచే దెలియును. ఈపద్యమునందుఁ బెద్దన చం॥ అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస, న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర, ప్రభుతిరువాళ్లకుం డిగు సురప్రకరంబు కళింగమేదినీ, విభు నపకీర్తి కజ్జలము వేమరు పెట్టి పఠింపు నివ్వలన్.

అని పెద్దనచే నుదహరింపఁబడిన జయస్తంభము దహరింపఁ డినది.

'కిరిబోల్ వళర్ద్ద కిళరుంబు యుక్కొ-న్నరాయర్
తిరైమాదు శింగాద్రియిల్ త్తంబవాట్ట
వరమాదరవాలళిత్తే వడహావమేవుమ్
కరుమామణివణ్ణనై నీడు కరుత్తుళ్వైప్పామ్'

ఇందు సింహాద్రిలోని స్వామిని వర్ణించుచో 'వడహావమేవుం' అనియొక విశేషణమున్నది. ఇది ఉత్తర దేశమందలి హావమున కధిపతియని స్వామిని వర్ణించియున్నది. ఇచ్చటి 'హావమ్' అను ప్రదేశమేదో యిప్పుడు తెలియ లేదు.

కృష్ణరాయలమంత్రివర్గములో నొక యఱవమొదలారిగూడ నుండెనట. 'అఱవళత్తిమొదలియార్' ఈయననామము. ఈపేరే గంభీరమావ్యతో 'అఱమాత్తుంగన్' అని ద్రవిడగ్రంథములలోఁ గనుపడుచున్నది. ఇతనికి తన స్వగ్రామమునుండి 'శేంబూర్ అఱమాత్తుంగన్ శేంబూరు అఱంవళత్తమొదలియా'రనియు నుద్యోగము చేసిన స్థలమైన 'హంపి' నగరమును బట్టి 'అంబియు అంవళత్తముదలియా' రనియు పేర్లుపడుచున్నవి. కృష్ణరాయలకాలములో నితనికనేకపాండ్యవంశమునఁ బుట్టిన రాజులు సామంతులుగా నుండిరి. అట్టివారిలో నొకఁడీ 'యఱంవళత్తమొదలారి'కంకితముగా నొక 'కలంబక'మును ద్రవిడకావ్యమును వ్రాసెనట. తాను క్షత్రియుఁడై రాజవంశమందు బుట్టియు నట్లు చతుర్థకులమునఁ బుట్టిన మొదలారికి కావ్యమీయవగునా యని యొకకవి యడుగఁగా నాపాండ్యుఁడీక్రిందిపద్యము బదులిచ్చినట్లు "తమిళ్నవలర్ చరిత"లో నున్నది.

"అఱంవళత్త ముదలియారై ప్పాడియక్ కంపాడలామో ఎప్పులవర్క్కుమ్ కూరియది"

"ఊఙ్గుశ్ మనన్దైరియుమ్బుల పీరొందుశీర్మ్మరబోఱ్
తిఙ్గళ్ మరబినన్ తిఙ్గళిన్ కూడచ్చెయ్బ్బూర్తఱియా
తుఙ్గన్ మరబినిల్ గఙ్గయుం కూడినన్ శోదియన్దో
ఎఙ్గణ్మ్మరబుణ్డెనక్కువిపాడినన్ యామవక్కే"

శివుఁడు తన జటాజూటమందుఁ జంద్రునితోఁ గూడ గంగను ధరించియుండుటచే, చంద్రవంశమునఁ బుట్టిన పాండ్యునికిన్ని గంగావంశమునఁబుట్టిన ముదలియారికిని సంబంధము కలదనియు నందుచేతనే తానతనికి గ్రంథమిచ్చెననియుఁ బైపద్యమునకుఁ దాత్పర్యము.

ఒకకాలమున గొందఱు వీథినాటకము లాడు నటులు, తాము వేగాశజాతివారివలె వేషములతో వచ్చి యాడినట్లును ఆయాటచే వారు 'అఖంపళొర్తముదలారి' దను వేగాశజాతి నవమానించినట్లును ఆయవమానమును సహించక నా మొదలారి వారిని కత్తిచే నఱికించినట్లు నొకయైతిహ్యమున్నది. ఈవిషయము తొండైమండల శతకమను గ్రంథమున నొకపద్యమున్నది. ఆశతక వ్యాఖ్యానమునం దీకథ క్రీ. 1511లో జరిగినట్లు గూడఁ జెప్పియున్నది. ఆపద్యమిచ్చట నుదాహరింతుము.

"తాణ్డైత్తయుళ్ళ పుగషేఱ్ కృష్ణరాయన్ శేముగత్తిలే
వేగాన్తూళిశై పొప్పశే వినోదత్తు వేడగ్గొణ్డు
శోకార్వయిరితుర్ హత్తాద త్తుళ్ కుడిమైరొణ్డ
వాశొలపతియిర్ మాఱ్ తైవన్దో తొణ్డమణ్డలమే"

కృష్ణరాయలకుఁ బిదపఁ గొంతకాలమునకు 'రామరాజు విఠ్ఠలరాయ'లను రాజు, నోళపాండ్య దేశములలో విజయనగరచక్రవర్తికిఁ బ్రతినిధిగా రాజ్యమేలెను. ఈవిఠ్ఠలరాయలు కృష్ణరాయలయల్లుఁడై యతనికిఁ బిదప మిగుల ఖ్యాతిగా రాజ్యమేలిన అళియరామరాయల పితృవ్యపుత్త్రుఁడు. ఈరాజు అచ్యుతదేవరాయల కాలమందును అళియరామరాయలకాలమందును అనేక రాజ్యముల కధిపతియై యనేక యుద్ధములలో వాసిఁగాంచెను. ఈతని పరాక్రమము లన్నిటిలోను పాండ్యకేరళ దేశములపై నితని దండయాత్రయు నచ్చటిదిగ్విజయములును ముఖ్యములు. కేరళదేశమున నొకరిద్దఱు రాజులసహాయము చేసికొని యాకాలమున 'పోర్చుగల్' దేశమువారును పాండ్యకేరళదేశములలో విజయనగరరాజులకు విరోధముగావించుచుండిరి. అట్టివిరోధమును రూపుమాపి యూపరంగులను (పోర్చుగీసువారిని) పోఁదోలి, వారికి సహాయులైన పాండ్యకేరళరాజులనోడించి విధేయులుగాఁ జేసిన దీవిఠ్ఠలరాజే. ఇట్లుజయించిన పిదప నీవిఠ్ఠలరాజునకు పుణ్యార్థముగాను, అతనిదిగ్విజయ సూచకముగాను ప్రకటించిన శాసనములునుఁ గొన్ని యున్నవి. ఈవిఠ్ఠలరాజు కన్యాకుమారిని జయించినప్పు డతనిపై సామంతుఁడైన పాండ్యరాజీక్రిందిపద్యముఁ జెప్పినట్లు తమిఴ్నావలర్ చరితలో నున్నది.

"తొట్టిలిరుక్కత్తొడఙ్గియ నాణ్ముదలా
అట్టదిక్కు నిన్కుడైక్కీళ్ళాయిఱ్ఱు విఠ్ఠలైకూ
తన్కుమరియన్ఱి తనిక్కు మరికొళ్ళానీ
తెన్కుమరిక్కేగువదెన్ శెప్పు,"

ఈపద్యమునకర్థము "ఓవిఠ్ఠలరాయా! నీవు శిశువై తొట్లలోనుండినవాఁడు మొదలు నెనిమిదిదిక్కులును నీ ఛత్రము క్రిందనమరినవి. తన(కుమరి) స్త్రీవితప్ప నితర కుమరిస్త్రీనిఁ బరిగ్రహించని నీవు 'తెన్కుమరి' కన్యాకుమారిపట్టణము (ఒకస్త్రీ) నెట్లుగ్రహించితివి.

విజయనగర సామ్రాజ్యము క్రీ. 1565కు వెనుక ప్రభతగ్గినందున సామంతరాజ్యములు క్రమేణ స్వతంత్రరాజ్యములైనవి. అందుచేత నాంధ్రదేశమునకును ద్రవిడదేశమునకును సంబంధము కొంతతగ్గినను ద్రవిడదేశములో స్వతంత్రులై రాజ్యము లేర్పరచుకొన్న వారనేకు లాంధ్రులుగానే యుండిరి. అట్టివారిలో ముఖ్యులు చెంజి, తంజావూరు, మధురదేశముల నాయకులు ప్రధానులు. చెంజి తంజావూరు పట్టణముల నాయకవంశములు శీఘ్రకాలముననే మహారాష్ట్రులకులోఁబడినను మధురయందలి నాయకవంశముమాత్రము నూటయేఁబది సంవత్సరముల వఱకు, అనగా దాదాపు క్రీ.వె. 1750 వఱకును ఇంగ్లీషువారికి ఫ్రెంచివారికిని కర్ణాటకదేశమున జరిగినయుద్ధముల వఱకు నుండెను. ఈనాయకవంశపు రాజు లాంధ్రులు. వీరిలోఁ గొందఱు స్వయముగాఁ గావ్యములు వ్రాసిరి. అనేకులు కవుల నాదరించి వారిచేఁ బ్రస్తుతులై, గ్రంథములఁ గొని యున్నారు. చెంజినాయకుఁడైన కృష్ణప్పనాయకుని యాస్థానమందు దక్షిణదేశమంతటను వ్యాకరణమీమాంసా వేదాంతశాస్త్రముల నసమానుఁడైన శ్రీనివాస

దీక్షితులుండెను. ఈదీక్షితులకే బిరుదములతోఁగూడి 'దంతిద్యోతిదివాప్రదీప సత్యమంగళ రత్నఖేట శ్రీనివాసదీక్షితుల'ని పేరయ్యెను. తంజావూరు నాయకుల విషయము తెలుఁగువారికిఁ దెలిసినదే. అత్యుత్తమాంధ్ర కావ్యములైన విజయవిలాస, సారంగధర చరిత్రాదులవట్టి పుట్టినవేకదా. తంజావూరు రఘునాథరాయలు సంస్కృతాంధ్రముల కవిత్వముచెప్పి కావ్యములనందినట్లే యతని పమునందును గొన్ని కృతులనందియున్నాఁడు. తిరువైయ్యార్పురాణమను నొక ద్రవిడకావ్యము రఘునాథ రాయలకంకితమీయఁబడెను. ఈకావ్యమందు రఘునాథ రాయలును వారి ప్రధానమంత్రియగు గోవిందదీక్షితులునుచాల పొగడఁబడియున్నారు.

మధురనాయకులు తామాంధ్రులై యనేకాంధ్ర కవులనాదరించియు వారి ఖ్యాతియాంధ్రవాఙ్మయమునకన్న ద్రవిడవాఙ్మయమునందే విస్తారముగా వెలుఁగఁదగి యున్నది. ఈనాయకవంశములో నందఱికన్నఁ బ్రఖ్యాతుఁడు తిరుమలనాయకుఁడు. మధురలో తిరుమలనాయకుని ప్రాసాదమును గూర్చి వినని వారలుండరు. ఈతిరుమల నాయకునిసభలో "కుమరగురుపరమునివర్" అను ద్రవిడ కవి యుండెను. ఈకవి 'మధురమీనాక్షి'పై 'పిళ్లైత్తమిళ్' అను నొక ద్రవిడప్రబంధము వ్రాసెను. ఈగ్రంథము తిరుమలనాయునిసభలో మొట్టమొదటఁ జదువునప్పుడు 'మీనాక్షీదేవియే యొకకన్యరూపమునవచ్చి వినుచుండెనని యైతిహ్య' మొకటి చెప్పుదురు. ఈకవియే 'మీనాక్షియమ్మైకుఱమ్' అని యింకొక ద్రవిడకావ్యమునుఁగూడ వ్రాసియున్నాఁడు. ఆగ్రంథమునందు తిరుమలనాయకుని యీ క్రిందిపద్యమునఁ బ్రశంసి యున్నాఁడు.

"నీర్వాష్షి తెన్నవనై నిన్నలవారదుళ్వాష్షి
కార్వాష్షి యన్నయల్ట్ కన్నితిమవనళ్వాష్షి
శీర్వాష్షి కచ్చినగర్ తిరుమలై భూపతి వాష్షి
పేర్వాష్షియవన్ శెల్వమ్ పెరియాష్షివాష్షియవే."

ఇందు కవి మధురలోని యీశ్వరుని, దేవిని, తిరుమలభూపతిని మంగళాశాసనము చేసినాఁడు. ఇందు తిరుమలనాయకుని కచ్చినగర్ తిరుమలైభూపతి యని ప్రశంసించెను. ఇందు 'కచ్చి' యనుపదము మధురలో నేలిననాయకరాజుల యింటిపేరు. ఈ వంశమువారు మొట్టమొదట'కంచి' యందుండి యచ్చటినుండి మధురలో రాజులైరి. అందువలన వీరివంశమునకు కచ్చియని యింటి పేరయ్యెను.

ఈవ్యాసము నందింతవఱకును అఱవమున నాంధ్ర దేశమునకు సంబంధించిన చరిత్రవిషయమే యధికముగాఁ జూపఁబడెను. ఇట్లే యాంధ్రవాఙ్మయమునకును నితరవాఙ్మయములకు నెన్నియో సంబంధములుండవచ్చును. ఈసంబంధముల నెఱుఁగుట యత్యావశ్యకము. అట్లెఱుఁగుటకు నాయాభాషలలో జ్ఞానము ముఖ్యముగా నుండవలెను. అట్టి జ్ఞానముచే యాంధ్రదేశమునకు సంబంధించిన విషయము లెఱుఁగుటయేకాక యాయావాఙ్మయములలో నుత్తమములైన గ్రంథములను, గ్రంథాభిప్రాయములను బరివర్తించుటకు నుపయోగించును.






ఆదిపూడి సోమనాథ రావు గారు

(రెండవ సంపుటము—౧ వ సంచిక తరువాయి)

౨౪

గీ. ఆశయే లేదుగాన మహర్షి తాను
పరమ దుస్సాధ్యకార్యమై పరఁగుచున్న
దానిఁ గూడను గొప్పగాఁ దలఁపకుండు

౨౫

సుఖసాధ్యము లనుకొని సలుపఁగడఁగు
నతని కెన్నియొ కష్టసాధ్యమ్ము లగును
సాధు వన్నియుఁ దనకుదుస్సాధ్యములుగఁ
దలఁచుఁ గావునఁ దన జీవితమ్మునందు
నొక్కటేనియు దుస్సాధ్య ముండఁబోదు

౨౬

గీ. దివ్యపథ మిలయందు నదృశ్యమైనఁ
గరుణయునున్యాయమునువచ్చి కానిపించుఁ
దెలివితో లాభనష్టముల్ దెలియుటకును
మొదలిడినతో నెకపటంబు పొదలఁదొడఁగు

౨౭

గీ. సత్య ధర్మమ్ము తా నిలఁ జాటుకొనదు
ధర్మమని కాన నద్దియే ధర్మమగును
అనృతధర్మంబు తానెపో యమలమైన
ధర్మమని చాటుకొనుచుండు ధరణియందుఁ
గాన నయ్యది ధర్మంబుగాకయుండు
నిష్క్రియాలత్వణంబయి నెగడునదియె
ధర్మమైయొప్పఁ గావున ధర్మ మిలను
గార్యపరతనుగోర దెక్కాలమందు
అనృతధర్మంబునకుఁ గార్య మవసరంబు
గాన నదిగోరుచుండును గార్య మిలను

-ర

గీ. దైవపథ మస్తమించిన ధర్మముండు
ధర్మ మడుగంటిపోయిన దానిచోటఁ
బ్రకటమగుచుఁ బరోపకారంబు దనరు
నవని నది యంతరింప న్యాయంబుపొదలు
న్యాయమడిగిన నాచార మతిశయిల్లు
సత్యకృత్రిమరూప మాచార మెన్న
భువి నశాంతికి హేతువై పొలిచి నిలుచు

౨౯

గీ. దివ్యపథమును నుత్తముల్ దెలిసి కేని
మించు రయమున దాని సేవించుచుండ్రు
దివ్యపథమును మధ్యముల్ దెలిసికేని
విడిచిపట్టుచుఁ బట్టుచు విడుచుచుండ్రు
దివ్యపథమును నధములు దెలిసికేని
నవ్వుచుందురువా రటు నవ్వరేని
దైవపథమునునామంబు ధన్యమగునె?

౩౦

గీ. చాలఁగలవాఁడె భువిఁ జాలఁగోలుపోవు
పరమసంతృప్తిగలవాఁడు భంగపడఁడు

చెదరకుండెడు మదివాఁడు చెఱుపుగనఁడు
పృథ్వి నాతఁడు చిరము జీవింపఁగలఁడు

౩౧

బ్రతుకుతోడ నెయుండును మృతియుఁ గాన
బ్రతుకులోఁ జొచ్చినప్పుడే మృతినిఁజొచ్చు
నష్టమొందిన దేహంబు నష్టమేమి?
సత్యమైనట్టి తెలివితో స్వప్రకాశుఁ
జేరఁగల్గినఁ జాలును జీవునకును
అనఁగ నిత్యత్వమందుటే యాత్మ కవధి

౩౨

అల్పవస్తువులనుగూడ నధికమైన
శ్రద్ధతోఁ జూడఁగలుగుటే సత్యమైన
సభ్యతకుఁ జిహ్నమైయొప్పు సాధుగుణమె
బలమునకు లక్షణంబయి వెలయుచుండు

౩౩

అజ్ఞుఁడని తన్నెఱుంగుట యగును ప్రజ్ఞ
అట్టు లెఱుఁగమి యొకవిధమైనజబ్బు

౩౪

మంచిమాటలు నరు నుద్ధరించుఁ గాని
మంచిపనులన్న వానిని మించియుండు.

౩౫

గీ. అచలమగుదాని సులువుగా నాఁపవచ్చుఁ
గలుగఁగలదాని నవలీల నిలుపవచ్చు
వేడుకగ లేఁతదానిని విఱువవచ్చు
జల్లుమని సూక్ష్మవస్తువుల్ చల్లవచ్చుఁ
గానఁ దగుతఱిఁ బనులకుఁ గడఁగవలయుఁ
గలఁతకుంబూర్వమే శాంతి గొలుపవలయు

౩౬

గీ. కడఁకతోడఁ బ్రవృత్తిమార్గమును మాని
యమలమైన నివృత్తిమార్గమును బూని
చులుకఁదనమును నెంతయుఁ దఱుఁగఁజేసి
మించుసిరులను విరివిగాఁ బంచిపెట్టి
యున్న యాడంబరములెల్ల సున్నచేసి
దుమ్మువలె నుండువాఁడె జగమ్మునందు
నైకమత్యమ్ము గూర్పగా నర్హుఁడగును

౩౭

గీ. ఆర్ద్రసుకుమారతనువుతో నవతరించి
పరమశుష్కాంగుఁడై తుది నరుగునరుఁడు
మొక్కలును జెట్లు ప్రాణులు పుట్టునప్పు
డార్ద్రసుకుమారతనులతో నలరుచుండి
అతికఠినశుష్కతనులతో నంతరించుఁ
గానశుష్కత్వమునుమఱి కఠినతయును
మరణసహపాంథులయియుండుధరణియందు

౩౮

గీ. మనుజుఁడింద్రియములనోర్చి మనినఁజాలు
నవనిఁబలుకుల బోధింప ననవసరము

౩౯

గీ. నీటికంటెను మృదువును నీటికంటెఁ
బరమసుకుమారమైనది ధరణి లేదు.
గాని బలుగట్టిగా నుండువాని నెల్ల
సమయఁజేసెడుశక్తిలో జలము మించి
వఱలుచుండెడువస్తువుల్ వసుధ లేదు
బలముగలవానిగెలుచుదుర్బలుఁడుమఱియు
మిగుల కఠినుని గెలుచును మేదకుండు
వసుధలో దీనిఁదెలియని వాఁడు లేఁడు
గాని యొకఁడైన నడువఁడు దీనిఁబట్టి

౪౦

గీ. విషయభోగంబు భువిలోన విహితమంచు
నొప్పుకొనుకంటె మించిన తప్పు లేదు

౪౧

తృప్తిలేమిని మించు దుస్థితియు లేదు

౪౨

వసుధయం దాశమించు పాపమ్ము లేదు

౪౩

రాజభవనాళి శిథిలతోఁ బ్రబలెనేని
పంటపైరు లవెల్లను పంటఁగలయు
నుర్విలో గాదెలెల్లను నుత్తవగును

౪౪

గీ. మతగురులస్తోత్రపాఠముల్ మానుకొనుఁడు
జనులలో దెబ్బలాటలు శాంతమగును

౪౫

కష్టసాధ్యములకు వెల గట్టకుండు
అపహరింపరు వానిని నప్పుడెవరు
విషయభోగేచ్ఛఁగొలిపెడు విషయములను
వెలిపఱుపకుండు శాంతమ్ము వెలయు భువిని

౪౬

గీ. అవనిరాష్ట్రంబు నేల న్యాయ్యంబు వలయు
ఆయుధంబులు ప్రజనుండి యపహరింపఁ
బ్రబలమైనట్టియుక్తిని బన్నవలయు
స్వర్గరాజ్యము నిష్క్రియ వలనఁగలుగు
మహిని వీని సమర్థించు మార్గమెద్ది?
ప్రబలనిర్బంధముల చేతఁ బ్రజలయందు
నంతకంతకు దారిద్ర్య మతిశయిల్లు
వాడిగలయాయుధమ్ములు ప్రజలయందు
హెచ్చుకొలఁది నశాంతియు హెచ్చుచుండు
ప్రజలలోపలఁ గపటంబు ప్రబలుకొలఁది
హెచ్చుగా ఘోరకృత్యముల్ పెచ్చుపెరుఁగు
ప్రకటనల్ హెచ్చుకొలఁదిని రాష్ట్రమందు
బందిపోటులు చౌర్యముల్ ప్రబలమగును
గాన సాధువు బోధింపఁ గడఁగెనిట్లు
నేను నిష్క్రియుఁడై యున్న నిక్కముగను
ప్రజలు పరిపూర్ణ వృద్ధినిఁ బడయఁగలరు
నేను శాంతిపథమ్మున నెగడుచున్నఁ
దమకుఁదామె జనమ్ములు ధరణియందు
న్యాయపథమున నెంతయు నలరఁగలరు
నిష్క్రియాశీలుఁడయి నేను నెగడుచున్న
ధరణిలోపలఁ దమ ప్రయత్నముల వలన
నఖిలధనవంతు లగుచుండు రఖిలజనులు
ఆశలన్నియు నే విడనాడియున్నఁ
దమకుఁ దామె జనంబులు ధరణియందు
సరళవర్తనమును గల్గి సంచరింత్రు

౪౭

ఇలను మునివ్రేళ్ల మీఁదను నిలుచువాఁడు
నేలపై సుస్థిరంబుగ నిలువలేఁడు
పంగకాళ్లను ధర నిలఁబడెడువాఁడు
సాగఁజూచిన ముందుకు సాగలేఁడు
వెలుఁగులోనిల్చువాఁడు దా వెలుఁగలేఁడు
తన్నుఁదా నెన్నుకొనువాఁడు తనకునుండు
మంచిచెడ్డలఁ దాఁబరీక్షించలేఁడు
తన్ను భూషించుకొనువాఁడు తథ్యముగను
తన్ను యోగ్యునిగా మదిఁ దలఁపలేఁడు

౪౮

పరులఁ దెలిసినఁ గుశలుఁడై పరగఁగలఁడు
తన్నుఁ దెలిసినఁ బ్రాజ్ఞుఁడై తనరఁగలఁడు

౪౯

అన్యులను గెల్చి బలశాలి యగును గాని
తన్నుఁ దాఁ గెల్చియగును ప్రతాపశాలి

౫౦
తనివితోనుండఁదెలిసిన ధన్యతముఁడె
ధనికుఁడనఁబడ సర్వాఢ్యుఁడై తనరుచుండు

౫౧
నేర్పువీడి వివేకము న్నిలుపుకొనుము
శతగుణమ్ముగఁ బ్రజలకు హితము హెచ్చు

౫౨
ఆశలేనిమహాత్ముని యాత్మయందె
శాంతి నెలకొనియుండు నిరంతరంబు

౫౩
వచ్చినా కీర్తిపోవునన్ భయముగలుగఁ
దొలఁగినా వచ్చునటకును దోఁచకుండు
తుచ్ఛముగఁగాదె కీర్తియం దిచ్ఛ భువిని

౫౪
నీవె నిను నమ్మకుండిన నిన్ను నెవఁడు
నమ్మఁజాలును జెప్పు జగమ్మునందు

౫౫
నాల్గుగుఱ్ఱాలుగట్టిన నవ్యరథము
నందు వెడలుట రాజయి యలరుచుంట
అధికతరసౌఖ్యమే యైన నగునుగాక
అంతకంటెను నేకాంతమందునుండి
పూజ్యదివ్యపథమ్మునఁ బూర్ణవృద్ధి
గాంచుటంతయుసౌఖ్యమై మించుఁగాదె

౫౬
చెఱుపుఁజేసినవానికిఁ జెఱుపుఁగాక
కరుణఁజూపెడువాఁడెపో ఘనుఁడనంగ

౫౭
కలదు సిరి గౌరవమ్మును గలదటంచు
విపులగర్వమ్ముచే విఱ్ఱవీఁగువాఁడు
కూర్చుకొనుచుండు నాపదల్ కోట్లకొలఁది

౫౮
వార్ధులును మఱినదులిల వాగులకును
లోంగుచుండును వానిని లోంగఁదీయు
అట్లె సాధువుకూడ నీ యవనియందు
లోంగఁజేయంగఁ బ్రజలకు లోంగవలయు

౫౯
నడుపఁగలవాఁడు తొందరపడకయుండు
గెలువఁగలవాఁడు కీడును దలఁపకుండు
పోరఁగలవాఁడు పోరును గోరకుండు
జనులసన్మార్గమునఁ బెట్టఁ జాలువాఁడు
వారికాధీనవర్తియై పరఁగుచుండు
ప్రజలశక్తుల నుపయోగపఱచికొనఁగఁ
దనకుఁగలశక్తి దీనిచే ధరకుఁ దెలుపు
ఉత్తమప్రజ్ఞయన నిదే యుర్వియందు
ఆత్మపరమాత్మసంయోగ మనఁగ నిదియె

౬౦
భీకరంబగుదానికి బెదరఁడేని
అతిభయంకరమైనది యతనికొదవు

౬౧
తననివాసము నిరుకుగాఁ దనదు బ్రతుకు
నెంతయును నల్పతరముగా నెన్నఁదగదు

౬౨
బ్రదుకును బ్రియంబుగా నెంచు వానికంటె
దానిఁ దలపనివాఁడె ప్రజ్ఞాఘనుఁడు

౬౩
తెలియునను వాఁడుగొంచెమే తెలిసియుండు
తెలియదను వాఁడె యెంతయో తెలిసియుండు

౬౪
వినఁగ సత్యము ప్రియమయి వెలయకు
వినఁగఁబ్రియమిల సత్యమై వెలయకు




(రెండవభాగము)

పులుగుర్తి లక్ష్మీ నరసమాంబ గారు

(రెండవసంపుటము మొదటిసంచిక తరువాయి)

ద్రౌపదీచరిత్రమునకును, ఇతరార్యనారీమణుల చరిత్రమునకును నెంతటి గురుతర ప్రభేదమున్నదియు మొదటిభాగమునందు యథాసాధ్యముగాఁ జూపఁబడినది. ఇఁక ద్రౌపదీచరిత్రమునకు మధ్య గ్రంథిగా నున్న తత్త్వమునుగూర్చి విమర్శింతము

ఈతత్త్వసంబంధమగు బహిర్వికాసము మిక్కిలి దీప్తిమంతమైనది. ఒక్కస్త్రీ కేవురు భర్తలైనను ఆమెను గులట యని యోచించుట కెట్టి యవకాశమును గనఁబడదు. ఇట్టి యసామంజస్యమునకు సామంజస్య మెక్కడ నుండి వచ్చినది?

ఈప్రశ్నకు మన యాంగ్లేయపండితులు మిక్కిలి తేలికగా సమాధాన మిచ్చుచున్నారు. "భారతీయులు బర్బరజాతివాండ్రు వారిలో స్త్రీలకు బహుభర్తృవివాహపద్ధతి పూర్వకాలమునం దాచరణలో నుండెడిది; ఆకారణముచేతనే పంచపాండవులకు ద్రౌపది యొక్కతయే పత్నియైనది" అని వారు చెప్పుచున్నారు. ఐరోపీయార్యవర్గమునకు మఱియొకటి సాధ్యమైనను గాకపోయినను భారతవర్షమును గూర్చి యింత తేలికగా మాటలాడుటమాత్రము వారికిఁ జక్కఁగా నభ్యాసమైనది.

ఐరోపీయులు భారతదేశప్రాచీన గ్రంథముల నన్నిటి నేవిధముగా బోధపఱచుకొనిరో యీసంగతి నే నించుక తెలియఁబఱిచెదను.

సంస్కృత సాహిత్యమునందలి వేద శాస్త్ర, దర్శన, పురాణ, ఇతిహాస, కావ్య ప్రభృతులకు వారొనరించిన యనువాదములు, టీకలు, విమర్శనములు మున్నగువానిని బఠించుటకంటెను గురుతరమైన మహాపాతకము సాహిత్యజగత్తునం దింకొకటి యుండఁబోదు; మఱియు మూర్ఖతను సంపాదించుటకుఁగూడ నింతకంటె సహజోపాయ మింకొకటిలేదు. ఇప్పుడును మనవా రనేకు లట్టివానిని బాఠముచేయుచునే యున్నారు. వారలను బ్రార్థించుటకే, యీసందర్భములో నప్రాసంగికములైనను గొన్నిమాటలను వ్రాయవలసిన బాధ్యతగల్గినది.

సంస్కృతగ్రంథములసంఖ్య యింతయని చెప్పఁజాలము. ప్రయత్నించినకొలఁది నూతన

గ్రంథము లెన్నియో లభించుచునే యుండెను. సంస్కృత గ్రంథములతోఁ బోల్చి చూచినప్పు డాంగ్లేయ గ్రంథముల నేవిధముగను గ్రంథములని చెప్పుటకే వలనుపడదు. ఏనుఁగుతో దోమను వటవృక్షముతో వల్మీకమును భాగీరథితోఁ బల్వలమును బోల్చిన నెట్లుండునో, మహాభారతముతోఁగాని శ్రీమద్రామాయణముతోఁగాని యాంగ్లేయ గ్రంథమును బోల్చినట్లుండును. వేదసంహితలు, బ్రాహ్మణములు, నారణ్యకములు, నుపనిషత్తులు, గృహ్యసూత్రములు, శ్రౌతసూత్రములు, ధర్మసూత్రములు, దర్శనములు, వానిభాష్యములు, వానిటీకలు, టీకాభాష్యములు, పురాణములు, నితిహాసములు, స్మృతులు, గావ్యములు, నలంకార వ్యాకరణ, గణిత, జ్యోతిశ్శాస్త్రములు నిఘంటువులు మొదలగు నానావిధసంస్కృతగ్రంథములతో నిప్పటికిని భారతవర్షము నిండియున్నది. అపారము లిపిబద్ధము నగు నీ ప్రాచీన గ్రంథసముద్రమధ్యమం దెచ్చటను, ఘుణాక్షరన్యాయముగా నైనను బ్రాచీనార్యులలో స్త్రీలకు బహుపతిత్వమున్న ట్లగపడదు. అయినను పాశ్చాత్యపండితులు, ఒక్క ద్రౌపదీవివాహమును నిదర్శనముగాఁగొని ప్రాచీనభారత స్త్రీలకు బహుపతిత్వము వాడుకలోనున్నదని సిద్ధాంతము సేయుచున్నారు. అట్టి యాంగ్లేయపండితులలో నొకరగు ఫర్గుసన్ దొరగారు భగ్నములైన గోపురప్రాకారములందలి వివస్త్రస్త్రీమూర్తులంజూచి, ప్రాచీనభారతదేశ స్త్రీలకు వివస్త్రలుగానుండుట యాచారమనియు సీత, సావిత్రి, ద్రౌపది దమయంతి మొదలగు సతీమణులు మామలు బావలు మున్నగువారి యెదుట నగ్నావస్థయందే సంచరించుచుండెడివారనియు సిద్ధాంతీకరించియున్నారు. అందుచేతనే యీయాంగ్లేయమహాపండితుల రచనలు చదువుటకంటె సాహిత్యజగత్తునందు మహాపాతకములేదని చెప్పియున్నాను.

ద్రౌపది పంచపతిత్వమునుగూర్చి విమర్శించుటకుముందు ఈకథ కేవలకల్పనమాత్రమా ఐతిహాసికమా? నిజముగా ద్రౌపది కైదుగురుభర్తలుకలరా లేక కవి యట్లు కల్పించియుండెనా? అను సంగతి విమర్శింపవలసియున్నది. మహాభారతమునం దెంతవఱ కైతిహాసికకథకలదో, "శ్రీకృష్ణచరిత్రము" (విమర్శనము)నందుఁ దెలుపఁబడియున్నది. మహాభారత మితిహాసమని చెప్పినంతమాత్రమునఁ భారతమునందలి కథలన్నియు నైతిహాసికములనుటకు వీలులేదు. అందు స్పష్టముగాఁ బ్రక్షిప్తములని తోఁచునవిమాత్ర మైతిహాసికములుగావు; కాని ద్రౌపదిచరిత్ర మైతిహాసికము. మూలమహాభారతమంతయు ద్రౌపదికథననుసరించియే యున్నదిగాన నిది ప్రక్షిప్తమనుటకు వీలులేదు. అయినను మూలమహాభారతకథ యంతయు నైతిహాసికమే యని కాని సత్యమే యని కాని చెప్పుట దుస్సాహసము. కవి, చరిత్రకారుఁడైనప్పుడుగాని చరిత్రకారుఁడు కవియైనప్పుడు గాని, కావ్యచరిత్రములకు మిశ్రమస్థితిగల్గుట సహజము. సత్యచరిత్రమునకుఁ గవి స్వకపోలకల్పితరచనలచే మెఱుఁగుపెట్టుట యాశ్చర్యము గాదు. ద్రౌపది యుధిష్ఠిరునకుఁ బట్టమహిషియే

యనుట యైతిహాసికమని తప్పక యంగీక
రింపవచ్చును, గాని యామె పంచపాండవు
లకును బత్నియనుటఁగూడ నైతిహాసికసత్య
మేయని యంగీకరింపవలెనా ?

ఈ ద్రౌపదీవివాహముదక్క భారతవర్ష
యార్యజాతియందుఁ గాని, భారతదేశగ్రంథ
సముద్రమునందుఁగాని స్త్రీలకు బహుపతిత్వ
వివాహమున్న ట్లట్టి నిదర్శనములు గాని
కాన్పించుటలేదు, విధవాస్త్రీ కన్యవివాహ
మున్న ట్లగపడుచున్నది, కాని యేకకాల
మునం దొక్కస్త్రీ యేకాధికభర్తలను వివా
హమైన ట్లగపడదు. ఎక్కడనైన నొక్కమను
ష్యునిచేతి కాలు వ్రేళ్లనుజూచిగాని, యొక్క
పుట్టంధుఁడైన మనుష్యునిఁ జూచిగాని, యందఱ
చేతులకు నాఱే వ్రేళ్లనియు, నందఱుఁ బుట్టం
ధులేయనియు సిద్ధాంతము చేయవచ్చునా?
అట్లే కేవలము నొక్క ద్రౌపదీ బహుపతిత్వ
వివాహమునుజూచి పూర్వము దార్యస్త్రీ
లందఱకును బహువివాహమాచారమైయున్న
దని నిశ్చయింపరాదు. మఱియు నిట్టివివాహ
మప్రసిద్ధమని మహాభారతమునందే స్పష్టీక
రింపఁబడియున్నది. కారణమేమన ? ద్రౌపదీ
సంబంధమున నిట్టిలోకవిరుద్ధమగు వివాహ
సంఘటనమును సమర్థించుకొనుటకు మహా
భారతకారుఁడు, పూర్వజన్మ సంఘటితములగు
ననేకవృత్తాంతములను నిరూపించి చెప్పుటకు
బాధ్యుఁడు కావలసివచ్చెను.

సంఘమునం దెన్నఁడునులేని యాచార
మును సంఘమునందుఁ బ్రవేశపెట్టుట లోక
నిందకుఁ గారణము గాకమానదు. అట్టిది,
పాండవకులమువంటి లోకవిఖ్యాతమగు రాజ
వంశమునందు సంఘటిల్లునని యనుమానిం
చుటకైన నవకాశములేదు. కాని, యొకతత్త్వ
విశేషమును బ్రస్ఫుటము చేయుటకుఁ గవి
యిట్టికథనుగల్పించుట విచిత్రముగాదు.

ఇది కల్పితకథయనుట కనేక ప్రమాణ
ములు గలవు. ద్రౌపది యైదుగురు భర్తల
వలన నైదుగురు పుత్త్రులను మాత్రమే వడసి
నది. ఎవ్వరివలన, నిరువురనుగాని, మువ్వురను
గాని గాంచియుండలేదు. ఎవ్వరివలనఁ బుత్త్రి
కను బడసి యుండలేదు. ఎవ్వని యౌరసుఁ
డును నిష్ఫలుఁడు గాలేదు. ఆ యైదుగురిలో
నొక్కఁడును భూపతి గాలేదు. అందఱు
నొక్కమారే యశ్వత్థామచేతిలో నిహతు
లైరి. అం దొక్కఁడును బ్రధానకార్య మొక్క
టియుఁ జేసియుండలేదు. అందఱును గురుక్షే
త్రయుద్ధమున నొక్కమాఱు, ఏకముగా వచ్చి
సేనలతోఁ గలిసి యుద్ధముచేసిపోయిరి. ఇంకే
మియును జేయలేదు. పక్షాంతరమున నభి
మన్యుఁడు, ఘటోత్కచుఁడు, బభ్రువాహ
నుఁడు, నెంతటి జీవత్ప్రతిభాశాలులై యుండిరో
చూడుఁడు !

ద్రౌపదీపంచపతిత్వవివాహము కల్పిత
కథయైనయెడల ద్రౌపదిధర్మరాజున కొక్క
నికే భార్యయైనయెడలఁ దక్కిన నల్వురుపాండ
వులును నవివాహితులేనా ? యను ప్రశ్న
పుట్టవచ్చును. దీనికిఁ బ్రత్యుత్తరము చెప్పుట
కష్టమే.

భీమార్జునుల కన్యవివాహము లున్నట్లు
మన మెఱుఁగుదుము; కాని, నకులసహదేవుల

కన్యావివాహాములైనట్లు మహాభారతమువలన మనకుఁ దెలియవచ్చుటలేదు. అంతమాత్రమున వారికివివాహాములే కాలేదని చెప్పుటకు వలనుపడదు. మహాభారతము ముఖ్యముగా, ధర్మజ భీమార్జునులముగ్గుర జీవితచరిత్రము మాత్రమే యైయున్నది; తక్కిన యిద్దరు పాండవులును వారికిఛాయామాత్రులైయుండి, వారితోఁగలిసి కార్యము లొనరించిరి. వారి యన్యవివాహాములను గూర్చి చెప్పుట యంత ప్రయోజనకారి కాకపోవుటచే నాప్రసంగమును భారతకారుఁడు విడిచియుండిన నుండ వచ్చును. అదియొకలోపముకాదు. ద్రౌపదీ పంచపతిత్వ వివాహావిషయమున నిదివఱకుఁ జేసిన పూర్వపక్షము చాలును.

ద్రౌపదీ పంచపతిత్వవివాహాము కేవల కవికల్పితమేయైనచో నిట్టి విచిత్రకల్పన మొన రించుటకుఁ గవి యుద్దేశ మేమైయుండును? విశేషగూఢాభిప్రాయ మెద్దియైన లేకున్నచోఁ గవి యిట్టికుటిలమార్గము ననుసరింప నేల? అట్లయినచో నాతని యభిప్రాయమేమై యుండును? ఇందలి నిగూఢతత్త్వమును మన మిప్పుడు నిర్ధారణము చేయవలసియున్నది. దీనిని నిర్ధారణచేయుటకుముందు, ఒకానొక పండితుని యభిప్రాయము నిచ్చట నిచ్చుచున్నాను. ఆయభిప్రాయ మిదివఱకుఁ బ్రచారములోనున్న "శ్రీకృష్ణ చరిత్ర"మునకు సంబంధించి వ్రాయఁబడినది.

"శ్రీకృష్ణుఁడు మనుష్యావతార మెత్తి భూలోకమున సంచరించెను" ఈమాటమేము ను అంగీకరించెదము. కాని భారతరచనకుఁ బూర్వమునందుండియు నతిమానుష మగు నీశ్వరావతారమని శ్రీకృష్ణునిగూర్చిలోకము విశ్వసించియుండెను. ఈవిశ్వాసము సప్రమాణమే యని తోఁచుచున్నది. కేవలము మొదటినుండియు మహాభారత గ్రంథమునందుఁగూడ నా విశ్వాససంబంధమగు ప్రతిబింబము పడియుండవచ్చును. అది యాశ్చర్యము గాదు. అట్లు జరుగుటసంభవమే. మహాభారతకారుఁడు, కర్మకాండమును గూర్చి తెలుపుట వేద సారమునుగూర్చి ప్రబోధించుట మొదలగు నుద్దేశములతో నర్జును నా దర్శనరునిగను సుభద్ర నాదర్శనారీమణిగను వర్ణించినట్లును; ఈశ్వరునియందలి నిశ్చలభక్తియు నీశ్వర ప్రీతియుఁ గల యాదర్శపురుషప్రకృతిని బ్రదర్శించుటకొఱకు సర్వోత్తముఁడగు శ్రీకృష్ణుని యందు విశేషమగు నీశ్వరశక్తిని మూర్తీభవింపఁజేసి చూపుటకు గవి ప్రయాసపడినట్లును, గన్పడుచున్నది. అట్టి యీశ్వరశక్తి యే మానవప్రకృతియందును, ఏ దేశమందును, ఏ కవిచేత నెప్పుడును బ్రదర్శింపఁబడియుండలేదు. ఆదికవియగు వాల్మీకిగూడ నిట్టి సంఘటనమునకుఁ బ్రయత్నింపలేదు. మహాభారతకవి యిమ్మహాకార్యమునకుఁ గడంగెను. ఆతని ప్రయత్నము సకలముఖముల సఫలీకృతమగుటచేతనే మహాభారతము పంచమవేదమని ప్రఖ్యాతమయ్యెను, ఆ యీశ్వరశక్తికే నిర్లిప్తతయని పేరు. మూర్తీభవించిన నిర్లిప్తతయే శ్రీకృష్ణుఁడు.

ఈనిర్లేపము వైరాగ్యముగాదు. ఇది సాధారణముగా వైరాగ్యమని చెప్పుకొనునది

యును గాదు. దీని రహస్యమును నేనెంతవరకు గ్రహించితినో భగద్గీతనుండి యొకశ్లోకము నీక్రింద నుదాహరించి తెలియఁజేయుచున్నాను.

శ్లో॥ "రాగద్వేష వియుక్తైస్తు,
విషయా నింద్రియై శ్చరన్;
ఆత్మయస్యై విధేయాత్మా,
ప్రసాద మధిగచ్ఛతి"

రాగద్వేషవిరహితంబులు, నాత్మవశీభూతంబులు నగు నింద్రియములచే విషయోపభోగంబు లనుభవించుచు సంయతాత్ముఁడగు వాఁడే శాంతిని బొందుచున్నాఁడు.

అందుచేత నిర్లిప్తునకు నింద్రియ విషయోపభోగవివర్జనము నిష్ప్రయోజన మగుచున్నది. వర్జించుటయన సంలేపమే యగుచున్నది. వర్జనమునకుఁ బ్రయోజనము గలదు; ఇంద్రియముల కాత్మలోఁ బడినప్పుడు విచ్ఛేదమెన్నఁటికి నసాధ్యమని తెలియుచున్నది, కాని యింద్రియవిషయోపభోగము లనుభవించుచు, వానియం దనురాగశూన్యుఁడై, సకలేంద్రియములను జయించి, యనుష్ఠేయకర్మసంపాదనమునకు విషయముల నుపభోగించువాఁడే, నిర్లిప్తుఁడు. వానియాత్మకును భోగ్యవిషయములకును సంబంధము లేదు. వాడు పాపదుఃఖముల కతీతుఁడు.

ఈవిధముగా నిర్లేపమును, అనాసక్తిని ష్టముగాఁ బ్రదర్శించుటకై హిందూశాస్త్ర లొకవిధమగు కౌశలము నవలంబించి న్నారు. వారు నిర్లిప్తుని, అనాసక్తుని, అధికములగు నింద్రియ విషయభోగములచేఁ బరివేష్టింపఁ జేయుచున్నారు. ఇందుకొఱకే, మహాభారతమునకుఁ దరువాతిపురాణకవులు, శ్రీకృష్ణు నసంఖ్యవారాంగనా మధ్యవర్తినిగాఁ జేసియున్నారు. ఇందుకొఱకే తాంత్రికుల సాధనక్రియలయందు నింద్రియోపభోగ వస్తువులు విశేషముగ నుపయోగింపఁ బడుచున్నవి. ఎవ్వఁ డీ యన్నిటియందును యథేచ్ఛముగా సంచరించుచు ననాసక్తుఁడై యుండునో యాతఁడే నిర్లిప్తుఁడు. ద్రౌపది బహుపతిత్వముగూడ నిందుకొఱకే.

స్త్రీజాతియందు ద్రౌపది మూర్తీభవించిన యనాసంగ ధర్మస్వరూపము. ఆస్వరూపముతో నామెను బ్రతిష్ఠించుటయే కవి యాశయము. అందుచేతనే ద్రౌపది గణికవలెఁ బంచభర్తృసమన్వితయయ్యును, సాధ్వియుఁ, బతివ్రతపరాయణయు నయ్యెను. ద్రౌపదికిఁ బంచపతిత్వ మేకపతిత్వమాత్రమే, ఉపాసించుట కేకవస్తుమాత్రమే, ధర్మాచరణమున కభిన్నంబగు నేకోపలక్ష్యమాత్రమే ధర్మాత్మునకు బహుదేవత లేక దేవతాస్వరూపమైనట్లే, జ్ఞాని కీశ్వరుఁడే యేకమాత్రంబగు నభిన్నోపాస్యం బైనట్లే, యనాసక్తయగు ద్రౌపదికిఁ బంచభర్తలు నేకమాత్రధర్మాచరణస్థాన మగుచున్నారు. వారి యందామెకుఁ బక్షపాతములు, భేదాభేదములు, మొదలగునవి లేవు. ఆమె గృహధర్మముల యందు నిష్కామయు, నిశ్చలయు, నిర్లిప్తయునై యుండి కర్తవ్యపాలనముఁ గావించుచుండెను. ఇదియే ద్రౌపదీచరిత్రమునందలి

యసామంజస్యమున సామంజస్యము, కాని యిట్టి ధర్మనిర్వహణ మతి దుస్సాధ్యమైనది. మహాభారతకవి మహాప్రస్థానికపర్వమునం దీ సంగతిఁ జెప్పియేయున్నాఁడు. ద్రౌపది యర్జునియం దింతుక పక్షపాతముగల్గియున్నదని చెప్పి యాపాపఫలమువలన సశరీరస్వర్గారోహణమున కనర్హయయ్యెననియు, నందుకంటె ముందుగా మార్గమధ్యమునఁ బడిపోయినదనియుఁ జెప్పఁబడియున్నది.

ద్రౌపది యైదుగురుభర్తలవలన నైదుగురుపుత్త్రులనుమాత్రమే పడయుటకుఁ గారణమేమో మనకిప్పుడు బోధ యగుచున్నది. హిందూశాస్త్రాను సారముగా గృహస్థునకుఁ బుత్రసంపాదనము ధర్మము. దానియెడల విరతి యధర్మము. పుత్త్రుఁడు పుట్టినప్పుడే వివాహధర్మము సఫల మగుచున్నది. కానిచో నాధర్మ మసంపూర్ణమే యగుచున్నది, కాని యాధర్మ మేకపుత్త్రలాభమాత్రముననే సఫలమగుచున్నది. ఏకాధికపుత్త్రుల బడయుట ధర్మముకొఱకుఁ గాదు; అది కేవల మింద్రియలోలుపత మాత్రమే యగుచున్నది. ద్రౌపది నిర్లిప్తురాలు. అందుచేతనే ధర్మనిర్వహణమైన తరువాత నామెకుఁ బతులయెడల నింద్రియసుఖలోలుపత విచ్ఛిన్న మయ్యెను. పతిధర్మపాలనముకొఱకు ద్రౌపది యైదుగురుపతులవలన నైదుగురు పుత్త్రులను మాత్రమే పడసెను. నిర్లేపవశంబున నింక సంతానమును బడయ లేదు. కవి కల్పనమున కిదియే ముఖ్యకారణ మని తోఁచుచున్నది.

ఇందువలన ననేకభర్తలను వివాహమాడినఁగాని, స్త్రీయనాసంగధర్మమును నిర్వర్తింపవలనుపడదని యెవ్వరును దలంపఁబోకుఁడు. దీని తాత్పర్యమిది. చిత్తశుద్ధిగలవారొకప్పుడు మహాపాతకమునఁ బడినను వారిని పాపము లంటఁబోవు. ద్రౌపది జీవితమునందలి యీసంఘటనముకంటె స్త్రీలోకమునకు మహాపాతకమింకొకటి లేదు. కాని ద్రౌపది చిత్తశుద్ధికలదగుటచే నామె యీమహాపాపమును గూడ ధర్మముగానే పరిణమింపఁ జేసికొనఁగల్గెను.

ద్రౌపది ధర్మబలంబున నతి దర్పితయని మొదటి ప్రకరణమునందే చెప్పియున్నాము. ఆదర్శమొక్కొక్కప్పుడు ధర్మమునుగూడ నతిక్రమించుచుండెను. ఆదర్శమునకును, ఇట్టి యింద్రియ విజయమునకును నెట్టి యసామంజస్యమును లేదు. కాని యామె నిష్కామధర్మము సంపూర్ణముగా ఫలించెనా? లేదా? యనునది ప్రత్యేకవిషయము.



# ఆశీర్వాదము

తుమ్మల సీతారామమూర్తిచౌదరి గారు

అఖిల దేశోద్ధారకాగ్రగణ్యుండైన
నాగేశ్వరుని పోషణమున వెడలి
ప్రఖ్యాతపండిత ప్రవరు లర్పించిన
వ్యాసరాజములచే వాసికెక్కి
సకలాంధ్ర జనకరాబ్జములందు నివసించి
యతులితంబైన మర్యాదఁ గాంచి
సారస్వ తార్కిక సాంఘిక నైతిక
సర్వవిజ్ఞాన తేజం బొసంగి

గీ. వత్సర ప్రాయమున వన్నె వాసిఁగాంచి
యున్న నీవ్ చిరకాల మాంధ్రోర్వియందు
నెలమి వెలయించుఁగాత సర్వేశ్వరుండు
భారతీపత్రికామణీ! భవ్యవాణి.

# ప్రపన్నుడు

సాహితీ సమితి సభాపతి శ్రీ శివశంకరశాస్త్రి

కాన వచ్చుట లేదు మార్గమ్ము నాకు,
ఊహ జనియింప దేమి చేయుటకుగాని,
అణచుకోజాల నీ మనోవ్యథల, నింక
నేమి చేతు ప్రభూ, సెలవిమ్ము నాకు!

ఆవరించెను నన్ను గాఢాంధకార
మన్యశరణమ్ము లేదు నా కార్తిహరణ,
దివ్యదీధితి పటల దేదీప్యమాన
మహితభవదీయ పాద యుగ్మమ్ము కన్న!

దేవ, నీయిచ్ఛ యెట్టిదో తెలియరాదు!
బుద్ధివైభవ మేను సంపూర్ణ గతిని
వదలి, నీమీది గాఢ విశ్వాస మున నె
మసలుచున్నాడ నెటో లోక మధ్యమందు.

శిథిల మైపోయె నాథ, నిశ్శేషముగను
దాసజనునకు నిపుడు స్వతంత్ర బుద్ధి
యంత్ర సదృశుని తావకేచ్ఛానుసార
సరణి నడిపింపు మో ప్రభూ, సత్పథమున!




భమిడిపాటి పట్టాభిరామయ్య గారు, బి. ఏ., ఎల్. టి.

## ౧. సత్కుటుంబచరిత్ర

బ్రహ్మశ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గోపాలపల్లి (అను) కాపురస్థులు, సదాచార సంపన్నులు, బహునిష్ఠాపరులు. ఈ యగ్రహారమునం దుండిన యితరవైదికు లందరు స్వగ్రామము విడిచి పట్టణములం జేరిరి. కాని శాస్త్రిగా రట్లు చేయ నొల్లక, తండ్రితాతలుండిన యగ్రహారమే కురుక్షేత్రముగ నెంచి, పాలుపు భూకృషిచే లభించు వందరూపాయలే లక్షలుగ భావించి, 'హాలికులైన నేమి గహనాంతరసీమల కంద మూలకౌద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై' యను మత మవలంబించి కాలము గడపుచుండిరి. ప్రాతఃకాలమున నిదుర లేచి రేవులో స్నానముం గావించి సంధ్యాదినిత్యములు సలిపి, పొలముం జూచికొని, మధ్యాహ్నమున నిల్లుచేరి గృహిణి తన కిడిన యన్నము భుజించి, యపరాహ్ణమున జందెములు వడుకుచు, కుమారునికి వేదము నేర్పి, దినములు గడపుచుండెను. అయాచితముగ ప్రాప్తమగు దానిని గ్రహించునేకాని యాచింపనొల్లఁడు.

వేదమునందు పారంగతు లగుటయే కాక, గానమునందుసైతము శాస్త్రిగారు నిరుపమాన పాండిత్యము గలవారు. ఇందు భక్తియుక్తము లగు పాటలం బాడుదురు. తదితరముల వర్జింతురు. గానము వీరికుటుంబవిద్య యనందగు. అనేక సంవత్సరముల క్రిందట వారి పూర్వులలో నొకరు నారాయణ తీర్థులవారి శిష్యులట. అందుచేత, తరంగములు, అష్టపదులు, అధ్యాత్మరామాయణమునందలి కీర్తనలు, త్యాగరాయకృతులు మున్నగు వానిం బాడుటయందు శాస్త్రిగారు ఖ్యాతి వహించిరి.

శాస్త్రిగారి బాల్యమున గోపాలపల్లిలో నుండి తరువాత పట్టణముల కేగిన కుటుంబములలో నిష్ఠలవారి కుటుంబమును, శాస్త్రిగారిబంధువులగు అనపిండివారి కుటుంబమును చేర్పఁదగినవి. ఈ వంశముల బాలు రిరువురు చిన్నతనమున వీథిబడిలో శాస్త్రిగారి సహపాఠులు—నిష్ఠలకృష్ణశర్మయు, అనపిండి నరసింహసోమయాజియు. వీరిరువురియందు బాల్యముననే వేర్వేఱు గుణముల యంకురములు చూపట్టినవి. కృష్ణశర్మ కేవల సత్త్వమూర్తి. బడియందు నియమితపాఠములం జదువుట, గురువుగారిప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిడుట, మరలి యింటి కేగుటయే తప్ప, యనవసరవిషయములం దగులు కలుగఁజేసికొనఁడు. ఈతఁడు మితభాషి, బుధవిధేయుఁడు. కావున గురువుగారి కితనియందుఁ బ్రీతి యెక్కువగ నుండెను.

సోమయాజి పూర్వులలో నొకండు యజ్వ. కావున నీతనికి వంశక్రమమున నీ పావననామధేయము కల్గెను; కాని, యీతఁడు బహుదుర్వర్తనుఁడు; కుటిలచిత్తుఁడు; తనకంటె బాగుగ నుండువారిం జూచిన నసూయఁ జెందువాఁడు.

ద్విపద. "ఒక్కచోటనె గుమిగూడు నిక్కముగను
రెక్కలొక రంగు గల్గిన పక్కిగుంపు"
అని యాంగ్లేయులోకోక్తి కలదు. మఱియు,

ఆ. "కప్పురము చందనంబును కలయుభంగి
సజ్జనుఁడు గూడు ననిశము సజ్జనులనె;
భంగు ధత్తూరు చేరడి భంగి నెపుడు
దుర్జనుం డిలఁ జేరును దుర్జనులనె."

అని భక్తాగ్రేసరుఁడు కబీరువల్కె. అట్లే బడియందును గ్రీడారంగమునందును, శాస్త్రియు శర్మయు నరనారాయణులవలె ననోన్యమైత్రితో మెలఁగుచుండిరి. సోమయాజియో తనవంటి దుష్టులంజేరి పైయిరువురిని

సతతము పేళనసేయుచు, పెక్కుతెలుగుల బాధపెట్టుచుండెను.

ఒకనాఁడు వీరుచదువుచుండెడి బడికి చిన్న ఇన్స్పెక్టరుగారు పరీక్షార్థమై విజయముచేసిరి. సోమయాజి చదువులోఁగూడ దొంగయై యితరులచేతఁ బని చేయించుకొనుచుండెను. ఇక్కారణముచేఁ, బ్రశ్నలకుఁ బ్రత్యుత్తరము లొసఁగుటకుఁ దా నసమర్థుఁడని తెలిచి, తనకు పరీక్షయందు సాయముచేయకుండినచోఁ గొట్టుదునని సోమయాజి శాస్త్రిశర్మలను ముందుదినము బెదరించెను. ఈసంగతి యుపాధ్యాయుం డెఱిఁగి, ఇన్స్పెక్టరుగారు రాకమునుపే తాను ప్రశ్నలువేసి, ప్రత్యుత్తరము లిడినవారిని పైకి పంపి, సోమయాజిప్రభృతులను దరగతి చివరకు దింపెను. ఇట్లు మంచికుఱ్ఱవాండ్రకు దూరమునం జిక్కి పరసాహాయ్యప్రాప్తి లేమిం జేసి సోమయాజి మఱియొక వత్సర మాతరగతిలోనే యుండ వలసివచ్చెను.

కావున బాల్యమునుండి శాస్త్రిశర్మలకు మైత్రియు సోమయాజికి వీరిరువురియెడ వైరము నుండెను. కాలక్రమమున నీ రాగద్వేషములు హెచ్చెను.

### ౨. పెండ్లిమాటలు

నలుపదిసంవత్సరము లాయెను. శాస్త్రి యొక్కఁడే తనగ్రామమునందుండెను. కాని తదితరులు పట్టణాంతరములకేగిరి. సోమయాజి పోలీసు సబిన్స్పెక్టరై ఇన్స్పెక్టరు కానుండెను. అతనికి పిల్లలనేకులు పుట్టి చనిపోయిన తరువాత "సన్యాసయ్య ధర్మవరమున" కేగి మ్రొక్కిన తరువాత కుమారుఁ డొకఁడుకలిగె. కావున నీతనికి "సన్యాసయ్య" అను నామంబిడిరి. విత్తమెంత ఖర్చుపెట్టినను ఈతనికిఁ జదువంటదాయె. పదునెనిమిదవ సంవత్సరమున మూఁడవఫారములో మూఁడేండ్లుమునుఁగుచుండెను. సోమయాజి తన భూముల సమరకము చేయుటకును, శిస్తు వసూలుచేయుటకును స్వగ్రామమునకు తఱుచు వచ్చుచుండెను. వచ్చినప్పుడెల్ల శాస్త్రియింటనే "తిష్ఠ" వేయుచుండెను.

శాస్త్రికి యిరువదిరేండ్లకుమారుఁడు ముకుంద శాస్త్రియు, తొమ్మిదిసంవత్సరముల కూఁతురు రుక్మిణియు నుండిరి. కుమారుఁడు స్కూలుఫైనలు ప్యాసుచేసి "ట్రేయినింగు" పూర్తిచేసికొని, యాగ్రామమందే బోర్డుబడిలో పాతికరూపాయల జీతముపైఁ బ్రధానోపాధ్యాయుఁడుగ నుండెను. తండ్రిగారియొద్ద వేదాధ్యయనమును చేసెను. కావున వైదికకర్మలు జరిపించుటకు సైతము సమర్థుఁడై యుండెను. అదియునుంగాక తండ్రియొద్ద సంగీతము నేర్చుకొని భగవన్నామసంకీర్తనముకూడ చేయుచుండె.

కృష్ణశర్మ చదువులో బహుకుశాగ్రబుద్ధి యగుటంజేసి సర్కారువారి ద్రవ్యసాహాయ్యముచేఁ బట్టపరీక్షలలో నుత్తీర్ణుఁడై గొప్ప యుద్యోగముంబొందె. కాని, తొమ్మిదవయేఁట నాగ్రామము విడిచినమొదలు తన స్నేహితుఁడగు శాస్త్రిని కలుసుకొనలేదు.

ఒకనాఁడు రాత్రి పదిగంటలాయెను. కృష్ణశాస్త్రి నిత్యభజన వేణుగోపాలస్వామియాలయమున నొనర్చి యింటికివచ్చి పరుండి నిదురించుచుండె. ఎవరో తలుపు తట్టిరి. ఎవరనియడుగ, "నేనేనోయి, శాస్త్రీ!" అని బదులువచ్చె. గొంతుకంబట్టి సోమయాజియని యెఱింగి శాస్త్రి యాతనిని లోనికిరమ్మని తలుపు తీసెను. అంతట సోమయాజి, భార్యాపుత్రసమేతుఁడై లోనికి వచ్చి "అబ్బ! ఈతిక్కుమాలిన గ్రామానికి రావాలంటే యమయాతనరా! బాబు! ప్రొద్దున ఆరుగంటలకు నంద స్టేషనులో రైలుదిగితే బండిలేదు. పోలీసువుండావాణ్ణిగనుక ఎలాగో ఓలాగ బండిచేయించుకుని ఇక్కడికివచ్చి పడేటప్పటికి, చూశావా రాత్రిపదిన్నర. అబ్బ! కాస్త ప్రసాదంమాట చూతూ!"

పాపము; శాస్త్రిభార్య ఇంటివెలుపలనుండెను. కుమారుఁడు, ప్రెసిడెంటుగారి సెలవైనదని యొక యుపాధ్యాయుల సమావేశమునకుఁ బట్టణమున కేఁగి యుండె. పాపము! ఆ నడిరేయి రుక్మిణి పొయ్యి రాజవేసి, వచ్చినవారికి, బండివానికి వండి వడ్డించి, వారల సంతృప్తులంజేసె. అంతట వారెల్లరు నిదురించిరి. చిరుచీఁకటి, కోడికూసినవెంటనే, రుక్మిణి నిదురలేచి, గోమయముతో నిల్లువాకిలి యలికి, ముగ్గువెట్టి, బిందెయు, పూలసజ్జయుఁ జేఁబూని, యేటికేగెను. స్నాతయై, బిందియనిండుగ నీరు నింపి, వేణుగోపాల

స్వామి యాలయమునకేఁగి, స్వామికి నమస్కరించి, తండ్రిగారి పూజార్థము బుట్టలోఁ బూవుల నునిచి, యింటికివచ్చి మడిచీర, కుంకుమ ధరించెను. పసుపుఁ బూసికొనిన మేనఁ గుంకుమ పెట్టినంతనే యాయింటి లక్ష్మియో! "రమా భగవత్యంశోద్భవ" యగు నభినవ రుక్మిణియో! యన నొప్పె. వంటచేసి, తులసిపూజ, గౌరీపూజ సలిపి, వీణ కేలంబట్టి, స్వీయకల్పనములు కలియ, మధురగానము సేయుకతనఁ, బ్రత్యక్ష సరస్వతి యనవొప్పె.

సోమయాజి కుటుంబపు మేలిమిగా వచ్చుటకుఁ గారణమేమన, తన కుమారుఁడగు సన్యాసయ్యకు రుక్మిణికి వివాహముచేయుట కేర్పాటుకొనుటకే. రుక్మిణి, తనయన్న యొద్ద చదువు నేర్చియుండుటయే కాక, పనిపాటలు సైతము నేర్చియుండుటం జూచి, సోమయాజి యానందభరితుఁడై తన భార్య నేకాంతమునఁ జెంతఁ జేరి యిట్లని సంభాషణము సేయఁదొడఁగె.

సో:—ఏమిటే! కబురు.

భార్య:—ఏమిటండోయి?

సో:—పిల్ల ఎలాగుంది? నేం చెప్పినవల్లా నిజమే కా?

భా:—మాబాగాచెప్పారు. అలాంటి భార్యరావడం మన దదృష్టము కలగాలెగదా! మనవాడి కాపిల్ల నిస్తారని నేనమ్మను.

సో:—ఇవ్వడం ఊసు నీకెందుకు? ఇవ్వమంటే ఇప్పిస్తాను. నీమనసుకు నచ్చిందా?

భా:—అటువంటి మణిని చూస్తే ఎవరికి నచ్చదు? ఆపిల్లను పెండ్లాడేటంత భాగ్యము మనవాడి కున్నదా అని సందేహమే కాని ఈ మొద్దు కాపిల్లను కట్టపెడితేమట్టుకు సంసారం ముచ్చటగా వెళ్లుతుందా? అదొకటి ఆలోచించండి.

సో:—ఓసి! పెద్దమ్మా! శకుని పలుకులు పలక్కు! ముడిపడితే ముచ్చట్లవే వొస్తాయి. అడ్డుగా వైనవ కబుర్లాడకుమీ!

భా:—నేనేమన్నానండీ? పిల్లదేమో ముద్దులమూట. పనిపాటలన్నీ వొచ్చు. కాని ఆపిల్ల రూపురేఖలు పనిపాటలు, తెలివితేటలు చూస్తే, ఎక్కడనో గొప్పయింటిలో మంచి చదువరిని పెండ్లాడే యోగ మున్నట్లు కనిపిస్తుందిగాని, మన నిరక్షరకుక్షికి భార్య అయ్యే యోగమున్నట్లు తోచదు. అదిగాదు గనక మనసులోవున్నది చెప్పాను. కోపమెందుకు?

సో:—గొప్పయింటిలోనికి పిల్లనివ్వడమంటే మాటలటే? దానికి తగినట్టే కట్నాలు కానుకలు లాగరా? రెండువేలరూపాయలు చేతపట్టుకుంటే సూక్తాలు పైవలు పంచాంగంపద్దు దొరుకునేమో? ఆపైని చదువు స్థితిగతులుంటే దానికి తగినట్టే ఉంటాయి కట్నాలు కానుకలున్నూ! శాస్త్రిగాడివద్ద, వాణ్ణి అమ్మినా, రెండువేలు కాదు గదా రెండువందలు కూడా లేవు. పెద్దసంబంధాలు వీడి కెలా వస్తాయి?

భా;—అయితే వీరుకూడా కట్నం అడుగుతారా ఏమిటి?

సో:—తప్పకుండాను. వెయిన్నీనూటపదహార్లడక్క మానను.

భా:—అయితే అసలు పోవడానికే దారి.

సో:—ఛీ, వెధవా! వెళ్లిపో అవతలికి. ఒళ్లు మండుతుంది. సామెతచెప్పినట్టు శుభంపలకరా పెండ్లికొడుకా అంటే........

భా;—మీ యిష్టం మరి. [నిష్క్రమించును.]

### 3. భీతి

ఈసంభాషణ కొంత గోడ అవతల వంటగదిలో నుండి రుక్మిణి వినెను, తండ్రి దరిద్రుండనియు గొప్ప కట్నములు కానుకలు నతఁడివ్వలేఁడనియుఁ దెల్ల మాయెను. తత్కారణముచేత నెవఁడో యభాజనుని కిచ్చునేమోయను భీతి గూడఁ గల్గెను. "ఇవ్వకున్న ఇప్పించెద" నని సోమయాజి పల్కె. ఇచ్చునట్లు చేయుటకుఁ దనతండ్రినేమి చిక్కులఁ బెట్టునో, యీశ్వరా! యని రుక్మిణి భయముఁ గొనెను. సాయంకాలము మరల యేటికి నీళ్లకుఁబోయి, తలదువ్వి జడవేసికొని, పువ్వులు ధరియించి గోపాలస్వామి కోవెలకుపోయి స్వామికి నమస్కరించి, మనసులో నిట్లు మొఱలిడెను:—

"దేవా! వినవఁట జీవులమాటలు, చనుదఁట చనరాని చోట్ల, శరణార్థుల కోయనుఁట." నిజమేనా? అయినచో నీభక్తుని నిష్కళంకుని సద్బ్రాహ్మణుని మాతండ్రిని రక్షింపుము. నా కట్టిపెనిమిటి నిచ్చినను సరే. నీచిత్తమని సహించెదను. కాని నావలన నాతండ్రి ఋణపీడితుఁడైనను, దిక్కులలోఁ బడినను, సహింపఁజాలను. ఇప్పుడు నీపాదములచెంతనే ప్రాణత్యాగముఁ జేసికొందును. నిక్కము, నిక్కము, ముమ్మాటికి నిక్కము. ఈసోమయాజిని జూడ నాకు యమదర్శనమువలె నున్నది. నామాట కేమి! నాన్నగా రీతని వలలలోఁ బడకుండఁ గాపాడుము జగద్రక్షకా! నీకు దయరాకున్నచోఁ జెప్పిన పనిచేసి తీరుదును సుమీ!"

అని యెదుటనున్న వానితో మాటలాడునట్లు, కన్నీరు బొటబొట రాలఁగా విలపించెను. కనులు విప్పి స్వామిం జూడ విగ్రహము చిరునవ్వు నవ్వినటులఁ దోఁచెను. రుక్మిణి హృదయము ధైర్యమునొందె. అంతట నాపిల్ల యింటికి వెడలిపోయి మరల రాత్రి వంటమొదలగు పనులఁ జేయందొడంగె.

తా నేకాంతమునఁ బ్రార్థించెనని రుక్మిణి యనుకొనెను కాని, దుఃఖోద్రేకముచే నుడికినమాటల నొకఁడు వినెను. ఈతఁ డాకోవెల పూజారి కుమారుఁడు రంగాచారి. బడిలో నితఁడు, ముకుంద శాస్త్రియుఁ గూడి బాల్యమునఁ జదివియుండుటం జేసి రుక్మిణియెడల సోదరభావము వహించి "చెల్లమ్మ" యని ప్రీతితోఁ బిలుచుచుండును. ఈకరణమున రుక్మిణిపలుకులు విన్నట్లు నటించిన నాచిన్నదాని మనసున కాయాసము కల్గునని తలఁచి మిన్నకుండెనే కాని, తన చేతనైనంత సాయముఁ జేయుటకు దీక్ష వహించెను.

రుక్మిణిని దవశోషలుగాఁ జేయుటకు బహుకాలముక్రిందనే సోమయాజి దూరాలోచనతో నెత్తు వేసియుండెను. మూఁడుసంవత్సరములు ముందు ముకుందశాస్త్రి వివాహము జరిగెను; తండ్రి మహా నీతుఁడుగాన కట్నముల నంగీకరింపలేదు. ఉపరి, పెండ్లిఖర్చుల నిమిత్తము, అయిదువందల రూపాయ లప్పుచేసెను. 'దేహి' యని యడిగినచో నీతని మాతనికి లభించియుండునుగాని యుచితముగాఁ బరవిత్తము గ్రహింప నొల్లక, తనకున్న గోష్పాదము భూమిని సోమయాజియొద్ద తనఖాపెట్టి, అయిదువందల రూప్యములకు దస్తావేజు వ్రాసి యిచ్చెను. కావున తన యిచ్ఛానుసారముగ శాస్త్రి వర్తించనిచో నొక్కట నీదస్తావేజు సోమయాజిచేత బ్రహ్మాస్త్రమువలె నుండెను.

ఈ రోజునఁ బగలంతయు శాస్త్రియు సోమయాజియుఁ బొలములం జూచుకొనుచుండిరి. రాత్రి భోజనముసేయు సమయమున సోమయాజి తలపెట్టిన సంబంధము విషయమై యిట్లు చర్చఁజేయఁదొడంగె.

సో:—అయితే, అబ్బీ! రుక్మిణి కేదైనా సంబంధము చూశావా? దాదాపు పదకొండేండ్లు నిండిన వను కొంటాను.

శా:—ఆలోచింపదగ్గదే. ఎవరి నడిగినా కట్నాలు కావాలంటారు. ఛీ! కాలగతి చూశావా?

సో:—ముకుందానికి పిల్లతో నీవు కట్నం పుచ్చుకొని ఉంటే ఎంత బాగుండును? ఇప్పటి యవసరానికి పనికివచ్చియుండును గా?

శా:—శ్రీహరీ! చేసినపాపాలు చాలక యిదికూడానా?

సో:—సింగినాదం! జీలకఱ్ఱ! లోకమంతా తొక్కేతోవ మనంకూడా తొక్కితే పాపమేమి? అదికాక నీ కాడపిల్లయుండుటచే లాభించి యుండునుగదా? రేపు రుక్మిణి పెండ్లిచెయ్యాలగదా, యేంచేస్తావు? మాసన్నగాడి కెవరైనా పిల్లనిస్తామంటే నాపుట్టుకు నేను వెయ్యిన్నీ నూటపదహార్లు కక్కించకమానను.

శా:—పీకపోయినాసరే ఇంత తులసీదళము తీర్థము ధారపోసి, ఒకపసుపుకొమ్ముతో శ్రోవతు పాఠ్య బ్రహ్మచారి కిస్తానే గాని కట్నాలిచ్చి కన్యాదాన ఫలం పోగొట్టుకుంటానా!

సో:—ఓరి! నీచాదస్తంగూల! పోనీ, కట్నమే లేదనుకుందాం మాటకు, పెండ్లిజరగవలెనా? పదిమంది రావడం పోవడం; సంతర్పణలు చదివించడాలు, లేనిది కాదుగదా, దాని కేమంటావు? నీభూమి నాతాఖాలోనున్నది. మఱి యెవ్వడు దానిమీద దమ్మిడీ నీకివ్వడుగదా. ఏంపెట్టి పెండ్లిచేస్తావు? [తనలో] యిహ కట్నాలుకావాలంటే అసలు చెడేలాగుంది వ్యవహారం.

శాస్త్రి:—వరుడు లభిస్తే చేనేతోవ కృష్ణుడే చూపెడుతాడు.

సో:—నీ విల్లుకదలక కూర్చుంటే పైబడి వరు డెవ డొస్తాడోయి? నాలుగు చోట్లకు వెళ్ళి, వాళ్ళను వీళ్ళను అడిగి సంబంధాలు తెచ్చే శ్రమ నీవు పడ లేవని తెలిసే, నేను మా సన్నిగాడి పేరెత్తాను. గ్రహించావో లేదో!

శాస్త్రి:—అంటే, మీ సన్నయ్యకు రుక్మిణిని పుచ్చుకో వలెననా నీతలంపు?

సో:—మరేమి?

శాస్త్రి:—బాబూ! మీరందరు కట్నాలగాళ్ళు. నీకివ్వ డానికి వెయ్యిన్నీ నూటపదహార్లువన్న మిక్త లేవస్తుందా?

సో:—అచ్చే! ఏదో మాట కలాగన్నానుగాని, మనలో మనకు కట్నాలేమిటోయి! అథవా, నీవిచ్చినా నే పుచ్చుకుంటానట్రా? [ఏవరో తలుపు తట్టిన శబ్దము విని రుక్మిణి తలుపు తెఱచును]

రుక్మిణి:—నాన్నా! అన్నయ్యొచ్చాడు.

సోమ:—బాబూ! వచ్చావూ? పట్నంలో నేమి వింతలు? శాస్త్రి! వీడు పెరగ్గా పెరగ్గా అచ్చా! నీలాగ తయారౌతున్నాడోయి!

శా:—(ఏమియులోచకా) ముకుందం! మన రుక్మిణిని సన్నయ్య కిమ్మంటున్నాడ్రా సోమయాజి. ఏమంటావు?

ముకుం:—మామా! మీకు కోపం రాదుగదా? పెద్దలకు నేను చెప్పదగ్గవాణ్ణి కాను గాని, నాలుగు సంబంధాలు చూచిన తర్వాతే నిశ్చయించుటను శ్రేయస్కరమని నామనవి.

రుక్మిణి:—(తనలో)—భలే! శ్రీకృష్ణుడు నాపాలిట నుండి అన్నయ్య నిలా పలికించాడు.

సో:—(తనలో) ఓహో! ఈ గుంటవెధవ అక్షుపుల్లలు పెట్టేటట్టు కనిపిస్తున్నాడు. కాస్త చెట్టుమీద వుంటే గాని మర్యాద దక్కదు. వీడు అబ్బలాంటి చాదస్తుడు గాడు. గడుసుబుఱ్ఱ. (బహిరంగముగా) భేషు! బాగా చెప్పావు నాన్నా! వయసులో చిన్నవాడైనా మంచి లోకానుభవం గల పెద్దవాడిలాగ పలికావు. నేను ఆమాటే మీ నాన్నతో చెప్పానిప్పుడు. నాలుగూళ్లుతిరిగి నాలుగుసంబంధాలుచూడ మనే. నేనుసన్నిగాడిమాట యెందుకెత్తానంటే, నాకు సంబంధాలు లేక కాదు. స్థితిగతులున్నవాణ్ణి గనక పైబడివచ్చి అడుగుతున్నారు; గాని, శాస్త్రి చిరకాలపు స్నేహితుడు. ఎక్కడనో తెలియని సంబంధాలు కలిగింమకోవడాని కంటే, మన రుక్మిణి అయితే వంశమంతా తెలిసినవాళ్లే. రేపు మా యింటికి వచ్చినా కొత్తగా వుండదని ఆలోచించానే కాని వేరులేదు.

ముకుం:—నాకు వట్టుకు సమ్మతంలేదన్నానా? నాలుగు చోట్ల, చూడడం మంచిదన్నానే కాని వేరులేదు.

సో:—మరి నాకేకో నిశ్చయంగా తెలిస్తేగాని, ఇతర సంబంధా లంగీరికరించడరూ మానడమా!

ముకుం:—అయితే! తమరు నాన్నగారి చిరకాల స్నేహితులు గనుక సంవత్సరాదిదాకా నాకు "టైం" మివ్వండి.

సో:—(గొణుగుచు) ఔనులే. ఈలోపుగా యెన్ని సంబంధాలు జారిపోతాయో. అదీకాక మరియొక టైతే కట్నాల దక్క తప్పదు. నేను, మీరిచ్చినా పుచ్చుకునేవాణ్ణి కాను. మీ నాన్న యిచ్చే స్థితిలో లేడు. నీవెఱుగవా?

ముకుం:—(మనసునొచ్చి):— ఆయన యివ్వడనండి. సమ్మతంకాదు. స్థితికేమిలెండి, భగవత్కృపయుంటే, ఇచ్చే స్థితి కలుగగూడదా?

సో:—వహవా! శాస్త్రికొడుకులాగే మాట్లాడావోయి!

ముకుం:—[మాటలు పెంచుట కిష్టములేక] చెల్లెమ్మా! ఏదో కాస్త మద్దపడేమా. చెవులు ఘుమేలు పడిపోతున్నాయి.

సో:—(తనలో) వీడు ఘట్టిగా అడ్డుతాడు. నిశ్చయం. (బహిరంగముగా) అబ్బే! శాస్త్రి! లేతావా? ఏమిటేమో పరధ్యానముగావున్నావు? చేతులు కడుక్కొని వీధరుగుమీద కడదాము రా.

ఆరాత్రి విశ్రమించి మఱునా డుదయమున సోమయాజి కుటుంబ సమేతముగా వెడలిపోయెను.

"అబ్బీ! శాస్త్రీ! అయితే సంవత్సరాది లోపుగా రుక్మిణి సన్నగాడి కిచ్చేదిలేనిది తేలి స్తేనేగాని, మా చెల్లె చిక్కు పడి పోతామనుమా" అని బండియెక్కెను, "అలాగే" అని శాస్త్రిపల్కెను.

ముకుందశాస్త్రి యూరు చేరినవెంటనే వాడుక చొప్పున వేణుగోపాలస్వామి దర్శనము చేయుచుండ, రంగాచారి రుక్మిణిచేసిన శపథముం గూర్చి యాతనితోఁ జెప్పి "నీవు సెలవునగా నుండకపోతే ఘోరం జరుగు తుంది ముకుందం!" అనెను. ఇంటికి వచ్చినతోడనే సోమ యాజి మాటలంబట్టి యాతఁడు తనతండ్రిని నిర్బంధించు చున్నాఁడని గ్రహించి, పైఁజెప్పినరీతి మాటలాడెను. తర్వాత రుక్మిణియు భీతినూపుడు మాటలాడెను కాని తాఁజేసిన శపథముమాత్రము చెప్పలేదు.

మరునాఁ డీ విషయముంగూర్చి ము కుం ద శాస్త్రి తండ్రి నడుగఁగా నాతఁడు "వరాన్వేషణాకై నేను దేశాటనము చేయజాలనురా" అనెను.

ముకుం:—నాన్నా! సెలవైతే తిరిగితిరిగి యెన్ని తంటా లైనా నేపడుతాను గాని, ఈసన్నగాడి కిచ్చేమాట కలలో తలపెట్టకండి.

శాస్త్రి:—నాకు అంత యిష్టములేదురా. ఎందుకంటే, సోమయాజి మొదటినుండి దొంగవెధవ, వాడి సంకతితో సంబంధము మంచిదికాదు. నిజమేకాని, యేంజేయను? మఱియెవరైనా అయితే కట్నం తెమ్మంటారు. అదీకాక, వీడి కోడుక్కిచ్చకుంటే, తనఖాసొమ్ము అసలుఫాయిదాలో క్రింద కట్టి మరి మాట్లాడమంటాడు. ఏంగతి? వాడంతటి వాడౌను. దయాదాక్షిణ్యాలులేవు. స్వభావము —పాముపగ.

ముకుం:—అంచేతనే; వాడితో సంబంధం తలపెట్ట కండి. నేనెలాగైన చచ్చి చెడి మఱియొక సంబంధం తెస్తాను. మీ కెందుకు? కాస్త తంటాలు పడకుంటే తగిన వరు డెలా వస్తాడు?

శాస్త్రి:—కృష్ణాడేడిక్కు.

ముకుం:—నిజమే; అయినను మనుష్యయత్నము చేసి, తరువాత దేవునిపై భారము వేయవలెనే కాని, ఊరక కూర్చుని భగవంతునిపై భారమువేయుట తగదు. తనకు తాను సాయము చేయువానికే దైవము తోడ్పడునని యాంగ్లేయ లోకోక్తి కలదు.

శాస్త్రి:—నీకు ధైర్యముంటేవెళ్ళు. నే నడ్డుచెప్పను.

ముకుం:—రేపు క్రిస్మసు సెలవులలో గోదావరిజిల్లా కెళ్లితే మన ద్రావిడవారు భట్టులున్నారు. మంచి శ్రోత్రియులు గూడాను. వద్దంతేను లోని పిల్ల దొరికితే కట్నాలుకూడా మానివేదురేమో.

శాస్త్రి:—శుభం! వెళ్ళవాన్నా. [తపాలావాఁడు ముకుందశాస్త్రి చేతికొక యుత్తర మిచ్చును] ఏమి ట్రా అది, సోమయాజి దస్తూరిలా గ్గనిపిస్తుందే.? ఎక్కడిది పోష్టుముద్ర?

ముకుం:—రైలులో తపాలాబండి ముద్ర. వెళ్ళుచూ వ్రాసినట్టు కనిపిస్తుంది.

శాస్త్రి:—ఏమంటాఁడూ? చదువు.

ముకుం:—[చదువును] బ్రహ్మశ్రీ వేదమూర్తులైన వేదు ల సుబ్రహ్మణ్యశాస్త్రి బావగారికి అవధాని సోమ యాజి అనేక నమస్కారములు చేసి వ్రాయంగల విన్నపములు—ఉభయకుశలోపరి.

నిన్న సంబంధంమాటలలో ఒకటి చెప్పటకు మరిచినాను. ఒకవేళ చి. సౌ. రుక్మిణిని మాసన్నయ్య కిచ్చుటకు నీకిష్టములేనియెడల నావద్ద నీవుంచిన తణఖా సొమ్ము అసలుఫాయిదాలు ఈవుత్తర మందిన నెల రోజులలో నాకు చెల్లించవలసియుండును గాన యిందు మూలముగా తెలియపరచడమైనది. ఇంతే నమస్కార ములు. చిత్తగించవలెను.

ఇట్లు విధేయుడు
"అ. నరసింహసోమయాజి."

ముకుం:—నే ననుకుంటూనే వున్నా, యిలాటి పిడుగేదో తెస్తా డని.

శాస్త్రి:—అయ్యో! ఏందారిరా! బాబూ! ఇప్పుడైదు వందలరూపాయ లియ్యమని పీకలమీద కూర్చుంటే నేనెక్కడికిపోనురా?

ముకుం:—ఎన్ని బాధలైనాపడి యాతని యాధీనత నుండి తప్పుకుంటేనే కాని మనకు క్షేమం కాదు. పెండ్లికంటే ముందీప్రయత్నము కర్తవ్యము.

శాస్త్రి:—(మాసిన గడ్డము తడవుచు) కర్తవ్యమే! ఒప్పుకొన్నా. దారి కనిపించదు.

ఇంతలో తండ్రివద్దనుండి మనోవ్యాకులము గ్రహించిన రుక్మిణి చింతాక్రాంతయై గోపాలస్వామి సన్నిధి కేగి మ్రొక్కె. అంతట మనమున ధైర్యము పొడమె. చిరచిర యింటికి మరల వచ్చె. ఆనాటిరేయి రుక్మిణికి వింతయగు స్వప్నము గానిపించె. వేణుగోపాలస్వామి దివ్యసుందరమూర్తిగాఁ గాన్పించి "గోదావరీస్నానము నాచరించిన నీకు సద్గతి కల్గు" నని చెప్పి యదృశ్యుఁడాయెను. మఱునాడు తల్లిదండ్రులతోను అన్నతోడను చెప్పెను. తలిదండ్రులు ఖిన్నులై రాఁజాల మనిరి కాని, ముకుందశాస్త్రి యానందభరితుఁడయ్యె. తాను గోదావరిజిల్లా చేరఁగ నిశ్చయించుటయు, చెల్లియకుఁ గల్గిన యీస్వప్నమును బహూకరించెనోగాఁ దోఁచె. తాఁ బూనిన కార్యము సిద్ధించుటకుఁ గృష్ణుఁడు తోడ్పడునను ధైర్యము కలిగె. తీర్థయాత్రకు వెళ్ళినట్లు చెల్లెలిం గూడ వెంటఁబెట్టుకొని వెళ్ళినయెడల, పలుగురు పిల్లను చూచుట కవకాశము కల్గునని చెప్పఁగాఁ దండ్రి యంగీకరించెను.

క్రిస్మసు సెలవులలో ముకుందశాస్త్రియు రుక్మిణియు రాజమహేంద్రవర మేగుదురని విని, రంగాచారి యాయవారమునందు తన మిత్రివారి యింట వీరికి బస యేర్పాటుచేసెను.

బయలుదేరుటకు శుభదినము నిశ్చయించిరి. క్రొత్తయూరిలో నగలు దాచుట కష్టమని తన నగలను రుక్మిణి తల్లి కప్పగించెను. వెంటనే వేణుగోపాలస్వామి కోవెల కేగి నగను గొనుగుచు నిట్లు మొఱలిడెను.

"దీనరక్షకా! అలనాఁడు నీవు కుచేలునికి సిరులియ్యలేదా? అటులనే నేఁడు మానాన్నగారికి దారిద్ర్యబాధ తొలగింపలేవా? వేయేల? నీ కృపయుండినచో ... నీదర్శనము చేసికొనయెద; లేదా నగలు సైతము అమ్మకు అప్పఁజెప్పి ఆఖరు సెలవు నీయొద్దఁ బొందుటయే. కడసారి దండముఁ గైకొమ్ము."

... మునుపటివలెనే యీమాటలు సైతము రంగా... ...చెను

## ౪. భగవదనుగ్రహము

ముకుందశాస్త్రియు రుక్మిణియు రాజమహేంద్రవరముఁ జేరిరి. ప్రతిదినము రుక్మిణి గోదావరిలో స్నానముచేసి మడినీరు తెచ్చి వంటచేయుచుండెను. అనుదినము ముకుందశాస్త్రి యాయవారమునుండెడి ద్రావిడ కుటుంబము లెవ్వియో కనుఁగొని ఒక్కొక్కరి యింటికి వరాన్వేషణకై వెళ్ళుచుండె. అనేకులు కట్నము లడిగిరి. మఱి కొందరు నోరు తెఱచి యడుగలేక, "ఏమి తొందర? మావాడికింక రెండుమూఁడు సంవత్సరములవఱకు వివాహము చేయు సంకల్పములేదు. ఈలోపుగా మంచి సంబంధములు చూచుచున్నా 'టైముంటుంది" అను సూచనగాఁ బల్కిరి. కొందరు మ.రా.రా. శ్రీ పేరి వెంకటేశంపంతులుగారు, బి. ఏ., బి. యల్., హైకోర్టువకీలు, రావుసాహెబు, జిల్లాబోర్డు ప్రెసిడెంటు, (ఇంకను పేర్కొనఁబడని బిరుదము లనేకములు) వీరియింటికి ముకుందశాస్త్రి వెళ్ళియడుగఁగా "అయ్యా! ఈకాలపుపిల్లవాళ్ళకు మనమేమి చెప్పలేము. వాళ్ళకే తిక్కతిరగాలెగాని, లేకుంటే మనమాట సాగదు." అని బంగరు ముక్కద్దములజోడు తగిలించుకొని ముకుంద శాస్త్రిని మఱి పలుకరించక "కేసులప్రసంగము" "పార్టీల"తో సలుప నారంభించిరి. ప్రాణము విసిగి ముకుందశాస్త్రి 'సెలవు పుచ్చుకుంటా'నని వెడలి వచ్చెను.

ఈవకీలుగారి కుమారుఁడు పేరి కృష్ణమూర్తి. తండ్రిగారి మాటలంబట్టి పెద్దలయెడల నవిధేయతతో వర్తించువాఁడేమో యని ముకుందశాస్త్రి ప్రప్రథమము దురభిప్రాయపడెనుగాని, విచారణచేయఁగా సుగుణోత్తముఁడని తెలిసె. ధనకాంక్షగల తండ్రి కట్నము బిట్టముగా లాగి యొక సంబంధ మేర్పాటుచేయు తఱి "నాన్నగారూ! కట్నము గ్రహించి వివాహమాడుట నాకు సమ్మతముగాదు. పెద్దలకు నేను మనవిచేయదగినది కాదు కాని, ఈ వివాహవిషయము నా స్వేచ్ఛకు వదలి వేయవలెనని నాప్రార్థన" అని వినయపూర్వకముగాఁ జెప్పెనఁట. అందుచే తండ్రి యాగ్రహము వహించి కుమారుని వివాహవిషయముం గూర్చి యుత్సాహము లేకయుండిరి. చి॥ కృష్ణమూర్తి ఇప్పుడు సర్కారు కళాశాలలో బి. ఏ. పట్టపుపరీక్షకు చదువుచుండె.

ఈతఁడు గోదావరీ ప్రవాహమందు "స్కౌటు" గా బహుజనోపకారముఁజేసికీర్తిఁబడసె. "స్కౌటు క్యాంపుతో" ధవళేశ్వరమున కేగియుండెను. "త్వరలో మరలి రానున్నాఁ"డని యందరనిరి. "కట్నము కాసింపని యిట్టి సుగుణవంతుఁడు మనరుక్మిణికిలభించిన నెంతబాగు! తండ్రి యడ్డునేమో" అని ముకుందశాస్త్రి యనుకొని చెల్లెలితో నీవృత్తాంతమంతయు చెప్పెను.

రాజమహేంద్రవరమున వీరలిట్లుండ, గోపాలపల్లిలో వీరితలిదండ్రులు, పిల్లలను విడిచి యెన్నఁడుండ కుండుటం జేసి, యేమియు తోచకయుండిరి. ఉత్తరములంబట్టి యింకను కార్యసిద్ధి కాలేదనిమట్టుకుఁ దెలియవచ్చెను. ఒకనాఁ డుదయమున వీరింగూర్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మనసు మిగుల వ్యాకులమొందె. ఏలనోకో యని యాలోచించుచుండఁగా నాతని భార్య, రుక్మిణి గోదావరిలోఁబడి కొట్టుకొని పోయినట్లు



శ్రీ వేణుగోపాలస్వామి సన్నిధియందు శాస్త్రిగారు తన్మయులై యుండుట

స్వప్నముఁ గన్న వార్త తెలిపె. వెంటనే క్షేమము వ్రాయుమని యుత్తరము వ్రాసి పడవైచి, తంబుర, చిరుతలు చేతంబూని వేణుగోపాలస్వామి సన్నిధికిం జని యేకాగ్రచిత్తుఁడై భజనచేయఁ దొడంగె. అప్పుడు రుక్మిణి యొక్క ప్రవాహములోఁ బడికొట్టుకొని పోవునట్లు తనకు కనఁబడె. అంతట.—"ఎపుడు కృప కల్గునో" "ఇఁకనైన నామొఱ వినరాదా." అను కృతులు పాడి" ఏహి ముదం మమదేహి" యను తరంగము పాడుతఱి, శ్రీకృష్ణుఁడు చేయూఁత నొసఁగి రుక్మిణిని పైకిఁదీసినట్లు కనుపించె. అంతట నానందబాష్పము లొలుక, శాస్త్రి తరంగపరంపరఁ బాడం దొడంగె. చివరకుఁ దనయింటికి వచ్చి "భయములేదు విపత్తువచ్చినను కృష్ణుఁడు కాపాడును. నా కభయ మిచ్చె"నని భార్యతోఁ జెప్పి శాస్త్రి యామెకు దుఃఖోపశమనముఁ జేసె.

ఈ దినమున రాజమహేంద్రవరములో స్నానఘట్టమునొద్ద నున్న జను లున్నట్లుండి గొల్లుమని కేకలు వేసిరి. స్నానము చేయుచున్న పిల్ల యొకతె యఖండ ప్రవాహములోఁ గొట్టుకొని రైలు వంతెన గుండాపోయెను. ఇంతలో జడ్జీబంగాళా చెంతనున్న రాళ్లనుండి యొక యువకుఁడు ప్రవాహములోనికి దుమికెను. జనులు గుంపులుగూడి చూచుచుండిరి. దవ్వున యానము చేయుచున్న నౌకలకు సంజ్ఞలుచేసిరి.

ఇంతలో నాయువకుఁడు రుక్మిణిని కేశములం బట్టుకొనెను. గట్టుచేర్ప నెన్నిమారులో యత్నించెను. గాని నీటివిసురుచే వీలులేకపోయెను. ధైర్యము విడువక ప్రవాహములో నీది యొకదిబ్బపైకి పిల్లనీడ్చిచూడఁగా, దివ్యసుందర యువతి. ఎవరు? రుక్మిణియే. యువకుఁ డెవరు? స్కౌటు కృష్ణమూర్తి. అప్పుడే ధవళేశ్వరమునుండి యాగట్టువెంట వచ్చుచు నబ్బాలిక పడుటఁ జూచి బనియను చడ్డీ తప్ప నితర వస్త్రములు విసరివైచి ప్రవాహములోఁ బడి పిల్లను పైకిఁ దెచ్చెనుగాని యూపిరి యాఁగిపోయెను. అంతట దాను నేర్చిన విధమున బాహులను సాగించి మడచి ప్రక్రి[illegible] జేయఁగా నెట్టకేలకు శ్వాస పునరపి వచ్చెను. లోఁగొ[illegible] నీరు కక్కించుటకై కాళ్లు పట్టుకొని గిరగిర [illegible] త్రిప్పఁగా ద్రావిననీరు వెలుపలికి వచ్చెఁ" గా[illegible] యింకను ప్రజ్ఞ తప్పియుండెను.

మేనం బూసిన పసుపుచేత బంగరుబొమ్మవలె వెలిఁగెడి యాసుందరాంగనం జూచి కృష్ణమూర్తి మన మునఁ బ్రీతినొందెను. రుక్మిణి యొక్కసారి కనులు విప్పి చూచి చిరునగవుతో "కృష్ణా! రమ్మంటివి గాన వచ్చితి." అని వదల ప్రజ్ఞ లేక పడియుండెను.

కాని వేంకటేశంపంతులుగారు కొమారునితో "ఏడ్చావ్ పెధవ! ఎప్పుడూ ఏటిలోనో నిప్పులోనో మరణం గోరుతుంటావ్" అని యాగ్రహపడెను. కాని జడ్జీగారికి కలెక్టరుగారికిని దనకుమారునివలనఁ గల్గినదయు తనకుఁ గూడ లాభించునుగదాయని యుల్లమందు సంతసించెను.



స్కాటు కృష్ణమూర్తి రుక్మిణిని గోదావరినుండి పైకితీసి యూపిరి తెప్పించ ప్రయత్నము చేయుట

ఇంతలో, భద్రాచలమువైపు పర్యటనుండి వచ్చుచున్న కలెక్టరుగారు దూరదర్శినిం జేబూని జరిగినదంతయుఁ జూచి తన "ధూమనౌకను" (Steam launch) అచ్చటికిం గొనిపోవ నాజ్ఞాపించెను. దిబ్బఁజేరి వీరిరువురిని లోనికిఁ దీసికొనెను. ఆయన భార్య రుక్మిణిని దనగదిలోనికిఁ గొనిపోయి తడిబట్టలఁ దీసి పొడి బట్టలిచ్చి వేడిపాలు త్రాగించెను. రుక్మిణి తెలివొంది "ఎక్కడనున్నాను? కృష్ణుఁడేఁడీ?" అనెను. కలెక్టరు గారుకూడా కృష్ణమూర్తికి క్రొత్తబట్ట లిప్పించిరి. తన బంగాళానుండి చూచుచుండిన జడ్జి నిమ్మల కృష్ణశర్మగారు మోటారు పడకబోటు తెప్పించి యొకానొకగా నచ్చటి కేతెంచి వీరిరువురిని తనగృహమునకుం గొనిపోవ నిచ్చఁ జూప, బ్రాహ్మణు లగుటంజేసి వీరల కచ్చట సౌఖ్యము కల్గునని కలెక్టరుగారు సమ్మతించి స్నానఘట్టమున దింపిరి.

కృష్ణశర్మగారు కృష్ణమూర్తిని తనమోటారులో నింటికిఁ బంపిరి. అబ్బాయితండ్రికి కుఱ్ఱవానిసాహసముం గూర్చిశ్లాఘించియుత్తరము వ్రాసిరి. ఈయుత్తరముచదువు

మఱునాఁడు సబ్ కలెక్టరుగారి కచ్చేరిలో పెద్ద కలెక్టరుగారు సభచేసి యాయూరమందు గొప్పవారిం జేర్చి కృష్ణమూర్తి సాహసముం గొనియాడి జనోపకార సంఘమువారిచ్చు హేమపతకమున కితని సిఫారసుచేసి నట్లు చెప్పిరి. చెన్నపట్టణమునుండి తంతివార్త విని వచ్చిన స్కాటుకమిషనర్ గారు, కృష్ణమూర్తికి "కింగ్స్ స్కాటు" అను గొప్ప బిరు దిడిరి.

ఇంతలో జడ్జిగా రీకుఱ్ఱవాఁడు కాపాడిన చిన్నది తన చిరకాలపు స్నేహితుఁడు సుబ్రహ్మణ్యశాస్త్రి కూఁతురని యెఱింగి, ముకుందశాస్త్రిని రుక్మిణిని తనయింటనుండ నియమించెను. శాస్త్రికి సొమ్ముఁబంపి భార్యా సమేతుఁడై రమ్మని వ్రాయ నాతఁ డట్లేవచ్చెను. కలెక్టరుగారి సభలో కృష్ణమూర్తితో నేకాంతముగా సంభాషించి వేయిన్నీనూటపదహార్లు చదివింప నిచ్చఁజూప నాతఁ డిట్లనియె. "నేను స్కాటు కావున చేసెడియుప కారమునకు ప్రతిఫలము గ్రహింపఁగూడదను నియమము కలదు. అట్లే ప్రమాణము చేసియున్నాఁడను. కావున యీపిల్ల తల్లితండ్రులు రిక్తదశలో నున్నట్లు

న్నడుమండుటంజేసి యీ పిల్లకుఁ జదివించిన వాకిచ్చి వెల్లి సంతసించెద" నని సిగ్గులో గూడిన చిరునగవుతోఁ బల్కెను. ఈకుఱ్ఱవాని ధైర్యము నౌదార్యమును శ్లాఘించుచు జడ్జీగారు రుపన్యసించిరి. వకీలు వెంకటేశంపంతులు జడ్జీగారు తనకుమారునింగూర్చి శ్లాఘించుట యిష్టమైనను వచ్చెడి వేయిన్నీ నూట పదహార్లు పోఁగొట్టుకొనెనని మోముచిట్లించిరి. అంత జడ్జీగారు సభామధ్యమునకు రుక్మిణిం జీరి వేయిన్నీ నూటపదహార్లాపిల్లకిచ్చిరి. అంతట జనులెల్లరు "వీరిరువురికిం బెండ్లిచేసిన బాగుండు" నని కేకలు వేసిరి. కలెక్టరుగారు లేచి "సభ్యులారా! మీరిప్పుడు కోరిన కోరిక నాభార్యకును నాకును బరమ సమ్మతము, కాని [illegible]శాకార్యక్రమముతో సంబంధించిన విషయముకాద[illegible]న, తరువాత విచారింపఁ దగిన విషయము. ఇంతటితో సభ చాలింతము" అని "వ ర్తబు" చేసిరి.

తరువాత జనులు జడ్జీగారి చుట్టు మూగి, "మా యభీష్ట మేమి నెరవేర్చెదరా?" అని యడుగ, జడ్జీగారు, కుఱ్ఱవాని సమ్మతి వాతని సిగ్గు చిరునగవుం బట్టి గ్రహించిరి కావున, వకీలువైపు తిరిగి "ఏమండీ, వేంకటేశం పంతులుగారు! తమరికి సమ్మతమా? మీరం దరేకగ్రీవులే కదా?" అనిరి. వేంకటేశం పంతులుగారికి కట్నము లేమింజేసి తృప్తి లేకున్నను, జడ్జీగారి యనుగ్రహము సంపాదించుట మంచిదని "తమ సెలవుకర్త్యం తరమేమి; శుభం, కానివ్వండి" అనిరి. తర్వా[illegible]త జడ్జీగారు శాస్త్రిపై పు మళ్లి "ఏంశాస్త్రీ! నీవేమంటావ్ [illegible]!" అని యడుగ, శాస్త్రి యభినవ కుచేలునివలె "నీమాటకెన్నడైన నే నెదురాడుట యుండునా? అదియుంగాక బహుజనసమ్మతము భగవత్సమ్మతము" అనిరి.

జడ్జీగారే శాస్త్రిని ఋణబాధనుండి తొలఁగించి వివాహము జరిపించిరి. వివాహసమయముననే జనోపకార సంఘమువారిచ్చిన హేమపతకము వచ్చెను. తరువాత కృష్ణమూర్తి పట్టపుపరీక్షయందు తీర్ణుఁడై, సర్కారువారి యనుగ్రహముచే "డిప్యూటి తహశీలుదా"రై త్వరలో డిప్యూటికలెక్టరుగా గోదావరిపై యానము చేయవలసివచ్చెను. మునుపటి దిబ్బప్రక్కనుండి వెళ్లుచుండఁగా, నాతఁడు రుక్మిణింబిలిచి యాదిబ్బచూపి, "నిన్ను నీటినుండి యీదిబ్బ మీఁదికి నే నీడ్చినవెంటనే "కృష్ణా! రక్షించితివి గాన నచ్చితి" వంటివి !" అని యడిగెను.

రుక్మిణి:—గోదావరీ స్నానము చేయుమని నాతోఁ కలలోఁ గృష్ణుఁడు చెప్పినప్పుడు మీవలెనే కన్పడె. కావున మిమ్ముంజూడఁగాఁ గ్రొత్తఁగాఁ దోఁచలేదు.

కృష్ణ:—ఏమి యీవింత!

రుక్మిణి:—వింతయేమి. మీరు కృష్ణుఁడు గారా? ఇవంతయుఁ గృష్ణునికృప.

---

# అభావప్రాదుర్భావము

జంధ్యాల శివన్నశాస్త్రి గారు

నాఁడు ప్రలాపమ్మునకు గర్వపడనొకో, అదియు నీతోడ మాటాడఁజేసె
నా యసంగత జీవనమును కుపోంగనో, యదియుకా నీపొందు నందఁజేసె
నాయంధతకు నుబ్బనా యదేకద విశ్వ,చక్షు వొసఁగి రహస్యంబు చూపె
నా యకించనత కానందింపనా యదే,కద నాకుఁ బెన్నిధిఁ గలుగఁజేసె
గీ. నేను నాఁడు రోదనముపై నేల హర్ష,మూననొకొ నేర్చె నా కది గాన మొకటి
దాని నేనియెడ వశంగత మ్మొనర్చు,కొంటి సద్దానివాంఛ యెక్కొండె నాదు
జీవనాకాంక్షయై మున్ను చెలఁగుచుండె.

# నావెండిరూపాయ



భమిడిపాటి సుబ్బారావు గారు

౧

శీతకాలమున అధికమైన చలిబాధ. చలిపేరు చెప్పినంతనే భయంపడి గృహముల దూరు భీరువులనే చలి వెంబడించి గ్రహము వలె నావహించును; కాని భయమొందక యెదురించువారి కేరికి నది భీకరముగా గోచరింపదు. అట్టివీరులలో నొక్కనిగ వీరన్నను జేర్కొనఁదగు. అందునకుఁ గారణములను ముందుముందు గ్రహింపఁగలము. ప్రత్యేకము చెప్పుట యంత ముఖ్యముకాదు.

వీరన్న కిప్పటి కేఁబదియేండ్ల వ్యవసాయానుభవము గలదు. ఇప్పు డాతని కింట గంపెడు బలగము. 'నల్లబంగారమును నమ్మి నవాఁ డెప్పుడును చెడిపోఁ' డనుమాటయొక్క యాథార్థ్య మీతని జీవితమున నిశ్చయమైనది. అట్లు కాకయున్నచోఁ గొడుకులు, కూఁతుండ్రు, కోడండ్రు, నల్లుండ్రు, మనుమలు, దౌహిత్రులు, వీరిచుట్టములు, చుట్టముల చుట్టములు మొదలగువారలను సమాదరించుటయు, శుభకార్యములు, పండుగలు, పబ్బములు మొదలైన న్నియో యథావిధిగ సాగించుటయు నాతని ట్లు సులభసాధ్యమైనవి ?

వీరన్న కున్న భూవసతి పెరుఁగుట యొఱుఁగము. సంసారాభివృద్ధి యన్ననో, శాఖోపశాఖలుగాఁ బెంపొందుచుండె. బహువిధశాఖాసమన్వితంబయిన విటపి, యొక్క కాండముపై నాధారపడియున్నట్లీ బాహుళ్యమగు కుటుంబమంతయు వీరన్న యాజమాన్యముపై నుండుట చాల నానందదాయకమైన విషయము.

అనుదినమును 'అయ్యా! —తాతా! —మామా! యను వరుసవరుస పేరులఁ బిలుచుచుఁ బిల్లలందఱు వీరన్న చుట్టును జేరి యాతని గడ్డమును లాగుచు, మోము నిమురుచుఁ జేతికఱ్ఱలాగుచుఁ, గథలు చెప్పుమని విసిగించుచు, నాతఁడు కసరిగొట్ట నవ్వుచు, లాలనఁ జేయుచు మఱింత దగ్గఱఁ జేరుచుఁ, బలు తెఱఁగుల బాలక్రీడావిశేషముల నప్రమత్తులై యుందురు. ఒక్కొక్కడుఁ జీకాకు చెందినను, వీరన్న యాత్మబలగవ్యాపారములవలన నపారమగు నానందము ననుభవించుచుండెననుటయే నిక్కము. అట్లుగాక యాతనికి గృహమున నే మనోవ్యాకులతాహేతువో యున్నచో నొక్కగడియయైన నిల్లు విడిచి, యేనిర్జన

ప్రదేశమునకో, వాహ్యాళికో, లేదా పుర మందిరమునకో విలాసార్థ మరుగఁడా?

౨

పిల్లలకు నిర్వ్యాపారతయన్న నసహ్యము. అది పెద్దలకే చెల్లినదిగాని, మానవబాలమానసశరీరములకు వ్యతిరిక్తము. ఎప్పుడును వారేదో వ్యాపారమున మగ్నులయి యుండవలసినదే. తగినంత పనిలేనప్పుడు వీథులవెంటఁ బరుగెత్తవలసినదే! కత్తి చేతఁ బట్టి చెట్లను చేమలను నఱకవలసినదే! ఏదో సందర్భము చూచుకొని యేవతో డెందమునో బొండెనో రెంటినో యుద్ధాయించవలసినదే! ఈ నైసర్గికధర్మమును శిశు తెలియని తలిదండ్రులు 'విద్య గఱపుచున్నా మన్న నెపమున' రూపుమాపుచున్నారు. పెద్దలు తాము చేయునది యొకటి చెప్పునది యొకటి యగుటచేతఁ బిల్లలు దుర్మార్గప్రవర్తన మాదర్శము చేసికొనుచున్నారు. తా మాచరించు నుత్తమకార్యముల, నేతల్లిదండ్రులు తనయులకు, మనసార నుపదేశించెదరో, యా జనకులచే శిక్షితు లగు బిడ్డలే పౌరు లనఁదగువా రగుదురు. ఆ విద్య మోసమునకు దూరమైనది. ప్రపంచభయరాహిత్య మైనది. ఫలాపేక్షా పూజ్యమైనది. బోధనమునకుఁ గాలనిర్ణయము లేదు. ఈ విషయముల నిర్ధారణము గావించుకొనుటకొక్కసారి వీరన్న సదనమువంకఁ జూడనగు!



వేకువను వీరన్న చలియనుకొనక, దొడ్డిలోనికిఁబోయి పసులఁ బరిశీలించి, యింత గడ్డిని దెచ్చి యొక్క చలిమంట వేసెను. చలిచేఁ బిల్లలందఱును నిద్రమేల్కాంచి ప్రక్కపై దొరలుచుండిరి. లేచుటకు శీతల బాధ; పరుంటకు నిద్రలేమి; వారొకరితరువాత నొకరుగ చలిమంటచుట్టును జేరిరి. ఒడలంతయుఁ గాచుకొనుచుండిరి. మధ్యమధ్య వీరన్న 'నిప్పు—జాగ్రత్త' యని హెచ్చరించుచుండెను. అతనిమాట లెవరు లక్ష్యము చేయుదురు; లక్ష్యము చేయలే దనుటకు వా రా మాటలను బెడచెవిని బెట్టిరా? ఒకఁడు తనయల్లరి చేయుచునే యుండెను. మఱొక్కఁడా యల్లరిచేయువానిని వీరన్నవోలె వారింపఁ బ్రయత్నించుచుండెను. యఃలించువానికి నల్లరిచేయువానిని మఁ

...దేశమునకో, వాహ్యాళికో, లేదా పుర మందిరమునకో విలాసార్థ మరుగఁడా?

౨

పిల్లలకు నిర్వ్యాపారతయన్న నసహ్యము. అది పెద్దలకే చెల్లినదిగాని, మానవబాలమానసశరీరములకు వ్యతిరిక్తము. ఎప్పుడును వా రేదో వ్యాపారమున మగ్నులయి యుండవలసినదే. తగినంత పనిలేనప్పుడు వీథులవెంటఁ బరుగెత్తవలసినదే! కత్తి చేతఁ బట్టి చెట్లను చేమలను నఱకవలసినదే! ఏదో సందర్భము చూచుకొని యేవతో డెందమునో బాండెనో రెంటినో యుద్ధాయించవలసినదే! ఈ నైసర్గికధర్మమును శిక్ష తెలియని తలిదండ్రులు 'విద్య గరపుచున్నామన్న నెపమున' రూపు మాపుచున్నారు. పెద్దలు తాము చేయునది యొకటి చెప్పునది యొకటి యగుటచేతఁ బిల్లలు దుర్మార్గప్రవర్తన మాదర్శము చేసికొనుచున్నారు. తా మాచరించు నుత్తమ కార్యముల, నేతల్లిదండ్రులు తనయులకు, మనసార నుపదేశించెదరో, యా జనకులచే శిక్షితు లగు బిడ్డలే పౌరు లనఁదగువా రగుదురు. ఆ విద్య మోసమునకు దూరమైనది. ప్రపంచభయరాహిత్యమైనది. ఫలాపేక్షాపూజ్యమైనది. బోధనమునకుఁ గాలనిర్ణయము లేదు. ఈ విషయముల నిర్ధారణము గావించుకొనుట కొక్కసారి వీరన్న సదనమువంకఁ జూడనగు!



వేకువను వీరన్న చలియనుకొనక, దొడ్డిలోనికిఁబోయి పసులఁ బరిశీలించి, యింత గడ్డిని దెచ్చి యొక్క చలిమంట వేసెను. చలిచేఁ బిల్లలందఱును నిద్రమేల్కాంచి ప్రక్కపై దొరలుచుండిరి. లేచుటకు శీతల బాధ; పరుంటకు నిద్రలేమి; వారొకరితరువాత నొకరుగ చలిమంటచుట్టును జేరిరి. ఒడలంతయుఁ గాచుకొనుచుండిరి. మధ్యమధ్య వీరన్న 'నిప్పు—జాగ్రత్త' యని హెచ్చరించుచుండెను. ఆతనిమాట లెవరు లక్ష్యము చేయుదురు; లక్ష్యము చేయలేదనుటకు వా రా మాటలను బెడచెవిని బెట్టిరా? ఒకఁడు తనయల్లరి చేయుచునే యుండెను. మఱొక్కఁడా యల్లరిచేయువానిని వీరన్న పోలె వారింపఁ బ్రయత్నించుచుండెను. యఃలించువానికి నల్లరిచేయువానిని మం

లించుట ముఖ్యోద్దేశమా? వీరన్న ననుకరించుట ముఖ్యోద్దేశమా? ఇట్టి మానసపరీక్ష యేవిజ్ఞానశాస్త్రజ్ఞునకుఁ దెలియును?

ఒక బాలుఁడు సగముకాలిన జనుపకట్టెను దీసి రెండవకొనను నోట నిడికొని చుట్ట కాల్చువారి నవహసించుచుండెను. వేఱొక్కచో బాలిక యొకతె 'హా' యని నోరు దెఱచి నోటినుండి వెల్వడు నీటియావిరిని ప్రక్కనున్న తన చెల్లెలికిఁ గన్పఱచుచు, గారడీవాని ననుకరించుచుండెను. ఇట్లు వీరందఱుఁ క్రీడామగ్నులయియుండఁ గ్రమముగా వెలుతురు చీకటిఁ ద్రోలివేయఁగడంగె. ధరా నవీనాపాంబరమున 'పొగమంచు' దట్టముగఁ బట్టి, చుట్టును యవనికవలెఁ గన్పట్టుచుండె. ఆ సూక్ష్మ జలకణసముదాయభారమునంతను వహింపజాలని సమీరుఁ డందుఁ గొంత చేర్చి హిమబిందురూపమున నెత్తగు వస్తువులపై ననఁగా చెట్లమీఁద, గడ్డిమీఁద, ప్రోవుచేసి యుంచె ఆజలబిందుభారమునే వహింప నోల్లనియట్లు, వానిచేతనే పరిశుభ్రమైన పత్రములా 'మంచును' సర్వభారవాహకత్వమును వహించిన భూదేవిపాలొనర్పఁ జల్లఁగ రాల్చుచుండెను. పవనుండును మెల్లగ సాగి పత్రములఁ దమయుద్యమంబున మఱింత ప్రోత్సహించుచుఁ దరంగములుగా లోకవ్యాపారము చేయుచుండెను.

అట్టిసమయమున వీరన్న 'ఓపిల్లలారా' ...ని పిలిచెను. ఆ పలుకును దనబొమ్మకు ...టలఁ గరపుచుఁ గథలఁ జెప్పుచున్న వీరన్న ...త్తి, తక్క తక్కినవారందఱును విని యాతనివంకఁ జూచిరి. ఆతని నెఱసిన శిరోజములు, దరహాసపూరితవదనము వెలుఁగులో వెలుఁగుచుండెను. ఆ బాలురలోఁ బెద్దవాఁడగు గోపన్న తాతయగు వీరన్న పోలికనుండెను. అతఁడు బలహీనుఁడు. తమ్మునివలెఁ గాక మితభాషి. తాత కథలను వినుటయన్న నాతని కాసక్తిమెండు. ఒక్కతనసే తాత ముఖగహ్వరమునుండి వెల్వడు మాటల నామూలాగ్రముగ గోపాలుఁడు వినుచుండును. తాను వినినదంతయు జ్ఞాపకముంచుకొనును. నాఁటి వేకువను తాత చెప్పిన కథను గోపన్న యాలించి దాను పెద్దయైనపిదప నొకచో వ్రాసి యుంచుకొనెను. ఆకథ మన మిప్పుడు చెప్పుచున్నదే!

3

నా జననీజనకులు పేదలు. నేను బాలుఁడనైనప్పుడు నన్నుఁగాక మఱి యాఱుగురు బిడ్డలను వారు పోషింపవలసియుండిరి. దినము గడచుటయే కష్టముగా నుండె. ధనమువచ్చుమార్గము లేదు. నా కెనిమిదేండ్ల ప్రాయము రాఁగానే నన్ను 'బసివిరెడ్డి' యను నొక ధనికునియింటఁ బ్రవేశపెట్టిరి. నా కాతఁ డన్నము పెట్టుటకును బాలము పని నేర్పి చేయించుకొనుటకును నిర్ణయము. తమ కీమూలమునఁ జేతిలో నొక దమ్మిడియైనఁ బడకపోయినఁగాని యంతకే నాతల్లితండ్రులు సంతసించిరి.

బసివిరెడ్డి నౌకరులచేఁ బనిచేయింపఁగల సమర్థుఁడని ప్రతీతి. తమ కేమి బాధ కలుగునో యని యెవ్వరు నాతని దగ్గర పనిచేయుట

కియ్యకొనరు. ఒప్పుకొన్నచో వారు తప్పక జవదాటక పనిచేయుటకు సిద్ధముగానుండి రన్నమాటయే. అనుదినమును వేకువజాము ననే లేచి పొలమునకుఁ బోయి, పాలుపితుకుట పిదపఁ బశువుల నింటికిఁ దోలుకొనివచ్చుట నా వంతుపనులలో నొకటి. వాతావరణస్థితి యెట్లున్నను, నాపని చేసితీరవలసినదే. పిమ్మటఁ జేనిలోఁ బిట్టలఁ గొట్టుట, కలుపుదీయుట, దూడల మరలించుట నాపనులు.

అయినను నాపని నేను శ్రద్ధతోఁ జేయువాఁడను. ఆవులన్నియు నన్నుఁజూచి యఱచెడివి. ఆమందలోని జంతువులు దూరము నుండియే నన్నుఁ బసిపట్టి గంతు లిడెడివి. సూర్యోదయకాలమునఁ బక్షిరుతములు నా చెవుల కింపుగా నుండెడివి. పొలముగట్లపై మొలచెడు మొక్కలు, పూచెడి పూవులు నాకుఁ గన్నులపండువొనరించెడివి. ఈయానందములోఁ బాఠశాలకుఁ బోవలెననికాని చదువుకొనవలెననికాని నా కెన్నఁడును దట్టలేదు. విద్యనేర్చుటవలన ధనము సంపాదింపవచ్చు ననునూహ నాకుఁ బొడమనే లేదు. పొడమినను గొనసాగకపోయియే యుండు ననుటలో వింత యిసుమంతయు లేదు.

ఏ పండుగుకో దొరకిన యొకటి రెండు డబ్బులుతక్క నా చేతితో నెన్నఁడును ద్రవ్యమును ముట్టి యెఱుఁగను. ఆ రెండుమూఁడు డబ్బులు వచ్చినప్పుడు నాయానందమునకు మేరయే లేదు. అట్టియానంద మెప్పుడో యేఁటి కొక్కనాఁడు కలిగెడిది. ఈ సందర్భమున, ద్రవ్యము పెట్టి పుట్టిన యే కొలఁదిమందికో కాని యందఱకు లభింపదనియు, సట్టి యదృష్టవంతులలో నేనొక్కఁడఁ గాననియు నా నమ్మకము. బసివిరెడ్డి దగ్గర నౌకరీచేసిన మూఁడేండ్లలో రాగినాణెములఁ దప్ప వెండి నాణెములను నే నెన్నఁడును ముట్టి యెఱుఁగను. రూపాయ యన్న నా కెట్లు తెలిసినదో యీ వృత్తాంతమే నా కథావిషయము. శ్రద్ధతో వినుఁడు:

౪

అప్పుడప్పు డంగడికిఁబోయి కావలసిన వస్తువులను గొని యజమానుని యింటికిఁ దెచ్చుట నా కలవాటు. ఆ ప్రకార మొక నాఁటి సాయంకాలము కోమటిదుకాణమునకుఁ బోయి సరుకులఁ గొని చేతఁ బట్టుకొని గృహోన్ముఖుఁడనై యరుగుచుంటిని. నేను బయలుదేరునరికే సూర్యాస్తమయ మగుట వలనఁ గనుచీకటిలో నడచుచుంటిని. దారిలో నొక చిన్న తెల్లనివస్తువు కంటఁబడియె. దానిఁ దీసుకొనవలయునన్న యభిప్రాయము లేకయే దానివైపు నిర్లక్ష్యముగా నడచితిని. దాని నెత్తితిని. అరచేతిలో నుంచుకొంటిని. అం దరయైన లే దయ్యది. అది యొక కాగితపుఁ బొట్లము. దానిఁ దిరుగఁ బారవేయ నుద్యమించి మానితిని. దాని లఘుభారమే దానిపై నాకుఁ గల నిర్లక్ష్యమును బెంపొందించె. ఏ బాలుఁడో నన్ను మోసము చేయుట కీయుపాయముఁ బన్నెనని యూహకూడఁ బొడమినది. ఈయాలోచనములదూరముగఁద్రోలి కుతూహలముచేత నా పొట్లముం దెఱచి నాయానందము హద్దులనతిక్రమించిపో

దానిని బట్టఁ బగ్గములు లేవు. ఎందు
దానిలోనుండి జారి క్రిందఁబడి టంగు
ధ్వనిఁజేసిన వస్తువే దీని కంతకును మూలఁ
అది యేమయి యుండునా యని ద
దిలకించితిని. అది స్వచ్ఛముగ నుండెను.
గుండ్రముగ నుండెను. 'డబ్బు' మాత్రము
కాదు, అంతకంటె విలువ గల నాణెమే,
రూపాయ; వెండిరూపాయ; సరిక్రొత్త వెండి
రూపాయ. నాసొత్తైనసరిక్రొత్త వెండిరూపాయ.
నేలమీఁదనుండి దానినిదీసి గుప్పిడిలో గట్టిగా
నొక్కి కొంత యానందము నడంచితిని. పండ్ల
సందున నిడి కొఱికితిని. దానితత్త్వ మొక్కింత
బోధపడినది. అది తిరిగి నన్నుఁ బాసిపోకుండ
భద్రముగఁ గోటుజేబులో నుంచుకొంటిని.
ఈ కార్యనిర్వహణమం దించుక కంప
మంకురించినది. అది జేబులో నున్నదో
లేదో యనుక్షణమును బైకిఁ దీసి తేరిపార
దానివంకఁ జూచుకొనుచు నింటికిఁ బోవు
చుంటిని. ఎవ్వఁడైనఁ గంటఁబడి నప్పుడు
నాణె మాతని దృష్టిని బడకుండ దాఁచు
చుంటిని. నే నొక నేరమొనరించినట్లు, కార
ణము స్పష్టమగుట లేదు కాని—భయపడు
చుంటిని. 'నీ దగ్గరనున్న రూపాయ నా'దని
యెవ్వఁడు వచ్చి యడుగునో యని సంకో
చించుచుంటిని.

'ఒకవేళ నెవ్వఁడును వచ్చి రూపాయ
నాదని చెప్పకున్నచో, నది న్యాయముగ నా
సొమ్ముగదా యని నిశ్చితాభిప్రాయుఁడ నైతిని.
కాని పరిస్థితి యింత యెక్కడిది? దాని నెవ్వరు
పోఁగొట్టుకొనిరో వారి నారయ లేదని విచార

రెడ్డికిఁగాని యాల
గాని నేఁ జెప్పలేదు. ఎందులకుఁ జె
నాధనము పోవునేమోయనెడి భీతిమాత్ర
నామానసవీథిని దాండవించుచుండె. భయ
మునకుఁ గారణముకూడ గలదు. నన్నుఁ
గాంచినవాఁడు తప్పక నాదగ్గర రూపాయ
యున్నదని తెలిసికొని తీరునని నా దృఢనమ్మ
కము. అక్కతమ్ముల సరిగ నెవ్వరి ముఖమ్ము
వైపుఁ జూడ లేకుంటిని. ఒంటరిగ నుండవలయు
ననియే నా యాశయము. రాత్రియంతయు
జాగరము. అకారణముగ లభించిన ద్రవ్య
మును దాఁచు విధంబునుగూర్చి కొంతకాల
మును, దరువాత దానిని వ్యయమ్మొనరించు
విధమ్మునుగూర్చి కొంతకాలమును యో
జించుకొనుచుంటి.

ఉదయముననే వాడిన మొగముతో,
జేవురించిన నేత్రములతో, దుర్బల శరీర
ముతోఁ జావడిలోనికి వచ్చితిని. సాధారణ
ముగ నా కన్నివేళల క్షుధానలబాధ యెక్కు
టము. అయ్యది వెల్లడిగాకుండఁ జేయుటకో
యన్నగతిని నైజముగఁ జిరునవ్వుతో వద
నము వికాసమొందుచుండెడిది. ఈ ప్రొద్దున
మాత్రము నేనాఁకలికిదూరమైతిని. అన్నముపై

...లవము ...ను. అతఁడు నన్ను ...ముగూర్చి ప్రశ్నించు ననుకొన్నం ...న మామకముఖము వివర్ణమైపోయె; శిరము వనతమయ్యె. "నీకు దొఱకిన రూపాయ యేదీ! దొంగా! ఎక్కడ దాఁచితివి? ఎవ్వరిదో వారి కియ్యది యియ్య నక్కరలేదా?" అని యాతఁ డడిగిన నే నేమి చెప్పుదునా యనుకొంటి. యజమాని నన్నుఁజూచి "వీరన్నా; నీవు రామస్వామి దగ్గరకుఁబోయి యీదినము పని లోనికి వచ్చునో రాఁడో కనుఁగొని రమ్మని నుడివె.

ఆ పలుకులు చెవిఁబడినంతనే యొక్క పెద్దబరువు నాహృదయమును బాసిపోయెను. కడకు యజమానుని యాజ్ఞ యిది. ఇట్టిపను లెన్నియైనఁ జేయ సంసిద్ధుఁడనై యుంటి నను కొని సంతోషముతో బయటకు గంతువేసి యాతని దృష్టిపథమునుండి తొలఁగి పోతిని.

ఒక్కసారి నా రూపాయను జేబులో నుండి పైకిఁదీసి కన్నులారఁ జూచి సంతోషించితిని. దాని వెచ్చించి నేను కొనఁగిలవస్తువుల పట్టికనూహించి యాశ్చర్యానంద నిమగ్నుఁడనైతిని. నా హృదయమునకు స్థైర్యములేదు. నాధనము లభ్యమైనందున సదృష్టవంతుఁడనని ...సంతసింతునా? అదియెవ్వనిదో తెలిసి ...టకుఁ బ్రయత్నింపకపోవుట యపరాధ ...విచారింతునా? ఈవిషయముల వితర్కిం ...కొన్నకొలఁదిని నా దుఃఖ మభివర్ధిత మగు చుండె. నన్ను రూపాయతోఁ బట్టుకొనిన దొంగయనరా? నాకు దొఱకినది దాఁచు కొనుట నేరముకాదా? అట్లయిన నా కీనాణె మక్కరలేదు. దాని యధికారి నన్నడిగిన వెంటనే యాతని కియ్యది యొసంగుదు. కాని, యెవ్వ రది పోఁగొట్టుకొనిరో తెలియనప్పుడు దాని నెవ్వరి కందఁజేయుదును? ఈవిధముగా వితర్కించుకొనుచు రామస్వామి సదనము సమీపించితిని.

'ఎట్లయిన సొత్తు నాకడ నున్నంతే కాలము నా డెందమున కొక పెద్ద యినుప గుండు తగిలించినంత భారముగ నుండె. దుష్టధన వ్యామోహముచే నా కీ ఘోరపరితాపము. వంగిపోయి యరిగిన రాగిదమ్మిడి దొరకినప్పుడు కలిగిన యానందమున నర్థభాగమైన నిప్పుడు కలుగకపోవుట యద్భుతము. అదమ్మిడిని తోమి సుత్తెతో బహిరంగముగ నరిమొనరించితిని. 'ఆ పైస మా' దని యెవ్వరు ననలేదు; అందు రన్న భయమును లేకపోయె. నాతోడి వారా స్వల్పధనమునకే నాపయి నీర్ష్యఁగొనిరి. ఆహా! అప్పుడంతకే మహారాజ నైతి నని యెగిరిపడితి. ఇప్పుడో! యీ వెండిరూపాయ నా దృక్పథమునఁ బడకుండిన మేలయ్యెడిది! దీనివలన నాకానందము రాలేదు. సరిగదా లేనిపోని మనోవ్యాకులత్వ మబ్బినది. మఱల నా కెన్నఁడు నిది కనఁబడ

కుండ మాయ మెసరింతునా? యనుకొనుచు గమ్యస్థానముఁ జేరితిని.

౬

రామస్వామి గృహమున లేఁడని తెలిసికొని స్వగృహాభిముఖుఁడ నైతి. మాయింటి తోఁటచుట్టు నున్న కోరడిదగ్గరకు వచ్చితిని. నాకన్ను లొక యశ్వమునుఁ దోఁటలోఁ గాంచెను. ఆ కంభాణము గ్రామాధికారిది. నాగుండె నీరయిపోయినది. ఆ గుఱ్ఱమా యధికారిదికానిచో నాభయమునుఁగూర్చి విన్నవారెల్లరు నవ్వెదరు కాబోలు! ఆయనదనియే నాకుఁ దట్టినది. నాభయమే యింతకును హేతువు. అతఁడు రూపిక యావద్వృత్తాంతమును విని నన్ను గారాగారమునకుఁ గొంపోవుటకై వచ్చినాఁడని నాయుద్దేశము. నాగుండె తటతట కంతరాయములేదు. అది నిలిచిపోయి యుండునా కడకు? నా నడుము క్రుంగిపోవఁ జొచ్చె. కాళ్లు తొట్రుపడియె. మొగము తెల్లబారె. గుఱ్ఱము నిల్చియున్న పథము ప్రక్కనున్న పొదలలోఁ దాఁగుకొన వలెనని, యటకేగి, యంచలి ముండ్లకు నరకుచేయక, యొక పొదమాటున నగర్చుచుఁ బడిపోతిని.



అక్కడ నేను గడపినది స్వల్పకాలమే; అదియొక యుగముపలెనుండె. ఈకాలము లోనే గ్రామాధికారి వాజి నధిరోహించి వెడలిపోయె. అతని మాటల యలుకుడువలన నాతఁడు వెళ్లిపోవుచున్నాఁడని నేను గ్రహించి తొంగి చూచితిని. అతఁడు కనుచూపు మేర దాటి పోయినపిమ్మటఁ జెదరిపోయిన నా బుద్ధితునుకల నన్నిటిం బ్రోవుచేసితిని. ఇప్పుడుకాకున్న మఱొక్కింతసేపుండియైన లోపలికరుగక తప్పదు కావున నప్పుడే యట్లొనర్పఁదలఁచి, లేని ధైర్యమును దెచ్చుకొని, పొదవిడిచి బయటకు వచ్చి, బట్టలు దులుపుకొని, మెల్లఁగా లోని కరిగితిని.

బసివిరెడ్డి నాదెస కొక్కసూటి వీక్షణమును బ్రసరింపఁజేసె. 'ఒక్కసారి భూమి బ్రద్దలయి నన్ను మ్రింగివేసిన మేలుగ నుండుఁగదా శంకరా!' యని యూహించితి. నాపని యప్పటితోఁ జెల్లు; నన్ను గారాగారమున కంపును గాబోలు ననుకొంటి; కాని యట్టిజరుగలేదు. 'ఇంతయాలస్యమేల చేసితివిరా?' యని యతఁడు నన్ను నిందింపఁదొడఁగినప్పుడు నా యాశ్చర్య మేమ నందును? 'ఎందు కాలస్యమైనది?

ఎక్కడ నుంటివి యింతకాలము?' మొదలగు ప్రశ్నలవర్షము కురిపించెను కాని యొక్కదానికైన జవాబునకు వేచియుండ లేదతఁడు. నేను వాని కనుమును మినుమును జెప్పలేదు. దీనికేమి కారణము? ఈతిట్లుతిను నప్పుడు నే పొందునంతటి యానందము నా జన్మలో నేను పొందలేదు. అతఁడు రూపాయ సంగతిగాని, కారాగారము సంగతిగాని మాట్లాడలేదు. కనుక నింక నెన్ని తిట్టుకొన్న నేమి? యవి గాలికి పోవుననుకొనుచు నిలుచుంటి. అతని దూషణవాక్యములు నా శ్రోత్రములకు గానమువలె వినంబడె.

రెడ్డి తిట్టితిట్టి పొలములోఁ బనిసేయ నన్నుఁ బంపె. నా రూపాయ నా జేబులో నుంచుకొనియే దినమంతయుం బొలములోఁ గలుపు తీసితిని. నా విషయమయి యజమానుఁడేల యనుమానము పొందలేదని నా యాశ్చర్యము. నా పని నప్పుడప్పుడు నిలిపివేసి, జేబుతడుముకొని రూపాయయందున్నదని నిశ్చయించుకొన్ని, సంతసించుచుంటి. ఇంతటి దారుణమైన చిత్తక్షోభమునకుం గారణము రూపాయగదా! ఆ విషాద హేతువగు నాణెము పోయినచో నా విచారము పోవునా? కల్ల. అది యుండినను మనోవ్యాకులతయే! పోయినను మనోవ్యాకులతయే! నాకయ్యది లభింపకున్న మేలుగా నుండునని లక్షసారులు తలంచితిని. ఏ విధముగా నయ్యది పొట్లములో వచ్చుట దొరకినదో యావిధముగనే దానిని బొట్లము గట్టి యిచ్చుటనే విడువ నూహకలిగె. అప్పుడే, తమకు హక్కులేని ద్రవ్యము ప్రాప్తించి నప్పుడితరులు నావలె మనోవ్యథపాలగుదురా యను సంకోచమును గలిగె. ఈరీతిని పవలు వెళ్లఁబుచ్చి యింటికిఁ జేరితిని.

౭

సాయంకాలము బసివిరెడ్డి నన్నుఁ బిలిచి 'రామదాసు నింటికిపోయి రేపు పనిలోనికిరమ్మని జెప్పు' మని యానతిచ్చె. ఈ సారి నేనరుగునరికి రామస్వామి యింటనే యున్నాఁడు. 'రేపువచ్చి యజమానునితో మాట్లాడుదు నను వార్త' నాతనికిఁ దెలుపవలసినదిగా నా కానతిచ్చె.

తిరిగి యింటి దారి పట్టితిని. చీకటి. నా కింకొక హృదయవికార మంకురించినది. అది దొంగలభయ మను వేధ. ఏడేండ్లవాఁడను. ఇతరులు దొంగిలించు భయము పుట్టించుపాటివస్తువేదియు నా దగ్గర నిదివఱకెన్నఁడును లేదు. నేఁడో, నా గుండె బెదరున కంతములేదు. సాధారణముగా, వాతావరణ స్థితి యెట్లున్నను, నడచునప్పుడీలఁ గొట్టుకొనుచుండుట నా కలవాటు కాని యీ సాయంకాలమున నీలవేయ మనసు రాకుండె. కుతూహలములేదు. పైఁగా భయమొకటి ధాపురమయ్యె. దారి కిరుప్రక్కల నున్న పొదలఁ గని యులికిపడుచుంటి. వేయేల? నా నీడఁగని నేనడలిపోవుచుంటి. నాదని నేనిలుకుచుండిన వెండితునక నిజముగా నవ్వనిదో, కనుక దానిని నాయొద్దనుండి యేవిధముననైన లాగుకొనుట కెల్లరు నధికారులే కదా!

ఈ రీతి నాలోచించుచు మా సదన సింహద్వారము చేరువకు వచ్చునరికి మా జాగిలంబు మొఱుఁగఁదొడఁగె. అప్పుడు నా గుండె యించుక కుదుటబడియె. కాని, ఆ మొఱుఁగు నాకుఁ జాలసిగ్గును గల్గించె. నేటి వఱకు నా కాకుక్కయే స్నేహితుఁడు. అను దినమును దాని కింత యాహారము వేయు చుంటిని నేను. అన్నముం గాంచి తన కాకలి తీనట్లు బెట్టుసరి చేసిచేసి, నే లాలన చేసినం దనే, యా యాహారము దినఁ బ్రారంభించెడిది. ఈ దినమున నా కీ సంతాపకారణధనము సంప్రాప్తించుటచేతఁ గాఁబోలు దాని కాహార మిడుటయే మఱచితిని. నా నిర్లక్ష్యభావమును సరకుగొనక యది సంతోషముతో నేయున్నది. నేను నా రూపాయ నా జేబులోనున్నను మహాదుఃఖి నైతిని. అక్కటనఁ గుక్కను జూచి సిగ్గుపడి తలవంచుకొని తిన్నఁగా లోనికిఁబోయి లజ్జాదుఃఖప్రకంపిత హృదయముతోఁ గ్రమముగ సుషుప్త్యవస్థలో నున్న తస్థాయిఁ జేరితిని.

## ౨

మరునాఁడు యజమానుఁ డగు రెడ్డి భోజనముచేసి కూరుచుండెను. రామస్వామి వచ్చి యాతనితో మాట్లాడఁబోవుచుండెను. అతఁడు చాటున నున్నను నిజము చెప్పకొన వలెను. అతఁడు విశ్వాసపాత్రుఁడు. కుటుంబికుఁడు. పరపతి గలవాఁడు. అన్నమాటఁ దప్పనివాఁడు. అతనికిఁ బౌరులు నిర్ణీతభృతి నిచ్చుటయే కాక పనిముగిసినతోడనే పండ్లో, కాయలో, వస్త్రమో బహుమానముగా నిచ్చుచుందురు. అతఁడు వచ్చినతోడనే నేనును కాలమును సరిపెట్టుకొని మధ్యాహ్నభోజనమునకై వచ్చితిని. రూపాయపొట్లము నా దగ్గరనే యున్నది.

అప్పుడు మా కీసంభాషణ జరిగెను.

రా—అయ్యా! నాకుఁ దటస్థించిన నష్టమును గూర్చి మీరువింటిరా?

బ—నష్టమా?—నీకే? ఏది! ఏమది! చెప్పు!

రా—బాబూ! ఏమని చెప్పను. ఈ యుదంతము ఊరంతయు నెఱుఁగునని నా యభిప్రాయము. నిన్నరాత్రి నేను పని నుండి తిరిగివచ్చుచు మార్గమధ్యమున నా కూలి రూపాయ — పొట్లముఁ గట్టిన రూపాయ— వెండిరూపాయ— పారవేసికొంటిని.

* * * *

రూపాయ యన్నమాటతో నా ప్రాణము లెగసిపోయెను. ముఖమునఁ జేరిన రక్తము, నద్ధెనలఁ జిమ్మునా యేమి యన్నట్టులుండెను. బసివిరెడ్డి రామిస్వామివైపు చూచుచు నాతని మాటల శ్రద్ధతో వినుచుండుటచేత నావదన రక్తిమఁ గనలేదు.

* * * *

రా—కాగితములోఁ జుట్టి యయ్యది సురక్షితముగ నుండునని జేబులో నుంచుకొంటిని. ఎప్పుడో జేబులోనుండి యాపొట్లము జారి పడిపోయినది. కాగితమున నుంటచేత క్రిందపడినను రూపాయ చప్పుడుకాలేదు. ఎక్కడ పడినదో నా కెరుక లేదు; కాని యింటికిఁ బోయి జేబు తడుముకొనునరి కయ్యది లేదు. వచ్చినదారినే వెనుకకుఁ బోయి వెదకితిని. అయిన నది యలభ్యమయ్యె. అనేకులా త్రోవనే పోవుచుందురు

కావున నెవ్వరికో అది దొరకి యుండును.

బ—దొరకినవాఁడు సంగతి వెల్లడింపఁడా? అది నిజమైనయెడల నీపాటికి నలుగురి నోళ్లలోఁ బడదా?

*　　*　　*　　*

నేను నేలలోకి క్రుంగిపోవుచున్నట్లు నాకుఁ బొడగట్టె. ఈసంభాషణము నాకు వినశక్యము గాకుండె. నామనస్సులో నున్నది యున్నట్లు వెల్లడిచేసి చిత్తవ్యాకులంబును బాపుకొన నెంచితిని. రూపాయపొట్లము పైకితీసి వణకు చున్న వ్రేళ్లతో రామస్వామి కిచ్చితిని. ఇది



నీదేనా యంటి. నామాట నాకే వినఁబడనంత మందస్వరములోనుండె. అందుచేత, నదే ప్రశ్న మఱల నడిగితిని. నా చేతిలోనున్న పొట్లము విప్పి చూచుకొని రూపాయయు పొట్లపుఁ గాగితమును దనవే యనియుఁ బొట్లము మాత్రము తాఁ గట్టినట్లు లేదనియు నతఁ డనె.

నీ కిది యెట్లువచ్చెనని బసివిరెడ్డి నన్నుఁ బ్రశ్నించె. నేను బాష్పపూరితనేత్రములతో యావద్వృత్తాంతము స్పష్టముగా వెల్లడించితిని. నన్ను యజమానుఁ డింటనుండి తరిమివేయు ననుకొంటి; లేదా దండతాడనము నాకు సిద్ధించునని యెంచితిని. ఎట్లులైనను సరే; నిజముచెప్పితిగదా యన్న యనిర్వాచ్యానంద మపారమై నాభీతిని బారఁద్రోలెను.

బసివిరెడ్డి నన్నుఁ గొట్టుటకు మాఱుగ బుజ్జగించి యపూర్వకారుణ్యవృష్టి నాపైఁ గురియించె. 'ఋజుమార్గవర్తి వన్న నీవే' యని నన్నుఁ గొనియాడె అంత నా మనోభార మదృశ్యమైపోయె.

అంత రామస్వామి యానందముతో నన్ను గౌఁగిలించుకొని యా రూపాయలో సగము నాకీయ వాగ్దాన మొసఁగె. ఆమాటకే నియ్యకొనలేదు. వదలిపోయినదిరా ఈశ్వరాయని సంతసించిన నాకందు భాగమేల? రూపాయతో వచ్చిన యాధిబాధ నే నెఱుఁగనిదికాదు. ఇంకను అనుభవింపవలయునా? వలదు. వలదు. అట్లొసర్చినందు కేనెన్నఁడు విచారముఁ జెందలేదు.

*　　*　　*　　*

ఈ ప్రకారము తన చిన్ననాఁటికథ నీతిబోధకమైన కథ—బాలురకు వీరన్న చెప్పెను. ఈ వృత్తాంతమును వినిన గోపన్న తాత తనకు నేర్పిన శ్లోకమునే యప్పుడు పాడ నందఱును చలిమంటదగ్గరనుండి లేచిపోయిరి.

అర్థానామార్జనే దుఃఖం
ఆర్జితానాంచ రక్షణే;
రక్షితానాం వ్యయే దుఃఖం
కి మర్థం దుఃఖభాజనమ్.



# కేనోపనిషత్తు

కవిరాజు పల్లాది వేంకట విశ్వనాథ శర్మ గారు

## ప్రథమ ఖండము

శిష్యుఁడు

ఎవ్వనిచేతఁ బూన్పఁబడి
యీప్సితమందున వ్రాలు మానసం?
బెవ్వనిచేతఁ బూన్పఁబడి
యెద్దియు స్వకార్యచికీర్ష ప్రాణ? మిం
కెవ్వనిచేతఁ బూన్పఁబడి
యీపలుకుల్ బలుకుం జనంబు? తా
మెవ్వనిచేతఁ బూన్పబడి
యీక్షణమున్ శ్రుతియేపుమీరా తెఱుఁగ?

గురువు

శ్రోత్రమునకు శ్రోత్రము, మనస్సునకు మనసు,
వాక్కునకు వాక్కు, ప్రాణమ్ము ప్రాణమునకు,
దృష్టికిని దృష్టి యగుదానిఁ దెలిసి ధీరు
లధిగమింతురు మరణించి యమృతసిద్ధి.

పోవ దచటికిఁ జక్షువు, పోదు వాక్కు,
మనమునుం బోదు, తెలిసికో ననువుపడదు,
శిష్యునకు దాని నేరీతిఁ జెప్పవలెనొ
యెఱుఁగఁజాలక యున్నాము తెలివులేమి.

విదితావిదితములకు న
య్యది మీఁదై మఱియు నన్యమై తగునంచున్
విదితముచేసిన పూర్వుల
సదమలవాక్యమ్ము మాకు శరణంబయ్యెన్.

వాక్కుచేత నేది వఱలదు దీప్తమై
వాక్కు దేనిచేత వఱలు దీప్తి
నదియె బ్రహ్మమంచు నాత్మ నెఱుంగుము
ఎద్ది గొల్తు రద్ది కాదు కాదు.

మనసుచేత నేది తనరదు వ్యాప్తమై
మనసు దేనిచేతఁ దనరు వ్యాప్తి
నదియె బ్రహ్మమంచు నాత్మ నెఱుంగుము
ఏది గొల్తు రద్ది కాదు కాదు.

కనులచేత దేనిఁ గాంచ నశక్యంబు
కనులు దేనిచేతఁ గాంచఁగలవు
అదియె బ్రహ్మమంచు నాత్మ నెఱుంగుము
ఏది గొల్తు రద్ది కాదు కాదు.

శ్రోత్రములను నేది శ్రుతము కాకుండును
శ్రోత్రవితతి దేన శ్రుతినిఁ బడయు
నదియె బ్రహ్మమంచు నాత్మ నెఱుంగుము
ఏది గొల్తు రద్ది కాదు కాదు.

ఏది ప్రాణమునను గాదు సప్రాణము
ప్రాణమునకు నేది ప్రాణ మగును
అదియె బ్రహ్మమంచు నాత్మ నెఱుంగుము
ఏది గొల్తు రద్ది కాదు కాదు.

## ద్వితీయ ఖండము

ఇచటనో దేవతలయందో యెచటఁగాని
బ్రహ్మరూపము నెఱిఁగితి బాగుగనని

తలఁచితివయేని దెలిసిన దలఁపమె యగుఁ
దరిచి మఱియు విచారింపఁదగును నీవు.

శిష్యుఁడు

తెలిసితిని బాగుగ నటంచుఁ దలఁపఁ, దలఁపఁ
దెలియనని, తెలిసితినని తలఁతుఁ "దలఁపఁ
దెలియనని, తెలిసితినని తలఁతు" ననఁగఁ
దెలియువాఁడె మాలో దానిఁ దెలియువాఁడు.

వేదము

తెలియరా దనుకొనువాఁడె తెలియఁగలఁడు
తెలిసె ననుకొన్నవాఁ డది తెలియలేఁడు
జ్ఞానసంపూర్ణులకు నవిజ్ఞాత మదియు
జ్ఞానహీనుల కది సువిజ్ఞాత మగును.
అదియు నెప్పుడు ప్రతిబోధ విదితమగునొ
అపుడె విజ్ఞాతమై కూర్చు నమృతసిద్ధి,
బ్రహ్మవేత్తయుఁ బొందు వీర్యము తనంత,
విద్యచే మోక్షసంపత్తి వెలయఁగాంచు.
ఇచట నెఱిఁగితేని నచట సత్యముగద్దు
ఇచట నెఱుఁగకున్న నచట సున్న
సర్వభూతములను సమతపాటించి యనం
తముఁ గాంత్రు ధీరు లమృతసిద్ధి.

తృతీయ ఖండము

బ్రహ్మమె జయించె మున్ను దేవతలకొఱకు
తజ్జయమునఁ బొందిరి సమర్థతను సురలు
'ఈ జయము మాదె మాదెయౌ నీమహిమము'
అనుచుఁ దలపోసి రాత్మలందునను సురలు.

సురల మిథ్యేక్షణంబును జూచి బ్రహ్మ
మతులకధితిఁ బుట్టె దేవతలకొఱకు
'ఇదియెదో గొప్పభూతమహా! ఏమిది!' యని
తెలిసికొనలేకపోయెను దేవగణము.

'జాతవేద! ఏతన్మహాభూత మేదొ
తెలిసి రమ్మ'ని పంపిరి త్రిదశు లగ్ని.
'సరియెఁ గనుగొందు' నని యగ్ని సమ్మతించి
పరుగు పరుగునఁ దత్సమీపమున కరిగె.

అదియు వానిని గాంచి 'యెవరయ్య! నీవు
నెవ్వఁడవొ చెప్ప' మనుచుఁ బ్రశ్నించె మొదట
'అగ్నియన జాతవేదుఁడు ననఁగఁ బరగు
వాఁడ నే'నని యాతండు ప్రతివచించె.

'అంతవాఁడవు! నీదు సామర్థ్య మేమి
చెప్పుమా?' యనుచు వానిఁ బ్రశ్నించె మఱల.
'ఈ సమస్తము, ఈ పృథ్వి నెసఁగు నిన్ని
భస్మమొనరింతు' నని వాఁడు ప్రతివచించె.

'అయిన దహియింపుమీ దీని' నంచు నగ్ని
దేవుముందట నది యొక్క తృణము వైచె.
తృణముఁ దరిసియు నతఁడు దహింపలేక
క్రమ్మఱి 'యిదేదొ తెలియంగరాని' దనియె.

'మాతరిశ్వ! ఏతన్మహాభూత మేదొ
తెలిసిరమ్మ'ని వాయువుం ద్రిదశు లంప
'సరియె కనుగొందు'నని వాఁడు సమ్మతించి
పరుగు పరుగునఁ దత్సమీపమున కరిగె.

అదియు వానిని గాంచి 'యెవరయ్య! నీవు
నెవ్వఁడవొ చెప్ప'మనుచుఁ బ్రశ్నించె మొదట
'వాయువను మాతరిశ్వుఁడ వచ్చినాఁడ
భవదుపాంతమ్మునకు' నంచుఁ బ్రతి వచించె.

'అంతవాఁడవు! నీదు సామర్థ్య మేమి
చెప్పుమా?' యనుచు వానిఁ బ్రశ్నించె మఱల.
'ఈ సమస్తము ఈ పృథ్వి నెసఁగు నిన్ని
పట్టి గ్రహియింతు'నని వాఁడు ప్రతి వచించె.

'అయిన గ్రహింపుమీ దీని' నంచు వాయు
దేవుముందఱ నదిరయొక్క తృణము నైచె
తృణముఁ దరిసియు నతఁడు గ్రహింపలేక
క్రమ్మఱె, 'యి దేదొ తెలియంగరాని' దనియె.

'ఇంద్రుఁడా! ఈ మహాభూత మేదొ తెలిసి
రమ్మ'నుచు వారు మఘవుఁ గోరంగ నతఁడు
పరుగు పరుగునఁ దత్సమీపమున కరిగె
అది తిరోధానమయ్యె నాయయ్యనుండి.

ఆయాకాశమునను శో
భాయుత యైయున్న హైమవతి నుమఁ దరియం
బోయి మహాభూతం బిది
యేయది?' యని యడిగె నెడఁద నెనసిన
తమితోన్

## చతుర్థ ఖండము

'ఇదియె బ్రహ్మము ఇయ్యదియే జయింప
విపులసామర్థ్యమున మీరు వెలసినారు?'
అనుచు నాయుమ వచియింప నమరపతియు
'ఇదియె బ్రహ్మస్వరూప'మం చెఱుఁగఁగలిగె,

దాపునందున్న బ్రహ్మముఁ దాఁకు కతన
'ఇదియె బ్రహ్మ'మని మొదట నెఱుఁగు కతన
నగ్నియును వాయు వింద్రుఁడు నన్య సురుల
నతి తరించిరి మహిమచే నతితరముగ.

దాపునందున్న బ్రహ్మముఁ దాఁకు కతన
'ఇదియె బ్రహ్మమని మొదట నెఱుఁగు కతన
నందఱినిమించి యింద్రుఁడే యన్య సురుల
నతితరించెను మహిమచే నతితరముగ.

ఇదియె తదాదేశం 'బె
య్యదితి ధ్యానింపంగఁ దగిన దండరొ కన న
య్యది స్ఫురియించును మెఱుపటు
లది బ్రంగు నిమేషమున నెదయాశ్చర్యముగాన్.'

'మొదట గ్రహించిన రూపము
సదమలగతి విరతిలేక సంకల్పింపన్
బొదలును బ్రహ్మమునకు దది'
ఇది యధ్యాత్మోపదేశ మీడిత మరయన్.

ప్రాణు లెల్ల బొందనగునట్టి బ్రహ్మము
ప్రాణులెల్లఁ బొంది యలరునంచు
భావమునఁ దలఁచి యుపాసించు వానిని
ప్రాణులెల్లఁ గొల్చు బ్రహ్మము నటు.

'ఉపనిషద్రహస్యము చెప్పుమో మహాత్మ!'
అనుచు శిష్యుఁడు గురు వేఁడ ననియె గురుఁడు,
'ఉపనిషద్రహస్యమె యిప్పు డుక్తమయ్యె.
ఇపుడు చెప్పితి బ్రాహ్మి యన్నుపనిషత్తు.'

'దానికిఁ దపమ్ముఁ గర్మయు దమము నాది,
గలవి స్థితిహేతువు లటంచుఁ దెలియు మాత్మ
సాంగముగ నొప్పు వేదముల్ సత్యనిష్ఠ
అరయ దీనికి నిలయమౌ నాయతనము.'

'ఎవ్వఁ డీబ్రహ్మవిద్య నిట్లెఱుఁగఁ గలఁడొ
వాఁడు సంసార పాపముల్ వదలివైచి
యంతమెఱుఁగని శ్రేష్ఠమౌ సమ్మతపదవి
నధివసించును- తప్పక యధివసించు.






శంకరదీక్షితులు

౧

రెండు మాసముల క్రితము నాభార్యను బిడ్డను రాజమహేంద్రవరమునకు 18 మైళ్లదూరముననున్న పట్టిస మామె పుట్టింటి కంపియుంటిని. క్షేమవార్త మధ్య మధ్య నా గ్రామమునుండి వచ్చుచున్న రైతులవలన దెలియుచుండినను పోయి వారి నొకసారి చూచిరావలయునను నుద్దేశము మనస్సున జనించి నన్ను తొందరపెట్టుటచే పోయి వచ్చుటకు నిశ్చయించుకొని, శుక్రవారము మధ్యాహ్నము బయలుదేరు పడవలో బోవలయునని తీర్మానించుకొని, తహసీల్దారు గారి యొద్దకు బోయి నాకు సోమవారము మొదలు నాలుగుదినములు శెలవునిప్పింపవలయుననియు, మూడవశనివారము నాదివారమునుగూడ గ్రామమును విడిచిపోవుట కనుజ్ఞ నీయవలయుననియు వేడుకొంటిని. మాతహసీల్దారుడు కేవలము దయార్ద్రహృదయుడు కాకపోయినను, కఠినుడుమాత్రము కాడు. తాలూకా గుమాస్తా తన కెందఱు పిల్లలో యెఱుంగుటకైన నవకాశములేనంత పనిగలవాడని లోకములో ప్రతీతియున్నను మాతహసీల్దారుడుమాత్ర మంతకఠినముగా మాచే రాత్రింబగళ్లు పనిచేయించకుండుట కీనడుమనే చిన్నకారణము కలిగినది.

తహసీల్దారుడు, హెడ్డు గుమాస్తాతో సర్క్యూటు పోయినప్పు డొక గ్రామములో సత్రమున మకాముగా నుండిరట. ఒకనాటి మధ్యాహ్నము మూడుగంటలకు ప్రక్కగదిలో నాతడు నిద్రించుచున్న సమయమున హాలులో హెడ్డుగుమస్తా పనిమాచుకొనుచు కూర్చుండెనట! లోపలిగదిలో తహసీల్దారుని భార్య స్థూలదేహముచే వేసవితాపమును భరింపలేక, విసరుకొనుచు, తలుపువైచుకొని యుండెనట! అప్పుడొక కరణము హెడ్డు గుమాస్తానుజేరి కూర్చుండి కుశలమడుగుచు "అయ్యా తమ కెందఱుసంతానమని" ప్రశ్నించెనట! హెడ్డుగుమాస్తా (పేరెందుకులెండు) చమత్కారి, దేవాంతకుడు, మాటలతో పొట్టప్రక్కలగునట్లు చేయుగల విదూషకుడు, గొంతు సవరించుకొని ఈరీతిగా నారంభించినాడట!

"నాయనా! అడగరానిప్రశ్న నడిగినావు! తాలూకాగుమాస్తాయంటే ఏమనుకొన్నావు? చెప్పెదవినుము. సూర్యోదయ మింకను గాకుండగనే బయలుదేరి, యజ మానియొద్దకుపోయి, కాల్యకృత్యములకైనన తీరికలేకుండ 10 గంటలవఱకు నున్నపని లేనిపనియు జూచికొని, అపరాహ్ణని

…కేహముతడసియు తడియనట్లు నీరు గ్రుమ్మ…రుకొని, సంధ్యావార్చుట కైనను దీరిక లేకుండ నోటినిండ గ్రుక్కుకొని, తొడుగుకొనుచున్న కోటుతో చుట్టుకొనుచున్న తలపాగాతో పదునొకండుగంట లైపోవునేమో యను బెదరుతో పోయి, ఆఫీసులో పడి, రాత్రి పహారాజవాను బలవంతముగా దీపములార్పు…ఆ కుండి గాలి యనక, వాన యనక, యంధ… మనక, రాత్రి పదిదింటికో పండ్రెం…టికో యిల్లుచేరునరికి నిశ్శబ్దముగా నున్న…టిలో, ఏమూలనో గుర్రుపెట్టుచు…ంచుచున్న యిల్లాలిని, లేపుటకుగాని, …డిదినినదో లేదోయని విచారించుటకైన నోపికలేనిహేతువుచే, నింటనామె వండిపెట్టిన మెతుకులను నిద్రాపరవశుడై నోటియందు వైచికొనుచున్నాననుసమ్మకముతో క్రిందకు జారవిడచుచు, ఆపీటయొద్దనో, లేక సమీపమున నెచ్చటనో హస్తప్రక్షాళనమైన సరిగా జేసికొనక నిద్రించుట మాకు నిత్యవిధి. తిరిగి తెల్లవారకమునుపే, యధికారి యింటికేగవలయుగదా యను బెదురుతో సరిగా నిద్రకూడ బోవుటకవకాశములేని మాకు పిల్లల కవకాశమెక్కడిది? ఏవ్రతబలముననో, మరేకారణముననో సంతానముకలిగినను, చేసికొనిన భార్యగతినే విచారింప నవకాశములేని తాలూకాగుమాస్తాకు, వారలసంగతి దెలిసికొనుట కవకాశ మెక్కడిదినాయనా!" అని యింకను …సినమాట లాప్రక్క…సముచే నిటునటు…యిల్లాలు విసవిధిలేక పోయెను. తరువాత నామె పెనిమిటితో నేమి చెప్పెనో నాకు దెలియదుకాని, సాయంకాలమాయన హెడ్డుగుమాస్తానుబిలిచి, "శేషప్పా! ఏమిటి మధ్యాహ్న ముపన్యాసమిచ్చినావట? యని యడిగినాడట! "ఏదో సంసారతాపత్రయమండీ! కష్టసుఖములు చెప్పుకొనుచున్నాము" అని శేషప్ప బదులు చెప్పెనట. తిరిగి రాజమహేంద్రవరమున కరుదెంచినది మొదలు తహసీల్దారు "సాయంకాల మారుగంటలు దాటిన తర్వాతగాని, ఉదయము పదునొకండు గంటలకు బూర్వముకాని కచ్చేరియందు గుమాస్తా యెవ్వరు కన్పడినను జుల్మానావిధింపబడును" అని నోటీసును పంపించినాడు. నాటి నుండియు మా శేషప్పను "సంసారసంక్రందనుడు" అని మేము పిలిచెడివారము. ఆనాటి నుండియు మాతహసీల్దారుని కఠినత్వముకూడ మాటుపడుట కారంభించెను.

"అన్నిదినములు నీకు శలవిచ్చుటకు వీలు లేదు. ఒక్కసోమవారముమాత్రము 'రజా' నిచ్చెదను కావలసినచో ఆదినముననే, ఒంటిగంటకు పడవకుబోవచ్చును" అని. ప్రత్యుత్తరనిరోధకముగా యధికారిపలికినమాటలకు సంతసింపవలసివచ్చెను. భార్యాబిడ్డలను జూచి రావలయునని నేనుచెప్పియుండుటచే నాతడా దినమైనను శలవిచ్చి యుండెను. లేనిచో నాతడు వృధగా నెవ్వరిని శలవుదీసికొన నీయడు. వెనుక నొకదొర, తద్దినమని చెప్పిన తప్ప, గుమాస్తాలకు శలవియ్యకుండెనని చెప్పెడివారు. అందుచే వారు, ఉన్నట్టియు లేనట్టియు, గతించినట్టియు, జీవించినట్టియు బందు

గులపేర్లు చెప్పి, వారితద్దినమని ఆ "తద్దినాల దొర"యొద్ద శలవుదీసికొని పోవుచుండిరని ప్రతీతి. అదియొక్క పెద్దగాథ. తరువాత నెప్పుడైనను జెప్పెదనుకాని అదేవిధముగా, భార్యాబిడ్డలవిషయ మనినప్పుడు మాత్రము ఘాతహాసీల్దారు ఇంతవఱకెన్నడును శలవర్జీని వృథాపఱపలేదు.

ఆదినమున (శుక్రవారము) మధ్యాహ్న మాఫీసునుండి యొంటిగంటకు బయలుదేరి, యింటికివచ్చి, నాతల్లితో చెప్పి, పిల్లవానికి బజారులో మిఠాయినిగొని, రెండుగంటల లోపుగా పడవలరేవును జేరి, ముందుబయలు దేరనున్న పడవను కనుగొని యెక్కితిని. నేను నాయిల్లు దాటివచ్చునప్పుడుమాత్రము, వీథిలోని రాయియొకటి కాలిబొటనవ్రేలికి తగులుటచే నది యపశకునముకాదని నిశ్చయించికొని బయలుదేరితిని కాని, వ్రేలిబాధ మాత్రము మధ్యమధ్య నావిషయమును జ్ఞప్తికి దెచ్చుచుండెను. స్వల్పముగా వీచుచున్న పైరుగాలి సహాయమున మాపడవ బయలుదేరెను. దినమెల్ల బడలియుండుటచేతను, లోనికేగి, త్వరలో గాఢనిద్రామగ్నుడనై పోతిని.

సుమారు నాలుగుగంటలకు ఉక్క ఎక్కువగ నుండుటచేతను, ఎండతీవ్రతచేతను దేహమంతయు స్వేదమయమగుటచే, నిద్రనుండి మేల్కాంచి, పడవలోపలిభాగమునుండి పైతట్టుపైకరుదెంచి కూర్చుంటిని. సాయంకాలము కావచ్చినను, ఎండ నిప్పులజెఱుగుచుండెను. ముక్కురంధ్రములనుండి వేడిశ్వాస వెలువడుచుండెను. ఎచ్చట నొక్కయాకైనను
కుండుటచే, వాయుదేవుడు కూడ నిలిచి
యెను. ఆవేసవికాలమున నిట్టిలక్షణములు ప్రకృతియం దెట్టితీక్ష్ణతను గలుగజేయునో అందఱు నెఱింగినవిషయమే. పడవకళాసులు తెరచాపదించి అందినప్రదేశములయందు గడలసహాయమున పడవను ముందునకు సాగించుచుండిరి. రాజమహేంద్రవరమునుండి ఆరే
మైళ్లదూరము వచ్చియుండనోపునని మే
హించి, నడుమనడుమ, గోదావరినుండి
కము నంగవస్త్రసహాయమున చెంబు
పైకిదీసికొని త్రాగుచు, స్వేదరూపమున
నంతయు వెలికిగ్రక్కుచు, బహిరంతస్తాప
లచే నేనేకాకుండ, పడవలోనివారెల్లరును గూడ తహతహపడుచు, నీటిలో కూర్చుండినచో, శీతలముగానుండునేమో యని మేమనుకొంటిమి.

ప్రకృతి మాప్రార్థనల నాలించెను కాబోలును ఆకసమున నొకమూల చిన్న నల్లటి మచ్చవలె గన్పడుచుండిన ప్రకృతి సేవకుడుప్పొంగినట్లు కొంచెముకొంచెముగా నభివృద్ధి నొందుచుండెను. కళాసులు దానిని గమనించి "వచ్చెగాలిదుమారము— సుడిగాలివచ్చింది" అని కళవళపడుచు పడవను సుమారు నూటయేబదిగజముల దూరమున నున్న యొడ్డునకు జేర్చుటకై విశ్వప్రయత్నము జేయనారంభించిరి. తనస్వేచ్ఛాప్ర
చారమున కీతప్ప
రనికాబోలును, త
దేవుని సహాయము

మంతయు గప్పివైచెను. ఒడ్డును జేరగలమా లేదా అని, చీకాకుపడుచు, తటతట కొట్టుకొనుచున్న గుండెలతో దిగులుపడుచున్న ప్రయాణికుల ప్రశ్నకు సమాధానముగా కాబోలు "రంయి, రంయి"మను ధ్వనితో సుడిగాలి వీవ మొదలిడెను. పడవయొక్క తెరచాప నదివలకే దింపియుండుటచే కొంతవఱకు వాయుతాడనము మాకు మొదట బాధకరముగా గన్పడలేదు. అప్పటికి మే మొడ్డునకు సుమారేబదియిరువది గజముల దూరము వఱకు పడవలో చేరగల్గితిమి. గాలి విజృంభించెను. ఇటునటు నుయ్యాలవలె, పడవ, యూపబడుచుండెను. కళాసులు సర్వవిధముల బ్రయత్నించుచుండిరి. 'పట్టిసము వీరభద్రా! రక్షింపు'మని గోలపెట్టుచు ఏ నిమిషమున, పడవ తలక్రిందగునో యని భయముతో నిల్వబడియున్న ప్రయాణికుల'నున్న స్థలములనుండి కదలినచో పడవ తప్పక తలక్రిందగు'నని కొంచెము మోటుగా పడవవాండ్రదలించుచుండిరి. గాలితాకుడుచేతను, పడవవాండ్ర ప్రయత్నముచేతను, గట్టునకు ముప్పది గజముల దూరమువఱకు పడవపోగలిగెను. అప్పుడొక కళాసును,నొక ప్రయాణికుడును ధైర్యముదెచ్చికొని పడవత్రాటిని పట్టుకొని, గట్టున కీదుకొని పోయి, తమవెంట పడవను లాగుకొనవలయునను సంకల్పముతో నీటనురికి, గట్టున కేగుచుండిరి. కాని ఆగాలిలో నెంతవానికైన కన్నులను మూసికొని, ఎదురీదుట కష్టసాధ్యమే! వారింకను నొడ్డును జేరనేలేదు! ఇంతలో పడవ తెరచాపకొయ్య, ఆగాలి దెబ్బకు, "ఫుర్ర్"ని విఱిగి, "దబ్బ"ని క్రింద పడెను. ఆతొందరలో నిటునటు తప్పుకొనగల వారము తప్పుకొంటిమి కాని దురదృష్టవశమున నాకొయ్యపడుటలో నొకనిజబ్బపైబడి, వానిని పడవతట్టుపై పడద్రోసి, యొకముసలి యామె తలపైబడి క్షణములో తట్టంతయు రక్తమయమగునట్లు చేసెను. ఆముసలియామె, యాక్రందనమును, రక్తసిక్తమగు నాతట్టును జూచి నాగుండెలు "గుభిల్లు" మనెను. ఈ హడావిడిలో పడవ ఇటునటును భయంకరముగా నూగజొచ్చెను. "బ్రతికియుండిన బలుసాకైన దిని జీవింపవచ్చునని" తలంచి చిన్ననాడెప్పుడో పదిబారలదూర మీదినజ్ఞాపకము దెచ్చికొని, నేనును, నీటిలోని కురుక నిశ్చయించుకొని, పడవ పట్టిసమెప్పటికైన జేరినచో, నాసామానును జాగ్రత్తగా తేవలయునని కళాసులకు జెప్పి నీటిలోని కురికితిని. నీటిని తాకినంతనే నాకొడలంతయు జలదరించెను. చేతులార బుద్ధిపూర్వకముగా గంగాప్రవేశమైతిని!

ఏనా డీదినయాత! కాకినాడలో కాలువలో నెప్పుడో పదిబారలదూరము పదిమంది మిత్రులమధ్య ఈదనేర్చిన నాకీయఖండగోదావరిలో నొకబారయైనను పడకపోవుటలో నాశ్చర్యమేమున్నది! ఆజలరాశిని, ఆప్రకృతి భయానకరూపమును జూచి, గట్టుచేరగలనా యని నాకనుమాన ముదయించెను. ఆ యనుమానముతోడనే నీరసముకూడ బయలుదేరెను. పడవలోనే నిలిచియుండినచో నలుగురితోపాటే కాగలదనియు, నీవిషమావ

స్థను నేనే తెచ్చుకొంటిననియు, నిందించుకొనిన నేమిప్రయోజనము? ఎట్టులో పదిబారల దూరముపోవునరి కాయాస మారంభించెను. చేతులు లాగజొచ్చెను. ఒకసారి నీటిపై నిలువలేక, యొకగుక్కెడునీరుకూడ మ్రింగవలసివచ్చెను, "చచ్చె, బ్రాహ్మణుడు చచ్చె" నని పడవలోనివారి యాక్రోశము స్ఫుటముగా నాకు వినబడెను. ఇంతలో మొదటబయలుదేరినయిర్వురును నాయవస్థనుజూచి, తమ చేతియందున్న బలమైన పడవత్రాటినిపట్టుకొని నెమ్మదిగా రావలసినదని నాకు ప్రోత్సాహము గలుగజేయుచు నీటిపై యాత్రాటిని నాయొద్దకు జేర్చుటచే దానిని బట్టుకొని, బహుకష్టముతో నిక నొకరెండు బారలు వేయగల్గితిని, అప్పుడాయిద్దఱిలో కొంచెము బలవంతుడైన ప్రయాణికుడు తిరిగి నీటిలోనికురికి నాయొద్దకుజేరి, తా నొక చేతితో నీదుచు, రెండవచేతితో, నాకు నడుమనడుమ సహాయము జేయుచు, నాగాలిదుమారములో నన్నొట్టకేల కొడ్డున కీడ్వగలిగెను. గాలి యింకను తగ్గలేదు. నాలుగు నిమిషముల కాలము శ్రమదీర్చుకొని, పడవ నొడ్డునకీడ్చుటకు మేము ముగ్గురము నెంత ప్రయత్నించినను గాలిభారముచే, మాకది సాధ్యముకాక పోయెను. తుదకు విసిగి వేసరి, చేరువనున్న యొకతుమ్మచెట్టున కా త్రాటిని గట్టిగా బంధించితిమి. అరగంటవఱకు నాగాలి మరల లేదు. తరువాత నాలుగైదునిమిషములవఱకు చినుకులుపడి, తిరిగి ప్రకృతి నిర్మలమై పోయెను. గడలనుతెల్లగావాడి కళాసులుమాకుసహాయముచేయుటచే, ఈసారి పడవ నొడ్డునకీడ్వగలిగితిమి. కాని, పడవవాండ్రా రాత్రికి దాని నచ్చటనే కట్టియుంచెదమనియు, తిరిగిపైరుగాలి తిరిగినగాని, బయలుదేరమనియుచెప్పుటచే సమీపగ్రామస్థులిద్దఱు నాకు తోడువచ్చెద మనుటచే, నావస్తువులను పడవవాండ్ర కప్పజెప్పి, నాబిడ్డకై కొనిన మిఠాయిపొట్లమును దీసికొని, అచ్చట కింకను పట్టణము 11 మైళ్లున్నను, రాత్రి 10 లేక 11 గంటలకైన నిల్లుచేరగలనను నమ్మకముతో నీరసముగా నున్నను, భార్యాబిడ్డలను జూడవలెనను . నాత్రముతో బయలుదేరి, నడుమనడుమ కూర్చుండుచు, అర్ధరాత్రికి పట్టిన గ్రామసమీపమును జేరితిని. అచ్చట నాతోవచ్చిన ప్రయాణికులిర్వురును నాకు దారినిజూపించి, తమదారి నేగుటచే, నొంటిగా గ్రామమును బ్రవేశించి, తిన్నగా నామామగారియిల్లు జేరి, తలుపు దట్టితిని. అర్ధరాత్రమగుటచే కాబోలును నాకెవ్వరును బదులు పలుకకుండుటచే తిరిగి రెండుమూడు సారులు తలుపును గట్టిగతట్టి "తలుపు! తలుపు!" అని అరచితిని.

'ఎవరువారు? దూరముగానుండండి తలుపుదీసెదను" అని కాబోలును నిద్రాముద్రాంకితమైన యస్ఫుటనాదము విని "నేను- తలుపుతీయండి" అని తిరిగి హెచ్చరించితిని. ఆలోపలనుండి వచ్చినశబ్దము మాయత్తగారిమూలుగువలె నుండుటచే నేనీసారి సగౌరవముగా నంటిని. ఇంతలో నాపతివ్రత "తలుపు ముట్టుకొనకండి, తీస్తాను" అని సహజస్వరముతో, మేల్కొని తలుపుదీయుటకు లేచెను. తల్లి

కూతురుపిడ్డలు నోకేస్వరముగలవారని నేను మరచితిని. తలుపుదీసి కొంచెము వెనుకకొత్తిగిలి, "నన్నట్లువీథిలోనికి పోనీయుండి, మీరు లోపలకు బోవచ్చును" అనెను. ఇదివఱకున్న స్వల్ప ఉత్సాహము కూడ నింతటితో నశింపగా, నాయరుగుపై చతికిలబడితిని. నాభార్య యింటిలోనికి పోకూడదని గ్రహించుటయే నావిషాదమునకు గారణము; కాని నాకష్టము లంతటితో తీరలేదు.

"మంచిసమయమునకు వచ్చినారులెండు! ...న్నయుదయము, అమ్మయు నాన్నయు, ...నగరము పోయినారు, తాతయ్యమాత్ర ...టిలో నున్నాడు. నేనీసాయంకాలము బయ ...దేరితిని. గ్రామములో నింకొక బ్రాహ్మణుల యిల్లు లేదు కదా, ఎట్లుచేయవలెనని యను కొనుచున్నాను, తాతయ్యకు కండ్లు కనబడవు గదా గోదావరి నీరెట్లు"

"ఛీ, నోరుమూయుము. పాడుగోల నీవును!" అని నావిసుగుదలనంతయు వెల్లడించితిని. ఆమె నాకిప్పుడు చెప్పుచున్న దానికర్థమిది. "ఇంట వంటచేయుటకు దిక్కెవ్వరును లేనికాలమున, సమయమునకు నేను వచ్చితిని కదా, ఇక నామెకు భయములేదట. సోమవారమువఱకు వంటచేసి, నాభార్య బుతుస్నాతయైన మధ్యాహ్నమో, సాయంకాలమో బయలుదేరి నేను తిరిగి రాజమహేంద్రవరమునకు బయనమైపోవలయును కాబోలు" నను విసుగుచే నేనామె నదలించితిని కాని నాయవస్థ యంతయు వినినతర్వాత నామె పడిన సంతాప మింతింతకాదు. ఆసంతాపముతో నాయుదేవుడును, పడవవాండ్రును, అధికముగా తలపీయుని నాయధికారియు, నామె శాపాగ్నికి గురియైనను, నాకేమియానందము? ఆమూడుదినములును వంటరాని హేతువుచే నుడికియు నుడకనిపాకము భుజించుటచే గలిగిన కడుపుబాధతోడను, అలవాటులేనిసలత్వముచే కాలిన చేతిబాధతోడను, అచ్చటనే యవలంబింపవలసిన గంగాధరత్వముచే గలిగిన యొడలినొప్పులచేతను, కేవలమును కొంటెయగు నామూడేండ్ల ప్రాయము గల బిడ్డచేసెడు నల్లరివలనకలిగిన చీకాకుతోడను, అన్నింటికంటెను, నాప్రయాణము తుదకిట్లు పరిణమించెనుకదా యను నవమానముతోడను, నేను పడినయవస్థ శత్రువునకైన కొరరాదని నేననుకొనుచు, సోమవారమునాడు సాయంకాలము కొవ్వూరున కేర్పాటు చేసికొనిన యొంటెద్దుబండికై వీథియరుగుపై కనిపెట్టుకొనియున్న సమయమున, నేను తన చమత్కారమునకు మెచ్చుకొందునను నుద్దేశముకాబోలును, నాభార్య నాయొద్దకువచ్చి, "సమయమునకు దేవుడువలె వచ్చి ఈమూడుదినములు గడిపినారు—"అని ప్రారంభించెను.

"ఎవరినైన పంపి, సీతానగరమునుండి, నీతల్లిదండ్రులను పిలిపించి, సరిగా వారము దినములలో రాజమహేంద్రవరమునకు నీవు రాకపోయినచో ఇక నాసంగతి; తెలియునా?" అంటిని. ఆమెకు నవ్వువచ్చుచున్నను, పరాభవాగ్ని నన్ను పీడింపజొచ్చెను. కాని, ఈ పరాభవమున కామె నేల నిందింపవలెనని, నాలోనేను శాంతిబొందితిని. తిరిగి పడవపై బ్రయాణముజేయవలదని నాభార్య నిర్బంధించుటచేతనే, నేనాదినమున కొవ్వూరున కొంటెద్దుబండిపై బయలుదేరవలసి వచ్చెను. "కానరానికష్టములకు" గర్తలెవ్వరో, ఈనా కష్టములకుకూడ బాధ్యులువారేయని నాలో నేను తృప్తిబొందవలసి వచ్చెను.




అనిపెద్ది జగన్నాథశాస్త్రి గారు

కనులన్ సమ్మదబాష్పముల్ గురియఁగా గాత్రంబు రోమాంచముం
గనఁగాఁ జిత్తము పారవశ్యమునఁ దూఁగన్ గుత్తుకన్ గద్గద
స్వనమొప్పారఁగ నస్ఫుటంబులగు బాసల్ వల్కుచున్నాఁడ వె
వ్వనితోనో? వివరించి చెప్పు మిట భావంబిచ్చి, భక్తాగ్రణీ!

మ. చిరజీర్ణంబు, విశాలపత్రశతసజ్జీభూత, ముద్యద్ఘుణా
ఙ్కురముం, జందనపంకసిక్త పటురక్షాపత్రమున్, యుష్మ దా
దరపాత్రంబు, హృదంతరస్థితకరాంతస్థంబు, శ్రీరుక్మిణీ
వరచిత్రాన్విత, మద్ది భాగవతమా? భాషింపు భక్తాగ్రణీ!

మ. తగుకాలంబుల నిత్యకర్మముల నిద్ధశ్రద్ధ గావించుచున్
సగుణబ్రహ్మముఁ బార్థసారథిని బూజల్ సేయుచున్, రజ్జ స
ర్పగతిన్, దేహ మనాత్మనాఁ గనుచు వైరాగ్యంబుఁ, బూర్ణంబుగా
భగవద్గీత పఠించినాఁడ వని నే భావింతు, భక్తాగ్రణీ!

శా. నీచిత్తంబునఁ దోఁచురూప మది వర్ణింపంగనౌ నేని నీ
ధీచాతుర్యముఁ జూపి చెప్పు మది యేదీ? బర్హచూడంబొ? సీ
తాచేతోహరమో? సుధాకర కళోత్తంసంబొ? మూర్తిత్రయ
ప్రాచుర్యావసథంబొ? ముక్తజనతాభావ్యంబొ? భక్తాగ్రణీ!

మ. తులసీమాలలు కంఠభాగమున ముద్దుల్ గుల్కు, హస్తాబ్జముం
గళతాళధ్వని మిన్నుముట్టఁ బద యుగ్మం బంటి సత్కింకిణీ
కలనాదంబు సెలంగ, నృత్యమును వేడ్కం జేయుచున్, మాధులన్
దలలన్ ద్రిప్పఁగఁ జేయఁ జాలితివి జోతల్ నీకు భక్తాగ్రణీ!




కొత్తపల్లి సూర్యారావు గారు

మహాపతివ్రతలకు నమస్కారము. అసూయ లేని తల్లులకు దండములు. గర్వరహితలైన [...]లకు మ్రొక్కులు. శాంతస్వభావముగల మాత[...]జోతలు. ఏ ముగ్గురు తల్లుల దయ లేకున్నఁ బ్రపం[చ]ములోనివారు తలయెత్తుటకు పలుమపడరో వారికి సాష్టాంగములు. ఏ పురుషుఁడు రాకున్న లోకములోని కథలకు గాథలకు మొదలుగాని తుదగాని దొరకదో వారికి మోడ్పుఁగేలు. సకలకల్మషములను దొలఁగించు గంగాదేవికి వందనములు. తలయెత్తి గగనముమీఁదికి రెండుచేతులు జాఁచి జయజయధ్వానము చేసితిమా వైకుంఠమును భత్యలోకమును మనస్తోత్రములు చేరినట్లు వెంటనే ప్రత్యుత్తరమిచ్చు తంత్రీమార్గము ఖేచరవాణికి స్తుతి కదంబము. లోకులకు భక్తి కుదురుటకును, గర్వము తొలఁగుటకును, మంచిపేరు గడించుటకును, మహాత్ముల మహిమముఁ దెలిసికొనుటకును లోకజ్ఞానము సంపాదించుటకును, దోషములు నశించుటకును, సన్మార్గమున బుద్ధి నిలుచుటకును బుద్ధిశాలులైన మన పెద్దలు బహుకాలము క్రిందటనే విశేషముగాఁ బ్రసంగవశమునఁ గథలక్రిందఁ గొండలచారిత్రములు వ్రాసిపెట్టిరి. అట్టివానిలో నేను చిన్నమొన్న నొక్కచో నొక్కకథ విని నా చెల్లెండ్రకు వినిపింపుచున్నాఁడను. ఒక్కసారి చదివినంతనే తెలియునంత తేటగా నున్నది. నా వ్రాఁతలోనే కాని కథలోఁ దికమకలు లేవు. విషమసంధులు లేవు. సందేహములకు సందు లేదు. నా చెల్లి వన్నె విడువలేదు. సహోదరీతిలకములార! దినదినమును దీనిని జరించి నా చెల్లి ఛేదిరా కనుఁగొంటిరా కొన్ని దినములకు నాకు సంతోషము గలుగును. నిర్మల హృదయములతో నా వ్రాఁతలను జదివి పరీక్షించిన నా మేనగోడండ్రనుఁ గొన్ని రహస్యములు మీరు తెల్పఁగలరు. కథ చెప్పెదను వినుండు.

అగ్గికిఁ జెదపట్టునా! పట్టినదని చెప్పుకొనుచున్నారు. ఒకప్పుడుఁ దనలో దిగి మునిఁగిన వారి పాపములను బటాపంచలు చేయు గంగాదేవిని మనము విడిచిపెట్టిన పాపములన్నియు మొత్తమై "చూచితిరా బుద్ధిలేని నరులకు బుద్ధివచ్చుటకై మనము పట్టుకొని వారిని బాధింపుమంద సహింపక గంగ మనదారికడ్డు వచ్చుచున్నది. కాఁబట్టి దీనినెట్లయినఁ గష్టపెట్టవలయును. అర్జునుని సంశప్తకులు చుట్టుకొన్నట్లులు దీపము మీఁదికి దివ్వారుపుఁ బుర్వులు ముసరికొనునట్లు చుట్టఁబెట్టుకొని యెవ్వరికిని లొంగక గంగను గలఁత పెట్టుటకంటె వేఱుమార్గము మనకుఁ బగతీర్చికొనుటకు లేదు." అని గూడుపుఠాణీ చేసినవి. చూచితిరా దుర్మార్గుల లక్షణములు. లోకుల కష్టములను దొలఁగింపఁజూచు భాగీరథీ ప్రయత్నము హానికి పరిపడ లేదు. పట్టుపట్టుమని నడుము గట్టినవి. వానిశరీరములు మసిబొగ్గులకు గురువులు. నీలమేఘములకుఁ దాతలు. కంబళి పురుగులకు మూలకుంపలు. మిడిగ్రుడ్లు, పండ్లు కుబుచచేతులు, తుప్పతలలు, దో[...] దోసకడుపులు, తొంటకాళ్లు తేలుకొండుల[...] చాలు, చిరాకుగా మీకు భయము పుట్టు[...] పెట్టెదను. ఇట్టిదరిద్రవర్ణనలపై [...] వారికై నవలలు నేడు తే[...]

...శ్యము చెప్పెదను. ఇప్పు డిట్టి వర్ణన
...చి. ముఖము పద్మమును బోలునని
...ఖములో రేకులున్నవా, కింజల్కములున్న
...ద్దిలున్నవా, పరాగమున్నదా, సరియైన పోలికి
...ను. స్వభావముగా వర్ణించుటచేతగాదు. చూడుఁడు యా
మినీతిలకలో - జగదేకసుందరిని శోకపాలుఁడు వర్ణించి
నాఁడు. ఆమెముఖము చూడఁగనే దుఃఖహృదయులకు
దుఃఖముపుట్టును. సంతోషముగా నున్నవారికి మఱింత
సంతోషము కలుగును. ఏడ్చుచున్నవారు చూచిరేని
రేడ్చుచున్నట్లే కనఁబడును. దుఃఖమునకుఁ జెల్లెలు.
సుఖమునకు తోఁడబుట్టు. ఆనందమునకు వేలువిత్తు.
ఆహా! యిట్లుండవలదాయని యిప్పటికవులు పూర్వు
లను దగడుదురు. పోనిండు మనము వీరిని దగడ నేల.
ఎవ్వరికిష్టములైన గ్రంథములు వారిని జదువనిండు.
పాపములు గంగను జుట్టుకొన్నవి. పైఁబడలేవు. వెంబ
డించను. ముట్టుకొనలేవు. తొలఁగిపోవును, గిల్లఁజా
లును, అక్కఁడలమను. కొలకఁగడలగను. ముందువడ
చుటకుఁ గాలాడునంతస్థలమీయవు. చేయి విదుచుకొను
టకు జేనెఁడు, లొడితెఁడు, జెత్తెఁడు సందుండనీయక
క్రిక్కిఱిసి, నేఁడుగాదు, నెలగాదు, సంవత్సరము
గాదు యుగములకొలఁది బాధింపఁజొచ్చెనవి. మనకుఁ
గష్టముల నడుమ రెండుదినములు వాసుకరైనదా సహిం
చి వానిలో మెలఁగఁగలము. గంగకు మాత్రము పాప
ముల నడుమ నెన్నివాళ్లుండినను ప్రాంతముకాలేదు.
కొన్నినాళ్లు పాపముచేసిన వారు వీరగురురన్న
సామ్యము గంగయొద్ద వర్థిల్లెనది. పాపము! పాపము
లొక్కసారిగాఁ గఱచుటకు నోరు దెఱచినఁ గంగ
కన్నులు మూసికొనును. బరువుటకు నోళ్లువిప్పి మొగము
మీఁదికిఁ జేతులెత్తినఁ రెండుచేతులు మోముపైఁగప్పు
కొనును. సాధనములు చెదరినది. పెరటిచెట్టు మందు
కురాదు. తాను సరస్వతిలోనో యమునలోనో మునిఁ
...పాపములు తొలఁగునా యని తలఁచెను. ఏపుట్ట
...ముమున్నదోయని తానెఱింగియున్న సమస్త
...కు చాటిపడియలలో - మునిఁగినది.
...కొన్నదిగాని తగ్గలేదు. ఎక్కడి
...కము చూచుకొనవలయును.

డొల్లపెట్టెల మేఁకలూడఁదీయు కాలునకుఁ దనమేఁ
కూడఁదీసికొనుట కింకొకకాలు కావలయును. అందఱ
పాపములను బోగొట్టు దాననైనను నాపాపములను
బోఁగొట్టుట కింకొరిసహాయము కావలసివచ్చెనది. అట్టి
మహాత్ముఁడెవ్వఁడు? పరమేశ్వరుఁడు గాక మఱి యె
వ్వఁడు? గంగ యోజించినది. ఈపనికి మగవారి దాఁకఁ
బోవలయునా. ఆఁడువారి బాధ లాఁడువారే తొల
గించుకొనుటకై - స్త్రీలవైద్యశాలలు, స్త్రీలపాఠ
శాలలు, స్త్రీలసభలు, స్త్రీలకు స్త్రీలే-ఆహా! భూలోక
మా! మూఁడు లోకములకు నీవు మధ్యవర్తివి. మగ
వారికంటెఁ బ్రతికార్యమునకు స్త్రీలే ముందు - ఆఁడువా...
చేయఁబూనని పని లేదు. ఉద్యోగము మొదలు యు...
మునకు - సపరికరము, సాయుధము, సవాహ...
సపతికము, సపుత్ర పరివారము. ఓ స్త్రీ సమాజ...
వచ్చుచున్నదానను. అయ్యో! పరమేశ్వరుని గా...
యుబలల వేఁడుట యేల? ఉండనీ, యెప్పటికైనఁ బని
వచ్చును. మనముగులలను వేయేండ్లు వర్థిల్లనిమ్ము. నిస్సందే
హముయిన స్థలమునకుఁబోయి త్వరలోఁ గుదుర్చుకొనక-
అసునాకాదా! ఏమో! అనుసంధేహస్థలమున కిపుడువల
దు. ఇట్లని తనలోనిలోపములను దలఁచుకొని- భగవం
తుని వైపునకే మరలినది; దేవా నాపాపములను బోగొ
ట్టుము. నీ సెలవుపై నేను పాపుల పాపములను దొల
గించు నుద్యోగములో గుదిరితిని. పలువురికై చేసిన మేలు
మందు తనకుఁ బనికిరాకపోయిన నతని వైద్యమేమిపనికి
వచ్చుకాఁకరకాయను జక్కఁగాపండి యందఱకుఁ బెట్టు
వంటవాఁడు దానిందినఁజాలఁడు. ఓ పరమేశ్వరా!
నన్నుఁగాంచి లోకులు నవ్వకుండఁ గాపాడుము. ఎప్పు
డుదీపము సన్నగిల్లునా! యెప్పుడు చుట్టఁబెట్టుకొందు
మా యని దీపస్తంభము నాశ్రయించుకొన్న చీకటుల
వలె నన్నాశ్రయించుకొన్న పాపములు నానాశమును
గోరుచున్నవి. కల్లుద్రాగిన వారి చేతిలోని బిడ్డవలె
నున్నదానను. అలజడి యెక్కువయినది. కలుగుండు పడు
చుంటిని. పంకమగ్నను నన్ను లేవదీయుము. దుఃఖప్రవా
హమునుండి నన్ను దరిఁజేర్పుము. అని పరిపరివిధముల
దేవుని వేఁడికొనినది. రాజుగారికివ్రాసికొన్న ప్రార్థనా
పత్రమునకు ముఖ్యమంత్రి యొద్దనుండి ప్రత్యుత్తరము

వచ్చినట్లు జగదీశ్వరునకుఁ జేసికొన్న వేడికోళ్లకు గగన సరస్వతినుండి యీక్రిందిరీతిని ప్రత్యుత్తరమువచ్చినది.

"ఓ గంగాదేవి! వినుము. నీయాపదలు కొంత రముచేయవు. త్రేలుపైఁ గొండయై తిన కృష్ణుఁడు నల్ల యాకులోఁ జేరినాఁడు. కాలగతిఁ దప్పించుకొనుటకు వశముగాదు. లోకుల పాపములన్నియు నిన్ను గాప వరపు తీఁడివలెఁ బట్టుకొన్నవి. నీది దీర్ఘ జాడ్యము. కాలమునుబట్టి స్త్రీలకు వైద్యము స్త్రీలే చేయవల యును. సందికట్టుగల వైద్యురాండ్రను వెదకుము. పట్ట ణములోని వైద్యము పనిచేయకున్నఁ, బల్లెలలోఁబడి నీరు గాలి మార్చికొనుము. మందులు మాత్రలు నీరోగము గుదుర్పఁజాలవు. ఏవేరో వల్లంకో రస ప్రయోగ మంత్రపు నీరో చేర్చిన సిద్ధురాలిని సేవింపుము. తిరుగుము. కర్మ పరిపక్వము కావలయును. ఏనీవువైద్యుఁడుగాని నవజ్వర పక్వముగాఁదగిన రోగిని సాయంకాలమునకు లేవఁదీసి కూర్చుండఁ బెట్టలేఁడు. రోగము రొట్టునీయును. అతి గర్వముగల దుష్టకవివలె నీకర్థముగాకుండ మాటలాడు చున్నదాననేమో, అచ్చతెనుఁగుగాఁ జెప్పెదను వినుము. కలలోనైనను ఖరీదుచేయముగాఁ దన పెనిమిటి కెదురాడక తలలో నాల్కవలెఁ బూసలలో దారమువలెఁ దోడునీడవలెఁ ద్రాడుతో దప్పనమువలెఁ జరించు పతి వ్రతను వెదకుము. పతివ్రతయను మాటకర్థము, పతివ్ర తకు నీకుఁ దెల్పనక్కఱలేదు. కావలయునేని వేరొక చోటఁ దెల్పెదను. అట్టి యిల్లాలివలన నీకష్టములు నష్ట మగును. కొప్పుపెట్టినదెల్లఁ బప్పువండఁజాలదు. బల్లగట్టి నంతనే బ్రతుసిపోదుము." అని మాటలు చాలించిన యాకాశవాణికి మ్రొక్కి నాకు మేలుచేయుట కేపతి వ్రతకడకుఁ బోవుదునాయని గంగ చింతించినది. పతి వ్రతను గుర్తించుట యెట్లు? ఏమైనఁ బక్షులా, పారితోషి కములా? నేను పతివ్రతనని, పెద్దపెద్దలిచ్చిన యోగ్యతా పత్రములున్నవని ప్రకటించుకొందురా? ఇండ్లపైఁ జేసుబల్ల లుంచుదురా? లేకున్న వారి ప్రసిద్ధికి లోపము కలుగునా? మహాపతివ్రతలు యాకులలోని పిందెవలె నడఁగి మడఁగియుండును. కన్ను లేనివారే గాజుకన్నుఁ బెట్టుకొని కన్నుగలవారివలె మెలఁగుదురు. పద్మాక్షీ విశాలాక్షీ యని పేరులు పెట్టుకొందురు. తప్పుసాక్ష్యములు వ్రాయు వారికి శతావధానుల శిష్యత్వము నిర్ధారణచేసికొన నవసరముకలుగును. కలియుగములోవలె నిప్పుడేమైన వృత్తాంతపత్రికలున్న, నీ మాఘ్యకీయు విశేషభరితారేము ఖ్యాగమనింపఁ, ఒక్కయూరిలో నొకస్త్రీ - రాత్రిపడిన కొవ్వరికిఁ గనఁబడదు. తెల్లవారకుండ నొరులకంటఁ బడకుండ నీళ్లుతేరను. ఆ నేను లీకై యత్నము చేయుచున్నారట యని తెలియఁబరచును. అదియును లేదు. అటుకుండి వంటికి కొనిరమ్మని వారు. ముందుగాఁ కైలాసమునకుఁ జని పార్వతిని దర్శించెదను. పతియని యాతల్లి కన్వర్థనామము. సర్వమంగళ, పెట్టకున్నఁబో యొఁ? సెకైకు చోటైనఁజాలును. ఎల్లలోకముల స్త్రీలు ను వచ్చుచుఁ బోవుచుందురు. ఆయమ్మకొలఁవుకూటము వార్తాపత్రికవంటిదియగును. కొంతవృత్తాంతము తెలిసి కొనవచ్చునని గంగమ్మ వెండికొండకుఁ బ్రయాణమైనది.



రజతగిరిమీదికి ..గంగ...ఎగురెక్కుచే తొట్రుపడినది.

రజితగిరి మీఁదికి మిక్కిలి కష్టముతోఁ గంగ యెక్కినది. ఎదు రెక్కలేక తొట్రుపడినది. జాతిబండలలో కొర్లు గింకలు పెట్టి పలువనై చక్కనివారికిఁ జిక్కుటయు. పాగసే యనిపించినది. నేను గొప్పదానను, నాతండ్రి ధనవంతుఁడు, మావంశమువరకుఁ గావలసినంత ప్రసిద్ధి కీర్తియునుగలవు. మేము శ్రీమంతులము అని పొంగుటకు సమయముగాదు. కార్యము సాధించుకొనఁదలఁచినవారికిఁ ద్రుళ్లిపాటుతగదు. వినయగుణము మంచిది. ఎట్లో యెక్కినది. 'అక్కా యమ్మా!' అని యొక్కకేక పెట్టినది. గౌరిదేవియుండు మేడ కుమ్మముకడకుఁ జనినది. ఒక్కముసలి ముత్తైదువవచ్చి, 'అమ్మా! ఏవో పండుగులంట. నిన్ననే వైకుంఠములోనికి వెళ్లినారు. కొన్ని దినములక్కడఁ గడుపుదురు.' అని మనవి చేసినది. "కార్యార్థినః కుతో గర్వః." కార్యము కావలసినవాఁడు గర్వింపరాదు. సరియే పోయివచ్చెదను. మన పనిగాని వానిపనిగాదు. పోనీ తిరిగివచ్చి నపుడు చూడరాదా. ఏయుత్సవమో, నన్నుఁ బిలువలేదు. ఇతర సమయము లందువలెఁ బంధుగులలోఁగూడఁ బిలువకుండఁ బోవుట చిన్నతనము. పిలువని పేరంటము, పేయని విస్తరి. కాని, పార్వతిబసలోనికి మాత్రము వెళ్లి తిరిగివత్తునా. ఎవ్వరైన నారాకఁ దెల్పిరా, 'పద్దుమాడుము. శుభలేఖపంపలేదు! కానిమ్ము, ఇప్పుడొక లేఖవ్రాసి పంపుము. మీకు లేఖ పంపినాము, మీరిక్కడికివచ్చినారు, అది యక్కడను వెళ్లినది' యని పొందుదురు. మెరమెచ్చుల చుట్టఱికములు నాకు నచ్చవు. పిలువకున్న నేమి? పుట్టినిల్లు, తండ్రి పాదదర్శనము చేసిరావచ్చును. ఒకవేళ దాక్షాయణి 'యిట్టిపను లేకూడదు,పిలువని తావునకేలవచ్చితి'వని, అనుభవమునుబట్టి కూకలు పెట్టునేమో. కూఁతును మఱచిన తండ్రి, యెంత తొందరపనిలో నుండునో. దానికిఁ గాదు. పదిమంది చేరుదురు. నాపరితాపము తీఱుటకు దారి దొరకునేమో గుడగకొమ్ముల సందేహము తీర్చుకొనుటకు. ఇట్లని గంగ పరిపరి విధముల వితర్కించినది. చివరకు వెళ్లుటకే నిశ్చయించినది. వైకుంఠమునకుఁబోయినది. తిన్నగా గౌరిదేవి బసలోనికి కిక్కురు మనకుండ నేగినది. చల్లచల్లగ నమస్కరించినది.

గౌరి— నీకప్పుడందినది. నీవు నాకంటె ముందే వచ్చియుందువని తలఁచి పిలువకుండ వచ్చితిని. లేకున్న నిన్నుఁ బిలిచియుందును.

గంగ— నే నేమియు నెఱుఁగను. మీయింటి యొద్దఁ దెలిసినది.

గౌరి— నాకు రావలయునని లేదు. క్రొత్తగా రవ్వల ముక్కఱ చేయించుకొంటిని; ప్రాఁతవి చిల్లరమల్లరలు కరఁగించి యేదో పెద్ద వస్తువు చేయించుకొంటిని; ఏవో కొంటిని. వానిని ధరించువాఁటికి మీరు రావలయును. పూజకుఁ బిల్లవాని నొక్కనిఁ బంపి యూరకుండవలదు. అని నిష్ఠురముగా, నిర్బంధముగా, వేడుకగా వ్రాసినారు. మీ బావలేరు.

గంగ— జట్టు విడిపోయినారు. ఆయన కెక్కడ ప్రమాణ! మీరిద్దఱుఁగలసియే వచ్చిరనికొంటిని. (తనలో) ఈమె పతివ్రతల పద్దులో మొదటిది. పతిని విడిచి-

గౌరి:— ఎక్కడనో లక్షపత్రి పూజలు, సహస్రఘటాభిషేకములు.

గంగ— పోనీ, యీకఅవుదినములలో నింటఁ గూర్చుండినఁ బొట్టగడవదు. ఉరిగి రానిమ్ము.

గౌరి— పిలువ లేనట్లున్నది. పిలువనిదే యేలవచ్చితివి?

గంగ— నీయొద్దకు రావలసి, అని చెవిలోఁ జెప్పను. గంగ పలుకులు గౌరిచెవిని బడినవి. గడుసరి. నేను సుప్రసిద్ధురాలనే, లక్ష్మితోఁ జెప్పి యేమైనఁ జేయఁగలదేమో చూచెదను. నేను పతివ్రతనని గర్వముగలది. అని లక్ష్మికడకుఁ దీసికొని పోయినది.

గంగనుజూచి లక్ష్మి 'మీనాయన నీకుఁ దల్లికంటె మిక్కిలి దగ్గఱవాఁడు. ప్రేముండఁబట్టునా. పిలువఁగానే వచ్చితివి. చాలసంతోషము.' అనినది. గంగకు దింకర్తైనది. ఇదియేమిటి, నే ననుకొన్నదే. అని లోలోన నవ్వుకొని 'నేనొక్కచోట నుందునా, పిలుపు నాకందలేదు.' అని పలికినది. లక్ష్మి తనలో "పట్టి పిలుపులందవు. ఏయూరిక్కలోఁ బంపినపు డందును." 'నేనిపుడేమియన్నను నాకు గజ్జెలపట్టెడ చేయింపలేవని కోపముచే ననుచున్నట్లు తలంతురు. కొందఱున్నారు. తాము చీర

గంగ — నీకడుపుచల్లగ, వీరిని మనచేతిలోనివా రిని- ఇట్లు జగద్విదిత ప్రభావముగలవారిని చేసుకొం దము. ఎవ్వరివలనఁ బ్రస్తుతకార్యము జరుగునో తెల్పుము.

ముగ్గురుతల్లులును కేలు లెత్తి-'ఇంకొక్కఁడున్నారు- ముందు మామీఁద వైరమెత్తి పుట్టవలయును.'

నార — అక్కఱలేదు- సిద్ధముగా నున్నది.

గంగ — ఎవ్వ రామె?

ముగ్గురమ్మలు — ఊఁ; పట్టిమాట మేము వినకుండ నున్నామా?

నార — మీవలె మిద్దెలమీఁద మేఁడలమీఁద దిరుగునదైన మీకుఁ దెలిసియుండును.

ముగ్గురు- ఎవ్వరయ్యా! అంత కూరలుదిని నారలు గట్టి యడవులు పట్టియున్న పతివ్రత?

నార — అమ్మలారా! భూలోకములో.

ముగ్గురు — ఆ! మనుష్య స్త్రీలలో?

నార — అవునమ్మలార! భూలోకములో- మనుష్యస్త్రీలలో-'దుంపలు, తూండ్లు దిని యడవులవెంటఁ దిరుగుచున్నది. అత్రిముని యిల్లాలు! అనసూయ' మహా పతివ్రత!

ముగ్గురు — (తమలో) అనసూయ తెలుఁగ కేమి! రామాయణములో వచ్చినది.

నార — అవును, అనసూయ.

ముగ్గురు — సీతకు నలుఁగుఁబిండి, తెలుఁగు బిళ్లలు చేసి యిచ్చినది.

నార — ఆమెయే- ఆమెయే- అత్రిరుషుల వో మ్మవలె మీకుఁ దోఁచుచున్నది. రాక్షసాంఘాకరణమును కడియ మిచ్చినది యామెయే.

ముగ్గురు — ఎఱుఁగుదుము. చెప్ప నక్కఱలేదు. జానకీ పరిణయ నాటకములో.

నార — మీ రెఱుఁగ కేమి. నన్ను క్షమింపుఁడు.

ముగ్గురు — మంచిది- నీవు నడుమఁ ద్రోపుడుగాఁ కలవుగదా! మంచిది, మానవమాత్రి మాచేతఁ బని చేయఁగలదని నీవు తలఁచుచున్న వాఁడవు- యింపుము.

నార — అందుకే క్షమింపుఁడని కోరితిని. మిమ్ము గాదని యెన్నఁడును గాదు. మీరూరకుండుఁడు- మీరీ పనికి రావలదని మొదటనే యంటిని.

ముగ్గురు — కానిమ్ము; ఏమట్టిపిల్లగాని, ప్రాణి పిల్లగాని యెలుకను బట్టుట ముఖ్యము. దీని పర్యవ సానము మాకుఁ దెల్పెదవుగదా!

నార — మీకుఁ గోపమువచ్చి నట్లున్నదే.

ముగ్గురు — లేదు, లేదు.

గంగ — అమ్మలార! యీదీనురాలికి సెలవిండు. నేను గార్యము సాధించుకొనఁ బోయెదను. నారదుని బట్టి మీరు సాధింపుఁడు. నాకు సందుదొరకినది.

అని గంగ వారి సమ్మతి గైకొని భూలోకము నకుఁ బోయెను.

నారదుఁడు ఉత్సవసమయమునకు విష్ణుమూర్తి గారలంకారము చేసికొనుచున్న తావునకుఁబోయి 'తాత గారు! లక్ష్మిగలవారికి నాలుగు చేతులున్నను, ఇరువది గాదు ముప్పది వ్రేళ్లున్నను మురుగులు, మురిడీగొలుసులు బొట్టనవ్రేలు మొదలుకొని బటువులు వజ్రపుటుంగరాలు, దాట్లుల, కవుసులు, పెట్టుకొనవచ్చును. భూలోకములోఁ గొన్నికులములుగలవు. వారు జన్మములోనుండి స్త్రీపురుషులు స్థూలశరీరముగలవారు. మగవారికేమిగాని స్త్రీలు మీవలె నలంకారప్రియులు. నిర్బంధముగా వారికిఁ బరిమాణాతీతములైన నగలు చేయించి పెట్టుచున్నారు. కొన్ని రోగభూములలో బోదకాలికిఁగూడ వారు కడియములు చేయించుచున్నారు. మీకు మీసములు లేవు. గనుక ముత్తెముగల కమ్మిగాని యడ్డబాసగాని బాగుగా నుండును. గడ్డాల వైరపుల, వహాదేవాదులకు వికారముగా నుండును.' అని హేళనముచేయుచు దగ్గఱఁ గూర్చుండెను.

వైకుంఠమునుండి గంగ వెళ్లఁగడుగుచున్నది. భూమికి సమీపించినది. ఇంతలో నాలుగైదునాళ్లు, పండుగలు, వేడుకలు, కాలక్షేపములు, పంపకములు, విందులు జరిగిపోయినవి. గౌరి, లక్ష్మి, సావిత్రి వరల నిట్లాలోచన సభగావించిరి. మన యొద్దకువచ్చినది మన చేతనగునో కాదోచూడకుండ నారదుని మాటలువిని గంగ

భూలోకములోని పేరంటాలు దగ్గఱకుఁ బోయినది. మనసుఁ జిన్నతనము గదా. అనసూయ యెంతపతివ్రతయో చూడవలయును. ఇతరులకుఁ దెలియరాకుండ గంగను వెంటాడి చూడఁబోవను రండని యొకరి నొకరు పిలుచుకొని చప్పుడుగాకుండ మనుష్యలోకమునకు దిగిరి. అత్రిముని యాశ్రమములోనికి గంగాభవాని దిగినది. 'ఆశ్రమము సమీపమున మనుష్యులు కనఁబడుదురా? ఏదయిన పనిమీఁద గొప్పవారిని జూడఁబోయినవారు తమంతట తాము గోత్రనామములు చెప్పుకొనుచుఁబోయి దర్శించుట యీభూలోకములో మర్యాద గాదు. మధ్యవర్తి యొక్కరు తీసికొనివెళ్ళిచూపించి వీరు వీరనిచెప్పి పరిచయముకలిగించిన మీఁద, రెండవసారి యెప్పుడు వెళ్ళినను వెత్తెఁడు చీటి ముక్క వ్రాసి లోనికిఁ బంపఁజాలును. నన్నుఁ దీసికొనిపోయి యెదుటఁబెట్టి చెప్పువారెవ్వరు? ఈ భయముల నెఱిఁగిన వారదుఁ డుండవలసినది. పోనీ, నేనే దర్శనము చేసెదను. వీరు మహారాజులు, ధనవంతులు, నరులపై గొప్పయధికారులును గారు. వీరికి సుమ్మములో, సేవకులు లేరు. నేను వారిచేఁ బొగడించుకొనవలసినపని లేదు. నాగొప్పలు, నాయఱుకులు పరుగలు వారియొద్దఁ గనఁబఱుపనవసరము లేదు. నేను గ్రంథము వ్రాసితినా? నాగ్రంథము పఠనార్హమని వ్రాసియిమ్మని, తప్పులతడిక నొప్పులకుప్పయని, పొగడించుకొనవలయునా! నేను జనోపకారకమైన యేపెద్దపని చేసెదనని-లేదు. నావిరోధులనుండి తప్పించుమనుటకు నారోగము కుదుర్చుకొనుటకు వారిపాదముల పైబడుటకు- సమయములు, మధ్యవర్తులు, రాయబారులు, నక్కఱలేదు. ధర్మవైద్యశాలలవారు ప్రాణాపాయకర రోగములకుఁ జికిత్స చేయుటకై వేళపాళలు చూడరు. ప్రతిక్షణము సిద్ధముగా నడుము కట్టుకొని - యే సమయములో నెవ్వరు పిలుతురోయని. రాత్రి ప్రక్కపైఁగూడ సన్నాహముతో నిద్రింతురు. అనసూయ మహాత్మురాలు. అత్రి మహాతపస్వి. నన్నుఁ గాంచి కొంచెమైనను గౌరవింపరా,' అని కోరికలఁగొద్దూలెఁ దనమట్టునున్న పాపములను దోలుకొనుచుఁ జేతులతో మసరికొనుచుఁ బర్ణశాలాద్వారమునకు నడచినది.

ఎండలు తీక్ష్ణముగాఁ గాయుచున్నవి. అత్రి కమండలువులోనిజలము చెల్లినది. మరలఁ గొంచెము నీరు త్రాగవలయునని- యాచమనము చేయవలయునని తలంపుగలిగినది. భార్యను నీరుతెమ్మని యానతిచ్చెను. ఉటజములో (పర్ణశాలలో) నీరు లేదు. వెదురు బిందెలో నీరుచుక్క కూడ లేదు. చెఱువులా, నూతులా. నాపతియాజ్ఞ నెట్లు నెఱవేర్తును! నీరుకోరెను, కోనేరు చాలదూరము; ఏఱు కడుదవ్వు, తెల్లవాఱుజామున నదికి వెళ్లివచ్చువారము. ఈయెండలో నడువఁజాలను. ఎక్కడనయినను నీరు వెదుక వలసినదే. పెనిమిటి మాటకుఁ బ్రతిచెప్పుటగాని, బద్ధకించుటగాని కూడదు. నీరే ప్రాణాధారము. దానికై వెదకెదను. అని పతివ్రత కలశము పట్టుకొని యీవలకువచ్చి, చుట్టు ప్రక్కల మూలనయిన యాచించి తెచ్చెదను. ఉదయమున లేనినదులు ప్రవాహములు నేనెఱుఁగనివి యీ యడవిలో నెక్కడనుండి యిప్పుడు నాకోసమెవ్వరు తెత్తురు. అని దీనవదనముతో రాతిక్రింద బండక్రింద వంగిచూచుచు, చెవియిచ్చి వినుచు గన్నుదెఱచి చూచుచుఁ దిరుగాడుచుండిన పతివ్రతాతిలకమును గంగ దర్శించినది. ఆమె వెంగకు, తలంపులు, పెదవులు కదపుకొనుట, మెల్లగ మాటలాడుట, కనిపెట్టినది. 'అమ్మా! నమస్కారము. నీవేమి వెదకుచున్నదానవు. నాతోఁ జెప్పుము సెలవిమ్ము' అని గంగ ప్రార్థించెను. 'నాపతి నాదైవము. ఎంతకష్టపడియైనను వారి యాజ్ఞ గావించుచుందును. ఇదినా వ్రతము. నేఁటివఱకుసాగినది. ఇక దానికి భంగము రానున్నది. జలము తెమ్మనిరి. ఇంటలేదు. ఎండమిక్కుటముగానున్నది. నీరు త్రాగకున్న నొకప్పుడు ప్రాణహాని, సంకల్పాదుల కాచమనమునకు లేకున్నఁ గర్మహాని, యెట్లురా భగవంతుఁడా యని చింతిల్లు చున్నదానను. ఎక్కడనైన దొనయున్నదా? సెలయున్నదా? బావి గుంట కనఁబడునా? అని తిరుగుచున్నదాన.' ఇట్లని పతివ్రత తనకుఁగావలసిన విషయము తెల్పెను. 'దీనికై మీరు శ్రమపడవలదు నేను దెచ్చెదను. ఆ పాత్రమిటు తెండు. నేను తేఁగవచ్చునా? యనిచేయిచాఁచెను. 'సరిసరి, మీకంటె నాకాచారమా?' మీకేల శ్రమ? మీతో నేను వచ్చెదను.' అని యనసూయ యుపచరించినది. ఇటురండు ఈ బాయిదొరకించిన మీకుఁ గావలసినంత జలమ అని చేతితో నొక్కసందుకుఁ దిరుగఁజూపినది. ఆవం నెక్కడనుండి లేచినదో, జలజల-గలగల- ప్రవా



ఎక్కడనుండి లేచినదో, జలజల - గలగల -
ప్రవాహము! ... ఒక్క శైలలోనుండి.

ఒక్క శైలలోనుండి - అద్భుతము! తొలుకవచ్చిన కన్నులము తొలఁగనిచ్చినది. పిమ్మటవచ్చిన కలకనీరు విడిచినది. తర్వాత లేటనీరు రాఁగాఁ బాత్రము పట్టి యనసూయ నిండించి, యంత ముఖము చేసికొని -'చల్లని తల్లి మీరెవ్వరో తెలిసికొననమ్మునా? నావలె మీరును మిట్టమధ్యాహ్నమున రాఁగతంబేమి? రండు నీరుకొని పోయి నాథ ర్తకిచ్చి యాశ్రమములో మాటలాడుకొందము-' అనివేఁడినది. 'తల్లీ! నేను దీనురాలను; ఆయుధము చేతనున్నను గొట్ట జాలనిదానను, కొట్టుటకు స్వాతంత్ర్యము లేనిదానను, గంగను. నన్నుఁ బాపములుముట్టుకొని బాధించుచున్నవి. ధర్మశాస్త్రము గర్వవాక్యములు ...ముఁడు. ఒక్కడు తన్నుఁగొట్టినఁ దానుగొట్టరాదఁట. తనకు మొఱ్ఱవెట్టుకొనవలెనట. మరలఁదామే చెప్పును. కొట్టినదానికంటెఁ గొట్టెదననుట గొప్ప నేరమని. నాస్థితిఁజీ ర్తగింపుఁడు. ఆకాశవాణి, మహాపతివ్రతవలనఁ గాని నీకు వచ్చిన యీ బాధతీరదనియెను.

నారదుని వలన మీమహత్త్వమ... మీ దర్శనమే పనిగా యీయెండ... టిని.' అని విన్నవించిన మిన్నే లునకు... మంగళకరంగే!' అని యనసూయ న... 'అమ్మా! నన్ను క్షమింపవలయును. నేనె... నను. నా మహత్త్వమెంత! కొడుకు... కొమ్మలా! ధనమా! ధాన్యమా! యిల్లా! వా... కలియా! ఉందురు మహాపతివ్రతలు. వారులేనిదే లోకము నిలువదు. వెదకఁబోవప్పను. నేనశక్తరాలనైనను నాకు నీవు చేసిన యుపకారమునకై కొంతసేపు మాకుటీరములో నిలుపుకొన నిచ్ఛ పుట్టుచున్నది. నాతో రావలయు' నని కోరినది. 'ఓజననీ! నీకంటె వేలు మహాపతివ్రతలుందురు. లేకుందురా. నారదుఁడేమియు నాలోచింపకుండ మిమ్ముఁ దెల్పలేదు. నాకార్యము దీర్చుటకు మీరే సమర్థులు. నామనోజవమట్లేయున్నది. నేను వేటొకరిని నమ్మలేదు. "అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణంమమ." నాకు వేఱుశరణములేదు.' అని గంగపలికి చేతులు జోడించినపుడు, 'నేనల్పరాలనైనను నాయందు నీకున్న విశ్వాసమైనను నాకుఁ దోడ్పడునుగాక! నాకుఁ గావించిన యుపకారమునకైన నేను ప్రత్యుపకారము చేయుయత్నించుట నావిధి. మాచెద'నని కాలుసేతులు కడిగికొని యాచమనముచేసి, భర్తను మనస్సునం దలంచుకొని పుడిసెడు నీరు చేతఁబట్టి - 'ఓ పాపములార! నేనే పతివ్రతను - నాదే సత్యవాక్యము - అని నారదాదులు తెలిసికొన్నది వ్యర్థముగాకుండ మీరు నశించి భస్మమైపొండు. మీదుష్కార్యములకు ఫలమును భవించి పెద్దల సత్యవాక్యమును నిలువఁబెట్టుఁ' డని కన్నులు మూయఁబోవునప్పటికే కొన్నిదూరముగాఁ బాఱిపోయినవి, కొన్ని తొలఁగఁబోవుచున్నవి, కొన్ని మమ్మొక్కరేమిచేసెదరని నిర్భయముగా నక్కడనే పండ్లిగిలించి చూచుచున్నవి. కన్నులు విచ్చినీరు గంగకుఁ జుట్టును జల్లినది. అల్లంతదూరమునఁ జిటచిటమ్మను ధ్వని వినఁబడినది. కొంతదూరమునఁ బటపటమను శబ్దము వినవచ్చెను. గంగచుట్టును ప్రేలాపన నిప్పు

కెక్కవట్లు విడిచిపెట్టెనట - సర్పము మెడమీఁదికెక్కి మొగముమీఁదికిఁ బడగెత్తి తొంగి చూచుచుండఁగా వాయువ్యకెనిపెట్టి నిర్భయముగఁ గదలక మెదలక యున్నది పూవులమాలయై మెడలో వ్రేలాడియుండెను. నిద్రనుండి లేచి అత్రిముని యీమాలయెక్కడిదని యడిగెను. గౌరిపంపినదని దానిని ప్రేమముగా మార్చితోలి వేసెనట.

లక్ష్మి ధనగర్వముచే నేమిచేయించిన దనినను సమ్మెనప్పును. ఆమె తనకుమారుఁడగు మన్మథుని, వసంతుని తోడిచ్చి పంపి, అనసూయకు మనోవికారము కలిగింపుమని ప్రోత్సాహపఱచెను. ఈవడుమ నొక్క నేడరాలు తన ముగ్గురు బిడ్డలతో నెక్కడనుండియో వచ్చి యత్రిముని యాశ్రమము దగ్గఱ నిర్భయముగా నుండునని చెట్టులనీడఁ గూర్చుండెను. ఆబాలురను గాంచి అనసూయ నాకు బిడ్డలు లేరు. పుత్రులుగల తల్లిదే యానందమని మనస్సునఁ గొంచెము విచారము నొంద, దానిని భర్త యెఱిఁగి నీవు విచారింపకుము. నేను బదరికావనమునకుఁ జని నారాయణమూర్తిం గూర్చి ఘోరతపం బొనరించి పుత్రసంబడయుటకు వరము గొని తెత్తునని తన యొద్దను శిష్యులను, "అనసూయకు సహాయముగానుండుఁడు, ప్రాతఃపాకములు వల్లించుకొనుచుండుఁ"డని ఆశ్రమము విడిచి యెందును బోవలదని-"ఇతర మునివారులతోఁ జదువులలో గర్వమునఁ బంతగింపరాదని" బోధించి- ఇంకనెన్నియో నీతులు చెప్పెను. వానిని మేము తెలుగ నొకనీతిగ్రంథము వ్రాయఁదలఁచియుంట విడిచితిమి. అత్రి బదరికాశ్రమమునకు వేంచేసెను. ఆనేడ బిడ్డలకు రొట్టెలు, పండ్లుపెట్టి వారి యాటలు వినోదములు చూచుచున్న యనసూయకడకు మన్మథుఁడు, అత్రిముని వేషము దాల్చివచ్చి తపశ్చమత్కారములు గారడివానివలె సంచివిప్పి చూపఁబోయెను. ఈదుష్ట[...]తములను గ్రహించి - నీమాటలు నాయొద్దనా! నీ[...]లకుఁ దోడు మాయవేషములు కూడ నేర్చిన లోకమున మర్యాదలు నిలుచునా. తొలగిపొమ్ము. నాయెదుట నుండరాదు. నీవైదునిమిషములలో నీసామగ్రితో నీపరివారముతో నాయాశ్రమము విడిచిపోవలయును. అని పలికిన మన్మథుఁడు సిగ్గుపడి వెడలిపోయెను. లక్ష్మి యేమిజరగినదని కొడుకు నడుగలేదు. మానమును గొడుకు చెప్పలేదు.

ఒక్కరొక్కరిగర్వము నీరీతిగా [...] కాని వచస్సులో ననసూయయశమెంత వృద్ధి పొంద[...] అనసూయ పాతివ్రత్యము వారికి ఘనమనిపిం[...] దానికింకొక్క చిన్నవిషయములో నైనది. వినుండు.

ఒక్క బ్రాహ్మణకన్యగలదు. ఆమె పేరు నర్మద. సద్గుణవతి, విద్య నేర్చినది, బుద్ధిగలది, యని పేరుపొందినది. కన్యాత్వముననే దైవవశమున మరణించి స్వర్గమునకుఁబోయెను. ఏమూలనో యొక్కమూలఁ బడియుండమని యున్నక పెద్దకుండల కెపరుపెట్టు మనవారిం జూచుటలేదా. ధనమున్న హాయిగా నొకరికిఁ బెట్టి తాము తినియుండక, ధనము వ్యర్థముగా వెలపుచేయుచుఁ బెద్దపెద్దపదవులకు, కార్యదర్శులకు మంత్రులకు, గావలయునని యెన్నికలు, పరాభవములు, న్యాయస్థానము కెక్కుట మనకు విదితమే. నర్మద, చేరితిని, నరకముగాదు స్వర్గము. కడుపులోని చల్లకదలకుండ నొక్కచోట నెక్కడనో వారు చూపించినచోటఁ గూర్చుండమనక, పతివ్రతలలోఁ జేరుదమని యత్నము. నేను పతివ్రతలలో నొక్కతెనుగా నిలిచెదనని యభిప్రాయము నడిగినది. తగునని కొందఱు, కొన్నిగుణములు తక్కువయని కొందఱు, నింద్రసభలోఁ దర్కించిరి. ఇంద్రునకు మనవి వ్రాసికొన్నది. నాగితము సభలోఁ బెట్టినాఁడు. సభలో ధర్మసందేహము- ఉపసభ యొకటి నిర్మించి యీవిషయమై చర్చించి నిర్ధారణచేయుఁడని యింద్రుఁడా కాగితము మీఁద వస్తుగా వ్రాసి బృహస్పతి యొద్దకుఁ బంపెను. కొన్నిదినములవఱకు దానిని బుట్టలోఁ బడవైచి పెట్టిరి. చిత్రగుప్తులయొద్ద నాకాగితమునకు బదులువచ్చినదాయని నర్మద యడుగుచుండును. ఒక్కనాఁ డుపసభ కూడినది. ఎన్నుట, బలపఱచుట, చప్పటులు చఱచుట, నేనెంతటి వాఁడను, మీరు నాకీ గౌరవమునిచ్చిరి. అర్హుఁడను గానని మీకెఱిఁగిదేయున్నారు. నన్నుఁ బీఁటమీఁద నాఁడుబడుమనుపలెఁ గూర్చుండఁబెట్టి మీరే యీకార్యక్రమమునందు భంగము లేకుండ సభను నిర్వహించుకొందురని ప్రార్థించుచున్నాఁడనని యధ్యక్షుఁడు తన వినయభావమును, నాడుక ముక్కలను వెలిపుచ్చుట-గొంతు

...కూర్చున్నది వెనుకను సభాధ్యక్షునికి ...డి ప్రక్క బారునఁ జీటులందించుట మీరే ...ముక్కలు చెప్పుఁడని ప్రక్కవారిని గిల్లుట ...ముగిసిన పిమ్మట- యథావిధిగా కార్యక్ర...ల్లమీఁదఁ బెట్టలేదేమి యని చిత్రగుప్తునిపైఁ ...ర్యదర్శి కన్నెఱ్ఱచేసెను. ఇందేమున్నది. ఒక్కటే యంశము. దీనికిఁ గార్యక్రమ పత్రిక లేదని తేలేదని చిత్రగుప్తుఁడు సమాధానముచెప్పెను. తేలేదుగదాయని చెప్పెను. అంతియకాని సభాక్రమమునకు విరుద్ధముగదా! అధ్యక్షుని యొన్నిక నేఁడేమి (శ్రోత్రియునియా) యీ చప్పట్లు మొదలైనవి. ఇది యొకపద్ధతి. కానిండు. వర్తన ప్రార్థన మొక్కటియే నేఁడు చర్చింపవలసినది. అని సభవారు సభాధ్యక్షునితో లేచి చెప్పిరి. కట్టిపెట్టెదను. విరాళిహాస్యము చెప్పను. సభ జరిగినది. తీర్మాన మిట్టులు చేసిరి.

“ఇంద్రుఁడుగారు నియమించినట్లు వర్తన ప్రార్థనమునకే సభవారు అభిప్రాయ పడుచున్నారు. కొన్ని కొన్ని చట్టములపుడపుడు రద్దుచేయుట, మార్చుట, సవరించుట మొదలైనవి కొన్ని రాజ్యములలోఁగలదు. ఇక్కడ బహుకాలమునుండి యట్టి తలంపే లేదు. పూర్వాచారము ననుసరించి కవచధారిని గుడిలోనికి రానీయమని వనిపుడు, కవచములు, మీసములుముందుజుట్టులేనివారెవ్వరు? ఈచర్చయుందు ముఖ్యముగా జరుగును. ఇక వర్తకను గూర్చి పూర్వశాస్త్రముల ననుసరించిరే యిప్పటి తీర్మానము. విధవల కట్టడములలోనికి వారెన్నివిధములుగాఁ జెడినను విధవలే చేర్చఁదగుదురు. కన్యల కట్టడములలోనికిఁ బెంపవరపి వచ్చినను గన్యలనువారే రావలయును. వివాహమైన వారికట్టడములలోనికి నాకబలి నాఁడు చనిపోయినను మంగళస్నానములు చేయుమఁ జచ్చినను వివాహసంస్కారమైనదనిపించుకొనిన వారే రావలయును. విధవలన్నివివాహితలని భేదము లేకుండఁ బతివ్రతలందఱు నొక్క భవనములో నుండవచ్చును. కాని వివాహముకానిదాని పాతివ్రత్యము పరిశీలన కెట్లువచ్చును? పతివ్రతయనఁగాఁ దాత్పర్యమేమి? పతినిదైవముగా వ్రతముచేయునది. పతిని బూజించునది ఇట్లెన్నియో రీతులు. ఎన్ని రీతులనాలోచించినను పెండ్లికాని వారికిఁ బతులున్నారో లేరో బహిరంగముగాఁ దెలియదుగానఁ గన్యకలు (కన్యకలనఁగాఁ జిన్న పెద్ద భేదము లేకుండఁ బెండ్లికానివారు) పతివ్రతలలోఁ జేరుటకు వీలుకలుగదు.”

ఈతీర్మానము నేకగ్రీవముగా వామోదింపవలెనా యున్న యెడలఁ జేతులెత్తుమంటిమి. ఒక్కడును జేయెత్తలేదు. కాఁబట్టి తీర్మానమయినది అని యధ్యక్షుఁడు చేవ్రాలుచేయు నప్పటికిఁ గొందఱు సభ్యులు దీనికంటె ముందు, దీనికంటె ముఖ్యమైన పనులలోనికి వెళ్లవలయునని లేచిపోయిరి. నేను గంటక్రిందనేవచ్చినట్లు వ్రాసి కొందఱు కూర్చుండిన వెంటనేవెళ్ళిరి. కరతాళధ్వనులతో (చిత్రగుప్తుఁడుమాత్రమే) సభ ముగిసినది. దేవేంద్రుఁడుగారి యొద్దకుఁబంపిరి. దానిప్రతి యొకటి వర్తనకిమ్మనిరి. చిత్రగుప్తులట్లుచేసిరి. వర్తన పదిమందికిఁ జూపించినది. ఎవ్వరికిఁ జూపినను నిష్ప్రయోజనము. భూలోకమునకుఁ బోయి పెండ్లియైన దనిపించుకొని రావున్న వీరి పట్టు వీడదనుకొనెను. అయ్యో, తీర్మానముల



సూర్యుఁ డుదయింప కుండునది యని వర్తనపలికెను.

సంగతియే యిట్టిది పొమ్మని యందఱును జెప్పిరి. తప్పదని నర్మదయుఁదోఁచినది. పెద్ద పేరువచ్చుననియే కాని పడవలసిన కష్టములెన్నోయని యాలోచింపదు. భూలోకమునకువెళ్ళి, కుష్ఠవ్యాధి, ముసలితనము, చిత్తకోపము, పెండ్లి చేసికొనవలయునను నాశయుఁగల యొక బ్రాహ్మణుని, వీఁడు శీఘ్రకాలములో మృతినొందును. విధవయైనను పతివ్రతలలోఁ జేరవలయునను పట్టుదలతోఁ బెండ్లియాడినది. అతఁడామెను బహుబాధలు పెట్టెను. తిట్టెను, కొట్టెను, చెప్పనేల! ఒక్కనాఁడు నడువలేను. నన్నెత్తుకొమ్మని కఱ్ఱతోఁ గొట్టి, పుంటికాలు కడిగి యీఁగలు వాలకుండఁ గట్టుకట్టి నదికి స్నానమునకుఁ దీసికొని పొమ్మని ముసలి బ్రాహ్మణుఁడు పట్టుపట్టెను. భుజముమీఁదఁ బెట్టుకొని మోచి నది యొద్దకుఁ జేర్చినది. కన్నులు కానరాక తపస్సు అచట చేసికొను నొక యోగిని త్రొక్కినాఁడు. అతఁడు దానికిఁ గోపగించి నీవు సూర్యోదయము కాఁగానే చత్తువని శపియించెను. నావగఁడు చనిన నేను విధవను గావలసివచ్చును. ఈరెండు కష్టములు రాకుండుటకై సూర్యుఁడుదయింప కుండునదియని నర్మద పలికెను. లోకములు చీకట్లు కప్పినవి. ఒక్కరికిని దోపకుండెను పట్టపగలు దీపములు పెట్టుకొని తిరుగుటకును గష్టమేఁగదా! దేవతలు, దానవులు, మానవులు నేకమైరి. ఏమి చేయుదమాయని సర్వవర్ణ సమామ్నాయ సభ జరిగినది. నర్మద మనమాటలకు లక్ష్యపెట్టదని కొందఱు, ఆఁడుదానిని మగవారు ప్రార్థించుటకు సిగ్గులేదాయని కొందఱు, సిగ్గు పౌరుషములున్నచో సూర్యునిఁ బొడిపింపుకొనుండని కొందఱు కొట్టుకొట్లాడిరి. ఇంతలో నొక కొఱవి పాలకఱ్ఱి జెలిఁగింపుకొని నారదుఁడువచ్చెను. మీరు మీరు గింజుకొన్నను, సూర్యుఁడుదయింపఁడు. నామాటవిని మీరందఱునుగలసి అత్రిముని భార్య మహాపతివ్రతయగు ననసూయను వేఁడుకొనుఁడు. ఆమె వచనములకు నర్మద వెనుకదీయదు అని చెప్పిపోయెను. పెద్దకాఁగడాలు వేయించుకొని యందఱును మహాపతివ్రత కడకువచ్చి గోలపెట్టిరి. పాపమామె వారినెల్లర వెంటఁ బెట్టుకొని నర్మద యొద్దకువచ్చి సూర్యుఁ డుదయించుటకు సెలవిమ్మనె. నీ పెనిమిటి చనిపోయిన నేను బ్రదికించెదనని నర్మదను బతిమాలెను. ఆమెయట్లు చేసినది. ఈమె యిట్లు చేసినది. పైఁగా నా బ్రాహ్మణుడు రోగములన్నియుఁబోయి దృఢశరీరము, యౌవనమును వచ్చునట్లు ననసూయ యనుగ్రహించెను. ఈపతివ్రతమహిమ గౌరిలక్ష్మి సావి



**ముగ్గురు మూఁడు**చంటిబిడ్డలైరి. కేరుకేరుమని యేఁడువఁజొచ్చిరి.

త్రులకు మతింతయనసూయను గల్గించినదట నింతలేదు గదా.

తమతమ పతులను జేరి 'వలదు; ప్రయోజనము లే' దని వారెంత చెప్పినను వినక మూర్ఖపుఁబట్టుపట్టి మీరు స్వయముగాఁ జని యనసూయను మోసపుచ్చిరమ్మని కోరిరి. అయ్యో, మేమును స్త్రీలమాటలు పట్టుకొని తిరుగ వలసినదేనా. అత్రియింటలేడు. ఎట్టిపనిచేయఁగల మని చింతించుచునే త్రిమూర్తులును (బ్రహ్మ విష్ణు మహేశ్వరులు) అనసూయ కడకు యోగిరూపములతో వచ్చి మా కాకలిగానున్నది. మీయింటనున్నదే చాలును. మేము స్నానము జపము చేసికొని సిద్ధముగ నున్నారము. నీవు వస్త్రము విప్పివైచికొని వడ్డింపుమని కోరిరి. కోరిక యాపెకుఁ జిరాకు పుట్టించినది. కాని సమయోచితమైన యూహయాపెను గాపాడినది. కూర్చుండుడని పీటములు పెట్టినది. కూర్చుండిరి. కమండలువులోని నీరు కొంచెము తీసికొని వారి ముగ్గురిమీఁదఁ జల్లిన ముగ్గురు మూఁడు చంటిబిడ్డలైరి. కేరు కేరుమని యేడువఁజొచ్చిరి. ఇంతలో దిగంబరయై పాత్రలలో వడ్డించి మరల బట్టకట్టుకొన్నది. కాని బిడ్డల యేడుపు తనకు జాలిగొలిపినది. తానొకబిడ్డను తన శిష్యురాండ్రిద్దఱు ఇద్దఱు బిడ్డలనెత్తికొని యూడించుచుండిరి. నారదుఁడు పరుగెత్తికొని ముగ్గురమ్మల దగ్గఱకుఁబోయి, 'యిట్టెట్టు జరిగినది. మాయమ్మలార! మీరీ గొడవకు రావలదని చెప్పితిని. నామాట వినలేదు సరి గదా పైఁగా నిట్టి తప్పుపనిచేయించిరి. రండు. మీరునచ్చి యనసూయను బతిమాలుకొనుఁడు. అత్రి యింటలేఁడు. కాఁబట్టి మగవారిమాట లాపె వినదు. స్త్రీలను స్త్రీలే పలుకరింపవలయును. మించినది. నాతోఁ జెప్పరాదా. నన్నుఁ బంపరాదా. పెద్దతలకాయలకు గౌరవహానికలిగిన లోకములో నెంత చిన్నతనము. రండురండు. జాగుసేయ వలదని గుండెలు కొట్టుకొనుచు తనవెంటరమ్మని వారికి నారదుఁడు, అనసూయదర్శనమునకుఁ గొనివచ్చెను. 'అమ్మా! మమ్ము రక్షించి మాకుఁ బతిభిక్ష పెట్టు'మని గౌరియు లక్ష్మియు సావిత్రియు వేఁడుకొనిరి. 'మీకేమి! పతిభిక్షయేమి! నేనేమిచేసితి'నని యనసూయ వింతపడియెను. 'మీరు ముగ్గురు మాభర్త'లని వారు చెప్పుకొనిరి- 'నాకు బిడ్డలు లేరు. నేనీయఁజాల'నని యనసూయపట్టుపట్టివారిని తిరస్కరించినది. అపుడు వీరు ముగ్గురును గొలుచుండిరి. ఆకాశవాణి, 'అనసూయా! నీపతి భగవంతుని పరము గోరి తెచ్చుచున్నాఁడు. ఈ త్రిమూర్తుల యంశమున నీకొక్క కుమారుఁడు కలుగును. వీరి పతులను మరల నిజస్వరూపులనుజేసి యిచ్చివేయుము. దీనివలన నీపతి ప్రతాపము మఱింత వన్నెకెక్కు'నని పలికెను. ఇంతలో నత్రిమునివచ్చెను. నీరు మంత్రించి చల్లి బాలురను త్రిమూర్తులనుజేసి యెప్పటియట్లనిలిపెను. త్రిమూర్తులును వారివారి భార్యలవంకఁ దలలు వాంచి చూచుచు మాకు శృంగభంగము చక్కఁగానైనదని సంజ్ఞలుచేసిరి. నేను, మీరు పరమపురుషులని యెఱుఁగను. ఎవ్వరోయతులని తలంచితిని. నన్ను క్షమింపుఁడని యనసూయవేడికొనియెను. నీ తప్పింతకైనను లేదని వారు సపత్నీకులై దయచేసిరి. నారదుఁడు వారితోఁ గొంత దూరము వెళ్ళి నాకు దత్తాత్రేయదర్శనముచేయ వలయుననియున్నది. సెలవిండని తిరిగివచ్చెను. అనసూయగర్భమునఁ గొన్ని దినములకు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యంశంబుల నొక్క పుత్రుఁడు దత్తాత్రేయుఁడు జన్మించి యామునిదంపతులకు హర్షము గలిగించెను. దత్తాత్రేయుని వర్ణించుట నాతరము కాదు. రవివర్మ పటములోఁ గొంత విషయము జూచి యెల్లవారు నానందింతురు గాక!






(క్షేమేంద్రుని కృతికిఁ దెలుఁగు)

శ్రీరాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరుగారు

ఉ. వాకిట నడ్డఁబడ్డఁ గని వద్దనఁ దెట్టులో చేర రా సమా
లోకముచేయఁ డేమనవులున్ గజనిమీలితముల్ పొసర్చుచున్
గైకొనఁ డేఁగినన్ వెదకు గంపెఁడుతప్పులు, తప్పులందుఁ గా
లాకృతియౌఁ బిశాచమున కాతని కేమిట భేదమోకదా!

చ. గురులను రాజపూరుషులఁ గొల్వఁడు కొల్చును రాజదాసులన్
వరదుఁ దలంపఁ డీశ్వరుని వారక విత్తమునే తలంచెడున్
నరపతి కీడుమేల్లను గనండు స్వకార్యములే కనుంగొనున్
జెలుచుఁ జెడున్ గడున్ జడుఁడు సేవకుఁ డెప్పుడు శ్రీనిమిత్తమై.

ఉ. చేరరు గోతఁగూల్చువిషచిత్తులు మత్తులు, చాటదుమ్మునన్
గూరదు నీమొగమ్ము, పెనుగోలయు నుండదు, ద్వారపాలదో
స్సారపుభీతి కల్గదిఁకఁ జప్పనఁ జేరుము పుణ్యకానన
ద్వారము; మూఢుఁడా యచట దంభనృపాలు రబాధ లేదురా.

శా. అన్నా! కష్టవినష్ట! సేవకుఁడ! పోషాశన్ మహాయాసమున్
గన్నావో, నయరో నపుంసకుని రాగద్వేషదోషార్తిదున్
మన్నిన్ భజియింతువే పరతరున్ మాహేశ్వరున్ గొల్వు మా
పన్నత్రాణపరాయణుం డతఁడు నిన్ బాలించు నెల్లప్పుడున్.

గీ. తృష్ణలేశుల యవివేకకారణమున, వెలయు దైన్యంబు లెన్నగా విడుఁడు సుమతు
లెద భవగ్రంథి నిఁక జనియింపనీక, దివ్యవిజ్ఞానమణిఁ గొల్చి ధన్యు లగుఁడు.

సీ. వ్యాజంబులకు నిత్య మావాసమగువారు, విజనసుఖేచ్ఛులై వెలయువారు
వసుధేశ్వరులు వారి బడిపంచలం బడి, యూడిగం బొనరించు టుడుగుఁ డింక

త్రెంపుఁడీ యాశాఖ్యదృఢపాశబంధంబు, చిత్తంబు నెంతయుఁ జిక్కఁ బట్టి
విమలంబు పూతంబు శమజలంబును జల్లి, యార్పుఁడీ తీవ్రతృష్ణానలంబు
గీ. హృదయకుహరాంతరాంధ్యంబు చెదరఁగొట్టఁ, జాలుపరమామృతజ్యోతిఁ గేలుకొలిపి
నిర్వికల్పసమాధిలో నెగడి మీరు, శుద్ధసౌఖ్యప్రపంచంబుఁ జూడుఁడయ్య!.

గీ. వృత్తిచేతనె జగము జీవించు; నిజము, వేరికో కొందఱకె సేవ వృత్తియగును
దాస్య మస్థానమునఁ దీవ్రతర మగుటను, దెగడుఁడీ దానిఁ బ్రాజ్ఞులు తెగువమీఱ.

గీ. పండితులఁ గొల్వ మక్కువపడెడువాఁడు, లోభసేవారసాంబుధిఁ దోఁగువాఁడు
చెలఁగి క్షేమేంద్రుఁడనువాఁడు చెప్పెదీని, బుద్ధిమంతులు సౌఖ్యంబు పొందుకొఱకు.

గీ. దేశమెల్లను దాస్యంపుఁదెవులుచేతఁ, గూలు నీకాలమున నిది మేలుగూర్చు
నని యథాశక్తిగాఁ దెలుంగునను దీనిఁ, జెప్పినాఁడ మన్నింపుఁడీ తప్పిదములు.

## తొలిపలుకు

వ్యాసదాసుఁడని నామాంతరముగల క్షేమేంద్రమహాకవి యీసేవ్యసేవకోపదేశమును సంస్కృతమున రచించినాఁడు. అతఁడు ౧౧-వ శతాబ్దివాఁడు. కాశ్మీరదేశీయుఁడు. మంత్రికులమువాఁడు. సంస్కృతమున నాతఁడు ముప్పదిగ్రంథముల రచించెను. వానిలోఁ గొన్ని విమర్శగ్రంథములు. అవి ఔచిత్యవిచారచర్చ, దేశోపదేశము, సువృత్తతిలకము, మొదలగునవి. భారతమంజరి, రామాయణమంజరి, బృహత్కథామంజరి, మొదలగునవి యితిహాసకథాగ్రంథములు. ఔచిత్యవిచారచర్చయందీతఁ డితరులనేకాక తన్నుఁగూడ విమర్శించుకొని దోషములఁ గణించుకొన్నాఁడు. క్షేమేంద్రుని స్వాతంత్ర్యప్రియత్వము నీచిన్నిగ్రంథము ప్రకటించుచున్నది. ఇందు సేవకుల కుండుసంకటములను ధౌర్త్యములను చక్కఁగా లెక్కించినాఁడు. సేవ్యులకును జక్కనిమందలింపు లున్నవి. పుస్తకము చిన్నదైనను, లోకవృత్తమును జక్కపఱుచునదిగా నున్నదిగాన ప్రియపడి తెనిఁగించితిని. 9-37 శ్లోకములు తెలిఁగింపలేదు. అవి సరిగాఁ దోఁపలేదు.

జయంతిపురము
29-1-1925

వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాద్.

## [illegible]




భావరాజు వెంకటకృష్ణారావుగారు, బి. ఏ., బి. యల్.,

సంపుటము ౧, సంచిక ౧౨ తరువాయి.

## రాయల సందర్శన భాగ్యము

"ఇట్లుండ నొకనాడు రాయలవారి సన్నిధినుండి నాకొఱకై చారులువచ్చి, సార్వభౌముని యాజ్ఞయైన దని, తెలియచేసిరి. ఆసాయంకాలము నేనును సర్వసన్నద్ధుడనై, కొలువుకూటమునకేగి, రాయలసందర్శన ప్రాప్తికి పరమానందము నొందుచు, మాదేలిక యభిమతానుసారముగ, నైదు పారసీకయుత్తమాశ్వములను, తొమ్మిదిరకములు ఎఱ్ఱపట్టు, ముఖమలు పట్టువస్త్రములు, అంగీబుడ్డలు, రెండుపళ్లెరములలో పెట్టి, రాయలకు కానుకగా సమర్పించితిని. వెనుక నేను వర్ణించిన నలువది స్తంభములుగల సభామంటపమున నత్యంతవైభవముతో నొకవేదికపై గల సింహాసనముపై రాయలు సుఖోపవిష్టులై, నాకు దర్శనమిచ్చెను. కర్ణాటక్ష్మాపాలుడగు నా రాయలు ఒకవంక, పండితులు బ్రాహ్మణులు, కవులు, వేదాంతులు, వేశ్యలు ఒకవంక, వీరభటులు, సామంతమండలేశ్వరులు బలసి కొలువుచుండ, మహావైభవముతో కొలువుదీర్చియుండెను. ఆతడు పసుపుపచ్చని పట్టుతో చేయబడిన యుడుపులను ధరించియుండెను. మెడలో, నవరత్నఖచితమై వెలలేని మంచిముత్యములచే చుట్టబడిన కంఠపట్టికను నానావిధరత్నభూషణములను ధరించియుండెను. అతని యాభరణముల విలువ ప్రపంచమున నేరత్నవర్తకుడు కూడ కట్టజాలడు; అతడు పచ్చని సంపగపు మేనిచాయ గలవాడు. కొంచెము పలుచగానుండి పొడవైనవాడు. అతనిరూపరేఖాదులుచూడ చాల చిన్నవయసువాడుగా గానుపించినాడు. [1]. అతని చెక్కిళ్లిందుక పలుచగా నున్నవి. సొగసైన మీసమున్నది. గడ్డము మాత్రము లేదు. అతని చూపులును, దృష్టియు, చల్లనివై హృదయానందకరములై విశ్వాస, భయ, గౌరవములను గలిగింపజాలినవిగ నున్నవి. కొలువుకూటమును ప్రవేశించినపుడు నేనును గౌరవసూచకముగ శిరసువంచియుంటిని. ప్రతీహారులు, రాయలకు నన్నెఱిగించిరి. రాయలును అంతట నన్నుచిరకీలితిని సంభావించి, తన చెంత గూర్చుండ నాజ్ఞాపించెను. నేనపుడు మాప్రభువుపంపిన సుహృల్లేఖను రాయల కందీయ, [2] నాతడు దానిని

---

1 అబ్దుర్ రజాక్ వ్రాసిన దీసందర్భమున సంశయమునకు తావొసంగుచున్నది. అప్పటి కిరువదిసంవత్సరముల నుండి యేలుచున్న యిమ్మడి దేవరాయలు యౌవనవయస్కుడెట్లగునో తెలియదు. ఒకవేళ నీ పారశీక రాయబారి సందర్శించినది, యిమ్మడిదేవరాయ లగునో కాదో? కాకున్న మరియెవరై యుండురు? ఒక్కటి నిజమయి యుండవచ్చును. యిమ్మడి దేవరాయలు క్రీ. ౧౪౪౩ ఏప్రిలుమాసమున క్రూరముగ చంపబడిపోయిరి. ఆవిఘాతమున, నాతడు వరణించినట్లు అబ్దుర్ రజాకు దెలుపడు. కావున, యిమ్మడి దేవరాయలు, కాయవంటివాడు గావచ్చుననియు, వృద్ధకాయుడగుటచేతగాని, చిన్ననాటనే సింహాసనమెక్కి యుండుటవలనగాని వయసు మీఱిన వాడుగాడనియు నూహింపనలయును.

2 అబ్దుర్ రజాక్ రాయలకొసగవలసిన యుత్తరములను పొరబడి సామూరి కర్పించెను. సామూరి ఆయుత్తరములు తనకు గావని తెలిసికొనినపుడు అబ్దుర్ రజాక్న కిచ్చివేసియుండును. అందువలననే కళ్లికోటయందు దితనికి ...ను గౌరవము జరిగియుండలేదు. తనకు సామూరి సన్నిధిని జరిగిన పరాభవమును, నిరాదరణయు, గడుసు...గా నబ్దుర్ రజాక్ చెప్పక దాచినాడు.

తనదుబాసిని గైకొమ్మని యాదేశించి యిట్లని మృదుమధురగంభీర భాషణముల బల్కెను. "మీరాజు అత్యంతాదర గౌరవములతో పుత్తెంచిన రాయబారమును ఈ లేఖను గాంచుటచే నాహృదయము పరమానందభరితమైనది." నేనాసమయమున, నూపిరి సలుపకుండునంతటి దట్టముగా నదుపులను ధరించినవాడ నగుటచే, తమకమును చామకొనజాలమి యున్నను పైకుబికి, నాకు ముచ్చెమటలు గ్రమ్మకేసి వైచెను. అంతట నేను చెమటచే బాధనొందుచుండ కరుణార్ద్రహృదయుడైన రాయలు, తమచేతనున్న వట్టివేళ్లవిసనను విసరుకొనుటకై నాకు ప్రసాదించిరి. ఆమహాగౌరవమునకు నేను మిక్కిలి అలరితిని. ఇంతలో సేవకులు కొందఱు ఒక బంగరు పళ్లెములో రెండువేల తమలపాకులును, ఇన్ని పోకలును, సుగంధద్రవ్యములును, అయిదునూర్ల పణములు గల నొక పట్టుసంచియు, నిరువది దీనారములెత్తు పచ్చకర్పూరమును, దెచ్చియొసంగిరి. ఆ కర్పూరతాంబూల మందిన తరువాత రాయలు సెలవుతీసికొనుట కనుజ్ఞనిచ్చిన విడిదికి వచ్చిచేరితిని. నాకు విజయనగరమున నున్నంతకాలము దినవెచ్చమునకై రెండుగొఱ్ఱెలు, ఎనిమిదికోళ్లు, ఒకమణుగు నేయి, ఒకమణుగు పంచదార, రెండువరహాలును, పంపబడుచుండెను. ఈరీతిగ నేనుఆనగరముననున్నంతవఱకు జరుగుచునేయుండెను. వారమునకు రెండుపర్యాయములు, రాయలకొలువునకు నన్ను బిలువనంపుచుండెను. సాయంతనపువేళ, నేను సముఖమున కరిగినపుడు, రాయలప్పుడప్పుడు మాయేలికయగు ఖాకానిసయ్యదు సుల్తానువారిని గూర్చి కుశలప్రశ్నలు చేయుచు వచ్చెను. కొలువుకూటమునుండి సెలవుగైకొని యరుగుసమయమున, తొలినాటియట్లె కర్పూరతాంబూలము బంగారుపణము లయిదువందలుగల పట్టుసంచి యొకటియు, నాకొసంగబడుచుండెను. ఇట్లు నన్ను బహూకరించు సందర్భమున నొకనాడు రాయలు, నన్నుచూచి, "ఓయీ,! మీరాజులు, తమకొలువు కేతెంచు రాయబారులతో సుఖవినోదగోష్ఠితో తనివినొందక సపంక్తిభోజన మిచ్చి గౌరవింతురు. కాని నీవు విమతస్థుడవు, విజాతీయుడవు నగుటచే నీతో మాకు సపంక్తి భోజనభాగ్యము లభింపదు గావున, అందులకై నీయట్టి చక్రవర్తిచే నంపబడిన రాయబారి కుచితమైన రీతి భోజనమునకు మారుగా, మాగౌరవమును జూపుట కీ సువర్ణటంకము లొసగితిమి." యని పలికెను.

తమలపాకులు - తాంబూలము

*   *   *   *   *

ఈ తాంబూలము నమలుటచే గాబోలునేమి తమలపాకులయొక్క గుణములవలననేమి, కర్ణాటభూపాలుడు అంతఃపురమున, నించుమించుగా నేడునందలమంది రాణులను, ఉంపుడుకత్తెలను భరించుకొనుచున్నాడు! అంతఃపురములోనికి పదియేండ్లు గడచిన మగచిన్నవాడు సయితము బోరాదు. ఒక్కొక్కయువతికి, రాణిగాని, ఉంపుడుకత్తెగాని, ప్రత్యేకముగ వేర్వేఱు వసతులు, పరిచారికలు, దాసదాసీజనమును గలరు. చివరకిద్దరు రాణులయిన, యిద్దరు ఉంపుటాండ్రయిన నొక యింట నివసింపరు. ఈవిశాలరాజ్యమం దెచ్చటనయిన సుందరియగు బాలికయుండుట తటస్థించెనేని వెంటనే రా[illegible]లామె జననీజనకుల యనుజ్ఞ బడసియో రొక్కమిచ్చియో, ఆబాలికను, తీసుకొని వచ్చి మహావైభవములో, తన విలాసార్థము అంతఃపురమును జేర్చుకొనుచుండెను. రాణివాసమున జేరిన తరువాత నామె యింక పరునికంట బడదు.

రాయలను జంపుటకు జరిగిన ప్రయత్నము

ఈ చరిత్రకారుడు డింకను కళ్లికోటనగరమున, కారణ వశమున వేచియుండిన కాలమున విజయనగరమున దారుణ మయిన వింత వృత్తాంత మొకటి జరిగియుండెను. అందలి విశేషము లిట్టివి. రాయలసోదరుడు, తన నివాసముకొరకు నూతన భవనమును నిర్మించుకొనెను. నూతనగృహప్రవేశమహోత్సవమునాడు రాజధానియందుగల సకల సామంత మండలేశ్వరులను, సేనాపతులను, ఉద్యోగులను, విందారగింప నాహ్వానించెను. ఇచ్చటి దేశీయుల యాచారసంప్రదాయములను బట్టి ఒకరు చూచుచుండగ నింకొకరు భుజింపరు. విందున[illegible]కై యరుదెంచిన అతిథులందఱు, ఆ నూత్న మందిరమున[illegible] గల యొక విశాలమంటపమునందు సుఖాసీనులయి [illegible] యజమానిరెడ్డో, లేక యాతని పరివారములో వె[illegible]

యొకరు అతిథులు కూర్చుండియున్న మంటపముకడకు వచ్చి, లోపల సిద్ధమయిన భోజనాదికము నారగింపుటకు ఒకని తరువాత నింకొకరిని లోనికి దీసికొని పోవుచుండిరి. ఆ మహోత్సవ సందర్భమునకు పట్టణము నందుగల యన్ని వాద్యములవారిని రప్పించి, రాయల సోదరుడు భేరీ, మృదంగ, ఢక్కా, కాహళాదివాద్యధ్వనుల చేతను, సంగీతవాద్య విశేషములచేతను, హర్మ్యమంతయు, గింగురుమని మారుమ్రోగునట్లు కోలాహల శబ్దమును చేయించుచుండెను. ఆ గొప్పసందడిసమయమున, నొకరి మాట యొకరికి కష్టముమీదనుగూడ వినబడుట లేదు. ఒక్కొక్క అతిథిని లోనికితీసుకొనిపోవుచు, ప్రత్యేక మందిరములందు కూర్చుండబెట్టుచుండిరి. అట్లు ఒక్కొక్కడే లోనికి ప్రవేశించునప్పుడు ద్వారముచెంతను తలుపుచాటున దాగుకొనియుండిన హంతకు లిరువురు, హఠాత్తుగా మీదబడి, యాతని కత్తితో బొడిచి ముక్కలు ముక్కలుగ జీల్చివైచుచుండిరి. ఆ నిర్భాగ్యుని శవ మచ్చటినుండి యతిత్వరితముగ గొంపోబడిన వెంటనే, మరియొక యదృష్టహీనుడు లోనికి ప్రవేశపెట్టబడుచుండెను. ఆనాడు అతిథులయివచ్చిన, అదృష్టహీనుడెవ్వడును తిరిగి తన యింటి ముఖమును జూడబోయి యుండలేదు.

ఆనాడు జరుగుచుండిన మేళ, తాళముల ఘోషవలన, నూతన గృహప్రవేశ సందర్భమున నిరపరాధులగు వారెందరి ప్రాణములు, పరులెరుగకుండ క్రూరముగ గైకొనబడుచుండెనో, యాహంతకుని పరివారము తప్ప నొరు లెవ్వరు నెఱుంగరు. ఇట్లు నగరమున నూరును, పేరును పలుకుబడియు గల్గి రాజభక్తిగల ప్రతిమనుజుడును దారుణముగ వధింపబడెను. ఒక మూల నీ దారుణ కృత్యములు జరుగుచుండ, రాయల సోదరుడు, రాయల యంతఃపురమునకు జనెను. అచట కావలివాండ్రను మచ్చికలాడి, తనయింట జరుగుచున్న విందునకై యాహ్వానించి, మెల్లగా వారినందరి నొకరి తరువాత నొకరిని తనయింటికి బంపివైచెను. ఇట్లు యింతమయింపగా, నగరికావలివాండ్రనందరిని బంపివైచి, మెల్లగా రాయలను సమీపించెను. రాయల సమ్ముఖమునకు జనునపు డాతడు చేత నొక బంగరు పళ్లెరము బట్టుకొని, యందొక బాకును దాచియుంచి దానిపై తమలపాకులు కప్పివైచి యుంచెను. రాయలను సమీపించినతోడనే "జగత్ప్రభూ! ఏలినవారు విందారగించుటకై సర్వము సన్నద్ధము చేయబడినది. ఇక తమ రాక మాకనుగ్రహింప వేడెదను." అనిపల్కెను. అదృష్టవంతులును, కారణ జన్ములు నగు మహారాజులకు రాబోవు విపత్తులు సూచితమగుచుండునని పెద్దలవలన విందుము. అందుచేతనే కాబోలు రాయ లదృష్టవశమున తన కస్వస్థతగా నున్నదనియు తమ్ముని యాహ్వాన మంగీకరింపజాలకునికి మన్నింపవలయుననియు వేడుకొని విందునకు బోయియుండలేదు.

రాయ లిట్లు తన మాయోపాయమును భగ్నపఱచుట గ్రహించి, యాగ్రహము పట్టజాలక, నాదురాత్ము డా పళ్లెరమునుండి బాకును దీసి రాయల దేహమంతయు తూట్లుపడునట్లుగ హఠాత్తుగ మీదపడి గాయములు గలుగజేసెను. ఈ దారుణ కృత్యమును లేశమయినను అనుమానింపకయున్నవాడుగావున రాయ లసహాయుడై, గాయపడి, సింహాసనముమీదనుండి వెనుకకు పడిపోయెను. ఆ దురాత్ము డంతట రాయలు మరణించెనని భావించి, తన చెంతనున్న సేవకుని కాతని శిరము ఖండించవలసినదని యాజ్ఞాపించెను. తానును తమకము నాపుకొనజాలక, రాజద్వారము కడకు బోయి, యచ్చట నున్న పరివారముతో "నేను రాయలను, మంత్రిని, ధన్నాయకులను, మండలేశ్వరులను ఎల్లరును జంపితిని. ఇప్పుడు సింహాసన మధిష్ఠింపబోవుచున్నాను" అని బిగ్గరగ నఱచెను. ఇంతలో రాయల తలను గొట్టుట కాజ్ఞాపింపబడిన ద్రోహి మెల్లగా రాయలచెంతకు జేరి కత్తి యెత్తునప్పటికి, రాయలు సింహాసనపుకాలు నూతగొని లేచి ఖడ్గమును దీసికొని యాహంతకుని హృదయముపై నొక్క వ్రేటువేసి క్రిందకు బడద్రోసెను. ఆ సమయమున రాజభక్తి, విశ్వాసములుగల యొకభటుడు అంతవఱకు భీతచిత్తుడై మూలను దాగియుండి రాయలు లేచుటయు, జీవించియుండుటయు గాంచి ధైర్యము దెచ్చుకొని, రాయలకు సాయముపోయి, హంతకుని యమపురి కంపియుండెను. రాయలును, జరిగిన బీభత్సమునకు వెఱగంది యాభటుని సాహాయ్యమున, అంతఃపురము

లోనికి పారిపోయెను. ఇంతలో నా రాయలసోదరుడు సింహాసన మెక్కి యచ్చటనున్న వారి నందరిని తన్ను రాయలుగా బరిగణింపవలసినదని యాజ్ఞాపించుచుండెను. ఆ సమయమున రాయలే మరియొక ద్వారమునుండి ప్రవేశించి "ఓరోరి రాజద్రోహులారా! నే నింకను జీవించియుండగనే మరియొక దురాత్ము డెట్లు సింహాసన మధిష్ఠింపగలడు! నా కండ్లయెదుట ద్రోహియై నాసింహాసనము నధివసించియున్న యాతని పట్టుకొనుడు" అని బిగ్గరగ వచించెను. ఈ సంవడినంతయు నిశ్చేష్టులయి యవలోకించుచున్న జనసమూహము ఆకుట్రాతిమానవుని పైబడి కత్తులతో కండకండలుగ జీల్చివైచి చంపివేసిరి. రాయ లంతట కొలువుదీరి, తన యితర సోదరులను, సామంతులను, దళవాయి, ధన్నాయకులను రాజబంధువులను రావింప నాజ్ఞాపించెను. ప్రధాని* తప్ప నందరును మృతులయిన వృత్తాంతమును దెలిసికొని రాయలు విషణ్ణుడయ్యెను. ధన్నాయకుడనబరగు ప్రధానమంత్రి, ఈ దారుణ విప్లవమునకు కొంతకాలము క్రిందటనే సింహళద్వీపమువైపునకు దండయాత్ర వెడలియుండెను. లేకున్న అతడును చచ్చియేయుండును. రాయలును, నిజరాజధానియం దట్టిఘోరకృత్యము జరుగుటకై చాలచింతించి ధన్నాయకుని (మంత్రి) వెంటనే బయలుదేరి త్వరితముగ రావలసినదని సింహళమునకు చారులను పంపెను. ఈ కుట్రయందు లేశమాత్రమయిన జోక్యముగలవారి నందరిని బ్రతికియుండగనే కాల్పించియో, ఒడలు చీరించియో, మరియొక విధముగనో చంపించి శిక్షించెను. వారికుటుంబముల నన్నింటిని నాశముచేసి వారి సొత్తు స్వాధీనము చేసికొనెను. మొదట విందునకును గృహప్రవేశసందర్భమునకును ఆహ్వానము గొనివచ్చినవాడుకూడ మిగిలిన రాజద్రోహులవలెనే శిక్షింపబడెను. ధన్నాయకుడు రాజధానికి తిరిగివచ్చినపుడీవృత్తాంతమంతయు విని యాశ్చర్యమగ్నమానసుడయ్యెను. రాయలు సముఖమున ధన్నాయకుని కటాక్షవీక్షణములతో దయ చూచినపుడు, అతడు సాష్టాంగముగ నమస్కరించి "యేలినవారు మహోపద్రవమును సుఖముగ దాటచేసిన యీశ్వరునకు నాకృతజ్ఞతావందనము లర్పించుచున్నాను" అని పలికెను. ఆ సంవత్సరము రాయలకు గొప్పగండము తప్పుటచే, పునర్జీవియయ్యె గావున ధన్నాయకుడు మహార్నవమి మహోత్సవములు ద్విగుణీకృతవైభవముతో జరుపవలసినదని యాజ్ఞాపించి సన్నాహము చేయించెను.

## మహార్నవమి† మహోత్సవములు

ఈదేశీయులు భాగ్య, వైభవ, బల సంపన్నులు. అందువలన, తమవిభవమును, ఐశ్వర్యమును, గౌరవమును సగర్వముగ ప్రకటింపవలయునను కౌతుకము గలవారు. ఈ మహార్నవమి పండుగ నీరాయలు, ఆతని మండలేశ్వరులు మున్నగువారలు, తమతమ యైశ్వర్యవిభవముల ననుసరించి అతి వైభవముగ జరుపుదురు. ఆమహోత్సవములు కన్నులపండువుగ జూడవలసినదేకాని వర్ణింపనలవిగాదు. అయినను ఆమహార్నవమి వృత్తాంతమును వర్ణించి తీరముచూచెదను. ముందుగా సామ్రాజ్యములోని యన్ని ప్రాంతములనుండియు, మండలేశ్వరులను, మహామండలేశ్వరులను, దుర్గాధిపతులను, దళవాయిలను, మహార్నవమి పండుగలకు రాజధానికి రావలసినదని యాజ్ఞాపించును. కొందరు మండలేశ్వరుల రాజ్యములు రాజధానికి మూడుమాసముల ప్రయాణదూరమునందుగూడ నున్నవి. ఆవచ్చిన సామంతరాజులందరును తమ పరివారములో వేయేసియేనుగులకు తక్కువగా కుండ నుండును. సుపానుచే నల్లకల్లోలమైన, యలలచే నొప్పారు మహాసముద్రపు కెరటములవలె నీమత్తగజములు తొండములు విసరుకొనుచు, ఊగుచు తేలుచు ఊపుకొనుచు నడచుచుండును. ఆమత్తేభముల ఘీంకారములు మేఘగర్జనములని భ్రమింపజేయుచుండును. తొండములకు ముఖమునకు తళతళ మెరయు యినుపకత్తులు, బాకులు, బల్లెములు, తాపించిన కవచములును సర్వాలంకారభూషణములతో,

---

* ప్రౌఢ యిమ్మడి దేవరాయల ప్రధాని యెవ్వడో యెచ్చటను తెలియవచ్చుటలేదు. ప్రధానియే ధన్నాయకుడని, అబ్దుర్ రజాకు మందొకచోట చెప్పియున్నాడు. మరియు నాతడు బ్రాహ్మణుడు. రాజ్యమునకు గలసేన కితడే అధిపతి.

† అబ్దుర్ రజాక్ మహార్నవమిని మహానవమి యనిపిలిచినాడు.

వింతవింతరంగులతో, శృంగారింపబడిన హావుదాల సమర్చబడి, యామదకరు లొండొంటి నొరసికొనుచు, తొండములు సాచుచు, మావటీండ్రను వెదరించుచు, చూపరులు విసరు ఫలముల నందుకొనుచు నడుచు చుండును. ఈయేనుగలపైనొక్కొక్క ప్రాంతీయమండలేశ్వరుల పరివారమునకు జెందిన సారడివాండ్రు, బొమ్మరివాండ్రు, విప్రవినోదులు; మున్నగువారు ఆసీనులయి తమ నేర్పరితనమును, చూపు విద్యలను ప్రదర్శించు చుందురు. ఈయేనుగుల ముఖములపై, తొండములపై, వింతవింతరంగులతో చిత్రింపబడిన రూపములు చిత్రములు చిత్రింపబడి మనోహరముగ గట్టబడియుండును.

రజాబ్‌మాసమున పూర్ణిమనాడు (సెప్టెంబరు ౧౪౪౩ (క్రీ. శ.) విశాలమయిన యొక మైదానముమీద రాయలు డేరాలు వేయించి కొలువుండెను. ఆతడేర్పఱచిన మహారాత్రమునకు రాజ్యమునందలి మహాప్రధానులు, దళవాయిలు, దన్నాయకులు, మండలేశ్వరులు, బ్రాహ్మణులు, రాక్షసులనుబోలు ఏనుగులు రాయల సమక్షమున కొలువు బలిసియుండిరి. * ఆవిశాలమయిన మైదానము, నువ్వుగింజలు చల్లిన రాలని యీ జనసమూహము, నడుమనడుమ మహోన్నతములయిన యేనుగులు విచిత్రరంగులు కనులకు మిరుమిట్లు గొల్పుచిత్రములు, పతాకములు, హావుదాలు, అన్నియు నొకమహాసముద్రమును దలపునకు దెచ్చుచుండెను.

సుందరమయిన యీబయలునందు, రమణీయమైన మందిరములు, అయిదేసి అంతస్థులు ఎత్తుగలవి అనేకములు నిర్మింపబడి యున్నవి. ఆమందిరస్థలయందు అత్యద్భుతములయినవి యనేక విధములయినవి నానావిధ రూపములతో చిత్రములు, చిత్రపటములు వ్రేలాడగట్టబడియున్నవి. ఆచిత్తరువులలో పక్షులు, జంతువులు, మృగములు, మనుష్యులు, స్త్రీలు, మున్నగునవి యనేకములు చిత్రింపబడియున్నవి. ఇవియన్నియు నత్యాశ్చర్యకరమైన కళాచాతుర్యముతో చిత్రింపబడిన చిత్తరువులు కాని యొండు కావు. ఇట్టి మందిరములలో కొన్ని పాంచాలికాయంత్ర నిర్మితములయినవి గలవు. అవి యూరక యెప్పుడెప్పుడు ప్రదక్షిణము సేయుచుండును. అవి, యొక్కొక్క ప్రదక్షిణమునందు ఒక్కొక్క వింత రూపమును దాల్చుచుండును. మరియు ప్రతిక్షణమునందును ఆమందిరములు క్రొత్తక్రొత్త శృంగారములతో మనోహరముగ గన్పట్టుచుండును. ఒకమారు చూచి తనివినొందుటకు వీలులేనియందము, వింతలు, వర్ణింపనలవిగాని శృంగారములు, నాబయలునందెచ్చట చూచినను గానవచ్చుచుండెను.

ఆబయలున కెదురుగా సోపానమంటప మొకటి నిర్మింపబడెను. ఆసోపానమంటపము స్తంభములపైకట్టబడెను. ఆ సోపానమంటపమునకు తొమ్మిది విశాలమయిన అంతస్తులు గలవు. తొమ్మిదవదానిపై రాయలు సింహాసనస్థుడై కొలువుదీరియుండెను. నాకీసోపానమంటపముమీద నేడవయంతస్తుమీద, ఆసనమిప్పింపబడియెను. అచ్చట నాపరివారమును, ప్రాణమిత్రులును తప్ప నితరులెవ్వరికిని స్థలమిప్పింపబడలేదు. ఈసోపానమంటపమునకును మైదానములో నిర్మింపబడిన మందిరములకును నడుమగల విశాలమయిన బయలునందు వింతవింత విషయములు చూపరులకు గన్పట్టుచుండెను. అందు గాయకులు, వీరకథలు పాడువారును విశేషముగా నుండిరి. గాయకులలో జాలమంది జవ్వనులే గలరు. ఆవిలాసినుల తళుకు చెక్కులు చంద్రునిసోయగమును బోలియుండెను. యౌవనప్రాదుర్భావముతో వికసించు వారి నెమ్మోములు వసంతాగమనమున చివురించు తొల్కరివలె మనోజ్ఞములయి యుండెను. సర్వాలంకారభూషితలయి, శృంగారకళికలయి, నృత్యముచేయుచున్న, యీబాలికల రూపము, సౌందర్యము, విలాసము, హొయలు, సింగారము, వేయేల వాలుచూపులు మావంటివారి హృదయములను, గులాబిపువ్వులను జూచినపుడువోలె తహతహలాడించుచుండెను. ఈ సౌందర్యవతులు రాయల కెదురుగా నొక అందమైన తెరచాటున కూర్చుండిరి. ఇంతలో తటాలున నా తెర రెండువైపులనుండి లాగివేయబడెను. తెర దింపినంతలో నాబాలికలు నృత్యముచేయ నారంభించిరి. ఆహా! ఏమి ఆనృత్యము! సర్వసంగపరిత్యాగులయిన మునులను మతిచలింపజేసెడి వారి నృత్యములు, హస్తవిన్యాసములు, కడగంటిచూపులు, ఆహా మా

* అబ్దుర్‌రజాక్ మహర్నవమి యుత్సవమునాడు విజయనగరమున నుండినట్లాతని వ్రాతవలన దెలియుచున్నది.

యాత్మ లాస్యనృత్యదర్శనముచే సంతుష్టిచెంది పరవశము లయ్యెను. (పద్యములుగలవు వాటినిట వదలితిమి.)

బొమ్మలాటవాండ్రు, దొమ్మరి, గారడివాండ్రు

గారడివాండ్రత్యద్భుతమయిన వింతలను జూపిరి. గజముపొడవును ఒక మూరెడువెడల్పును, మూడునాలుగు గజము లెత్తును గల దూలములను మూడింటిని కలిపి కట్టి యొకచో నుంచిరి. వానిలో మొదటి రెండు దూలములమీదను, అంతేయెత్తును లావును వెడల్పును గల మరి రెండుదూలముల నమర్చియుంచిరి. వీటిపైననొక చిన్నదూలము నుంచిరి. ఇయ్యది యంతయు మెట్లవలె నమర్చబడియుండెను. ఈవిద్యకై శిక్షణగావింపబడిన యేనుగు నొకదానిని దెచ్చిరి. అది మెల్లగా సోపానములుగా గట్టబడిన యాదూలములపై నెక్కెను. మొదటి సోపానముమీదనుండి, రెండవదాని మీదకు, అందుండి శేషమైన వెడల్పులేని మూడవ మెట్టుమీదకుకూడ నా యేనుగు నేర్పరితనముతో నెక్కి నాలుగు పాదములను మోపెను. అంతట దానిపాదములు మోపినదూలము ప్రక్క దూలముల నన్నిటిని దీసివైచిరి. అచ్చట నిలువబడిన యాగజముక్రింద దొమ్మరివాండ్రు పాడు వింత పాటలకు తొండముతో తాళమువేయుచు, ఎత్తుచు, దించుచుండెను.

మరియొకచోట పదిగజము లెత్తుగల స్తంభము నొకదానిని నిలువబెట్టిరి. ఆ స్తంభముకొనయం దొక రంధ్రమును జేసి యందుండి మరియొక దూలమును దూర్చి త్రాసువలె నమర్చిరి. ఆవాసమున కొకవైపు ఏనుగు బరువుగలయంతటి పెద్దరాతిని వ్రేలాడగట్టిరి. రెండవ వైపున ఒకగజముపొడవును, చాలవిశాలమును గల యొకపలకను త్రాళ్లతో కట్టి వ్రేలాడతీసిరి. ఆపలక కొక బలమైన త్రాడును గట్టిరి. ఒక యేనుగును దెచ్చి యాపలకమీద నెక్కించి, త్రాసునందువలె, యొకప్రక్క బండరాతిని, మరియొక ప్రక్క యేనుగును ఎక్కించి, త్రాడులాగుచు రాజు ముంగిట ఏతాముతోడు టభినయించిరి. రాయి క్రిందకువచ్చి ఏనుగు, గాలిలో పైన నున్నప్పుడు సయితము తొండమును తనహంగు పాటదారులపాటలకు లయచెడకుండ తాళమువేయునట్లు ఎత్తుచు దించుచు నుండెను.

పౌరాణికులు, కథకులు, పాటలవాండ్రు, సుద్దులవాండ్రు, గాయకులు, నటులు, గారడివాండ్రు, విప్రవినోదులు మున్నగువారలకెల్లను రాయలు, వారివారి విద్యాగౌరవమునుబట్టి, సువర్ణాభరణములను, నూతన వస్త్రముల నొసంగి సత్కరించెను. ఇట్టి మహోత్సవము లెడతెఱపిలేక మూడహోరాత్రములు, అత్యంత వైభవముతో జరిగెను. అచ్చటి వింతలను, విశేషములను ఒక్కొక్కటిగా చెప్పినగాని తనివితీరదు. అటు చెప్పుటకు తగినంత సావకాశముగాని కాలముగాని లేదు. వాటి నన్నిటిని జూచియుండవలసినదే.

## దేవరాయ మహారాయుల సందర్శనభాగ్యము

పండుగ మూడవనాడు రాయలు సోపానమంటపమునుండి పయనమయి యింకొకచోటకు బోవును. ఆదినమున నన్ను అచ్చటిపరివారము రాయలసన్నిధికి దోడ్కొనిపోయిరి. కర్ణాటాంధ్రాధిపు డధిష్ఠించియున్న సింహాసనము మహోన్నతమయి యుండెను. అంతియు స్వర్ణమయమును, రత్నఖచితము నయియుండెను. ఆసింహాసనమును చేసిన యగసాలి యెట్టిశిల్పియోకాని యందలి కళానైపుణ్యము వర్ణనాతీతమయియుండెను. ప్రపంచమందు ఏదేశమునందును ఏరాజున కిట్టిసింహాసన ముండుటనే నెఱుగను. ఇట్టి పనితనమునుగూడ ఎచ్చటను జూచియుండలేదు. సింహాసనము మీద మూడువరుసల ముత్తెపుసరు లంచులు కుట్టబడిన పసుపుపచ్చని చీనాపట్టుతో చేయబడిన తల్పముగలదు. ఆముత్యముల సొగసు కాంతియు నద్భుతముగనుండెను. అట్టివానిని నేనెచ్చటను జూచియుండలేదు. ఆమహార్నవమి పండుగలలో రాయ లీసింహాసనముపై యాపట్టుమెత్తపై నాసీనులై యుండెను. మహార్నవమిపండుగ గడచిన మరునాడు రాయలవారు నన్ను నగరునకు రావలసినదని యాజ్ఞాపించిరి. అప్పుడు సాయంసమయము, నమాజు చేసికొనువేళ. నేను నగరు సమీపించునప్పటికి అచ్చోట పదిచతురపు గజములమేర నొకకూటము సోపానమంటపమును బోలినది నిర్మింపబడి కానవచ్చెను. ఆమంటపమునకు పైకప్పు, గోడలును, కత్తివెనుకభాగమున్నంత దళసరి బంగారురేకులతో కప్పబడి యుండెను వేలయువ నవరత్నములు మనోహరముగ స్థాపితమయి యుండెను.

ఆమంటపములో పైనుండి మొదటి అంతస్తుమీద రాయల సింహాసనము అమర్పబడియుండెను. ఆసింహాసన మంతయు స్వర్ణనిర్మితమే! అది చాలయెత్తు గాకుండ నుండెను. రాయలందు రాజసమొప్ప నిండుగా కొలువు దీరియుండెను. నే నాప్రభుని సమీపించి బహూకరింప బడి యాసీనుడనయిన పిదప మృదుమధుర గంభీరభాషణముల, మాయేలికయగు కాఖాని సయద్ సుల్తానువారిని గూర్చియు నాతనిసామంతులను గూర్చియు ప్రసంగించెను. మాప్రభువున కెంతసైన్య మున్నదనియు అశ్వబల మెంతయుండునని యు నడిగెను. మాదేశపు నగరము లందలి వింతవిశేషములను, అందు ముఖ్యముగ సమరఖండము, హీరాటు, షిరాజు, మొదలగు నగరములగూర్చి ప్రశ్నించెను. నేను మున్నెన్నడు నెఱుగని యపార కరుణావిశేషములతో నాదరించి మన్నించెను. పిమ్మట నన్నుగాంచి "మీరాజు, మాకు నీయట్టిరాయబారిని బంపి మైత్రి కోరుచున్నందులకు మే మెంతయుసంతసించి నారము. ఇపుడు మేము కొన్నియేనుగులను, ఇరువది తుకీబుకొజ్జాలను, అమూల్యములును అద్భుతములును నగు వింతవస్తువులను కానుకలుగానిచ్చి మీకాఖానిసయదు సుల్తానువారికి, యోగ్యుడును, నీతికళారహస్యజ్ఞుడు నగు నొకరాయబారి నిచ్చి, పంపుచున్నాము" అని నాకు సమ్మోదము కలుగబల్కెను.

ఆకొలువు కూటమునందు పరివేష్టితులయియున్న రాజకుమారులలో నొకడు నన్నుజూచి,ద్విభాషిద్వారా రాయలసింహాసనము మీదనున్న జరీవగిసీ, అంచులు లతలు, పుష్పములు అల్లి నవాల్గుమొఖములు పట్టు సోఫాలు ఎటులున్నవని ప్రశ్నించెను. ఆతని యభిప్రాయము అట్టివి మాదేశములో చేయజాలరనుట నేనెఱింగి "అవి చాలబాగున్నవి. అట్టివి మాదేశములో తయారు చేయు అలవాటు లేదు. ఒకవేళ చేయదలచిన యింతె అందముగను చేయగలరని నానమ్మిక" అని ప్రత్యుత్తర మిచ్చితిని. రాయలును నాప్రత్యుత్తరమునకు సంతసించి ఎప్పటియట్ల అనేకదీనారపణములతో నింపబడిన సంచులను తాంబూలమును,తనకై ప్రత్యేకముగా నుంచు కొనిన కొన్ని మధురాపపు ఫలముల నిచ్చి యింటికి బంపివైచెను.

## హార్మజు (హురుమంజి) నగరవాసుల మాత్సర్యము

విజయనగరమున కొంతకాలమునుండి నివసించు చుండిన హార్మజునగరవాస్తవ్యులు కొందఱు నాకు రాజు జూపిన గౌరవమును, ఆదరమును, ప్రేమను జూచి సహింపజాలక, మీదుమిక్కిలి, మాయేలికకు రాయబార మంపబూనుట విని యోర్వకొనజాలక మాత్సర్య గ్రస్తులయి యెటులయిన మా స్నేహ సౌధమును ధ్వంస ముజేయ బ్రయత్నించిరి. ఈ అల్పజ్ఞుడు, నిజముగా ఖాకానిసయదు సుల్తానువారి నిజమైన రాయబారి కాడనియు, కపటవేషము బూని వచ్చినాడనియు నొక యపవాదమును వ్యాపింపజేసిరి. నా దురదృష్టవశమున నీవార్త క్రమక్రమముగా, ఆనోటనుండి యానోటబడి రాజోద్యోగులనుండి మంత్రి దళవాయులకు, తుదకు రాయలవారికి జేరెను. ఆవల జరిగిన వృత్తాంతమును పిమ్మట జెప్పెదను.

## కల్బరిగపై దండయాత్ర

విజయనగరమునందు వృత్తాంతము లిట్టులుండ నన్నింతవఱకు సత్యంతాదరగౌరవములతో మన్నించు చుండిన ధన్నాయకుడు (మహాప్రధాని) కలబరిగె రాజ్యముపై దండెత్తి పోవుట సంభవించెను. కలబరిగె రాజ్యము నా కాలమున సుల్తాను అల్లా ఉద్దీన్ అహమదుషా పరిపాలించుచుండెను. సుల్తాను అహమ్మదుషా, విజయనగరమున దేవరాయలను, ఆతని సామంతులను వధించుటకు జరిగిన ప్రయత్నములనెల్ల విని సంతుష్టాంత రంగుడై, రాయలకు తన ధూర్తస్వభావము తేటబడ "ఏడు లక్షల వరహాల నిపుడు నాకు గప్పముగా జెల్లింపుము, లేనియెడల నీ రాజ్యమును భస్మీపటలము చేయ జాలు సైన్యమును బంపి, నిన్నును నీమతస్థులను రూపుమాపెదను" అని వార్తనంపెను. విజయనగరాధీశుడగు దేవరాయ లామాట లాలకించి క్రోధావేశ పరవశుడై "ఔరా! ఏమి యీ కండకావరము, తురుష్కుల ముష్కరత! నే నింకను జీవించియుండగనే, ఎవరో, కొద్దిపాటి మంది, మావారు చనిపోయినంతమాత్రాన అహమ్మదుషా యిట్టి విపరీతపు తలంపుతో నన్ను జయింప దలచెనా! మంచిది, మీ సుల్తానుతో కయ్యము

సేయుటయే మాకుపన్నుగతి. మిమ్ముగలను ఎదుర్కొనుటకు సమరము చేయుటకు నాకు దగిన బలమున్నది. ఒక్కరోజులో నొక లక్షసైన్యమును గూర్పగలను. సూర్యుడు తేజోమూర్తి వెలుగువంతకాలము ప్రతియణువును కనబడును. నాశత్రువులు, నాకు మహోపద్రవము తటస్థించినదనిగాని, నా బంధుమిత్ర పరివారము నశించిరనిగాని నన్నుండఱు ద్రోహులయి పోయిరనిగాని యెంచినయెడల వారు మిక్కిలి పొరబడినవారగుదురు. నాకిని శుభదినములు, నాకిది మంచిదశ, నాకేయాపదయు వాటిల్లదు. నా సైన్యము లెక్కడ బోయిన జయభేరియే మ్రోగింపగలవు గాని పలాయనముకావు. అదృష్టదేవత నావైపున్నది. ఇపుడు మీ సుల్తాను నా దేశములోని ప్రజలను కొల్లగొట్టి ధనమును గొనిపోయి, సయ్యదులకు మొల్వీలకు నొసంగును. నేను అతని దేశమును ధ్వంసముచేసి నా వేటకాండ్రకును, ద్విజోత్తములకు నొసంగుదును" అని గంభీర భాషణముల దిరస్కరించి పల్కి, రాయబారి నవమానించి పంపివైచెను. పిమ్మట ఉభయులును సమరసన్నాహము చేయించి రణరంగమున సైన్యముల నడిపిరి. ఒకరి దేశముల నొకరు కొంతకాలము కొల్లగొట్టి పాడు చేసిరి. *

### ప్రధానమంత్రి హాంబనుకీర్ † పారశీక దేశమునకు రాయల రాయబారము

కలబరిగా రాజ్యముపై దండెత్తి పోయిన, బ్రాహ్మణ ధన్నాయకుని స్థానమున, దేవరాయలు కార్యనిర్వహణమునకై, "హాంబనుకీర్" అను వానిని ప్రధానిగా నియమించెను. రాయల యభిప్రాయమున నీతడు ఆ బ్రాహ్మణ ప్రధానియంతటి ప్రజ్ఞావంతుడగుటయే, నా యుద్యోగ మొసగియుండెను. కాని యాతనియంత దురాత్మగ్గుడును, కుటిలుడును, క్రూరుడును, మరియొకడు లేడు. ఇతడు చూచుటకు పొట్టిగను, అసహ్యాకరముగ నుండును. వీడు మిక్కిలి హీనకులసంజాతుడు, అసూయాపరతంత్రుడు, ముక్కోపి, కుటిల ప్రవర్తనముగలవాడు, దురాగ్రగ్గుడు, నీచుడు, గౌరవమెఱుగనివాడు, వేయేల? యీ తనియందు దుర్గుణములన్నియు మూర్తీభవించినట్లుండెను. చెప్పుకొనుటకు మంచి విషయ మొకటియైన లేదు. రాజకార్య నీతనిపాలబడినతోడనే ధర్మాసనముగూడ మాలిన్యపూరితమయ్యెను. ఆత డధికారము పూనిన తరువాత మొదట గావించిన ఘనకార్యము నాకు ప్రతిదినమును బంపబడుచుండిన దినవెచ్చమును ఆపివేయుట. హేరమంజి నగరపువారికిపుడు నామీద తమకుగల అసూయను దీర్చుకొనుట కవకాశము గలిగెను. ఎన్నెన్నివిధముల నామీద చాడీలు చెప్పి మనస్సు పాడుచేయవలయునో అన్నియు చెప్పి నామీద ప్రధానికి మనమున్నదానికంటె నసహ్యము నెక్కువజేసిరి. హాంబనుకీర్ యభిప్రాయము నెఱిగినవారగుట, నాతని యిష్టానుసారముగ, నేను నిజముగా పారశీక చక్రవర్తిచే నంపబడిన రాయబారిని గాననియు వర్తకము చేయ దలచివచ్చి, కపటరాయబారినై మెలగుచున్నాననియు నెన్నియో మంతనములను జేర్చుచుండిరి. ఈ జకీయోద్యోగులు నమ్మునట్లనేక అసత్యములను కల్పించి, మెల్లమెల్లగా వాటిని రాయల చెవి సోకునట్లు గూడజేసిరి.

---

* ఫెరిష్టాకూడ నీ కాలమున (౧౪౪౩—౪ క్రీ. శ.) దేవరాయలకును, అహమ్మదుషాకును, యుద్ధము సంభవించెనని తెల్పుచు నందులకు వేరుకారణములను దెలిపియున్నాడు. మూడుమాసములకాలము యుద్ధము సాగెను. అందు మూడు ఘోరయుద్ధములు జరిగెను. మూడింటియందును కర్ణాటాంధ్ర సైన్యములే గెలుపొందుచువచ్చినవి. చూడుడు: Briggs Ferishta Volume II, P. P. 430-435.

† ఈ పదము నిపు డేవిధముగ పూర్వస్థితికి సమన్వయింపవలెనో తోచకున్నది. అబ్దుర్ రజాక్ యీ పేరును తప్పుగా నుచ్చరించి వ్రాసికొనినట్లు కన్పట్టుచున్నది. అబ్దుర్ రజాక్ గ్రంథముయొక్క మరియొక ప్రతియందు "నిమపజీర్" అని యున్నది. కాని పెక్కుప్రతులందు హాంబనుకీర్ అని యున్నందున నిదియే సరియైన పాఠమని యెంచ దగును. హాంబనుకీర్ అను పేరు "హంపీగ" అనుదాని సమీపమున నున్నది. లేక "హనుమంతిపీర" కావచ్చును. లూయిరైసు దొర దేవరాయని ధన్నాయకులలో నాగన్నయను వాడొకడుండినట్లు మాత్రము దెలుపుచున్నాడు. ఇంక నీహాంబనుకీర్ యెవరయియుండునో ?

ఇట్లు దినభత్యము లేక, శత్రువులయసూయకు గురియై, ధనములేక గౌరవము చెడి నిరాశచెంది కొంత కాలమెట్లో యీపాపిష్ఠి రాజ్యమున, దుర్మార్గులయిన విగ్రహారాధకులగు ప్రజలమధ్య కాలము గడపితిని. నేనిట్లు ఇడుములబడుచుంటినను, అప్పుడప్పుడు పురవీథులందు రాయ లూరేగుచు నా కెదురయినపుడు మదపుటేను నాపి, చిరునగవుతో, దయారసము లొలుక నారోగక్షేమ మారయుచునే యుండెను. నిజముగా మహారాజు చాల ఔదార్యముగలవాడు. సుగుణముల పుంజ మనదగిన మహానుభావుడు.

ఇంతలో బ్రాహ్మణ దండనాయకుడు కలబురిగ రాజ్యముపై దండయాత్రలు ముగించి, దురదృష్టవంతులగు కొందరిని బానిసలగను, ఖైదీలుగను బట్టుకొని, రాజధానికి విజయ లక్ష్మితో మరలివచ్చెను. ఆతడు రాజధానిని ప్రవేశించినదినముననే, నా దుస్థితిని గూర్చి విని, హాంబనుకీర్ ను, చాల మందలించి, ఆ దినముననే నా ఖర్చులకై ఏడువేల ఫణముల నివ్వవలెనని టంకసాలకు బరాత నిచ్చెను. విజయనగరవాస్తవ్యులయిన ఖ్వాజా మసూద్, ఖ్వాజా మహమ్మదు (ఖురాసాను దేశీయుడు) అనువారలను, రాజపరమేశ్వరు డనదగిన రాయలు అనేక అమూల్యాభరణములు, దుస్తులు, రత్నములు, కానుకలు, మొదలయినవి యొసంగి మా పారశీక చక్రవర్తి కడకు ప్రతిరాయబార మంపించెను. ఆ సమయముననే, ఢిల్లీ సుల్తానుగానుండిన ఫీరోజుషావంశీయుడగు ఫత్తేఖానుగూడ, ఖ్వాజా జమాలుద్దీను అనువానిని తన వకీలుగా, నేర్పఱచి, మా చక్రవర్తి కడకు అనేక కానుక లర్పించుచు నొక విన్నపమును బంపించియుండెను.

నేను విజయనగరమునుండి, రాయలయొద్ద సెలవు గైకొని ప్రయాణమగు రోజున, చక్రవర్తి నన్ను జూచి కృపాలుడై "ఓయీ! నీవు నిజముగా, పారశీక సుల్తాను షారూఖ్ వారి భృత్యుడవు గావనియు, మమ్ము మోసముచేయ నేతెంచినవాడవనియు ననేకులు మాతో చెప్పియుండిరి. లేకుండిన ఇంతకంటె గొప్ప యాదరణకును, గౌరవమునకును మావలన, నీవు పాత్రుడవై యుందువు. గడచినదానికై వగవవలదు. ఎన్నటికైన నీవు తిరిగి మాకు విశ్వాసము గలిగినపిమ్మట, మా రాజ్యమునకు మీ సుల్తానువారిచే బంపబడుదువేని మా సామ్రాజ్యగౌరవప్రతిష్ఠలకు దగినరీతిని నిన్ను గౌరవించి బహూకరించెదము" అని పల్కెను.

... ... ... ...

మా సుల్తానువారికి వ్రాసిన సుహృల్లేఖలో దేవరాయ మహారాయలు నా విషయమును, తన దేశములో బుట్టినయపప్రథల నన్నింటిని నుడువుచు హోర్ముజు నగర వాస్తవ్యులు జూపిన యసూయలను వర్ణించి, మరియు నీ విధముగా వ్రాయించెను. "మీతోడ మాకు నెయ్యమును, స్నేహమును ఎంతయు మోదావహములును, వాంఛనీయములును, గాని, కొందఱు మాకు అబ్దుర్ రజాకు మీ భృత్యుడు గాడని చెప్పుచు వచ్చిరి; లేకుండిన యింతకంటె నెక్కుడుగా, మా గౌరవము జూపుచు, మాస్థితికి దగినట్లుగా కానుకల నంపియుందుము. మీ రాయబారిని గౌరవించియుందుము."

పిమ్మట నా ప్రయాణ సన్నాహము బూర్తి చేసికొని శుభదినమున స్వదేశమునకై పయనమైతిని.

## స్వదేశాభిగమనము నడుమ తుపాను

అదృష్టమను ఆకాశమున దైవకృప అనుభానుడుదయమయ్యెను. ఆశాభువనగోళమున, భాగ్యతార ప్రకాశింపజొచ్చెను. (?) కటికచీకటి రాత్రియందు, సంతోష కాంతులు వెలుగసాగెను. అంతట నాకు దైవమును నమ్మినవారికే బాధయు నెప్పుడును గల్గదని తోచెను.

... ... ... ...

హిందూస్థానమునం దొకచోట మూడుమూల లున్నది విజయనగరము. దేశమంతయు, విగ్రహారాధన పరులు. నేను సంపాదించుకొనినదంతయు, నా కష్టకాలము! వ్యయమయిపోవుటచేత, ప్రయాణమునకు గావలసినంత ధనము నాయొద్ద లేకుండెను. ఇక, నా దురదృష్టపు సంగతులను చెప్పను. ఎట్లో అల్లా నాయందు కరుణాళుడై యుండినందున ప్రయాణము సాగించితిని. షాబాను మాసమున * పండ్రెండవ దినమున నేను విజయ

* షాబానుమాసము మనకు పుష్యమాసమగును.

నగరమునుండి యితర రాయబారులతో పాటు బయలు దేరితిని. పదునెనిమిదిదినము లహోరాత్రములు పయనము గావించి 'రమజాను'* మొదటిరోజున మంగళూరు నగరమును జేరితిని. మంగళూరులో రమజాను ఉపవాస దినములను జరిపి, పిమ్మట హానూరురేవునకు బయలు దేరితిమి. మంగళూరులో సయ్యదు అల్లాఉద్దీన్ మహాడీ అను మహమ్మదీయఫకీరు గలడు. అతనికి నూట యిరువది సంవత్సరములు వయస్సుండునని చెప్పుదురు. హిందువులును, ముసల్మానులునుగూడ వాతని మహనీయునిగా భావించి పూజింతురు. అట్టి మహనీయుని సందర్శించి, యాశీర్వాదము బడయుభాగ్యము నాకు లభించినందుల కేనెంతయు నదృష్టవంతుడనని యెంచెదను. ఇచ్చట నుండగనే విజయనగర రాయబారులలో ప్రధానుడగు ఖ్వాజామసూద్ అకస్మాత్తుగ మరణించెను.

హానూరు రేవునందు పారశీక దేశమునకు బోవుటకై యోడ నొకదానిని గుదుర్చుకొని నలుబదిదినముల ప్రయాణమునకు వలసిన సామగ్రి నంతయు సమకూర్చితిని. ఇచ్చట శుభశకునమును పరీక్షించి, జిల్కదా మాసమున ౨౫ వ తేదీన ఓడలంగరు నెత్తించితిని. ఓడప్రయాణము మాకు చాల యుపద్రవకరమయ్యెను. వరుసగా రెండు మాసము లించుమించుగా తుపాను రేగుచుండుటవలన మేము చాల యిబ్బందుల పాలబడితిమి. ఎట్టకేలకు హిజరాశకము ౧౦౪౪ సంవత్సరమున ముహరము పండుగ సమీపించునప్పటికి (ఏప్రిల్=చైత్రము: క్రీ. శ. ౧౬౪౪) సముద్రప్రగండములను గడచి మా దేశములోని కలహాట్ † శిఖరమును సందర్శింప గల్గితిమి.

## సముద్రయాన సమాప్తి హోర్ముజునగర ప్రవేశము

నా ప్రయాణ చారిత్రముగూడ ముగియుచున్నది. మొహరముపండుగ గడచునంతకు మేము మస్కాటు రేవునుగూర్చి సుఖముగా పయనము సేయుచునే యుంటిమి. మస్కాటు రేవునుజేరి కొంతకాల మచ్చట లంగరు దింపి, సముద్రముమీద తుపానువలన గల్గిన నష్టము చూచి తేర్చుకొని హోర్ముజునగరమునకై ఓడ లంగరెత్తించి పయనము సాగించితిమి. మస్కాటురేవు దాటిన పిదప "ఖూర్ ఫకాన్" రేవున రెండుదినము లాగి, మరల బయలుదేరితిమి. అప్పటికి వేసవికాలపు వేడి దుర్భరముగుటచేత నారేవున రెండుదినముల నిలువుండవలసి వచ్చెను. ఖూర్ ఫకాన్ రేవునుండి బయలుదేరి సురక్షితముగా హోర్ముజురేవున సఫర్ నెల ౧౨ వ తేదిని మధ్యాహ్నమగునప్పటికి లంగరు దింపితిమి. ఆనాడు శుక్రవారము.

హానూరు రేవునుండి హూరుమంజి (హోర్ముజు) రేవునకు మాకు పయనము సేయుటకు డెబ్బదిరెండు దినములు పట్టెను

---

* రమజాన్ మొదటిరోజు మార్గశిర శు ౨, యో ప్రథమతిథియో యగును.

† కలహాట్ శిఖరము మస్కాట్ రేవునకు నలుబది మైళ్లదూరమున నున్నది. దానియెత్తు ౮౦౦౦ అడుగులుండును.

# నవనాగరికత - విద్వన్నిరాదరణము

వైద్యరాజ డింటు సుబ్బావధాని గారు

శా. ఉన్నారిప్పటికైన నేగుడిసెనో యున్నార లేమూలనో
యున్నావా యనువారి గాన కకటా! యొక్కొక్క ప్రాణంబుతో
నన్నంబే కరవై మహామహులు విద్యాపారగుల్ జ్ఞానులున్
అన్నా! వేంకటశైలభర్త! యభయం బవ్వారి కీవే సుమా!

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులు కారా?

— చిలుకూరి వీరభద్రరావు గారు

(రెండవసంపుటము - మొదటిసంచిక తరువాయి)

దక్షిణహిందూస్థానము నలంకరించి యుండిన నేటిపరిశోధకులలో నగ్రపీఠము నధిష్ఠించియున్న శ్రీమాన్ డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారు మున్నొకప్పుడు హిందూదేశమున సార్వభౌమపదవి నలంకరించిన యాంధ్రులు కొందఱు తా మార్యులమని చెప్పుకొనుటచేతను, ఆర్యులకన్నను విశేషనాగరికతాసంపన్నులమని ద్రావిడులు చెప్పుకొనుటచేతను, ఆంధ్రుల తోడను ద్రావిడులతోడను చేర్చుట కిష్టపడక తెలుఁగులను బడుగులని వక్కాణించిరి. దీనికిఁ గారణము నూహించి వా రిట్లు చెప్పిరి.

"Generally speaking, however, the Andhra power came into touch with the Tamil on the northern frontier marked by Tirupati and Pulikat. The wild people called Vadukar by the Tamils must have interposed between the Tamils and the Andhras * * * * This position is still more difficult by the reference to the Vadukar, which term occurs very often in the literature of this period. Vadukar is the present day vernacular name for the Telugu speaking people in the Tamil country; but they are described still as in the same savage stage of frontier tribes being as marauders. They are located in the region immediately to the north of the Tamil frontier of Pulikat and Tirupati. This would seem to preclude the equation that the Tamils regarded the Vadukar and the Andhras as one"

"అయినను సర్వసామాన్యదృష్టితోఁ జూచినపుడు తమిళులరాజ్యమయిన తమిళకమున కుత్తరపుసరిహద్దులుగ నున్న పులికాట్ (పులికాడు) తిరుపతులకడను ఆంధ్రరాజ్యమునకు తమిళులకు సంబంధము కలుగుచున్నది. తమిళులచే 'వడుగర్' అని పిలువఁబడు నాటవికజనులు తమిళులకును, ఆంధ్రులకును నడుమ నడ్డపడియుండవలయును...... ఈస్థితి యీ యుగమునాటి వాఙ్మయమునఁ దఱుచుగా 'వడుగర్' శబ్ద ముదహరింపఁబడి యుండుటచేత నింకను మఱింత కఠినమగుచున్నది. 'వడుగర్' అనుపదము తమిళదేశమున నివసించుచు తెలుఁగుమాట్లాడుచున్న తెగలవారిపట్ల తమిళులచే వ్యవహరింపఁబడు నిప్పటి దేశభాషానామమై యున్నది. కాని వా రిప్పటికిని సరిహద్దులలోని బందిపోటు దొంగలవలెనె యింకను కిరాతకస్థితియందే యున్నటుల వర్ణింపఁబడియున్నారు. తమిళకమున కుత్తరపుసరిహద్దులగు పులికాడు, తిరుపతులకు నుత్తరము నత్యంత సమీపముననే వారికి నివాస మేర్పఱుపఁబడి యున్నది. ఇదియె 'వడుగర్' అనువారిని ఆంధ్రులను వారిని నొక్కటేయని తమిళులు భావించుటకు ప్రతిబంధక మగుచున్నది."

అయ్యంగారికి తెలుఁగువారినిగూర్చి యెట్టి యభిప్రాయముగలదో పైవాక్యముల వలన స్పష్టపడఁగలదు. ఇంక నాంధ్రులను గూర్చి వీరు వ్రాసినదానిని జిత్తగింపుఁడు.

The Andhras are described as Aryan people who had given up the Aryan customs and practice in religion, in other words mlecchas or even Vratyas

ఆంధ్రు లార్యాచారములను మతాచరణములను విడిచిపెట్టినవారు. అనఁగా మాఱు మాటలలో మ్లేచ్ఛులుగను, వ్రాత్యులుగను గూడ నభివర్ణింపఁబడియున్నారు. * తమకును తమిళులకును నడుమనున్న బడుగు లను కిరాతులనుండి (తెలుఁగువారు) యేయపాయమును గలుగకుండఁ దమ్మును దమరాజ్యమును సంరక్షించుకొనుటకై యాంధ్రు లిప్పటిగుంటూరు మండలములోని యమరావతికడ ధాన్యకటకమనుపేర నొకరాజధాని నేర్పఱచుకొనిరఁట. ఆంధ్రులకు తమిళులకు నడుమ బందిపోటు దొంగలయిన బడుగు లుండుటచేత క్రీస్తుశకమునకుఁ బూర్వమున రెండువందలసంవత్సరములును, బరమున రెండువందలసంవత్సరములును బరిపాలనము చేసి చక్రవర్తులైన యాంధ్రులతోడ నిప్పుడు తెలుఁగుమాట్లాడు వారేవిధమైన సంబంధమును గల్పించుకొనుటకు హక్కుగలిగియున్నారా యనుప్రశ్నము పుట్టుచున్నదట! ఇంతవఱకు దొరకినసాధనములనుబట్టి యిదమిత్థమని నిర్ణయించుటకు సాధ్యపడదఁట!

ఈ పైవాక్యములనుబట్టియు, వీరివ్యాసములో వెలువఱిచిన తక్కినవిషయములను బట్టియుఁ, దేలిన సిద్ధాంత మెట్టిదనిన:— "వడుగర్" అనుతెగవారు బందిపోటుదొంగలనియుఁ, తమిళదేశములో నిపుడు తెలుగు భాషమాట్లాడుచున్నవారిని 'వడుగర్' అను నీతమిళ భాషానామముతోనే వ్యవహరించుచున్నందున 'వడుగర్' అనువారు తెలుఁగు వారేయనియు, ఈ శబ్దము ఆంధ్రశబ్దమునకుఁ బర్యాయపదముకాదు గనుక యాంధ్రులు తెలుఁగువారుకారనియు సిద్ధాంతమగుచున్నది."

అయ్యంగారి కిట్టిభావములు 1922-వ సంవత్సరములో జనించినవి. కాని 1909 దవ సంవత్సరమునాఁటి కిట్టిభావములున్నట్టు వీరి వ్రాఁతలనుబట్టి కన్పట్టదు; కాని 1909-దవ సంవత్సరము. 'ఇండియన్ ఆంటిక్వెరీ' అను పత్రికయొక్క 'మే' నెల సంచికయందు 'ఆంధ్రపూర్ణ' విరచితమైన 'యతిరాజవైభవ' మనుపేరుగల(శ్రీ)రామానుజచరిత్రమును వీరు భాషాంతరీకరించి దానిని బ్రకటించియున్నారు. అందలిపీఠికలో, నాకవినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"Nothing is really known about Andhrapurna, the author of this work. Except what he chooses to tell us himself, Viz, that as he was engaged in the milkservice of Ramanuja." Even tradition has few things to tell about him We find his name however among those of the 74 successors of "Ramanuja" in the propagation of Vishnava Gospel, and the author of Prapannamritam, who lived a Contemporary of Venkatapatiraya (died 1614 A. D.) claims to be a descendant of Andhrapurna (Vaduganambi as he called in Tamil.)

రామానుజునకు క్షీరము సమకూర్చునుద్యోగములో నుండినని తనంతట తాను

* See the Quarterly Journal of the Mythic Society. Vol. XII, 1921-1922—p. 25.

మనకు వెల్లడించినది తక్క యీకృతికర్తయైన యాంధ్రపూర్ణునిగుఱించి నిజముగాఁ దెలియఁబడిన దేమియును లేదు. అతనిగుఱించి తాలి పెడుగాథలోఁగూడ వానిఁగూర్చి యేమియుఁ గానఁబడదు. అయినను అతని నామము రామానుజుని తరువాత వైష్ణవమత ధర్మమును బోధించిన డెబ్బది నలుగురు మతప్రవర్తకులలోఁ గన్పట్టుచున్నది. 1614-వ సంవత్సరములో మృతినొందిన వేంకటపతిరాయలతో సమకాలికుఁడై ప్రపన్నామృతమను గ్రంథమును విరచించినకవి తాను ఆంధ్రపూర్ణుని (తమిళభాషలో వడుగనంబియని చెప్పఁబడినవాఁడు) సంతతివాఁడనని చెప్పికొనియున్నాఁడు. ఈ వడుగనంబి యనునాంధ్రపూర్ణుఁడు పదునొకండవ శతాబ్దిలో నున్నవాఁడు. ఆంధ్రశబ్దమునకు, బర్యాయపదముగా వడుగశబ్దము వ్యవహరింపఁబడుచున్నందు కింతకంటె దృష్టాంతము మఱే యేమికావలయును? అయ్యంగారు ఆంధ్రులు తిరుపతి, పులికాడులు దాటి తమిళదేశములో నెన్నఁడు ప్రవేశింపలేదని మిక్కిలి ధీరత్వముతో వ్రాసిరికాని తమయభిప్రాయమునకు విరుద్ధముగా తమిళవాఙ్మయమునందు నొక యాంధ్రప్రభువు మిక్కిలి యతిశయోక్తులతో వర్ణింపఁబడియుండుట దలఁపోసి కాదని నిరూపించుటకై వెఱ్ఱిమొఱ్ఱి ప్రత్యుత్తరములు చెప్పఁ దొడంగినారు. వారివ్యాసములో నిట్లు వ్రాసిరి.

"There is a chieftain known by the name of Aay Andiran. The second word of this name is rendered Andhra by some. It is just possible that it is the Tamilised form of the word Andhra."

"ఆయ్ అందిరన్" అనుసామంతప్రభువు (మాండలికుఁడు) గలఁడు. ఈ నామములోని రెండవశబ్దము కొందఱిచే ఆంధ్రశబ్దముగాఁ బరిగణింపఁ బడుచున్నది. అయ్యది ఆంధ్ర శబ్దమునకు తమిళభాషా స్వరూపమని చెప్పుటకు సాధ్యపడును."

ఇట్లు పై రీతిని వ్రాసియుండియు నడుగు భాగమున(Foot-note)లో నిల్లాకవాక్యమును వ్రాసి యున్నారు.

"If the term Andar used to designate shepherds comes from the Sanskrit Andhaka, a Tamil derivation seems impossible, there is justification for this interpretation. The term Andiran is used in this compound in contradistinction to the term Einan in Aay-Eyinan undoubtedly denoting the caste or tribe from which he came The two names would stand 'Aay' the she herd and 'Aay' the hunter."

గొల్లవాండ్రకు పేరుగా వాడఁబడిన (Andar), (ఆండార్) శబ్దము 'అంధక' అనుసంస్కృత శబ్దమునుండి పుట్టినపుడును, ఈశబ్దమునకు వ్యుత్పత్తి తమిళభాషలో సాధ్యము కాక యున్నపుడును, ఇట్టి వ్యాఖ్య చేయుట న్యాయమే. ఈమిశ్రనామములోని 'అందిరన్' అనుపదము 'ఆయ్- ఎయినన్' అను మిశ్ర నామములోని 'ఎయినన్' శబ్దమునకు వ్యత్యాసముగా వాడఁబడియుండుటచేత నిస్సందేహముగా నతనికులమునుగాని వర్ణమును గాని తెలుపుచున్నది. 'ఆయ్' అనఁగా గొల్ల వాఁడని, బోయవాఁడని (వేఁటకాఁడు) రెండు నామము లేర్పడుచున్నవి.

ఇంత వ్రాసియుఁ దుదకు వీరు తమయభిప్రాయము నీక్రిందిరీతి వెలువరించిరి.

"It would be unsafe, however, to assert that the Andhras, as such, came and settled in the South."

"అయినను, ఆంధ్రులు దక్షిణమునకు వచ్చి నివాసులయిరని వక్కాణించుట సురక్షితము కాదు." ఎందుకు సురక్షితము కాదో?

ఇమ్మహాశయులకడనే 'యూనివర్సిటీ రీసర్చిస్టూడెంటు' గా నుండి తరిబీతుగాంచి నేఁడు 'మద్రాసు ఆర్క్యాలాజికల్ సూపరింటెండెంటుగారి కార్యాలయమున 'అసిస్టాంటు ఎపిగ్రాఫిస్టుగానున్న శ్రీమాన్ ఏ. రంగస్వామిసరస్వతి. బి. ఏ. గారుకూడ 'The Origins of South Indian Dynasties' అను గ్రంథమును వ్రాసి యాగ్రంథములో నీపైవిషయమునుగూర్చి యొకింత వ్రాసియున్నారు. ఆగ్రంథమింకను ముద్రితము గాకయున్నను వారు నాకోరికను మన్నించి యందలివిషయములనుపయోగించుకొను సనుజ్ఞ దయచేసియున్నందున వారికెంతయుఁ గృతజ్ఞుఁడను. 'ఆయ్ అందిరన్' అనువానిని గుఱించి వారు వ్రాసినదానిమాత్రమే నేనిచటఁ దెలుపుచున్నాను.

"దక్షిణహిందూస్థానమును బరిపాలించిన యనేకరాజవంశముల యుత్పత్తులను దెలుపు శక్తి ద్రవిడవాఙ్మయమునకుఁ గలదు. ఆంధ్రశబ్దముయొక్క వ్యుత్పత్తిని దెలుపు జాడ నేమైన నయ్యది తెలుపఁగలదా? ఆంధ్రశబ్దము తమిళభాషలోనికి మాఱినపుడు 'అందార్' 'అందిరన్' అనుపదములుగాఁ గన్పట్టగలదు. ప్రాచీన ద్రవిడవాఙ్మయమునం దీపదము లొకతెగవారికి నామములుగాఁ గన్పట్టుట చిత్రము. సంఘముకాలమునాఁటి గ్రంథములలో 'అందిరన్' అనునొకప్రభువు గన్పట్టుచున్నాఁడు. అతఁడు పరిపాలించిన దేశము తిన్నెవెల్లిమండలములోని 'పొదియిల్' కొండను చుట్టునుండు దేశమయి యున్నది. అతనిరాజధాని 'ఆయక్కుడి' అనునది. అందమైన నీటిబుగ్గలుగల 'కవిరమ్' అను కొండలవరుసయొకటి యాతనిదేశ మలంకరించియుండెనని 'అగం' అను కావ్యమున వర్ణింపఁబడినది. అతనిదేశమున 'ఏనుగ'లు నధికసంఖ్యగాఁ బుట్టుచుండెననియు, వానిని బహుమానములుగా నొసంగుచుండురనియు 'నట్రినై' అను గ్రంథమున వర్ణింపఁబడి యుండెను. అతనికనేకులు భార్యలు గలరనియు, అతఁడు సురపొన్నపూలదండలను ధరించుటయం దెక్కువ యభిలాష గలవాఁడనియు, అతఁడు కొంగులతోఁ బోరాడి పశ్చిమసముద్రతీరమునకుఁ దఱిమివేసెననియు, 'పురం' అను కావ్యమునందు వర్ణింపఁబడియుండెను. మఱియు నా గ్రంథముననే యతని యాస్థానమండపముయొక్క సొగసు 'ఉఱైయూర్ ఏనిచ్చేరిముడమోసియర్' తురైయూర్ ఒడైకిల్లర్, కుద్దవాస్ కిరనార్' అనుకవులచేతను, 'అగ'మను కావ్యమున 'పరణ్ కొక్రనార్' 'పరనార్' అనుకవులచేతను, 'నట్రినై' అను గ్రంథమున 'కఱికన్ననార్' మొదలగు కవులచేతను విశేషముగా నభివర్ణింపఁబడియుండెను. వీరిలో 'మోసియర్' అను నాతఁడు ముఖ్యుఁడు. 'అదిగమాన్' అనువాని కవ

యిత్రియగు 'సువైయర్'ను, 'వేల్పట్టి'యను వానికి 'కపిలర్' కవియు నెట్లో- 'అయ్- అందిరన్' అనువానికి 'మోసియర్' అట్టి వాఁడని చెప్పఁదగును. మొదట నీతనిగాని యీతని దాతృత్వమునుగాని యెఱుంగక దేశదేశములు తిరిగితిరిగి తుద కీతని ప్రఖ్యాతిని విని యీతని యాశ్రయమును బొందెను. ఈ ప్రభువు నాటక ప్రదర్శనములను బ్రదర్శించుటయందు నభిరుచిగలవాఁడై యనేకములను బ్రదర్శింపఁజేసె ననియును, ఇయ్యది తనగొప్పకొఱకును, స్తోత్రపాఠములను బడయుటకొఱకును గాక తన ధర్మమని నమ్ముటచేతను తనపూర్వు లాచరించినవారగుటచేతనుఁ బ్రదర్శింపఁజేయుచు వచ్చెనని కవి వర్ణించియున్నవాఁడు. ఇతఁడు మృతినొందినపుడు వీనిభార్యలు పెక్కండ్రు సహగమనము గావించిరట. ఇతని మృతిని గుఱించి 'మోసియర్' 'కీరనార్' కవులిరువురు మిక్కిలి జాలిపుట్టించెడు విధముగా వర్ణించిరి. వీరిలో 'ముడమోసియర్' అనుకవి వర్ణించినపద్యములలో నొకపద్యములోని సార మిట్లున్నది.

"భూలోకమునుండి "అయి- అందిరన్' ప్రభువు వచ్చుచున్నవాఁడని విష్ణులోకములో ఇంద్ర దేవాలయములో గానములును, పండుగలును మెండుగా జరుపఁబడుచుండెను.

ఇక్కడ నొకచిత్రభాగవతకథ వినిపింప వలసియున్నది. డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు ఆయ్‌శబ్దమునకు గొల్లవాఁడనియు, వేటకాఁడనియు నర్థమున్నట్లొప్పుకొనియున్నారు. శాతవాహనరాజు లాంధ్రరాజు లను విషయము పురాణప్రసిద్ధమనుట యంగీకరించియె యున్నారు. మున్నొకప్పుడుసాత లేక శాతవాహనుఁ డను నాతఁడు సార్వభౌముఁడై విఖ్యాతిఁ గాంచియుండెననుట జగద్విదితము. ఇతనిం గూర్చినకథలు భరతఖండమునం దంతట చెప్పఁకొనఁబడుచున్నవి. శాతవాహనుని దక్షిణ హిందూస్థానమునందంతట నొకదైవముగాఁ బూజించుచున్నారు. తమిళదేశమున 'అయ్యనార్' అనుపేరుతోడను, కన్నడదేశమున "అయ్యప్ప" అను పేరుతోడను మనదేశమున 'పోతరాజు' అనుపేరుతోడను పూజింపఁబడుచుండెడి దేవుఁడు శాతవాహనుఁడే. ప్రాచీన తమిళభాషా నిఘంటువులగు 'దివాకరమ్' 'పింగళనిఘంటువు' లలో శాతవాహనుఁడే 'అయ్యనార్' అని వ్యాఖ్యానింపఁబడియుండెనని రంగస్వామిసరస్వతిగారు వ్యాఖ్యానించియున్నారు. తమిళదేశమున 'అయ్యనార్' మిక్కిలి జనరంజకుఁడైన దేవుఁడుగ నున్నవాఁడు. ఇతనికి 'శాస్త' అను మఱి యొకనామముగలదు. కాని శాస్త బుద్ధదేవుని నామములలో నొకటిగా నున్నదని అమర నిఘంటువులో నిట్లువ్యాఖ్యానింపఁబడియున్నది.

సర్వజ్ఞ స్సుగతో బుద్ధో ధర్మరాజ స్తథాగతః,
సమంతభద్రో భగవాన్ మారజి ల్లోకజి జ్జినః.
షడభిజ్ఞో దశబలో ద్వయవాదీ వినాయకః,
మునీంద్ర శ్శ్రీఘన శ్శాస్తా మునిః...

"దుష్టాన్ శాస్తి శిక్షతీతి శాస్తా" అనఁగా దుష్టులను శిక్షించువాఁడనియర్థము. మఱియు జనులు వీని నిట్లు ప్రస్తుతింతురు.

"భూతనాథ సదానంద సర్వభూతదయాపర;
రక్షరక్ష మహాబాహో శాస్త్రే తుభ్యం నమోనమః"

కాని యీ 'శాస్త' నామముతోఁ బ్రవర్తింపఁ బడుచున్న 'అయ్యనార్' అను దేవుని (శాతవాహనుని) హరిహరపుత్రునిగాఁ బౌరాణికు లభివర్ణించియుండిరి. వీనిగుఱించి యీ క్రింది మంత్రములు గన్పట్టుచున్నవి.

"ఓంనమోభగవతే హరిహరపుత్రాయ పుత్రలాభాయ శత్రునాశాయ (గాళిదోష వినాశాయ) మదగజవాహనాయ మహాశాస్త్రాయ నమః"

"అస్యశ్రీ మహాశాస్త మంత్రస్య రుద్రఋషిః అనుష్టుప్ఛందః మహాశాస్తా దేవతా"

"మమ సర్వాభీష్టసిద్ధయే వినియోగః షడంగం హరిహరపుత్రాయ హృదయాయ నమః అర్థలాభాయ పుత్రలాభాయ శిరసే స్వాహా, శత్రునాశాయ శిఖాయైవషట్, సర్వస్త్రీమోహనాయ కవచాయ హుం, మదగజ తురంగావహనాయ నేత్రత్రయాయ వౌషట్, మహాశాస్త్రాయ హుంఫట్, స్వాహా అస్త్రాయఫట్"

"ఓం ఐం హ్రీం సౌం క్లీం శ్రీం హ్రీం హ్రీం క్లీం హరిహరపుత్రాయ అర్థలాభాయ పుత్ర లాభాయ శత్రునాశాయ సర్వస్త్రీ మోహనాయ మదగజ తురంగావహనాయ మహా శాస్త్రాయ నమః"

అయ్యనార్, మహారాష్ట్రదేశమున 'ఖాంఢోబా' అనుపేరిటను కొడగుదేశమున 'బేట అప్పయ్య' లేక మలెదేవుఁ డనుపేరిట నారాధింపఁబడుచున్నాఁడు. వీని యారాధనము శైవులలో భైరవారాధనముగను, వీరభద్రారాధనముగను, వైష్ణవులలో వేంకటేశ్వరారాధనముగను మార్పుగాంచినది. ఈహరిహర పుత్రునిగుఱించి పౌరాణికులైన శైవు లొక వింతగాథను బుట్టించిరి. ఒకప్పుడు భస్మాసురుఁ డనువాఁడు తపస్సుచే నీశ్వరుని మెప్పించి తాను చేతితో ముట్టిన నేవస్తువైనను భస్మమగునటుల వరమిమ్మని వేఁడెనట. ఆయన తన కావరమును బ్రసాదించిన వెనువెంటనే యావరముయొక్క యాథార్థ్యము నరయఁగోరి వాఁడు తనకు వరమనుగ్రహించిన యాశివుని నెత్తిపైనే తనచేయి నిడఁ బ్రయత్నించెను. అతఁడు సర్వజ్ఞుఁడయ్యును వానిభవిష్యద్వర్తనమును దెలిసికొనఁజాలక యట్టివర మనుగ్రహించిన మహానుభావుఁడు ప్రాణభీతిచేఁ బఱువిడి యొకకొలనిలో నొకపుష్పములో దాఁగుకొని భయార్తుఁడై ప్రాణరక్షణార్థము విష్ణువునుగూర్చి ప్రార్థించె నట. విష్ణువు వాని యుత్తలపాటును దెలిసికొని మోహినివంటి స్త్రీ రూపధారియై వానిముంగట నిలువంబడి మరులు గొలిపెను. ఆమెనుగాంచి వాఁడు కన్నుచెదరినవాఁడై హృదయముచలింప మదోన్మత్తుఁడై వెంటఁబడ నామె తుద కొడంబడినట్లు నటించుచు, "శుచివైయుండుటకు ముందుగా నీవు కొలనిలో స్నానముచేసి కురులార్చుకొని తలకు చమురురాచికొని రమ్ము" అని పలికెను. కామపీడితుఁడుగావున వాఁ డామాటలను విశ్వసించి యట్లుగావింపఁ దనతలను తానే

ముట్టుకొన్న వాఁడయినందున వెంటనె భస్మమయ్యెను. శివుఁ డాపర్యవసానమును దెలిసికొని కొలనిలోనిపుష్పమునుండి బైటకువచ్చి విష్ణువు జరిగినవృత్తాంతము నివేదింప మరల నొకమాఱు 'మోహినివిగమ్మ'ని యడిగెనఁట. మరల నొకమాఱుమోహినీరూపమునుదాల్చి యెదుట నిలువంబడ మున్నొకమాఱు తన్ను మరులుగొలిపిన మన్మథునే రూపడంచినంతటి తపశ్శాలియగు భగవంతుడే కాలకర్మవశమున మోహమత్తుఁడై యామాయామోహిని వెంటఁబడి సఫలీకృతమనోరథుఁ డయ్యెను. అప్పుడాపురాణదంపతులకుఁ బుత్రోదయప్రాప్తి లభించెను. అతఁడే హరిహరపుత్రుఁడు. ఇందలి సత్యమును జదువరులు గ్రహింపవలయును. దక్షిణదేశమున ముఖ్యముగాఁ దమిళకమున 'అయ్యనార్' అనుశాతవాహనునిగుడి లేని గ్రామ మెచ్చటనోకాని కానరాదు. ఈగుళ్లు సామాన్యముగాఁ జిన్నవిగానుండి యేకాంతప్రదేశమున నూరునకుఁ బడమరగా నొకచోట నున్నతములైనవృక్షచ్ఛాయలనడుమ నిర్మింపఁబడియున్నవి. వీనిముందు మట్టిచేఁ జేయఁబడిన గజతురగాదిజంతువులయొక్క విగ్రహములలోఁగొన్ని చిన్నవియుఁ బెద్దవియుఁ గూడ నుంచఁబడియుండును. అనేకులు ప్రజలు నిరంతరము మ్రొక్కుబడులు చెల్లింపుచుందురు. ఈగుళ్లద్వారముల నిరుపార్శ్వముల నిరువురు ద్వారపాలకులు భయంకరాకారములతో నొప్పుచుందురు. వీనితలలపైన కిరీటములును సింగపుకోరలతో నొప్పెడుమోములును, చేతులలోఁ బెద్దకత్తులును గలిగియున్నట్లుగా వీనిం జిత్రింపుదురు. గుడికి ముందటిభాగమున సప్తమాతృకల విగ్రహము లుండును. ఇవియును బూజింపఁ బడుచుండును. (త్రికరాశూరి, మాయాకరశూరి, రక్తచాముండా, వనచారిణీ (శాకేరి), భగవతీ, బాలశక్తి, భువనశక్తి, అనునవి సప్తమాతృకలు). గుడికి లోపలిభాగమున తలుపున కిరుప్రక్కలను రెండువినాయకవిగ్రహము లుండును. గర్భాలయమున పూర్ణా(పూరణై) పుష్కలా (పుట్కలై) అనునిరువురు భార్యలు చెరియొకప్రక్కనుండ 'అయ్యనార్' దేవుఁడు తనచుట్టును సప్తకన్య లొప్పుచుండ నడుమ నధిష్ఠించియుండును. ఉత్సవకాలమున నూరేగుటకై కొయ్యతోఁ జేయఁబడిన గజతురగాది వాహనములు ప్రక్కగృహములోనుండును. 'అయ్యనార్' విగ్రహము స్వారి వెడలు సందర్భములఁగాక తదితరకాలముల సామాన్యముగా నెఱుపువన్నెగల చర్మముతోఁ గూర్చుండియున్నటుల విగ్రహము చిత్రింపఁ బడియుండును. తలపై కిరీట ముండును. ఫాలతలమున మూఁడు విభూతిరేఖ లుండును. అనేకములయిన యలంకారములతో నలంకరింపఁబడియుండును. అహింసతోఁగూడిన బలులను బ్రాహ్మణులును, హింసతోఁగూడిన బలులను బ్రాహ్మణేతరులు నాదేవున కొసంగుచుందురు. కష్టకాలములందుఁ బ్రజలు మ్రొక్కుబడులు చెల్లించుచుందురు. పూర్వము మన దేశమున హరిహరారాధన ముండెనని సూచనలు గన్పట్టుచున్నవి. తిక్కనసోమయాజి మహాభారతమును నాచనసోముఁడు యుత్తర హరివంశపురాణమును హరిహరనాథునకే

యంకితము గావించిరి. హరిహరపుత్రుల మూలముననే హరిహరారాధనము నద్వైతమును వెలసినవని తోచుచున్నవి. 'అయ్యనార్' దేవేరులలో పూర్ణాదేవి నల్లనికస్తూరి బొట్టు నలంకరించుకొనియుండ బుష్కలాదేవి తెల్లని మూడువిభూతిరేఖల (తిరునీరు) నలంకరించుకొనియుండును. ఇతనికి పవిత్రకిరీటము గల యోధుడను నర్థముగల 'తిరుముడిసేవకర్' అనియు, మంచియోధుడను నర్థముగల 'నల్లసేవకర్' అనియు, గ్రామబాహ్యాంతరమున నివసించుదేవుడను నర్థముగల 'పురత్తవాన్' అనియు, అందమైన కడలివన్నెగలవాడనునర్థముగల 'పూన్‌కడల్‌వన్నాన్' అనియు, 'యోగి' అనియు, మచ్చలేనివాడనునర్థముగల 'బరుమాశత్తాన్' అనియు, భయంకరాయుధము గలవాడను నర్థముగల 'చండాయుధన్' అనియు, పూజ్యుడను నర్థముగల 'అరియాళ్' అనియు, ధర్మరక్షకుడనునర్థముగల 'అరక్కైకాప్పోర్' అనియు, 'తెల్లయేనుగురౌతు' అనునర్థముగల 'వెళ్లైయానైయూర్తి' అనియు, యువకుడను నర్థముగల 'కుమారర్' అనియు, తండ్రియను నర్థముగల 'అయ్యర్' అనియు, హరిహరుని కుమారుడనునర్థముగల 'హరిహరపుత్తిరన్' అనియు మొదలుగాగల నామాంతరము లెన్నో గలవు.

తమిళదేశమునకును ఆంధ్ర చక్రవర్తియైన మొదటిశాతవాహనునకును నింతటి పురాణప్రసిద్ధిగల సంబంధము గన్పట్టుచుండి నపుడు సంబంధములేదని డాక్టరుకృష్ణస్వామి అయ్యంగారు చెప్పబూనుట వింతలలో వింత గదా.

అయ్యదేవర యాంధ్రుడైనపుడు మన అయ్యరులు మనఅయ్యంగారు లన్యులగుదురా? అయ్ శబ్దమునకు బహువచన ప్రత్యయమైన 'అర్' అనుదానిని చేర్చినపుడు అయర్ - అయ్యర్' అగుచున్నది. సెట్టియార్, మొదలియార్, అన్నట్లుబహువచనరూపములతో బ్రశంసించుట తమిళుల సంప్రదాయమగుట 'అయ్యరు' లని వ్యవహారములోనికి వచ్చినది. 'గారు' అనుపదము తెలుగులో గౌరవసూచకమైనపదము. అయ్యర్ + గారు'= అయ్యంగారు' అని యేర్పడుచున్నది. తెలుగులో 'అయ్యగారు' అనుదానికి 'అయ్యంగారు' అనునది ప్రాగ్రూపము. 'గారు' అనుదానిని తెలుగువారు మాత్రమే వాడుదురు. కన్నడులు 'గారు' అనుదానికి బదులుగా 'అవర్‌గళు' అనివ్యవహరింతురు. కావున మన 'అయ్యంగార్లు' కూడ పూర్వము తెలుగు వారయి యుండి తెలుగు దేశమునుండి తమిళదేశమునకు బోయినవారని చెప్పదగును. ఇయ్యది పెక్కుదృష్టాంతములను జూపి సమర్థింప నవకాశము గలదు.

'వడుగర్' అనుశబ్దము మొదట తెలుగువారికి వర్తింపబడియుండలేదని తెలిపెడువాక్యములు డాక్టరుకృష్ణస్వామి అయ్యంగారికి, ప్రత్యుత్తరముగా వారివలన తరిబీతుగాంచిన వారి శిష్యవర్గములోనివారయిన శ్రీమాన్ రంగస్వామిసరస్వతిగారి "ద్రవిడవాఙ్మయము



యమ్. హెచ్.
స్టాక్ఘర్డు దొరగారి సతీమణి
చెన్నపురి గౌరవ న్యాయాధికారిణి



శ్రీయుత
పాండురంగరావుగారి సతీమణి
చెన్నపురి గౌరవ న్యాయాధికారిణి



న్యాయమూర్తి
శ్రీయుత సదాశివయ్యరుగారి సతీమణి
చెన్నపురి గౌరవ న్యాయాధికారిణి



శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు
కాకినాడ పురపాలకసంఘ సభ్యురాలు
గోదావరిజిల్లా విద్యాసంఘోపాధ్యక్షురాలు



అఖిల భారత ప్రాచ్య విద్వత్పరిషత్తు
మూడవ సమావేశము
1924 వ సంవత్సరము డిసెంబరునెల 22 వ తేది చెన్నపురి



1924 వ సంవత్సర డిసెంబరునెలలో చెన్నపురియందు సమావేశమయిన మూడవ అఖిల భారత ప్రాచ్య విద్వత్పరిషత్తువారిచే సమ్మానింపబడిన

పం డి త బృం ద ము

ఆంధ్రులు," అను శీర్షికగలిగి క్రిందటినెల భారతిపత్రికలోఁ బ్రకటింపఁబడినవారి వ్యాసమునుండి యెత్తిచూపినఁ జాలును'

"భాషల నెన్నుచో నీక్రిందియగస్త్య వ్యాకరణపఙ్క్తి ముఖ్యమైనది" "కొజ్జక్కన్నడ శ్చాన్ధ్రంతైలుజ్ఞం" దీనినే యనుకరించి పదునొకొండవశతాబ్దిలో వెలువడిన 'నన్నూల్' అను వ్యాకరణమునకు వ్యాఖ్యానమొకదానియందు 'కన్నడమ్వడుగు కలిఙ్గమ్ తైలుఙ్గమ్' అనియున్నది, 'వడుగ' అను పద మిప్పు డఱవములో దెనుఁగుభాషకును, దేశమునకును వ్యవహారమునందునను మొట్టమొదట నట్లుకాదనియు నాంధ్ర దేశమునకుఁ బశ్చిమమున నిప్పటి బళ్లారిజిల్లా ప్రాంతభూమికే పేరనియు, నాదేశప్రజలకే 'వడుగ' శబ్దముండెననియు, నిప్పటి కప్పటనే బడగనాటివారనుజాతివా రున్నారనియు స్థలాంతరమున వ్రాయుచున్నాను. కాలాంతరమున నాపదము యొక్క యర్థము మారి యిప్పుడు తెనుఁగు, కన్నడము రెండుభాషలకు నర్థమగుచున్నది"

ఇప్పుడు డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారు దక్షిణహిందూదేశమునందలి ద్రావిడ పరిజ్ఞానమేది(Dravidian Culture in South India) కలదని లోకమునకుఁ బ్రదర్శింపుచున్నారో యాద్రావిడ పరిజ్ఞానమనునది యాంధ్రజ్ఞానముకంటె భిన్నమైనది కాదనియు, ఆంధ్రపరి [illegible] వన్నెపెట్టఁబడినది 'ఆంధ్రసృష్టి [illegible]మును దెలిసికొన్నవారికి స్పష్టము [illegible]దు. ఇప్పుడు నాకవోయినను భవి [illegible] గాకమానదు.

మఱియు నింకొకవిషయము నిచట వివరింపవలసియున్నది.

పంజాబు ఆర్క్యాలాజికల్ డిపార్టుమెంటు నలంకరించి యుండిన బి. హెచ్. బేడెన్, పవెల్. ఎమ్. ఏ. సి. ఐ. ఇ. అను వారు (Mr. B.H. Baden Powell M. A., C.I, E.) హిందూదేశ గ్రామసంఘము(Indian Village Communities) లను గ్రంథములో ఆంధ్రులనుగూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"It is possible that the known invasions about the time of Darius Hystaspes (6 th Century B. C.) brought new Turanian tribes to North India. A Turanian Royal family appears about that time to have succeeded to the Earlier Aryan Dynasty of the Magadha Kingdom (E. Bengal.) From them are derived the Andhra, who at one time dominated the upper part of the Peninsula, and also the Naga or snake, kings of Eastern Central India. These latter invasions were of clans probably identical in race with the earliest Dravidians of epic times."

"క్రీస్తునకుఁ బూర్వమున నాఱవశతాబ్దిలో డరయస్ హిస్టాస్పెసు కాలమునఁ దెలిసికొనఁ బడిన దండయాత్ర లుత్తరహిందూస్థానమునకు క్రొత్తతురానియాగుంపులు లేక తెగలు గొనిరాఁబడినవి. ఆకాలమునకుఁ బూర్వమున మగధరాష్ట్రమును బరిపాలించుచుండిన యార్యవంశమువారిని దొలఁగించి యొక తురానియారాజవంశమువా రారాజ్యమును జేకొని పరిపాలించినట్లు కన్పట్టుచున్నది. ఒకప్పుడు హిందూద్వీపకల్పముయొక్క యుత్తరభాగమును, నాగరాజులచేఁ బరిపాలింపఁబడు మధ్యహిందూదేశముయొక్క పూర్వభాగమును ఆక్రమించి దొరలైయుండిన యాంధ్రులు

వారినుండి యుద్భవించిరి. ఈకడపటిదండయా త్రలలోఁ జాలుగొన్న తెగలవారలు పురాతన శిలాయుగములనాఁటి ప్రాచీనద్రావిడుల తెగలతో సంబంధించినతెగలవా రయియుండవచ్చును," 'ఆర్యులు, ద్రావిడులు' అనువారి జాతివిభేదమునుగూర్చి వీ రెట్టియభిప్రాయము గలిగియున్నను గౌతమబుద్ధునకుఁ గొంచెము పూర్వమున 'విజయుని' దండయాత్రలు నడచి యున్నవి గనుక నప్పటికి బహుకాలమునకు ముందే యాంధ్రులు భరతఖండములో దొరతనము నడుపుచున్నారనుట యీనానా తనపరిశోధనములకు బలమునొసంగుచున్నది. నేను వంగదేశీయులకును నాంధ్రులకును సంబంధముగలదని పౌరాణికవాఙ్మయమును బ్రమాణముగాఁ గొని తెలిపియుండఁగా నామిత్రులు కొందఱు పరిహసింపుచున్నారు. వారికొఱకు నే నీక్రిందివిషయమును బ్రత్యుత్తరముగాఁ దెలుపుచున్నాను. ఇదివఱకు తమిళులు గంగానదీముఖద్వారమునందున్న తమలిట్టీసు(తామ్రలిప్తి) నగరమునుండి దక్షిణహిందూదేశమునకు వచ్చినవారివలనఁ దమకు తమిళులన్న నామము కలిగినట్లుగా వి. కనకసభాపిళ్లగారి గ్రంథమునుండి వారియభిప్రాయములను దెలిపెడి వాక్యముల నుదాహరించియున్నాఁడను గదా. ఇప్పుడు కలకత్తా యూనివర్సిటీలో (Lecturer of Comparative Phylology and Indian vernaculars)గానుండిన విజయచంద్రమజుందారుగారు వ్రాసిన "Ancient Bengal" (పురాతనబంగాళము) అనుగ్రంథములో వ్రాసినవారియభిప్రాయములనుగొన్నిటి నిచట నుదాహరించుచున్నాను.

తమిళభాషయు, తమిళదేశమును వీరి మనస్సు నెక్కునగా నాకర్షించియున్నకత మునఁ దమ వంగదేశమునకు తమిళదేశమునకు నడుమనున్న యాంధ్రులను తెలుఁగుభాషను మఱచిపోయి, యీ క్రింది విషయములను వ్రాసియున్నారు.

(1) తమ బెంగాళీభాషలోనున్న పదములు పెక్కులు తమిళభాషలోఁగూడ నున్నవఁట. అవియేవియన నీక్రిందిపదములనుదాహరించిరి.

(1) ఆకలి (2) కల్ (కల్లు = రాయి) (3) కాఇ (కాయ) (4) కడల (కడలి) (5) చక్కన (6) చిన్న (7) తల్లి (8) పాలు (9) పిల్ల (10) పిల్లి.

ఇవి తెలుఁగుపదములో, తమిళ్ పదములో, మేధానంతులైన చదువరులు నిర్ణయించుకొందురుగాక.

(2) బంగాళా దేశములోనుండు తెగలవారే తమిళదేశములోనుండు తెగలవారుగా నుండుట. ఆంధ్రులలోని తెగలు వీరితెగలకంటె భిన్నములయినవా ? వీ రుభయులకు సరిపడిన 'Ethnology'(వేర్వేఱు తెగలవారలను గుఱించిన శాస్త్రము) ఆంధ్రులకు సరిపడదా?

చరిత్రనిర్దిష్టమైన మఱియొక గొప్పవిషయ మేమనఁగా బంగాళమునుండి పోయిన ప్రజల వలసవిధానము ద్రావిడమ్మ[illegible] దుండుటయే. మిక్కిలిప్రాచీనములైన[illegible] షాగ్రంథములు సర్వారాధకులయి[illegible] బంగాళమును[illegible]

యొక్క యితరభాగములనుండియు తమిళకములోఁ దమయాధిపత్యమును నెలకొల్పుటకు బోయియుండుట వక్కాణింపఁబడియెను.

ఈ తెగలలో ముఖ్యముగా 'మరన్', 'చేరన్', 'పాంగలతిరయార్' అనునవి యెక్కువగా మాకు ముచ్చట కలుగఁజేయుచున్నవి. 'చేర' తెగలవారు బంగాళముయొక్క వాయవ్యమూలనుండితమిళ దేశమునకుఁబోయిచరిత్ర ప్రసిద్ధమైన చేరరాజ్యమును స్థాపించిరని చెప్పఁబడియెను. ఈ తెగవారు మగధరాజ్యముయొక్కతూర్పుభాగమున నుండిరని ప్రాచీన బ్రాహ్మణ వాఙ్మయము తెలుపుచున్నది. 'మరన్'అను తెగవారుఉత్తర హిందూస్థానమునందు 'చేర' తెగవారికి సమీపనివాసస్థులైయున్నారు. ప్రఖ్యాతులయిన పాండ్య రాజులు 'మరన్' తెగవారమని చెప్పుకొనియున్నారు. కాళికాదేవిని పూజించుమరవలు భయంకరులయిన రణశూరులని చెప్పఁబడియున్నారు. ఇంకను పాంగలతిరయానులనువారు (తీరవంగులు) బంగాళమునుండి మద్రాసు తీరమునకుఁ బోవుటకుముందు 'ఆర్యసంస్కరణము'లను బంగాళాదేశములోఁ బొందియుండిరనియెంతమాత్రముజంకులేకవక్కాణింపఁగలము. ద్రావిడకవు లీతెగలను గూర్చి వారిగ్రంథములలోఁ వ్రాసినగాథలు విశ్వసించుటకు వివరణాదులలో భేదము గన్పట్టినను ముఖ్యమైనకథ సంగీకరింపఁదగును. ఆగాథ ల గ్రంథస్థలములను జేసినకవులకు బంగాళమును గూర్చిగాని దాని సమీపప్రదేశముల గూర్చికాని సరియైన జ్ఞానము లేకపోవచ్చును. ఆ దేశములోనాగులు స్థిరనివాసములు కుదుర్చుకొనుకాలమున మక్కలనువారు (Makkalar) మిక్కిలి పలుకుబడి గలవారుగ నున్నారు. 'మక్కల లేక మక్కడ' అను తమిళపదము రామాయణములోని మర్కటపదముగా సంస్కృతిగాంచినది. వీరు మధ్యహిందూదేశములో నాగజాతులవారితో సంబంధములుగలుపుకొని దక్షిణహిందూదేశమున నున్నతస్థానముల నధిగమించిరి. బర్మాలో తెలుగువారు విశేషముగాఁ బలుకుఁబడిగలిగి యున్నకాలమున 'బోంబు' తెగలవారు అనాములో దొరతనముచేయునట్టి రాజవంశమును స్థాపించిరి. తిరయానులు బంగాళాసముద్రతీరమున గొప్ప నావికులుగా నుండుటచేత సముద్రము మీదుగా దక్షిణహిందూదేశమునకుఁ బోయిరని తెలిసికొనుచున్నాము.

ఈవిజయచంద్ర మజుందారుగారు పైని వక్కాణించిన 'చేర' అను తెగవారు 'అంధవన' తెగలవారనియు, పాంగలతిరయారులను సంస్కృతమున సాగరకులు లందురు. 'పాక్కడయర్' అను మారుపేరుగల వీరు అంధపవనయనఁబడు ఆంధ్రపల్లవు లనియును, 'మరన్' అంధవనతెగవారనియును వీరెల్లరాంధ్రులేయని తెలిసికొనవలయును. మన పురాణేతిహాసములను, బౌద్ధవాఙ్మయమును జక్కగాఁ బరిశోధించినవారికిఁ జక్కగా బోధపడకమానదు. నేననేకవిధములయిన దృష్టాంతములతో నిప్పటి యాంధ్రులకన్న భిన్నులు కారని సహేతుకముగా రుజువు చేసెదను. ఇదియొకవ్యాసము ... గావునను ఈవ్యాసమే యిప్పటికే ... ందునఁ బ్రస్తుతము దీని ముగించుచు...




మక్కపాటి వేంకటరత్నకవి గారు

శ్రీ రాజకషోల్లస,దారామాంతరసదావిహారిణి! కరుణా
పారీణశీలశాలిని! భారతి! భవదరుణచరణపాళిఁ గొలిచెదఁ.

సీ. కెందామరలు బుట్టువోఁదిన ట్లలరు నీ, మృదుపదంబులఁ దొట్రు వోదవె నేల?
వివిధోన్నతానర్ఘ విలసితాలంక్రియల్, తాఱుమాఱై చెన్ను దక్కె నేల?
లోకసంజీవనోత్సేకభావక్కళల్, సిరిఁ బాసి కనువిందు సేయవేల?
సుమనోభిరామ మంజుల ఝుంఝుణధ్వనుల్, పదపదంబున వినంబడ వదేల?
గీ. తల్లి! తావకనిరుపమోదాత్తమూర్తి, చేవచెడి సొంపుదక్కి కృశించె నేల?
చూడఁజాలంగ నిను మది గాఁడివాఱి, దండిసెడి గుండె నీరగుచుండె నమ్మ!

సీ. ప్రభవించితివి జగద్వంద్యప్రభావమా, ప్రాచేతసుని ముఖపంకజమున,
పారాడనేర్చి తుజ్జ్వలధీప్రసన్నమా, వ్యాసమౌనీంద్రుని వదనసీమ,
మాటపొం దెఱిఁగితివమ్మా! శాబ్దికాగ్రణి, భాససూక్తిసుధాప్రవాహకలన,
రస భావ కళల సారస్య మెఱింగితి, కాళిదాసుని పరిష్కారమహిమ,
గీ. సార సౌజన్య సౌశీల్య సరససాహితీ మహోదాత్త భావప్రదీప్త వగుచు,
భువనసంస్థితి కాధారభూత వైన, నీవు నిక్కైతె సుతుల దుర్నీతికతన.

గీ. స్వజనమునకైనఁ గన్గట్టు పగిదిఁ దనరు, వైభవోన్నతి విలసిల్లు పట్టభద్ర,
వక్కటా! నీవు నేఁ డిట్టు లరులకైన, "నయ్యయో"! యనుదుర్గతి కగ్గమైతె.

సీ. ఎల్లవిధాల వర్ధిల్లఁ జేయఁ గలట్టి, నృపులకు నీ వన్న సేవపుట్టె.
కొంచెమో! గొప్పొ! నిన్గొలుచువారలకుఁ బెద్దమ్మదాస్యమునఁ జిత్తమ్ము లవిసె,
ధనికులు నీదు దుర్దశఁ గాంచుటకు నైనఁ, గలిమిచేడియ వారి కండ్లుకప్పె,
తక్కువారైన నీ చక్కిరా నరికట్టఁ, బశ్చిమబుద్ధి నిర్భరతమస్సు,
గీ. తల్లి! జగమునఁ బెద్దముత్తైదు వైన, నీదు కడగండ్ల నెనరు గణించువార,
లనుచుఁ గవిపుత్రు లేమి[illegible]సహించి, కడఁక నిను దేర్ప నడుములు గట్టినారు.

గీ. మాతృసేవాపరాఙ్ముఖమానసమైన, సంతతినిఁ బాసి పరుల పంచలను జేరి,
సుడివడుచు దిక్కుమాలి నీ పడినయట్టి, కటకటఁగష్టాలు గట్టెక్కఁగలవు తల్లి!

గీ. ఇన్నినాళ్ళెల్లమిని భవద్ధృదయతాప, మపనయింపమి కడుదోస మగునుగాక,
కృపవహించి క్షమించి రక్షింపు మమ్మ! తనయు లెఱుఁగమిఁ జేసినతప్పు లెల్ల.

సీ. భోజుని రౌజ నపూర్వవజ్రతనుత్ర, మలవరింపంగ దార్ఢ్యంబులేదు,
వీరరుద్రునిలీల విశ్వసన్నుత పరి,ష్కారంబు నీ కిప్డు సలుపలేరు,
రాజనరేంద్రుతరాన సామ్రాజ్యాభి,షేకోత్సవంబును సేయలేరు,
రాయలువోలె రారాజదలంకార,కోటులు నీకుఁ జేకూర్పలేరు,
గీ. గాని నీప్రజ విమల నిష్కామభక్తి, రంగదాత్మార్పణంబు సేయంగలారు,
తల్లిరో! తన్విఁ జెందు మద్దానితోడఁ, గాలము దలంచి సుతుల సంకటము లెంచి.

సీ. కాచియున్నారు స్వాగత మొసంగఁగ మార్గ,ములయందు మధువారి జలకమాడి,
అలవరించిరి దోయిళులు బొంగిపొరల న,ర్ఘ్యమునకై పరిశుద్ధరాగరసము,
చేఁగొన్నవారు కైసేఁతకై నవనవో,ద్యద్భూరిమందారదామకములు,
పాడుచున్నారు నీపై గీతమాలికల్, శ్రవణపేయముగ నచ్ఛంపుభక్తిఁ,
గీ. జెలఁగి దిక్కులు కదిసివచ్చిన విధానఁ, గూడ ముట్టిరి సుతుల రేపాడినుండి,
భారతీ! రమ్ము! సుతులతో స్వాంతమలర, మజల హాయిగ నాత్మసామ్రాజ్యమేల?

సీ. ప్రావృట్పయోదగర్జారావమునకంటె, ధీర మపారగంభీరతరము,
చిత్తమోహనవిపంచీస్వనంబునకంటె, సుకుమార మతులమంజులతరంబు,
కోమలపికవధూకూజితంబునకంటె, సురుచిర ప్రణయబంధురము వరము,
సలలిత భ్రామర ఝుంకారమునకంటె, మధుర మనర్ఘ్య సమ్మదకరంబు,
గీ. ప్రణుతనిర్ఝరఘుమఘుమ ధ్వనులకంటె, రమ్య నవరసభావనీరంధ్రమైన
మృదుమయస్వనమున వీణ మేళవించి, విశ్వగాన మొనర్పు మో విశ్వజనని.

గీ. కళ లఖిల మింక నభివృద్ధిఁ గాంచుఁగాత, కవికుమారులు సంతృప్తిఁ గందుగాత,
భారతి కటాక్షమహితసంపదుపలబ్ధి, ననయమును విశ్వకళ్యాణ మగునుగాత.

# నేటిప్రశ్నము



# అజంతా గుహాలయములు

III

కొ. నరసింహాచారిగారు

(సంపుటము ౧ సంచిక ౧౨ తరువాయి)

గుహాలయములలోని చిత్రములన్నియు వాటి నిర్మాణకాలము నాటి జనుల జీవయాత్రను దెలుపునవిగా నున్నవి. ఇందును ముఖ్యముగా గౌతమబుద్ధుని జననమాదిగా నిర్వాణపర్యంతమును గల చరిత్ర విశదముగా చిత్రింపఁబడియున్నది. గౌతముని జననము, బాల్యమున నాయన సహపాఠకుల గూడి విద్యాభ్యాసము చేయుట, శరీరవ్యాయామముల నభ్యసించుట, యువరాజై పురవీధుల నేగునపుడు చూపు భూతదయాదిగుణముల వెల్లడిచేయు పనులు, వైరాగ్యోదయము, సతీసుతులవీడి యర్ధరాత్రమున పురము వెడలిపోవుట, తపము, సన్న్యాసాశ్రమము, మతబోధకుడై నానాదేశ సంచారము మొదలగు విషయములు బయస్కోపు ఫిల్మునను, త్రిప్పుచు కొంతకొంతగా తెరపై జూపునట్లుగాక, యేకకాలముననే దానియందుగల చిత్రములన్నియు నాతెరపై బడునట్లు జేయురీతి, గుహాలయ కుడ్యములపైనను, స్తంభములపైనను, లోకప్పునను చిత్రింపబడి ప్రదర్శింపబడియున్నవి. మఱియు బోధిసత్త్వుడు (బుద్ధుడు) మృగపక్ష్యాది జన్మముల నెత్తినట్లును, ఆ జన్మములయందును దయాళుత్వము, త్యాగశీలత మొదలగు గొప్పగుణములు గలిగియున్నట్లును కొనియాడు "జాతకము"లన బరగు జన్మకథలు నూరులకొలది చిత్రితములై యున్నవి.

ఈ చిత్రములయందు నాకాలమునాటి జనుల జీవయాత్రను చక్కగా జూడగలము. వారి వేషములు, ఆచారములు, వైభవములు, ఆభరణములు, వాహనములు, ఆయుధములు కరతలామలకములుగా చిత్రింపబడియున్నవి. ఏచటజూచినను, రాజులు, భిక్షువులు, ధనవంతులు, దరిద్రులు, వ్యాధులు, పరిచారకులు, దాసదాసీజనంబులు, గాయకులు, వైణికులు, వేత్రధరులు వారివారి యుద్యోగముల శ్రద్ధతో జేయుచున్నట్లును, పద్యమునందలి పొల్లుపదములు పాదపూరణ పదములవలెగాక ప్రతిప్రాణి చిత్రమును భావగర్భితమగునట్లును చూడగలము.

ఒక్కొక్కచోట దండశాసకులయ్యును, దయామయులయి ప్రజాపాలనమొనర్చుచు తమ స్నేహము నభిలషించి యితర రాజులచే బంపబడిన రాయబారుల గౌరవించుచు మహావైభవమున గొలువుండు రాజులను, చతుర్విధ సైన్యసమేతులయి మృగయావినోదార్థము పోవు ప్రభువులను, నొకచోట పట్టాభిషేక మహోత్సవములను కన్నులపండువైయొప్పుట జూడగలము.

హంస, కీర, కుక్కుట, పారావతాది పక్షులను; సింహ, వ్యాఘ్ర, భల్లూక, వరాహ, వృక, గజ, అశ్వ, వృషభ, మహిష, కురంగ, మర్కటాది జంతువులను; కదళీ, క్రముక, పలాశ, నారికేళాది వృక్షములను; ఇంకననేక పుష్పజాతులను, వాటివాటి స్వాభావిక స్థితులలో సుందరముగ చిత్రించబడియున్నవి. ఈమృగపక్ష్యాదిప్రాణుల వాటి నైజస్థితియందు చిత్రించుటయే కాక చిత్రకారులు తమ బుద్ధివికాసమును, కల్పనాశక్తిని వెల్లడించుచు నా రూపములనే యలంకార చిత్రముల (Decorative and Conventional design) యందు బ్రవేశపెట్టి చిత్రించియున్నారు. వారికి క్షేత్రగణిత జ్ఞానము గలదనుటకు వారిచే చిత్రితములగు నగాసు (Fret work) పనియు ఇతర(Geometrical Pattern drawings) చిత్రములును సాక్షులు. కేవలమానవ



గుహాలయ:గర్భగృహమునకువామపార్శ్వమునగల యొక చిత్రముయొక్క—వస్త్రాలంకారభాగము.

ప్రతిమలేకాక దేవజాతులకు కిన్నర, గంధర్వాదులును సందర్భానుసారముగా నజంతా చిత్రకారంగమున వచ్చుటఁ జూడఁగలము.

బోధిసత్త్వుని యవతార కథలు (జాతకములు)

షడ్దంతజాతకము

ఒకానొక సమయమున బోధిసత్త్వుడు (బుద్ధుడు) హిమాలయ వాసియు, 8,000 యేనుంగుల కధిపతియు నగు నొక గజరాజపుత్రుడై జనించెను. ఈ గజ సమూహమంతయు హిమాలయమునగలషడ్దంతసరోవరసమీపమున నొక బంగారుల్లోయయందు నసించుచుండినది. తత్పరిసరమున నెచ్చట జూచినను తెల్లగలువలు, ఎఱ్ఱగలువలు, తామరలు మొదలగు పుష్పయుతములగు కొలంకులును, నేత్రానందకరమగునట్లు వల్లులు, తమ పైకెగఁ బ్రాకుచుండ, నాటలాడించుకొనుచు బిడ్డలకుత్రేయరాకయొసగి తమపైకెగఁబ్రాకించుకొని యానందించు తల్లుల వలెనొప్పు వృక్షంబులును గలవనములు నేత్రపర్వముగ నుండినవి. ఇట్టి వనముల మధ్య నాగరాజపుత్రుడు తనకళత్రద్వయముతో సుఖంబుండి యొకనాడు తనయొక కళత్రముఖకు గోపము గల్గించిన వాడయ్యెను. తదాది యాకరిణి భర్తయెడ ననూయాగ్రస్తయై తానొకయప్రతిమాన సౌందర్యవతియై జన్మించి కాశీరాజునకు భార్యయై తన సౌందర్యాతిశయమున రాజును వశంవదునిగావించుకొని తన్మూలమున తన వైరమును సాధింప నెంచెను. రాజుచే వేటకాండ్రను పంపునట్లుచేసి విషబాణమున తన భర్తను జంపించి షడ్వర్ణకిరణముల వెదజల్లు ప్రభావముగల యాతని దంతముల దెప్పించుకొని తన పగ దీర్చుకొన సంకల్పించుకొని జన్మాంతరమునుగోరి చింతించుచుండెను. తదాది నిరాహారయై కృశించి కృశించి తుద కాకరిణి మరణించెను.

తన కోరిక ప్రకారముగనే యా యేనుగు సుందర స్త్రీజన్మము నొంది కాశీరాజును చేపట్టెను. ఆమె తత్‌క్షణమే యొక వేటకాని నక్షవులకు పంపి తన తొలిజన్మమున భర్తయైయుండిన గజమును వెదకించెను. వేట



గుహాలయమున లోకప్పులోని సొరుగుబిళ్లలయందుగల అలంకారచిత్రములు, చిత్రములకుమధ్య నడ్డముగాగల భాగములను కఱ్ఱసామానని గ్రహించునట్లుగా దారు రేఖలతో చిత్రించియున్నారు.



కుడ్యోపరిచిత్రములలోని హస్తవైఖరులు. హస్తములే యెంత భావగర్భితములై యున్నవో చూడుడు

మిక్కుటమై యామె వెంటనే మరణించెను. షడ్వర్ణకిరణముల నీనుదంతములుగాన సావర్ణము లాటెంటిని ఆఱుదంతములుగా నన్వయించి యీ బుద్ధజన్మాంతర చరితను "షడ్దంత జాతకమనివాడెదరు.

రురుజాతకము

ఒకానొకవర్తకుడు ధనికుడుండెను. వానికొక కుమారుడుకలడు. తల్లిదండ్రులచే నతిగారాబున పెంపబడి ధనసమృద్ధిచే వాణిజ్యపుత్రుడు కన్నుగానక తనచే జిక్కిన ట్లాయాస్తినంతయు వ్యయపఱచి యప్పులపాలయ్యెను. తుదకు ఋణదాతల బాధల దాళజాలక యతడు ప్రాణత్యాగమున దన కష్టముల బాపుకొన దలంచి గంగానదిలో దుమికెను. నీటబడిన వెంటనే యతడు ప్రాణములపై యాసమరల బాధింప వచ్చుటను ధైర్యము చాలక యతికరుణముగా రోదించెను. బోధిసత్త్వుడు హరిణముగా జన్మించియుండెను. తన మందను వీడి యొంటరిగ గంగానదీ ప్రాంతములదిరుగుచుండి యావణిక్పుత్రుని యాక్రందనమును విని యతనిగా పాడియతనిరొుక్క తన్నెవరికిని పట్టీయకుండునట్లు వాగ్దానము గావించుకొని పంపెను.

ఒకనాటి రాత్రి యావణిజు డుండు పట్టణమున రాణి యొకస్వప్నముకనెను. తన కొకబంగారులేడి తత్త్వమును బోధించినట్లామె స్మరించెను. వెంటనే యామె కురంగమునకై కాంక్షించెను. దానిని పట్టివ్వనని వాగ్దానము గావించియు కృతఘ్నుడగు వర్తకపుత్రుడు హరిణాన్వేషణతత్పరుడగు రాజునకు దానియునికి పట్టును జూపెను. దేదీప్యమానముగ వెలుగుచుండు నట్టియు స్వర్ణవర్ణగాత్రముకల యామృగమును చూచినంతనే రాజు పరవశుడై దాని నేయ నెత్తిన బాణమును జారవిడిచెను. పిమ్మట నామృగమును మహోత్సవముతో నూరేగించుకొని తన రాజధానికి గొంపోయి దేవి కిచ్చి తదాది సకల ప్రాణులకును రక్షకుడనై యుండుదునని దీక్ష వహించెను.



# ప్రణయప్రభాతము

చిట్టోజి సత్యనారాయణగారు, బి. ఏ.

పాకలో సిగాలి సోకితే సాలు
వొయికుంటమే నాకు వొచ్చినట్లేను! పాక!

యిడుపు పొలమూలంటె యిడి శెల్లుతాను
పట్టమంటే సర్లె కొట్టమంటాను! పాక!

కారడివి నడిమికే పారి పొమ్మంటేను
శెట్లతో నీమాట శెప్పుకుంటాను! పాక!

వొక్క మావిడికినీ సక్కనీ పేరెట్టి
దానికిందా నేను తల దాసుకొంటాను! పాక!

తెప్పలో నన్నెట్టి తేలిపొమ్మంటేను
నిన్ను తలుసుకొంటా నేనెల్లిపోతాను! పాక!

నిప్పు గుండాల్లోను నిలుసుండ మంటేను
మనుసునీమీదెట్టి మాడిపోతాను! పాక

మనుట సహాయనిరాకరణపాషండులమతము. విదేశీయు లగు తెల్లవారిని వెనుకలేక భారతభూమినుండి జడల గొట్టగల్గుటయే స్వరాజ్యానుభవమున కానవాలనుట తామసభక్తుల పరిజ్ఞానము. స్వరాజ్యము,కట్టులేని స్వేచ్ఛకు పేరనుట జాడ్యమనస్కుల యభిమతము. కైంకర్యము లేని యధికారమె స్వరాజ్యమనుట గ్రామసంత్రాసకుల (Village Tyrants) యభిప్రాయము. పాతకాలపు సనాతన ధర్మదర్శనులకు కంకంటి పాపరాజు

సీ. సుతులు లేక కలంగు సుదతు లెక్కడ లేరు,
　　పతివియోగము చెందు సతులు లేరు
పతులఁ బాసిన కళావతు లెయ్యెడను లేరు,
　　పడఁతులఁ బాసినపతులు లేరు,
దారిద్ర్యదుఃఖసంతప్తు లెందును లేరు,
　　కలిమి గర్వముఁ జెందుఖలులు లేరు,
వ్యాధుల బాధల వగచువారలు లేరు,
　　నిందలొందినవార లెందు లేరు,
గీ. లేరు జారులు చోరులు లేరు దుర్వి
చారు లగ్నిబాహిత్యష్టాతభాది
వాతదుర్భిక్షభయయుతులైనవారు లేరు
రఘుకులోత్తంస! నీయేలు రాజ్యమునను.

ఆనుపద్యమున కనయుత్తరరామాయణమున వర్ణించినట్లు రామరాజ్యము స్వరాజ్యమని తోచునేమో?

ప్రజలకష్టములు తగ్గుటయుసౌఖ్యములు హెచ్చుటయు ఇట్టి వివిధాశయములకు సామాన్యాంశములయి యుండబట్టి స్వరాజ్యానుభవమున కారెండేలక్షణములను యనువాదము ఈవ్యాసపు శీర్షికలోని సమస్యకు సిద్ధాంతమని యనేకులు భ్రమించవచ్చును. కానికవమయినను (test) స్వరాజ్యపరమార్థమును తూచుటకు చాలదు. అఫ్ఘనిస్థానము స్వతంత్రరాజ్యమే. అట్లున్నను అక్కడి ప్రజకు ఈదేశీయులకుండునన్ని సౌకర్యములున్నవని చెప్ప రాదు. పారసీకమందును ఇప్పుడిప్పుడు స్వాతంత్ర్యము గడించిన తురుష్కమందును గల స్థితులను పరికించినపుడు, ఆరాజ్యతంత్రములందు ప్రజాహితమునకై మనదేశమందుండునన్ని యుపకరణము లుండవనుట కనుగొనవచ్చును. అంతయేల, సంపూర్ణమయిన స్వరాజ్యపద్ధతికి పుట్టినిల్లను ఉత్తర అమెరికాయందు మూగజంతువుల బొమ్మ ధరించుట జనులు అలంకారముగ భావించి అందుకై సంవత్సరమున ఇరువదిలక్షల జంతువులు ఉక్కుపంజరముల యందు చిత్రవధకు పాలుపరచబడుచుండుట ఇప్పటి యాచారమైయున్నది. ఇంగ్లాండున నేడు లక్షలకొలది జనులకు కూడులేక 'అన్నమో రామచంద్ర'యని యల్లాడుచున్నారు. వారయినను, కుంటి, గ్రుడ్డి కురూపులగు చేతకానివారుకారు. కడచిన ఘోరసంగ్రామమందు బ్రిటిష్ సామ్రాజ్యమునకే జయ మాపాదించినవారి శేషులగు వీరవరులలోనివారు. దేశాభిమాన తత్పరులు. యుద్ధమునకై చేసిన కోట్లకొలది ఋణముపై వడ్డీ యయినను చెల్లించుటకు తెరవుగానక నేడు అట్టి ఇంగ్లాండే తల్లడిల్లుచున్నది. ఇప్పటి కార్మిక ప్రభుత్వమువారు (Labour Govt.) ఈభారమును ప్రజలనుండి తగ్గించుటకై యుప పన్నులనువారి మూలధనముపైన కన్నువేయ నారంభించుచున్నారు. ఇట్టి విపరీతపు పోకడలకు రష్యా మరియొక నిదర్శనము. ఈ సామ్రాజ్యము చిరకాలము నిరంకుశ ప్రభుత్వమునకు లోనైయుండి దౌర్జన్యజాలక, నిరంకుశాధికారమును ధిక్కరించి అంతకుముందున్న కట్లను త్రెంపుకొనుటయే విముక్తియని తలచి బంధముం బరిత్యజించుకొనిరికాని, పరిణామమందు తామెదురుచూడని యుచ్ఛృంఖలప్రవృత్తి ప్రజల నావరించి, యామూలమున దేశమే పడరాని కడగండ్లపాలయి, చేయునది లేక త్రెంపుకొన్న వెనుకటి కట్టులను ఒక్కొక్కటిగ వెదకి కొన నారంభించుచున్నది.

చిరకాలముగ స్వాతంత్ర్యము ననుభవించు సామ్రాజ్యము లగతియే యిట్లుండ మనకురాబోవు స్వరాజ్యమన మాత్రము చిక్కులుండవనుట యపభ్రాంతి. రాజ్యభారమంతయు నెత్తినపడి ప్రజలే నిర్వహించ బూనినపుడు, క్రొత్తసంసారమును సమకూర్చుకొనుట యందువలె మనము సవరించుకొనవలసిన సమస్యలు సర్వతోముఖములయి మనల నావరించనున్నవి. భిన్నజాతుల యెడల చెలిమి, హిందూమహమ్మదీయసఖ్యము, కులభేదముల సవరణ, సంస్థానాధీశుల సమాధానము, వాణిజ్య నావికా వాణిజ్యసరణి, భూమ్యాకాశసముద్రములందు రాణువుల నెలకొల్ప నిర్వహించుట, ఆర్థిక సంపదుద్ధారమునకై యంత్రసాధన సంపత్తి మున్నగు వేనవేలు సమస్యలు ప్రజల నెదుర్కొననున్నవి. ఇట్టి సందిగ్ధసమయమున

స్వార్థపరతను నిగ్రహించు వనవరము తీవ్రముగ నన్ని దిశల వ్యాపించును. అతిరూపమున 'స్వరాజ్యము స్వరాజ్యమో'యని ఇపుడు పలవరించు మనలో ననేకులా 'ఇది యేటి పీడ'యని విసుగుకొనుకాలమువచ్చినను రావచ్చును. స్థానిక పరిపాలన శాఖయందు (Local Self Govt.) ఇపుడు ప్రజలకు సంఘటించియుండు స్వాతంత్ర్యానుభవము ఇట్టి కోపటకుమవ్వు.

ఇట్టి ప్రమాదముల చేయి త్రిమూకి యూపర్పితాకబర్పనముచే స్వరాజ్యభాగ్యము నాశింపువారిని భయపెట్టవలెననుట ఈవ్యాసకర్త యాశయముకాదు. ప్రజలు ఇట్టి విపత్తులను మునుమున్నగా తెలిసి కార్యము నెరవేర్పవలెననుటయే. హిందూ మహమ్మదీయ స్పర్థలు నిమ్న జాతుల సంత్రాసము ఆ ధీరోదాత్తుడగు మహాత్మునే కలవర పెట్టుచుండునపుడు శక్తిలేని వారన నెంత!

'నేతి నేతి' యను సిద్ధాంతసరణిని ఉపమగా గైకొని యియ్యదిస్వరాజ్యము కాదన సూచించుట సులభమయి యుండునేమో కాని దాని పరమార్థము అనుభవము చేతనే గ్రహింపనగినది. స్వరాజ్యామృతము దానిని చవిగొన్నవారికే వేద్యమనిన తప్పుకాదు.

ఐహిక స్వరాజ్యము ఆముష్మిక మోక్షపదమునకే చరమ సోపాన మనజెల్లు. స్త్రీజన్మమునకు మాతృత్వ మెట్లు భాగధేయమో వృక్షవర్గమునకు ఫలపుష్ప భరమెట్లునియతియో జాతీయతకు స్వరాజ్యానుభవ మట్లు. కనులకు వెలుతురెట్లో ప్రజ బ్రతుకునకు స్వరాజ్య మట్టి వన్నెగడ. ప్రయాణమునకు రైళ్లెట్లో ప్రజాభ్యుదయమునకు స్వరాజ్య మంటిటి మహోపకరణము. బరువు నీవ్వు సాగబండికి అడుగున వేసి యుండు ఇనుపకమ్మి లెట్లు సౌలభ్యకారణమో జనుల జీవయాత్రకు స్వరాజ్య మట్టి సాధనోపాయము. ఈ పరమార్థము ప్రజలనునను నావేశించునేని దాని సాధనకై సంతోషముగ సమర్పింపబడలేనంటిటి త్యాగము మరియొకటి లోకమందుండదు. ఏదేశచరిత్రయందుగాని స్వాతంత్ర్యమునకై తమయసువుల సమర్పించిన వీరవరుల స్మృతి ఆకసమున చుక్కలవలె వెలుగుచుండును. అట్లుకాదేని కడచిన ఐరోపా మహాసంగ్రామ మందు పాల్గొనిన యోధాగ్రేసరులు తమదేశస్వాతంత్ర్య రక్షణకై తమప్రాణములనే యొక్కుమ్మడిగ సమర్పింపుట తటస్థించి యుండదు. స్వరాజ్యమునకు మూలమగు త్యాగమునకు కిదియే పరిమాణము.

స్వరాజ్యమన నిర్దిష్టమగు స్థలముకాదు. సముదాయమున ప్రజల మనోవీథియం దుదయించు స్వాతంత్ర్యదర్శనము (Scene of Freedom). తలుపులును కిటికీలును మూసియుండు ఇంటి తలుపుల రెండట్లు సందునుండునా! ఎట్లు లోపల ప్రవేశింతునా! యని కాచుకొన్న కైలులెవల వ్యాపించి యుండునో అట్లే స్వాతంత్ర్యము జనులమనోవృత్తుల నాకరించుట కు సాన్నిధ్యమందే వేచియున్నది. స్వరాజ్యభారము చుల కనగాదు. ఘనతరమే దాని లక్షణము. దాని రక్తమెరిగినవారు ఆభారమును ధరించుట కుద్విగ్నులగుదురు. అట్టి భారవాహిత్వమునకు విశ్రాంతి బరువుకొగ్గించుటయందు కాదు. దానిని మోయుశక్తి హెచ్చుటయే. తల్లికి బిడ్డల బరువట్లో, వివేకవంతమగు ప్రజకు స్వరాజ్యభారమట్లు. తల్లియెప్పుడైనను తనబిడ్డల బరువుకొగ్గవలెనని తలంచునా? దినదినము తనబిడ్డలు పుష్టిగలవారలగుకొలది తనయందు వారల జంగనిడుకొనుటకు శక్తి హెచ్చుచుండవలెనని కోరును.

ఇట్టి మహత్తరభాగ్య వీక్షణమున దేశమునే యూదుకొన రాబోవుచున్నది. విభిన్నపక్షముల ప్రజాప్రతినిధులు రాజసభలందు నిల్చి

గా. తాబంధములన్నియూడ్చి, యమరాగారావపత్రాళి
నెంతో శోభిల్లజుటించి తోరణములన్ తుష్టిన్ సుధా
లేపన, ప్రాశస్త్యం బొడగూర్చి భక్తిమయదీపం
బుంచుమానీంద్రమ్ము,తో హెచ్చింబున్ గన వాసయోగ్య
ములు నీకున్ ధర్మచింతామణీ!

వడ్డాది సుబ్బారాయుడు.

అని కైవారములపాడి రానున్న స్వరాజ్యలక్ష్మికి స్వాగత మొసగుచున్నారు.

అమహాదేవి వచ్చినిల్చుటకు ప్రజాహృదయ సింహాసనమును నిర్మలముగ సిద్ధపరతురా? జాతివైషమ్యముల విడనాడుదురా? కులభేదముల బోకార్తురా? అస్పృశ్యతాపిశాచమునకు పుణ్యాహవాచనము చెప్పుదురా? స్వార్థ

మను యజ్ఞపశువునవధించి యాగమొనర్తురా? అల్లదిగో! గాంధీపురోహితుడు, మీతో సంకల్పము చెప్పించుటకు సంసిద్ధుడై యున్నవాడు.

'ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య
వరాన్నిబోధత' (?)

యనుమహామంత్రము నుపదేశించ లేచియున్నాడు. ప్రజలేమిచెప్పెదరు.

క. కొందరు వెనలున నందురు
కొందరు వెసలుటరయు సిగ్గుగోను గోవిందుం
డందురు కొందరు మదిలో
కొందలమందుదురు కడకు గొని మనుజేంద్రా!
(గోపికా వస్త్రాపహరణము, భాగవతము)

ఇట్టిసంశయమున కిది తరుణముకాదు.? భవసముద్ర ణముయొక్క మహాఫలము మున్న మనమూహించ లేము. స్వాంత నివేసన మొవచ్చిన పిదపగాని దాని రసానుభవమున కర్హత సాధగదు. అది సాధగినపుడు గోపికలవలె

గీ. చీరలపహరించి, సిగ్గులు విడిపించి,
పరిహసించి యయినఁ బరగ మనకు
ఘనుఁడు నోము కొఱంత కాకుండ మొక్కించె
నమును హరినుతించి రబలలెల్ల.

అని దేశభక్తులకువా రుపదేశిని సాధనము.



# మ ర ణ భీ తి

దామరాజు పుండరీకాక్షుడు గారు, బి. ఏ.

మరణమా! నన్నేమిచేతువు - మాటిమాటికి బెదరగొట్టెదు
పరమపతితు డనంతమూర్తికి - దరిని కేరి సదాభజించెద;—మరణమా!

ఆలుబిడ్డల వీడజాలక - గోలగోలగ నేడ్చువారిని,
చాలవిభవము విడువలేక వి-చారవార్ధి మునుంగువారిని,
కఫ పరంపర లెగసి తట్టగ - కాళ్లు చేతులు చల్లబడగా
"గావుగావు" మటంచు వైద్యుల - కాళ్లుపట్టి తపించువారిని,
లోకసుఖములె నాకసుఖమని - లోలులై భ్రమసేటివారిని,
జేరుపో నీమాట లచ్చట - జెల్లిపోవును, చెల్లవిచ్చట;—మరణమా!

రామతారక మంత్రరసము ప-రాకు సేయక గ్రోలువాడను,
నేమమున నీ జీర్ణకాయము - నిలిపి నూతనవస్త్రధారణ
చేసిచేసియు తుట్టతుదకా - శ్రీరమేశు పదాబ్జములనె ని
వాసముగ నేర్పరుచుకొనియెద - భయము నాకేమిటికి ఛీ! ఛీ!
మరణమా! నన్నేమిచేతువు - హరికృపారసమున నశింతువు.

# సూత్రకాల వ్యవసాయ చరిత్ర

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

క్రీ. పూ. 1000 మొదలు క్రీ. పూ. 500 వరకు సూత్రకాలచరిత్రమును వ్రాయుటకు కల్పసూత్రములు, జైమిని పాణిని ఆపస్తంబ గౌతమాది మహర్షులచే రచింపఁబడిన పూర్వమీమాంసా వ్యాకరణ ధర్మశాస్త్రగ్రంథములు; మహాప్రఖ్యాతినొందిన మనుస్మృతి, తోడ్పడినవి. ఈకాలపుజనులు, ఋగ్వేద శాస్త్ర కాలములజను లవలంబించిన వ్యవసాయవిధులకంటె హెచ్చుసువిధులచే వ్యవసాయముఁ జేసి లాభమునొందిరి. భూమికిఁ దగిన దోహదముఁ జేసి, తగినబీజమును విత్తినచో ఫలాభివృద్ధి కలుగునని నాఁటివారు తలంచుచుండిరి. చూడుఁడు :

(1) (వరిమొదలగు) ఓషధులకు, (మామిడిమొదలగు) వృక్షములకు, భూమికిఁ దగిన దోహదవిశేషమునందు, బీజమునకుఁ దగినఫలాభివృద్ధి కలుగును.

పైసూత్రార్థముచే నాఁటివారు తేభూమి కేదోహదముఁ జేసి యేబీజములను నాటిన ఫలాభివృద్ధి కలుగునో దానిని బాగుగ గుఱుతెఱిఁగిరని నమ్మవలసియున్నది.

శ్రౌతకర్మలలో "చైన" భేదమున యజ్ఞస్థానమును దున్నెదరు. ఈ దున్నుటకు, యజురథర్వవేదములయందు విధులు కలవు. ఆవిధులే లౌకికకర్షణమునకును బనికివచ్చునని, సాయనాచార్యులవారు తమ కృష్ణయజుర్వేదసంహితాభాష్యమునం దిటుల వ్రాసిరి.

(2) మూడగకలతో చివరనుండి మొదటికి దున్నగా మూఁడుచాళ్లేర్పడును. కాని మూఁడుచాళ్లయొక్క మధ్యభాగము పూర్తిగ పెల్లగింపఁబడదు. కాన యీయకలను ప్రదక్షిణముగాఁ ద్రిప్పి తూర్పుపశ్చిమములకు దున్ని పిమ్మటను దక్షిణమునుండి యుత్తరమునకు దున్నిన రెంటిల భూమి బాగుగ దున్నఁబడును.

ఇటులనే యజుర్వేదసంహితయొక్క (3-17) మంత్రమునకు భాష్యమును వ్రాయుచు విద్యారణ్యులు, లౌకిక, వైతానిక, సూత్రములను క్రోడీకరించి, పై యజుర్వేదభాష్యమున వ్రాయఁబడినదానినే దృఢపఱచియున్నారు. అందు స్వల్పభేదములే కాన్పించినందున గ్రంథము పెరుఁగునని వ్రాయలేదు. దానిపర్యవసానము నాలోచింపఁగా యజమాని కొంతదున్ని, భృత్యునకుఁ బిమ్మటనిచ్చి దున్నించుటయే విశేషమని తోఁచునది. ఇందు యజమాని శ్రద్ధావిశేషము కాన్పించును. "కాశిక సూత్రీకులు" తమపొలము బాగుగ పండవలెనని "కృషిలాభకర్మ" యను నొకకర్మఁ జేయుచుండిరి. దాని నిట వ్రాయుచున్నాఁడను.

(3) కృషిలాభకర్మయందు బాగుగ పండిన యన్నమునందు వెన్న, గుగ్గిలము, పసుపు, ఉప్పు వేసి "సీతే ఇంద్రామహే త్వా" యనుమంత్రమును బఠించి, భుజింపవలెను. పైసూక్తముచే హాలికునిచే మూఁడుచాళ్లు దున్నించి పిమ్మట యజమాని "సీరా

(1) యథౌషధివనస్పతీనాం బీజస్య క్షేత్రకర్మవిశేషే ఫలపరివృద్ధిరేవం॥ ఆపస్తంబధర్మసూత్రం. 2-1-4. (2) కల్ప॥పుచ్ఛా చ్ఛిరోభికృషతి ...ప్రదక్షిణమావర్తయాం తిస్రః తిస్రః సీతా స్సంహితాః కృషతిమధ్యే సంఛిన్నా భవంతి దక్షిణా త్పశ్చా దుత్తరస్మాద్దక్షిణాయై శ్రోణే రుత్తర మంస ముత్తరాయై దక్షిణమ్॥ కృష్ణయజుర్వేద భాష్యం. 5-2-5. (3) కృషిలాభకర్మణి, సాయూపవత్సే ఓదనే సర్పిర్పింజసగ్గులులవణాని ప్రక్షిప్య అనేన సూక్తే సంపాత్య అభిమంత్ర్య అశ్నాతి "సీతే ఇంద్రామహే త్వా" ఇత్యృచా హాలికేన కృష్యమాణా తిస్రః సీతా కర్తా ప్రత్యేక మనుమంత్రయతే. అత్ర "సీరాయుంజంతీతి" యుగలాంగలం ప్రతినోతి దక్షిణం ఉష్టారం … మం యునక్తి—కౌశికశ్రౌతసూత్రం. 3-3-11.

యుంజంతి" అనుమంత్రముఁ బఠింపుచు, విశేషముగ దున్నుచున్నాడు. ముందు దక్షిణమునుండి యుత్తరము నకు దున్నుచున్నాడు.

"వైతానిక"సూత్రీకులు ముందు తాము దున్ని, పిమ్మట భృత్యునిచే దున్నించుచున్నారు. అది భృత్యున కుపదేశమాత్రమై యున్నది. కౌశిక సూత్రీకులు ముందు భృత్యునిచే దున్నించి తృప్తినొందక పిమ్మట, తాము దున్ని శ్రద్ధాధికతను జూపుచున్నారు. రెండును, వ్యవసాయమునందలి శ్రద్ధనే సూచించుచు "కృషిలాభకర్మ" యనుటకుఁ దగియున్నవి. వైతానసూత్రములో (5-1) "కృతేయోనౌ" అనుఋక్కును బఠింపుచు విత్తనములఁ జల్లవలెనని కలదు. ఋగ్యజుస్సామవేదీయుల కంటె నథర్వవేదీయులు 'దున్నుట, విత్తుట' యనుకర్మల నతిశ్రద్ధతోఁ జేసి విశేషలాభము నొందుచుండిరని తోఁచుచున్నది. కృషికర్మకుఁగూడ వివిధసాంప్రదాయములు ప్రాచీనకాలమునుండి నేటివరకును గలవు. మఱియు దున్నుట, విత్తుట, వేదకాలమునుండి నేటివఱకు శుభకర్మగా నాలోచించి ద్విజులు తమయిండ్లలో జరుగు వివాహోపనయనాదులలో "అంకురారోపణము" అను కర్మ చేయుచున్నారు. ఆకర్మయం దయిదుమూఁకుడుల దీసికొని, పుట్టమట్టితో వానిని నింపి, తొమ్మిదికంటె హెచ్చుగురకములవిత్తనములఁ బాలతో జడిపి పైమూఁకుడులలోఁ జల్లెదరు. విత్తనములఁ జల్లినమూఁకుడు లయిదింటికి, 'పాలికలని' పేరు. ఈపాలికలకు, శుభకర్మ జరుగుదినములలోఁ బూజ సలుపుదురు. పాలికలలో మన్నును బోయునపుడు, "ధూమ్రాద్దేవతాక"సూక్తమును విత్తనములఁ జల్లునపుడు "ఓషధీసూక్తమును" బఠింతురు. అందు మంత్రపఠనములో నొక్కొక్క వేదశాఖవారి కొక్కొక్కసాంప్రదాయ విశేషము కలదు. "అంకురారోపణకర్మ" యీ సూత్రకాలమునసే బయలు దేరెను. ఆపస్తంబాదులు, పుట్టమట్టి తెచ్చి పాలికా ప్రతిష్ఠాపనతోఁ దృప్తినొందిరి కాని "పారస్కరగృహ్యసూత్రకారుఁ"డంతటితోఁ దృప్తినొందక శుభకర్మ చేయుటకుఁ బూర్వమే, మంచిముహూర్తముఁ జూచికొని, పాలములో దున్ని విత్తనములఁ జల్లవలెనని విధించుచున్నాడు. ఆగృహ్యసూత్రమునుండి కావలసినయంశముల నిట వ్రాయుచున్నాను.

(1) పుణ్యదినమున నాఁగలిని గూర్పవలెను.

(2) ఎద్దులను, పెఱుగు, నెయ్యము, పరిమళద్రవ్యములచే నర్చించి వానిచేఁ దేనెను నేతిని నాకింపవలెను.

(3) "సీరాయుంజంతి" యనుమంత్రముచే నాఁగలిని గట్టవలెను.

(4) "సువర్ణసుఫలా" యనెడుమంత్రముఁ బఠించుచు దున్నవలెను. లేక కఱుకోలనైనఁ బట్టుకొనవలెను.

(5) అఱకలవాండ్రలో వెంబడివాని నభిషేచించిన పిమ్మటఁ దక్కినవారు వాని ననుసరించి దున్నుట కారంభింపవలెను.

(6) స్థాలీపాకదినముకంటె పూర్వదినమునందే యాసీతాదేవిని బూజింపవలెను. వ్రీహులగాని యవలగాని చల్లవలెను. వ్యవసాయారంభమును, నీప్రకారమే చేయవలెను.

(7) పిమ్మట బ్రాహ్మణులకు భోజనము వెట్టవలెను.

వ్యవసాయదారులు నేటికిని, శుభనక్షత్రాదులఁ జూచికొని "ఏఱువాక" యనునొకకర్మ నమంత్రకముగాఁ జేయుచున్నారు. ఆకర్మను వృషభహలములఁ బూజించి తా మలంకరించుకొని, మానప్రదమూని చేయుచున్నారు. మఱికొందరు (గోదావరీమండలవాసులు) "దొంగఏఱువాక" యను పేరుతో, ప్రతిఫాల్గున బ 30 నాఁటిరాత్రి, శుభాశుభములను విచారింపకయే చేయుచున్నారు. దీనికిసమ్మతమే ప్రధానముగా నున్నది.

---

1. పుణ్యాహే లాంగలయోజనం; 2. దధ్నా తండులై ర్గంధై రిష్ట్వానడుహో మధుసర్పిః ప్రాశయేత్; 3. సీరా యుంజంతీతి యోజయేత్; 4. సువర్ణసుఫలా ఇతి కృషేత్ ఫాలం వా లభేత; 5. అగ్రే మత్యేషి చ్యాకృష్టం తథా కృషేయుః; 6. స్థాలీపాకస్య పూర్వవద్దేవతా యజేదుభయో వ్రీహియవయోః ప్రవప న్సీతాయజ్ఞేషు; 7. తతో బ్రాహ్మణభోజనం—"పారస్కరగృహ్యసూత్రం" (13 కండికా).

హలకర్మారంభమునకు, "మాహూర్తిక" గ్రంథములలోఁ గొన్ని నిబంధనలు కలవు. వాని ననుసరించియే సిద్ధాంతులు, తమపంచాంగములలో గొన్ని ముహూర్తములను, "వసంతర్తువునందు" వ్రాయుచున్నారు. "పారస్కరుఁడు" తనగృహ్యసూత్రములలో హలకర్మారంభమునకు విశేషవిధులను సూచింపక, జ్యేష్ఠా స్వాతీనక్షత్రములు మంచివని మాత్రము చెప్పియున్నాఁడు. "ఆపస్తంబా"ది సూత్రకారులమతము ననుసరించి,"పాత్రానుక్రమణికా"దిగ్రంథములలోఁ జెప్పఁబడిన యంత్రోపకరణవిధులను గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

## ధాన్యవిశేషములు

శ్రౌతకాలమునందుండిన ధాన్యవిశేషములకంటె సూత్రకాలమునందు నానావిధములగు బీజముల నార్యులు కనుపెట్టి వ్యవసాయముఁ జేయుచుండిరి. శ్రౌతకాలమునఁ జెప్పినవానిని విడిచి యీకాలమునందు వాడఁబడినవానిలోఁగొన్నిటినిమాత్రమే వ్రాయుచున్నాఁడను.

పాణిన్యాచార్యులవారు, తమయష్టాధ్యాయియందు శబ్దనిష్పత్తిఁ జేయుపట్టులలోఁ గొన్నిబీజములను వృక్షములను నుచ్చరించియున్నారు. అందిక్రిందివి ముఖ్యమైనవి. 1కందులు, ఆవాలు, శెనగలు, షష్టికములు (2) ఉలవలు, (3) చెఱకుఁ దోఁటలు, (4) చెఱకుబెల్లము, (5) పసుపు, (6)జీర, ద్రాక్ష, పిప్పలి, చింత,(7) పత్తి, పెన్కుచోఁటులను సొరకాయ, గుమ్మడికాయ, దోసకాయ మొదలగువాని నుచ్చరించియున్నారు. మఱియుఁ పాణిన్యాచార్యులవారు పెన్కుచోఁటులను, బిల్వ, ఖర్జూర, తింత్రిణీ, చూత, శాల్మలీ, పిప్పలి, దాడిమ, కపిత్థ శబ్దములను, అట్టివనములను వచించియున్నారు. దేశమునందు, నానావిధధాన్యములు పండు పొలము లున్నవని యీ క్రిందిపేరులచే రూఢిపరచుచున్నాఁడు (8) పెసలు పండుపొలము "మౌద్గీనము," ఎఱ్ఱజిలకఱధాన్యము పండుపొలము "వ్రైహేయము," తెల్లధాన్యము పండుపొలము "శాలేయము," తెల్లగోధుమలు పండుపొలము "యవ్యము" లేక, "యవక్యము," షష్టికలు (60 దినాలకు పండుధాన్యము) పండుపొలము "షష్టిక్యము," తిలలు పండుపొలము "తిల్యం" లేక, "తైలీనం," మినుములు పండుపొలము "మాష్యం" లేక, "మాషీణం," ఏగిసవఱ్ఱు పండుపొలము "ఉమ్యము" లేక, "ఔమీనము," (పతంజలి ఉమలుధాన్యముకాదనివాఁడు. ఉమయన యగిసెపూస యర్థము) జనుము పండెడు పొలము"భంగ్యము,"నల్లకఱ్ఱు పండుపొలము "అణవ్యము" లేక,"అణవీనము" అనుశబ్దము లనుచున్నవనిరి. దమ్ముచేసి యూడ్చెడినేలలు వాఁడు కలవు. అట్టిపొలములసమూహమునకు, "కైదార్యం" లేక "కైదారకం" అనిపేరు. (పాణిని అష్టాధ్యాయి; 4-2-40) కాని 4, 5 సంవత్సరములకుఁబూర్వమునఁదక, మనదేశమునందలి పాశ్చాత్య వ్యవసాయశాస్త్రజ్ఞులు దమ్ముచేసినయెడల భూమి పాడగునవియు, పండదనియుఁదలంచి యితుల బోధించుచుండిరి. 1907-వ సంవత్సరము ప్రారంభవ్యవసాయశాస్త్రపరీక్షకుఁ బోయినవిద్యార్థులకు "దమ్ముచేసినయెడల కలుగు చెఱుపేమి" యను వర్థమిన్పుప్రశ్నను గూడ పరీక్షాధికారు లడిగిరని జ్ఞాపకము. నేఁడటులుకాక, దమ్మునేలలుగా కొన్ని యుండు టవసరమని, ప్రభుత్వవ్యవసాయశాఖవారు తలంచుచున్నారు. నేటికి మూఁడువేలేండ్ల క్రిందటనే మనదేశీయులు, దమ్మునేలలుగాఁ గొన్ని, మెట్టదుక్కిగాఁ గొన్ని పొలములుండు నావశ్యకతను గ్రహించియున్నారు. బాగుగదున్నుటను పాణిని చెప్పియున్నాఁడు (9)షష్టికలను ధాన్యము అరువదిదినములకుఁ బండునది. ఇది మూఁడువేలేండ్లనుండి మనసీమందూదేశమునందు లాభదాయకధాన్యమై యున్నది. స్మృతికర్తలు షష్టికలను పవిత్రధాన్యమని శ్రాద్ధాదుల కుపయోగింపు మనిరి. ఇది నేఁటి, "దాళువా, గరికసన్న" మనుధాన్యమునకు పితామహస్థానీయ మనవచ్చును. షష్టికలనుధాన్యము విశాఖపట్టణముజిల్లాలోఁ గలవు; అవి షష్టికలేమో. "కలుపు"

---

1. 2-4-3; 2. 4-4-4; 3. 8-45; 4. 4-4-103; 5. 4-4-53; 6. 4-3-167; 7. 4-3-136; 8. ధాన్యానాం భవనే క్షేత్రే ఖఞ్, (5-2-1) వ్రీహిశాల్యోర్ఢక్ (5-2-2) యవయవక షష్టికాద్యత్ (5-2-3) విభాషాతిలమాషోమాభఙ్గాణుభ్యః (5-2-4); 9. కృష్టేశ్ఛందసి. 7-4-64.—అష్టాధ్యాయి సూత్రములు.

సస్యమునకు నడుమ బయలుదేరిన యనవసరపు మొక్కలు తీయుపద్ధతిని నాఁటివా రెఱుఁగుదురు.

(1) పైరుఁ బెట్టువాఁడు, పైరునందలికలుపు నూడఁబెఱికి యెటులు పైరును గాపాడునో.

పైనిచెప్పిన సస్యములేకాక "వల్లులి" కలవని గౌతమసూత్రమునందును, చెఱుకుపానకమును గూర్చి "ఫాణిత" మనుమధురద్రవ్యమును, వండుచుండిరని, ఆపస్తంబధర్మసూత్రమున చెప్పుచున్నది. "ఫాణితము" తేనె పానకమో, లేక, చెఱుకురసమునుండి వండిన "మద్యమో" యైయున్నది. "బావాటా"ని గ్రంథముల లోని వర్ణనలచే, తేనెపానకమని తలఁచుచున్నాను. సూత్రకాలమునందే చెఱుకుతోట లీభరతఖండమున వ్యాపించి, ఫాణితము, బెల్లము, పంచదార వండఁబడుచున్న దని, పాణినికృతాష్టాధ్యాయిలోని పదములచే తెలిసికొనుచున్నాము. అనూచానముగ గుడ, శర్కరాదులకు స్థానమైన భరతఖండమునకు, "జావా, జమైకా"దిద్వీపుల నుండి పంచదార దిగుమతియగుచుండుటకుఁ గారణ మేమై యుండును ? (2) పట్టుబట్టలు, ఎఱ్ఱనిబట్టలు (3) లక్క, లత్తుక, రంగులువేయఁబడినబట్టలు కలవు. వస్త్రములకు, రంగుబట్టలకుఁ బ్రసిద్ధికెక్కినభరతఖండమున కేల పరదేశములనుండి బట్టలు రంగులు దిగుమతి యగుచున్నవి? పంట లెక్కువగాఁ బండుటకుఁగాను "ధాన్యసమృద్ధి" కర్మను "కౌశికసూత్రీకులు" చేయుచుండిరి. గ్రంథవిస్తరభీతిచే దానిని వ్రాయలేదు. పాణిన్యాచార్యులు, ద్రాక్ష చూతాదివనములను, పెక్కుసారు లుచ్చరించుటచే తరుకృషి విస్తారము కల దని తోఁచుచున్నది. వృక్షముల నుండి (4) గుగ్గిలమును, కర్పూరమును దీయుచుండిరి. ద్రాక్షేక్షుఖర్జూరాది మధురద్రవ్యసమృద్ధి కలుగుటచే సూత్రకాలమునందుండి నంతే మధువా (తేనె) వృద్ధి సూత్రకాలమునందు లేదని తలంపవలసియున్నది. శిల్పులయొక్క సూత్రస్థానములు మొదలు, సూర్యమండలపర్యంతముఁ గొలిచెడి సూత్రకాలగణితశాస్త్రజ్ఞులకు భూమిఁగొలత, వర్షపుఁగొలత తెలిసియుండుట లెక్కలోనిది కాదు. పాణిని అష్టాధ్యాయి యందు, భూమిఁగొలతను, వర్షపుఁగొలతను జెప్పినాఁడు. (5) స్వల్పసంఖ్యాకు లగు బ్రాహ్మణులు, విద్యాకృషిలో నిమగ్నులగుటచేతను, వైదికకర్మపరతంత్రులగుటచేతను, అట్టిబ్రాహ్మణులను ప్రభువులు పోషించుచుండుటచేతను క్షత్రియులు రాజకీయపరతంత్రులగుటచేతను, పైరెండు జాతులవారికిని, వ్యవసాయము చేయుటకు సావకాశము లేక, వాణిజ్యవృత్తితోపాటు, కృషి పాశుపాల్యవృత్తులు



చెఱుకురసముతోఁ బంచదారను వండుట

1. "యథోద్ధరతి నిర్దాతా కక్షం ధాన్యంచ రక్షతి." మనుస్మృతి (7-110); 2. గౌతమసూత్రం 7 ఖండ; 3. అష్టాధ్యాయి (4-2-1,2); 4. అష్టాధ్యాయి (4-4-53) (4-2-80); 5. కాండాంతాత్ క్షేత్రే (4-1-2) వర్ష ప్రమాణ ఊలోపశ్చాస్యాన్యతరస్యాం (3-4-32).

వైశ్యులవృత్తులైనవి. అందువలననే నాటిగ్రంథములలో వ్యవసాయవృత్తి, వైశ్యవృత్తియని వ్రాయఁబడినది. శూద్రుఁడు, త్రైవర్ణికసేవకుఁడుగా నాఁడుండెను. పంచముఁడు నేఁడును నాఁడును, ఇంచుమించు సమానస్థితిలోనే యుండి నాఁడు. కొన్ని విధములనే నాఁడే పంచముఁడు, కొంత మంచిస్థితిలో నుండెనని తలంచుచున్నాను. కృషి వాణిజ్యాదులు, వైశ్యుని ముఖ్యవృత్తులనియు బ్రాహ్మ క్షత్రియు లాపదవచ్చిన పుడే కాని వ్యవసాయముఁ జేయరాదనియు, అప్పుడైనను, బ్రాహ్మక్షత్రియులు స్వయముగదున్నక దున్నించి వ్యవసాయముఁ జేయించుకొనవలెననియు బోధాయనాపస్తంబ, గౌతమ, మనుస్మృతులు చెప్పుచున్నవి. గ్రంథము పెరుగునని యాచర్చ యిందు వదలఁబడెను. వ్యవసాయమొకజాతివారి వృత్తిగ నుండుట సూత్రకాలపు భారతీయులకు లాభకరమై కాన్పించెను కాని ప్రస్తుతకాలమున నొకజాతివారివృత్తిగ నుండుట నష్టదాయకముగాఁ గాన్పించుచున్నది. సూత్రకాలపు వాఙ్మయముఁ బరిశీలింపగా, నాఁటి కాలమునందు వ్యవసాయము మహోన్నతస్థితిలో నున్నదని తోఁపగలదు. నాఁటికాలపుసర్వశాస్త్రవేత్తలు ప్రభువులు, ప్రజలు సుఖముగ జీవించుట కనువగుపద్ధతులఁ గని పెట్టిరని నాఁటిగ్రంథములవే నూహింపఁ బడుచున్నది.



గ్రామమును కొలతచేయుట

## పశువర్ధనము

ఈ కాలమున భరతఖండమునందు పశువు లత్యభివృద్ధి నొందినవి. గ్రామనిర్మాణముఁ జేయునపుడు ముందుగ పశుసౌఖ్యమునే గమనించుచుండువారు. చూడుఁడు:

(1) పశువులు గ్రామసమీపమున స్వేచ్ఛగ సంచరించుటకు గ్రామమునకు చుట్టును, నాల్గువందలమూరల దూరము



గ్రామపరిసరము - పశువులు

1. ధనుశ్శతపరీహారో గ్రామస్య స్యాత్సమంతతః; శమ్యాపాతా స్త్రయో వాపి త్రిగుణో నగరస్యతు. తత్రా పరివృతంధాన్యం విహింస్యుః పశవో యది; నతత్ర ప్రణయే ద్దండం నృపతిః పశురక్షిణామ్. మనుస్మృతి 8—237,238.

వరకు మందబయలు నేర్పరుపవలెను. లేక బలముగల వానిచేత విడువబడినమాడు కోలలుపోవు దూరమువరకైనను మందబయలు నేర్పరుపవలెను. పట్టణమునకు మూడురెట్లధికముగ మందబయలు నేర్పరచవలెను.

ఆమంద బయలులో కాపుసల చేయని ధాన్యాదులను పశువులు తినినయెడల పశుపాలకుఁడు దోషికాఁడు.

ప్రాచీనకాలమున నేర్పరుపఁబడిన మందబయళ్లగుఱుతు లింకను నామమాత్రముగ నున్నవి. ఈమంద బయళ్లు గోదావరి, కృష్ణా డెల్టా గ్రామములలో క్షీణించి క్షీణించి నా[illegible]పలమూరలకుబయలు, నాలుగుమూరలైన లేనస్థితి కలవై యున్నవి. మందబయళ్లు లేని గ్రామములలో మంప లెటులుండును ? ఇందునుగుఱించి, యాంగ్లకాల చరిత్రలో వ్రాయఁగలను. మనువు చెప్పిన చొప్పున మంద బయళ్లు, హైదరాబాదు రాజ్యమునను పశ్చిమాంధ్ర రాష్ట్రమునను కొన్నిచోటులఁ గాన్పించుచున్నవి. మను స్మృతిలోఁ జెప్పినదానిని, గౌతమధర్మశాస్త్ర మిటులు బలపఱచుచున్నది.

(1) గోగణము దేశమునఁ దీకింపఁబడిన నది ప్రభుదోషము, పశుపాలకుఁడు రక్షింపకపోయినచో నది పాలకునిదోషము. దారిసమీపమునందుండిన పొలము కాపుసల చేయకపోయినచో నందుఁ బశువులు పడినయెడల, కొంత పొలమువానిది కొంతఁ బశువుల కాపరిదియు నగు దోషమగును.

గ్రామసమీపస్థ క్షేత్రాధికారి తనపొలము నకు, ఒంటెకుఁ గనఁబడనంత యెత్తుగఁ గంచెను వేసికొనవలెనను విధిని మన్వాదిస్మృతులు చెప్పుచున్నవి. ఎద్దుల నాబోతులనుగా, నథర్వవేదకాలముననే విడుచుటకుఁ బ్రారంభించిరి. అది యీసూత్రకాలమున వృద్ధినొందెను. పశుసంబంధమగు నభియోగాదులకు మనుస్మృతియం దట్టి నిబంధనలు కలవో దిఙ్మాత్రముగ నుదాహరించుచున్నాము.

( ) ముక్కుత్రాడు తెగికాని కాడి విఱిగికాని ఎద్దువలనగాని బండివలనఁగాని, మఱియొకని కాపద సంభవించినయెడల బండియజమానిని దండింపరాదు. పశువులను మేపువాఁడు పగలు పశువులఁ దోలుకొనిపోయినది మొదలు రాత్రి యజమానికడ నప్పగించునంతవఱకు నాపశువులకును పశువులవలనఁ బైరులకును గలుగునష్టమును, పశుపాలకుఁడే భరింపవలెను. ఇంటికడ నొప్పఁజెప్పినపిమ్మట యజమానుని దగును. మందలోఁ జెడిపోయినను, క్రిములు మొదలగువానిచేఁ జంపఁబడినను, కుక్కలు మొదలగువానిచేఁ గఱవఁబడినను, మిట్టపల్లములఁబడినను, అశ్రద్ధగా మేపుటవలన నశించినను, కలిగెడి పశునష్టమును మేపువాఁడు భరింపవలెను. పశువులు తమంతట నవియే యడవిలోఁ జచ్చినయెడల యాపశువుల చెవులు తోక సండ్రుకలు గోరోచనము కొమ్ములు మొదలగునవి పశుపాలకుఁడు యజమానికి నమ్మకముకై చూపవలెను.

పశువులబీడులు విస్తారముగ నాఁడుండెను. "వ్రజ, గోచర" శబ్దములను "పాణిని" అష్టాధ్యాయియందుఁ బెక్కుసారు లుచ్చరించుటచే, దేశమునం దనేక ప్రదేశములలో, గోశాల లుండెనని తలంపవలసియున్నది. ఋగ్వేదకాలమునం దారంభింపఁబడి, సూత్రకాలమున వృద్ధినొందిన పశువైద్యము స్మృతికాలమున విశేషాభివృద్ధి నొందెనని క్రిందినిదర్శనములచే నూహింపఁబడుచున్నది.

"అల్గండువు" అను క్రిమి గోశరీరమున వ్యాపించి రక్తమాంసములఁ బీల్చును, తోక చివర నంటుకొనును. ఈ క్రిమికిఁ దగినచికిత్స:( )గోశరీరగతమగు "నల్గండువు" లను నశింపఁజేయుటకు "ఇంద్రస్య యామహీ" యనెడి యథర్వసూక్తముచే నేతితో నల్ల సెనగలను హోమము చేయవలెను.

1. పశుపీడితే స్వామిదోషః, పాలసంయుక్తేతు తస్మిన్, పథి క్షేత్రే అనావృతే పాలక్షేత్రికయోః॥ గౌతమధర్మసూత్రం. 12 ఖండ.; 2. శ్లో. ఛిన్ననాస్యే భగ్నయుగే న దండం మనురబ్రవీత్. 8-291,292, శ్లో. దివా వక్తవ్యతా పాలే రాత్రౌ స్వామిని తద్గృహే, యోగక్షేమేఽన్యథా చేత్తు పాలో వక్తవ్యతా మియాత్. 8-230, శ్లో. నష్టం వినష్టం క్రిమిభిః శ్వహతం విషమే మృతమ్, హీనం పురుషకారేణ ప్రదద్యాత్పాల ఏవతు. 8-232, కర్ణౌ చర్మచ వాలాంశ్చ వస్తిం స్నాయుంచ రోచనామ్, పశుషు స్వామినాం దద్యాత్ మృతేష్వంగాని దర్శయేత్. 8-234. మనుస్మృతిః; 3. "ఇంద్రస్య యామహీతి" ఖల్వాంగాన్ అల్గండూనాన్ ఘృతమిశ్రాన్ జుహోతి. వాలాన్ అసితే కాండే సవ్యం పరివేష్ట్య సంధినత్తి ప్రతపత్యాదధాతి పశ్యేన దక్షిణాముఖః [illegible]ంగుష్ఠం ఉపమస్య కిరతి. సమ్యద్నాత్య దధాతి. (కౌశికసూత్రం-4-3).

గోవుయొక్క తోకకుచ్చును విడదీసి కాల్చవలెను. మార్గమధ్యమునందుండిన బూడిద నెడమచేతితోఁ దీసికొని, కుడిచేతితో స్పృశించుచు, దక్షిణాభిముఖుఁడై పైసూక్తము జపించుచు రోగము వచ్చిన గోవుయొక్క శరీరమునఁ జల్లవలెను. పైసూక్తము జపించుచు మార్గమధ్యమునందలి బూడిదను రోగవంతమగు గోశరీరమునందంతటను రుద్దవలెను. నేఁడు పల్లెలలో "గోమారు" అను పురుగు గోశరీరమునందంతటను వ్యాపించినయెడల బాగుగ కడిగి శరీర మారినపిమ్మట "కరుమాపము" (తోటాకుల యింట్లలో సాగబారుచోటున వ్యాపించు ఘాలి) బట్టింతురు. తోక కుచ్చునకు నాశగింజలంటి పేలుపట్టి యంటుకొనినపుడు తోకను విడదీసి పిడుగనిప్పుతో కాలచెదరు. ఈ వైద్యములకు వ్యయ మేమియును లేదు. కౌశికసూత్రముకఁ జెప్పఁబడిన వైద్యములకును వాఁటికాలమున నల్లనెనగలు, నేయి హోమముఁజేయుటలో వ్యయ మేమియుఁగలుగదు. కాని నేఁటి యాంగ్లేయ పశువైద్యప్రకారము గోమారు, పేలు, వదలుటకు అర్ధరూపాయవిలకు వదలవలసి యుండును. కిరసనాయిలుగాని సబ్బుతో 2, 3, పారులఁ గడుగుటలో వ్యయ మెక్కువకాదా.

### పశువుల శరీరమునఁ బుండ్లుపడి పురుగులుపట్టినపుడు చేయఁదగినకర్మ

(1) "ఉద్యన్నాదిత్యః" అను సూక్తముచే సంధ్యాత్రయమునందును, గోవులకుఁ బుట్టినపుండ్లపై దర్భలతో రాయవలయును. నేతితో నల్లనెనగలను పైసూక్తములో హోమములఁజేసి, అపురుగులు, చంపఁబడినవి చంపబడినవి యని చెప్పవలయును.

(2) "బ్రహ్మజజ్ఞానం, అగానః, ఏకాదశేమే" అను మంత్రములఁ బఠించుచు, కాచి చల్లార్చిననీటిలో నుప్పును జేసి, గోవులచేఁ ద్రావింపవలెను. సంతానముఁ గోరువారు గోవులు నీరుఁ ద్రావుటకుఁ దొట్టెలఁ గట్టింపవలెను.

పశువులు నీరుఁ ద్రావుటకుఁ దొట్టెలను ఋగ్వేద కాలముననే యార్యులు కట్టుచుండిరి. ధర్మముకొలకు సూత్రకాలమునఁ దొట్టెల గట్టుటకు నారంభించిరి. పైని చెప్పఁబడిన చిన్నచిన్న వైద్యములను బల్లెలలో నేఁడును వ్యవసాయకులు చేసికొని, తమ పశుగణమును రక్షించుకొనుచున్నారు. పశువు లరణ్యమునకుఁ బోవునపుడును, తిరిగివచ్చునపుడు పాలు వృద్ధినొందుటకును, పెక్కులు పశువృద్ధికరతంత్రము లావాఁడుకలవని కౌశికసూత్రములు చెప్పుచున్నవి. గ్రంథము పెరుగునని వ్రాయలేదు.

### రాజునకు వ్యవసాయదారునకుఁగలసంబంధము

ప్రభువునకు భూమిపై నెంత యధికారము కలదో పూర్వమీమాంసాశాస్త్రకర్తలు నిర్ణయించియున్నారు. పూర్వమీమాంసలో యాగ దక్షిణావిధానమునందు భూమినిఁ బ్రభువు దానమీయవచ్చునా కూడదా యను మీమాంస యాశాస్త్రజ్ఞులకుఁ గలిగి, "విశ్వజిద్యాగ" దక్షిణావిధానములో చర్చించియున్నారు. పూర్వ మీమాంసాశాస్త్రకర్తయగు "జైమిని" యొక్కయు, ఆజైమిని సూత్రములకు భాష్యముఁజేసినవారి యొక్కయు చర్చ నిందు వ్రాయుచున్నాను.




---

1. ఉద్యన్నాదిత్య ఇత్యుద్యతి గోనామేత్యా. అపాకితి సూక్తాం తేతే హతాహాతితి దర్భైః రక్ష్యస్యతి మధ్యందినేన ప్రతీచీం అపరాహ్ణే చాలస్థుకాం అభిదృ ఖల్వాదీని ఇతి, (కౌ. సూ. 4-3): 2. "బ్రహ్మజజ్ఞానం, అగానః, ఏకాదశేమే" ఇతి గాలవనం పాయయ త్యుపతాపినీః ప్రజననకామాః ప్రపాం అనురుద్ధ్య. (కౌశికసూత్రం. 3-2).




రాఢవిక్రాంతి కాకతి రుద్రదేవ, చక్రవర్తి సమగ్రాంధ్ర శాసనుండు
హనుమకొండాభిధాన పురాంతరస్థ, రత్నసింహాసనస్థుఁడై రాజ్యమేల.

సీ. ప్రాక్పయోరాశితరంగడోలికలపై, నామోదమెసఁగ నుయ్యాలలూఁగి
శ్రీశైలవిశ్వేశ సేవాసమారబ్ధ, మహితసౌభాగ్యసంపదల నొంది
మాల్యవత్సహకారమంజరీమకరంద, కలితగంధానిలంబులను దనిసి
కల్యాణపురరాజ్య కల్యాణసమధికై,శ్వర్యసంపదలను సంగ్రహించి

తే. గీ. ఆంధ్రనీరకుమార కరాంతరస్థ, రమ్యహేతులపై నాంధ్రరాజ్యలక్ష్మి
యాటలాడుచు నుండెడి యవసరమునఁ, గలిగె దుస్తరమైన సంగ్రామ మొండు.

ఉ. మేళగిదేవభూవిభుఁ డమేయపరాక్రమశాలి; ధారుణీ
పాలకు రుద్రదేవు గెలువన్ దలపోసి సమగ్రసైనిక
శ్రీలలితాత్ముఁడై రణము సేతకు వచ్చెను. హన్మకొండ కీ
కీలకముం గ్రహించి యుఱికించిరి వాజుల నాంధ్రపుత్రకుల్.

ఉ. *బాలసముద్రతీరమున వైరులడంపు వసించె, రుద్రభూ
పాలుఁడు శైలదుర్గ పరిపాలకులం దిలకించి మార్తురన్
దోలుఁడటంచు వాకొని కుతూహలియై జవనాశ్వమెక్కె ని
ర్వేలపరాక్రమాప్తి నెదిరించె విరోధివరూధినీ తతిన్.

క. †పోలవాస రాజ్యలక్ష్మీ, తిలకుఁడు మేళగి విభుండు తీవ్రాత్ముండై
బలములను రుద్రవిభుబల,ములపైకిన్ ద్రిప్పె భటసమూహము పొలిసెన్.

చ. మిగుల భయంకరంబుగ సమిద్భువి రుద్రనృపాలుసైనికుల్
పగతుర ముట్టడించి వెటుఁ బొఱఁగనీక వధింపుచుండగా
దెగువ దలిర్ప మేళగిపతిన్ దునుమాడఁగ రుద్రదేవుఁ డా
వగ గ్రహియించి వైచెఁ బయిపై నిశితప్రదరప్రతానమున్.

ఉ. అమ్ముల తాకిడిన్ నొగిలి యంగకసంధులు వీడిపోవ న
శ్వమ్ము మఱల్చి మేళగి నృపాలుఁడు యుద్ధభరంబువీడి ప్రా
ణమ్ముల కాసచేసిచనినన్ విడనాడక రుద్రభూవిభుం
డమ్మొయి వెంటనంటెఁ బ్రళయాంతకు కైవడి సాహసక్రియన్.

---

*బాలసముద్రము. ఇది హనుమకొండ చెంతగల యొకానొక తటాకము.

† మేళగి దేవుఁడు పోలవాసరాజ్యము పాలించుప్రభువు. పోలవాస నిజాంరాష్ట్రమున గోదావరీ తీరమునఁ గలదు.

తే. గీ. ప్రభుఁడు వెన్నిచ్చుటం గాంచి ఫౌజులెల్ల, మొగ్గరంబును విడి పాఱిపోవుచుండ
రుద్రధరణీశు భటులు వైరులనుబట్టి, బలియొసర్చిరి పద్మాక్షి* పార్శ్వమందు.

ఉ. మేళగి భూమినాయకుఁడు మృత్యు భయంకర శాతదంష్ట్రికా
జాలనిబద్ధశీర్షుఁడయి సంగరరంగ మతిక్రమించి వా
తూలరయాను సారియయి తుంగతురంగక మెక్కిపోవుచోఁ
గాలవశంబునన్ ధరణి కాంతు తురంగము పందగింపఁగన్.

తే. గీ. మేళగి నృపాలుఁ డత్తఱి మేదినీగ్ర, కాననాదికముల నెల్లఁ గడచిగడచి
కాకతి నృపాలు ధాటిని గన్నబ్రామి, తెఱువు విడనాడి యెందో యదృశ్యమయ్యె.

చ. "అరినృపుఁ డెందుఁబోయె నిశితాసికి నుత్సవ కారణంబు రూ
పత్తె" నని రుద్ర భూవిభుఁ డుదగ్రపరాక్రమ బాహుదర్ప వి
స్ఫురణము తాండవింప వనభూములు గ్రుమ్మఱసాగెఁ గాననాం
తరమున నెందు నేనియుఁగనంబడ దశ్వఖురాగ్రచిహ్నముల్.

ఉ. ఎక్కడ వైరి చిక్కు, నటనే విజయాంకము లుల్లసిల్లగా
నక్కజమైన శాసనజయధ్వజముల్ నెలకొల్పవచ్చు నన్
మక్కువతోడఁ ద్రిమ్మరఁగ మైళగిభూవిభుఁ డేగుత్రోవ, నే
దిక్కునఁ దోఁచదయ్యె నెదఁ దీవ్రత హెచ్చెను జక్రవర్తికిన్.

సీ. తలిరు తీవియలచే పెలిగొన్న మెలమావి, తరుమూలములనెల్ల నరసి యరసి
పరువంపుఁ జివురు జొంపములచే రాజిల్లు, పొదరిండ్లలోనికిఁ బోయిపోయి
జనదుర్గమములైన శైలభాగములెల్ల, విసువక నొంటిమై వెదకివెదకి
తరణీకరంబులు చొరరాని ఘోరకాం, తారభాగములందుఁ జేరిచేరి

తే. గీ. ఆంధ్రసామ్రాజ్యశాసనుఁ డనుమకొండ, రుచిరసింహాసనారోహి రుద్రవిభుఁడు
వెదకె పొలవాన మేళగివిభునికొఱకు, పౌరుష సుమంబు రేకెత్తఁ బ్రతిపదంబు.

ఉ. కొంగలమధ్యభాగమునఁ గ్రుమ్మరుచుండఁగ, నొక్కచో లతా
మండప పార్శ్వభాగమున మైళగిదేవునివాజి కన్పడన్
నిండు ముదంబుతోడ ధరణీపతి రుద్రవిభుండు; వైరి యిం
దుండఁగ వచ్చునంచుఁ జనుచుండెఁ దదంతరమధ్యసీమకున్.

చ. జ్వలనుఁడు మండుచుండె నొకచాయ మహోన్నతకాష్ఠపంక్తిపై,
చెలియ యొకర్తు పార్శ్వమునఁ జేరి సుమాంజలి దాల్చి ధ్యానని
శ్చలమగు దృక్పరంపరలు శాంతరసంబు సృజింపుచుండఁగాఁ
బలుమరు ప్రేమగీతికలు పాడఁగసాగె శ్రవఃప్రియంబుగన్.

తే. గీ. పావనతరుండు ప్రత్యక్ష దైవతంబు, వహ్నిభట్టారకునిచుట్టు వనిత తిరిగి
యంజలిస్థసుమంబుల నందు విడచి, సమధి కోన్నతమైన ప్రస్తరము నెక్కె.

* హనుమకొండయందున్న జైనదేవత.



ఉ. "ప్రాణవిభుండు మైళిగి నృపాలుఁడు పోయిన త్రోవనాకు, ని
ర్వాణసుఖ ప్రదాయకము భౌతిక దేహము పొందుచాలు, ని
ర్వాణమునొంద భర్తృచితి యందు విలీనమ నాదువంచు" పూఁ
బోణి వచించి కన్నుఁగవ మోడ్చెఁ బతిస్మరణానురక్తయై.

చ. "ఇఁక నిముసంబు సైపు జననీ! జననీ! జననీ!" యటంచు, రా
జకులుఁడు రుద్రభూవిభుఁడు సత్వరరీతి వచించుచుండ్, దురం
గకము వదల్చుచుండ, నల కంజనిభానన దూఁకె నగ్నిలో
వికచపయోజకర్ణికను వేగమ వ్రాలెడు తేఁటి పోలికన్.

తే. గీ. గాటపూ కౌఁగిలింతలఁ గలసి మెలసి, దహనుపేరిటియవనికాంతరమునందు
దంపతులు సుంత సేపు శాంతముగ నుండి, దృశ్యలోకంబు విడిచి యదృశ్యమైరి.

క. పావనతరసహగమన మ, హావ్రతమును నిర్వహించి యైహికసౌఖ్య
శ్రీ వదలె నేకవీరా, దేవికిఁ దులనీడఁగఁ దగిన తెఱవలు గలరే.

తే. గీ. స్నిగ్ధభావాదికోన్మాద చిత్తయగుచు, భర్తృచితిలోన శయనించి భస్మమైన
కాంతబూదినిగూర్చి, విగ్రహ మొనర్చి, నలిపెనట దేవళము రుద్రచక్రవర్తి.

క. మగువ సహగమన నియమము, మొగిలిచరలలోన నలిపె, భూవిభుఁ డచటన్
భగవతికి * ఏకవీరకు, నగణితవృత్తుల నొసంగె సర్వావిధికిన్.

తే. గీ. కాకతీయుల రాజ్యంబు గంగఁగలసె, మైళిగినృపాలు రాజ్యంబు మాయమయ్యె
ఇప్పటికి శాశ్వతంబుగా నేకవీర, యాదరించుచునున్నది యాంధ్రసతుల.

* మైళిగిదేవునితో సహగమనవ్రతమునలిపి మృతజీవినిరైన ఏకవీరా దేవి యాలయము హనుమకొండకు నాలుగు మైళ్లదూరములో మొగిలిచర్ల యందుఁగలదు. ఏకవీరాదేవి యిప్పటికిఁ బ్రత్యక్షదేవతగా భావింపఁబడుచున్నది.

# మూఁడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసనము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

ఈ తామ్రశాసనము ఉర్లాము, కంబకాయ గ్రామములకు మధ్యగా నొకమైలు దూరముననున్న చిక్కాలవలస అను నొక గ్రామమునందలి రైతు తనపొలమును దున్నుకొనుచుండఁగా బయలుపడినది. ఈ సంగతి తెలిసికొని, చిక్కాలవలస నివాసులు, శ్రీ ఖైరి అప్పలస్వామి నాయుఁడుగారు ఆరైతునుగలిసికొని, ప్రకటింపఁబడినపిదప నాశాసనముమఱల నతని కిచ్చివేయఁబడునని యతనికి నచ్చఁజెప్పి దానిని దీసికొని ప్రకటనార్థము దేశోద్ధారక శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారికిఁ బంపిరి. పంతులుగారు 'భారతి' లో బ్రకటించునిమిత్తము దయతో దానిని నా కొసంగిరి.

### ఆకారాదికములు

శాసనమునంగల రాగి రేకులుఅయిదు. ఒక్కొక రేకు పొడవు ౮. ౫ అంగుళములు; వెడల్పు 3. ౫ అంగుళములు. రేకులు కుడి యెడమ వైపులఁ గొంచెము వెడల్పుగను, నడిమిభాగమునఁ గొంచెము సన్నముగను ఉన్నవి. రేకుల యెడమభాగమున అంచులకు 3/౪ అంగుళము దూరమున రంధ్రములుకలవు. ఆరంధ్రములగుండ పోనిచ్చిన యొకరాగి కడియమునూలమున నీయైదు రేకులును బంధింపఁబడియున్నవి. కడియముయొక్క వ్యాసము ౪. ౫ అంగుళములు. ఈ కడియ మొకరాజ ముద్రికలో నతికింపఁబడి యున్నది. రాజ ముద్రికమీఁద పరిస్ఫుటముగ నొకనంది చెక్కఁబడియున్నది. ఆనంది కిరుప్రక్కల చంద్రుఁడు, సూర్యుఁడు, శంఖము, నాగలి, మత్స్యము మొదలైనవి కలవు. మొదటి రేకు మొదటి పెడ నేమియు వ్రాయఁబడి యుండక, పుస్తకమును అట్టవలె, శాసనమును గాపాడుచున్నది. నాలుగవ రేకు రెండవ పెడఁగూడ వ్రాయఁబడియుండుటవలన క్రిందిభాగమున శాసనమును గాపాడుటకు ఒక రేకు చేర్పఁబడినది. శాసనపరిరక్షణమే ఆ రేకును జేర్చుటలోఁగల యుద్దేశము. ఆ యైదవ రేకునకు రెండువైపులఁగూడ వ్రాఁత లేదు.

### లిపి - భాష

శాసనమునందలిలిపి నాగరి; కాని యిప్పటినాగరి అక్షరములకు, శాసనములోని అక్షరములకుఁ జాల వ్యత్యాసము కలదు. అయినను ఇప్పటి నాగరి లిపి శాసనమునందలి లిపియొక్క పరిణామమే యనుట స్పష్టము. పూర్వమునకు ఇప్పటి మిక్కిలి వ్యత్యాసముగల అక్షరములలో ఇ, ఏ, ఖ, ఘ, జ, చ, ఞ, ణ, ధలు పేర్కొనఁదగినవి. నకారపుఁబోల్కి 'న' అనుఅక్షరము

నకు క్రింద నొకగీటు గీయుటచేఁ జూపఁబడి నది. ఉదా ౧౩-వ పంక్తిలోని '°నివహాః', ౧౬-వ పంక్తిలోని '°త్రింశతమబ్దకాః' అను నవి చూడఁదగును. మకారపుఁబొల్లు పై నొక యనుస్వారము వ్రాసి దానిక్రిందతలక్రిందయిన అర్ధచంద్రాకృతివంటి యొకగీటు వ్రాయుట చేతఁ జూపఁబడినది. ఉదా: రెండవపంక్తిలోని '°గోత్రాణామ్', ౮-వ పంక్తిలోని '°మహీణామ్' మొదలగునవి చూడఁదగును. ఈ పద్ధతికి వ్యతిరేకముగ ఈ మకారపుఁబొల్లు అక్షరము నకు నెత్తిమీఁద నిచ్చు అడ్డుగీటు తీసివేయుట వలనను జూపఁబడినది. (చూడు పంక్తి 33 'మహీమ్') ఇట్లే రకారపు పొల్లుకూడ ఆయక్షరమునకు నెత్తిమీఁదనున్న యడ్డుగీటు తీసివేయుటవలనఁ జూపఁబడినది. (చూడుఁడు పంక్తి ౮౬ 'తస్యభార్యార్ రయపా') అను స్వారము కొన్ని కొన్నిచోట్ల అక్షరముల శిరోభాగమునను, కొన్నికొన్నిచోట్ల అక్షర మునకు అక్షరమునకు మధ్యగా నెగువను గలదు. అక్షరమున కెడమవైపున నీయఁబడు గీటు అక్షరమునకు నెత్తిమీఁద నీయఁబడు అడ్డుగీటును దాటి పైకిపోనిచ్చుట వలన ఇకా రమును, అడ్డుగీటుతో సమముగా వ్రాయుట వలన ఏకారమును, ఇట్లే అక్షరమునకుఁ గుడి వైపున నీయఁబడుగీటు అక్షరమునకు శిరో భాగమున నీయఁబడు అడ్డుగీటునుదాటి పో నిచ్చుటవలన ఈ కారమును, అడ్డుగీటుతో సమముగా నిచ్చుటవలన ఆకారమును సూచింపఁబడినది. 'ణ' 'ల' అనునక్షరము లకు స్వల్ప వ్యత్యాసము కలదు: మొదటి దానికి నెత్తిమీఁద నడ్డుగీటులేదు: రెండవ దానికిఁ గలదు. కాని 'ల్ల' 'ణ్ణ' అక్షరములు రెండును ఇంచుమించుగ నొక్కరీతి నున్నవి. 'ఞ్చ' 'ఞ్ఛ' అని వచ్చినపుడెల్ల చ, ఛ లు ముందును, పిదప అనునాసికమును వ్రాయఁ బడినది. 'ఙ్క' 'ఙ్ఖ', 'ఙ్గ', 'ఙ్ఘ' అను సంయు క్తాక్షరముల స్వరూపములు గమనింపఁదగినవి. రేఫము పిదపవచ్చు ప్రతిహల్లును ద్విత్వముం జెందినది. ఇట్లు ద్విత్వములేని హల్లులును గొన్నికలవు: ఉదా: పంక్తులు ౧౦, ౧౪, ౧౯, ౨౧, 33. శాసనమునం దంతటను బ కారమునకు వకారము వ్రాయఁబడినది. ఇట్లే కొన్ని కొన్నిచోట్ల శవర్ణమునకు సకార మును, సకారమునకు శవర్ణమును వ్రాయఁ బడినది.

శాసనమంతయు సంస్కృతభాషలోఁ గలదు: గద్యపద్యాత్మకము. శాసనమున పంద్రెండు శ్లోకములు కలవు: ఇవి శార్దూలవి క్రీడితము, మాలిని, వసంతతిలకము మొద లగు వేర్వేఱు వృత్తములలోఁ గలవు.

శాసన వృత్తాంతము

ఈ శాసనము గాంగవంశజుండైన అనంత వర్మాభిధానుండగు వజ్రహస్తదేవునిది. గాంగ వంశజులలో వజ్రహస్తుఁ డను పేరు గల వారిలో నితఁడు మూఁడవవాఁ డగుటచేత నితనిని గాంగవంశచారిత్రమున మూఁడవ వజ్రహస్తుఁ డందురు. ఈ వజ్రహస్త వంశీ యులైన గాంగులు ఆత్రేయ గోత్రులు; పరమమాహేశ్వరులు; పరమ భట్టారకులు; త్రికలింగ మహీభుజులు. శాసనమున

మొట్టమొదట వారివంశప్రశస్తి కలదు. పిదప వజ్రహస్తుని వంశానుక్రమము తెలుపఁబడినది. అది యీరీతిని గలదు:

గాంగవంశమున కలంకారభూతుఁడైన వాఁడును, విక్రమముచేత భూతలమునంతను ఆక్రమించిన వాఁడును అగు గుణమహార్ణవ మహారాజొకఁడు కలఁడు. అతనికి వజ్రహస్తుఁడు అను కొడుకుగలఁడు. పూర్వము అయిదుఖండములుగ విభాగింపఁబడి, అయిదుగురు రాజులచేత పరిపాలింపఁబడు భూమినంతను ఒకటిగఁజేసి శత్రుసమూహమునంతను జయించి అతఁడు నలువదినాలుగు సంవత్సరములు పరిపాలించెను. అతనికి గుండమరాజు, కామార్ణవుఁడు, వినయాదిత్యుఁడు అను ముగ్వురు కుమారులు గలరు. ఈ ముగ్వురిలో వజ్రహస్తుని అనంతరము గుండమరాజు మూఁడు సంవత్సరములును, పిదప నాతని యనుజుఁడైన కామార్ణవదేవుఁడు ముప్పదియైదు సంవత్సరములును, అటుతరువాత నాతని యనుజుఁడైన వినయాదిత్యుఁడు మూఁడేండ్లును పరిపాలనముచేసిరి. వినయాదిత్యపరిపాలనానంతరము కామార్ణవుని కొడుకును, అనియంక భీమనృపతి అనుపేరు గలవాఁడును అగు (రెండవ) వజ్రహస్తుఁడు ముప్పదియైదు సంవత్సరములు రాజ్యమేలెను. ఈ రెండవ వజ్రహస్తునికి ముగ్వురు కుమారులు కలరు (౧)(రెండవ) కామార్ణవుఁడు,(౨) (రెండవ) గుండమరాజు, (3) మధుకామార్ణవుఁడు. వీరు వరుసగా నొకరితరువాత నొకరు రాజ్యమునకు వచ్చిరి. వీరిలో కామార్ణవుఁడు అర్ధసంవత్సరమును, గుండమరాజు మూఁడేండ్లును, మధుకామార్ణవుఁడు పందొమ్మిదేండ్లును పరిపాలనముచేసిరి. వీరిలోఁ గడపటివాఁడైన మధుకామార్ణవుఁడు గుండమరాజునకు సవతితల్లి కొడుకు. ఇతని తరువాత (రెండవ) కామార్ణవునికి వైదుంబవంశీయురాలైన వినయ మహాదేవి వలనఁ గలిగిన (మూఁడవ) వజ్రహస్తుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడే యీ శాసనమునందలి దాత. ఈతనిదే యీ శాసనము. సూర్యుఁడు వృషభ రాసియం దుండఁగా, తొమ్మిదినందల అఱువదన శకవర్షమున చంద్రుఁడు ధనుర్లగ్నమున రోహిణిలో నుండ, అనఁగా క్రీస్తుశకము ౧౦౩౮ - వ సంవత్సరము మేనెల మూఁడవతేది ఆదివారమురాత్రి ఎనిమిదిగంటల ఇరువదియేడు నిమిషములకు శుక్లపక్షతృతీయా ఆదివారము నాఁడు అనంతవర్మాభిధానంబునం బరగు నీ (మూఁడవ) వజ్రహస్తుఁడు సకలధరాతలమునుసంరక్షించుటకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. శకము ౯౮౩-వ సంవత్సరమున నీ వజ్రహస్తదేవుఁడు కోలువర్తని విషయములోని కద్దమాఖ్య గ్రామమును మల్లపశ్రేష్ఠి అనునొక వైశ్యునికి దానమొసంగెను.

ప్రతిగ్రహీత

దానమును పట్టినవాఁడు మల్లపశ్రేష్ఠి అనునొకవైశ్యుఁడు. ఇతనితాతపేరు మాధవశ్రేష్ఠి. తండ్రిపేరు సోమనశ్రేష్ఠి. తల్లిపేరుఅరయప. వీరిది దత్తగోత్ర మని చెప్పఁబడినది. వైశ్యుల కులదేవత యగు వాసవీకన్యతో

## గాంగవంశవృక్షము

౧. గుణమహార్ణవ మహారాజు

౨. (మొదటి) వజ్రహస్తుఁడు (౪౪ ఏండ్లు)

౩. గుండమరాజు (౩ ఏండ్లు)    ౪. కామార్ణవదేవుఁడు (౩౫ ఏండ్లు)    ౫. వినయాదిత్యుఁడు (౩ ఏండ్లు).

౬. అని యంకభీముఁడు నాఁబరగు(రెండవ) వజ్రహస్తుఁడు. (౩౫ ఏండ్లు)

౭. కామార్ణవభూపతి(వైదుంబవంశజ యగు వినయమహాదేవిని పెండ్లిచేసికొనెను.) (అర్ధసంవత్సరము)    ౮. గుండమహీపతి (౩ ఏండ్లు)    ౯. మధుకామార్ణవుఁడు (౧౯ ఏండ్లు)

౧౦. మూఁడవ వజ్రహస్తుఁడు.
(క్రీ. శ. ౧౦౩౮ లో పట్టాభిషిక్తుఁడయ్యెను.)

నగ్నికుండమును జొచ్చిన నూటరెండు గోత్రములవారిలో దంతగోత్రీయులు కలరుకాని దత్తగోత్రీయులు లేరు. అందువలన దంతఅనుటకు శాసనమున దత్త అని తప్పువ్రాయఁబడినదని నాయూహ. శాసనములలో లేని సున్నలుపెట్టుట, ఉండవలసిన సున్నలు లేకపోవుట యిట్టి లేఖకప్రమాద దోషములు సర్వసాధారణము. అందువలన ప్రతిగ్రహీతయైన మల్లపశ్రేష్ఠిది దంతగోత్ర మనియే నా నిశ్చయము. దంతగోత్రీయుల ప్రవర వైశ్య పురాణమునందును, వైశ్యగోత్రాంకిత పద్యావళిలోను నీరీతిని చెప్పఁబడినది.

దంతాఖ్యగోత్రుండు దంతకులాన్వయుం
డెంతయు వింధ్యాద్రి నెలమిలోఁడ
నలరి సుతీక్ష్ణనామ్నాయమునికిని శిష్య
వర్యుఁడై పదివేలవత్సరములు
తపముచేసి సుఫలదానంబు లొనరించి
జన్మవృక్షంబు వర్ణింబుగాఁగ
జహ్నుసాగరమున జామదగ్నీశ్వర
నిలయముఁ గల్పించి నలువదేను
దీపకళికల నొసఁగి యద్దేవునకును
బందుక్షేత్రంబు లేఁబది పదిలపఱచి
సకలవైభవయోగముల్ జరిపి [పిదప]
నొకరి కొకరికిం బ్రబరమై రొప్పుచుండు.

మనము గమనింపవలసిన మఱియొక విషయముకలదు. నేను చూచినంతవఱకు పూర్వ చాళుక్య శాసనములలో వైశ్యుల కిచ్చిన దానమును దెలుపు శాసనమొక్కటియుఁ గానరాదు. ఈ కళింగ గాంగవంశజులు బ్రాహ్మణులకే కాక వైశ్యులకుఁగూడ నగ్రహారములను దానముచేసి పుణ్యమును, యశస్సును సంపాదించుకొని యున్నారు. మన శాసనమునందలి దాతయైన వజ్రహస్తునివలెనే యతని పూర్వుఁడును, అనంతవర్మమహారాజు కుమారుఁడు నైన మధుకామార్ణవ

దేవుఁడు[1] కూడ "గాంగేయ వంశ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము" ౧౨౬ లో వైశ్య కుల సంభవుఁడును, మంచినాయకుని కుమారుఁడునైన ఎరపనాయకునకు పటుగ్రామము, హొండరవడో, మోరఖని అను మూఁడు గ్రామములను వైశ్యాగ్రహారముచేసి యొసంగియున్నాఁడు.[2] ఈవిధమున కళింగదేశము నందలి వైశ్యులు గాంగవంశజుల యాదరణ పోషణముల క్రింద వర్ధిల్లినట్లు తెలియఁగలదు.

దాన ప్రతిగ్రహీతయైన మల్లపశ్రేష్ఠి కుద్దమాఖ్య గ్రామమునకు రాజునుండి దాన శాసనమును సంపాదించి పిదప తనకు నివేశన స్థలమును, ఉద్యానస్థానమును, ఆగ్రామములోని నూఱుమురల ధాన్యోత్పన్న భూమిని అనఁగా ధాన్యముపండు భూమిని మిగుల్చుకొని మిగిలిన కుద్దాముగ్రామ శేషమును జలమూర్వారు గ్రామనివాసియు, ఉపమన్యు గోత్రుఁడును, ద్విజోత్తముఁడునైన పిల్లిశర్మ మనుమఁడును, కరంటమ నాయకునికిని రేకమకును పుత్రుఁడును అగు మాపయ నాయకునితోఁ గూడ ముప్పదిమంది బ్రాహ్మణులకు ఉత్తరాయణ పుణ్యకాలమున నగ్రహారముచేసి యాగ్రామమునకు వచ్చు కప్పములు నూఱుమురల ధాన్యముతోను, ఎనిమిదిమాడలతోను ధారాపూర్వకముగ మఱల దానముచేసెను.

### స్థలనిర్దేశము

ఈశాసనమునఁ జెప్పఁబడినవి మూఁడు గ్రామములు మాత్రమే: ఒకటి మాపయ నాయకుని నివాసస్థలమైన జలమూర్వారు; రెండవది దానముగ నిచ్చిన కుద్దాముగ్రామము. దానమిచ్చిన యీగ్రామము కోలువర్తని విషయములో నున్నట్లు తెలుపఁబడినది. మూఁడవది కళింగనగరము. ఇది గాంగ వంశజుల రాజధాని. ఇచ్చటినుండియే దాతయైన మూఁడవ వజ్రహస్తదేవుఁడు మల్లపశ్రేష్ఠికి దానము నొసంగియున్నాఁడు. ఈ గ్రామములు ఎచ్చట నున్నవి?

గంజాము మండలమునందలి శ్రీకాకుళము తాలూకాలో జల్మూరు, కుద్దాము అను గ్రామములు కలవు. కుద్దాము గ్రామమునకు జల్మూరు ఈశాన్యదిక్కుగ ఆఱుమైళ్ల దూరముననున్నది.[3] కుద్దాము గ్రామము ఉర్లాం సంస్థానమునకు రెండుమైళ్లదూరముననున్నది. ఈ కుద్దాము గ్రామము పొలిమేరనే మన యీశాసనము చిక్కాలవలస నివాసియైన యొకరైతునకు దొరకినది. అందువలన మన శాసనమునందలి జలమూర్వారు శ్రీకాకుళము తాలూకాలోని యిప్పటి జల్మూరుగను, కుద్దాఖ్యగ్రామ మనఁబడు కుద్దమాఖ్య గ్రామము ఇప్పటి కుద్దాముగ్రామముగను గుర్తించుటలో సంశయింపం బనిలేదు. కుద్దాము గ్రామమున గృహస్థానమును, ఉద్యానస్థానమును గాక ప్రతిగ్రహీతయైన మల్లపశ్రేష్ఠి తనకు మిగుల్చుకొనినది 'శతమురధాన్యో

1. ఈ మధుకామార్ణవునికి మనశాసనమునందలి దాతయైన వజ్రహస్తదేవునికిఁ గల సంబంధము తెలియదు.
2. Ep. Coll. Cp. No 5 of 1918-19.
3. కుద్దాము, జల్మూరుల స్థానమును, వాటికిగల దూరము మొదలగు విశేషములను దయతోఁ దెల్పినందులకు శ్రీ ఖైరి అప్పలస్వామినాయుఁడుగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

...భూమి' అనఁగా నూఱుమురలధాన్యము ...భూమి. మఱల మల్లపశ్రేష్ఠి అగ్రహారముచేసి యిచ్చిన కుద్దాము గ్రామమువలన ప్రతిగ్రహీతలైన బ్రాహ్మణులకువచ్చు ఆదాయము శతమురధాన్యము, అష్టమాడలును: అనఁగా నూఱుమురలధాన్యమును, ఎనిమిది మాడలును. మొత్తముమీఁద కుద్దాము గ్రామమునకువచ్చు ఆదాయము రెండువందల మురల ధాన్యమును, ఎనిమిదిమాడలును. మురయననేమి? ఈ మురయను పదము మొదట భూమికిని, పిదప ధాన్యమునకును గూడ నుపయోగింపఁబడుటచేత, నిది కేసరిపాటిపుట్టి, కేసరిపాటి తూమువలెనే భూమికొలతకును ధాన్యపు కొలతకునుగూడ నుపయోగించు నొకవిధమైన 'కొలమాన' మని మనము నిశ్చయింపవచ్చును. ఈ 'ముర' అనుపదము 'మురయు', 'మురక' అనురూపములను గానవచ్చుచున్నది. వైశ్యుల కగ్రహారముచేసి యొసంగిన మధుకామార్ణవుఁడు తన దానశాసనమును[1] వ్రాసిన లేఖకునికి ౪౦ మురల భూమి నిచ్చినట్లుకలదు ('లేఖకస్యభూమి మురయ ౪౦; సత్రస్యభూమి మురయ శతద్వయమ్ ౨౦౦). ఇట్లే దేవేంద్రవర్మసూనుఁడైన సత్యవర్మయొక్క శ్రీకాకుళము శాసనమునను[2] 'మురయు' పదము కానవచ్చుచున్నది. అచ్చటఁగూడ నిది 'కొలమాన...ం'ను తెలియఁజేయు పదముగనే కాన్పించుచున్నది. 'మురక' రూపముతో నిది మనవజ్రహస్తుని మఱియొక శాసనమునఁ[3] గన్పట్టుచున్నది (ధాన్యము రకశతద్వయోత్పత్త్యా భూమిర్దత్తా). కాని యిన్ని శాసనములలో 'మురయ','ముర','మురక'పదములువచ్చినను అవియొక నిర్ణీతమైన 'కొలమానము'ను దెలియఁజేయునవని తెలిసినను అది యిప్పటి పుట్ల కొలతలో నెంతకు సమానమో తెలియరాదు.

ఈజలుమ్మూరు, కుద్దాము గ్రామములున్న ప్రదేశమే కోలువర్తని విషయము. కోలమనఁగా వరాహమునకుఁ బేరుండుటవలన, శ్రీయుతులు రావుసాహేబు హెచ్. కృష్ణశాస్త్రిగారు చెప్పినట్లు[4], కోలువర్తనీ లేక కోలవర్తనీ విషయమనఁగా వరాహవర్తని విషయము కావచ్చును. వరాహవర్తని విషయము గాంగవంశజుల చాలశాసనములలోఁ బేర్కొనంబడినది[5]. ఈ మూఁడవవజ్రహస్తుని నదగాం శాసనమునఁ గూడ కోలువర్తనీ విషయము పేర్కొనంబడినది. కాని యావిషయమున నున్నట్లు చెప్పఁబడిన 'నుగిల గ్రామము' గుర్తింప నసాధ్యమైనది. అదియటుండ మన శాసనమునం జెప్పఁబడిన 'జలమ్మూరు' వజ్రహస్తునికిఁ బూర్వము కళింగమును బరిపాలించిన గాంగవంశజుల కాలమున నొక విషయము (అనఁగా నిప్పటి యొకమండలము—జిల్లా వంటిది)గ నుండినట్లు తెలియుచున్నది. శ్వేతకము రాజధానిగా కళింగమును పాలిం

1. Ep. Coll. Cp. No 5 of 1918-19. 2. Ind. Ant. Vol XIV. p 10. 3. Ep. Ind. Vol. IX. p 94.
4. Ep. I d. Vol IV. p 185, Note 5. 5. Ep. Ind. Vol III, p 127, Ind. Ant. Vol. XIII. p 275. Ind. Vol. XIII. p 120. Ep. Ind. Vol. XIII; p 212. Ep. Ind. Vol. IX. p 94. 6. Ep. Ind. Vol. IV. p 183.

చిన ఇంద్రవర్మ జలమ్బోరవిషయము[1] లోని అమెరసింగయను గ్రామమును దానము చేసెను. ఈ జలమ్బోర గ్రామమును, మన శాసనమునందలి జలమ్బూరు గ్రామమును ఒక్కటియే యనియు, ఈ జలమ్బూరు(ఇప్పటి జలుమ్మూరు)ను బట్టియే జలమ్బోరవిషయ మను పేరు వచ్చినదనియు నానమ్మకము. కాని యిప్పుడు అమెరసింగగ్రామమును గుర్తించుట కష్టసాధ్యము. ఆపేరుగల గ్రామ మిప్పుడు కానరాదు.

ఇంక గాంగవంశజులకు రాజధానియైన కళింగనగర మేది? గాంగవంశజులకు ఈ వజ్రహస్తుని కాలమున రాజధానీనగర మొకప్పుడొకటియు, మఱియొకప్పుడొకటియు నుండి నట్లు శాసనముల ననుసరించి తెలియుచున్నది. మూఁడవ వజ్రహస్తుని మొదటిరాజధాని దంతిపురము; రెండవరాజధాని కళింగనగరము. గాంగ వంశజులకుఁ జాల పూర్వకాలము నుండియు వచ్చురాజధానులలో కళింగనగర మొకటి: ఇదికడు ప్రసిద్ధమైనది. రఘువంశమున కాళిదాసమహాకవిచేతఁగూడ

శ్లో. యః మాత్యన స్సన్యని సన్నికృష్టో
మత్ద్రిస్వనిర్త్యాజితయామతూర్యః;
ప్రాసాదవాతాయనదృశ్యవీచిః
ప్రబోధయ త్యర్ణవఏవ సుప్తమ్.

అనికీర్తింపఁబడినది. కళింగ నగరమును గాంగవంశజుల శాసనములుకూడ నీ విధముననే వర్ణించుచున్నవి. మహారాజయిన ఇంద్రవర్మయొక్క శ్రీకాకుళము ... మున[2] కళింగ నగరము ఈవిధమున వర్ణింప బడినది.

"స్వస్తిజలధిజలతరంగకరపల్లవాలింగిత సకలకళింగావనీకుల తిలకాయమానాద్విజయకళింగనగరాత్ ..."

అందువలన నీనగరము సముద్రతీరస్థమనుట స్పష్టము. శ్రీకాకుళముతాలూకాలో శేవుపట్టణమగు కళింగనగర మొకటి కలదు. గాంగవంశజుల రాజధానియైన కళింగనగరము ఇది యగునా కాదా యను విషయమున చర్చ చాలకాలమునుండి జరుగుచున్నది. పర్లాకిమిడి తాలూకాలోని ముఖలింగమే కళింగనగరమని శ్రీయుత రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు వ్రాసియున్నారు.[3] శ్రీకాకుళము తాలూకాలోని కళింగనగరమే అసలు కళింగనగరమని శ్రీయుత గాది నరిసింగరావు పంతులు (బి. యే) గారు విజయనగరము మహారాజావారి కళాశాలపత్రిక కొకవ్యాసము వ్రాసియున్నారు[4]. శ్రీ నరసింగరావు పంతులుగారు రఘువంశము, దశకుమారచరిత్రము లందలి కళింగవర్ణనములనుబట్టి యిప్పటికళింగ నగరమే అసలు కళింగనగరమని వ్రాయుచుఁ దమవాదమునకు బలము నిచ్చుచున్నదని వేములవాడ భీమకవి విరచిత మనఁబడు నొక సీసపద్యము (చాటువు) నుదాహరించి యున్నారు. కాని ఆపద్యము భీమకవిదాయని సంశయింప

1. Epi. Coll. Cp. No. 9 of 1917-18.
2. Ind. Ant. Vol. XIII. p 122. దీనిని శ్రీయుత జి. రామదాసు పంతులుగారు రిపవఅకే చూచియున్నా
3. Ep. Ind. Vol IV. p 183.
4. Vol I. p 59.

కళింగనగరముయొక్క ప్రాచీన చారిత్రమును గూడ వర్ణించియున్నాడు. పద్యములు వేములవాడ భీమకవివి కాకపోయినను అప్పటికి ప్రజలకు ఆ కళింగనగరమునుగుఱించి తెలిసిన చారిత్రమును మనకుఁ దెలుపుచున్నవి.

అది యటుండ క్రీ. శ. ౧౮౧౦ - ౧౨ ప్రాంతముల కళింగనగరమునుగూర్చి వ్రాయఁబడిన కైఫీయతులో నిట్లు కలదు.

‘ ఈ రాయకళింగగంగు అధికారం జరిగిన తరువాత కొన్ని దినములకు సముద్రముపొంగి కళింగపట్నం సముద్రగామి అయినందున కోటకూడా సముద్రగామి అయినది. యిప్పుడు సముద్రములో ౨-3 నిలువుల లోతున కోటయుండరవున్న చదురురాళ్లు ఘుడలకు తగులుతవని వాడలువడిచే పల్లెవాండ్లు చెప్పేవారు. సదరు రాయకళింగగంగుతరుణమందు కళింగపట్నం సముద్రగామి అయిపోయిన తరువాతను పట్నం జేబిరాకు అయి వాడరేవుమాత్రం సాగుతూవుండెను ’[1]

ఇఁక ముఖలింగమునకు కైఫీయతులలో నిట్టిగాథ లేవియు వ్రాయఁబడలేదు. అది యటుండ ముఖలింగమునకు కళింగావనీనగరము[2], కళింగదేశనగరము[3], (కళింగావనియందలి నగరము) అనుపేర్లేకాక త్రికళింగావనీ నగరము[4], (త్రికళింగావనియందలి నగరము) అనియు, గోకర్ణ[5]మనియుఁగూడఁ బేళ్లు ఉన్నట్లు అచ్చటి శాసనములవలన స్పష్టమగుచున్నది. అందువలన ముఖలింగమునకు ఎప్పుడును కళింగనగరమనుపేరు రూఢముగ నుండలేదేమోయని నా సంశయము. ఈ కారణములవలన నిప్పటి కళింగనగరమే గాంగవంశజుల రాజధానియైన కళింగనగరమని నా యూహ. అయినను ముఖలింగము శాసనములు అచ్చపడువఱకు నీవిషయమిదమిత్థమని నిర్ణయింపవలనుపడదు.

కాలనిర్ణయము

అనంతవర్మాభిధానుండగు వజ్రహస్తదేవుఁడు మల్లపశ్రేష్ఠికి శుద్ధమాఖ్య గ్రామమును శాలివాహనశకము కర (౨) వసు(౮) నిధి (౯) అనువానిచే సంకితమగు ౯౮౨ వ సంవత్సరమున కార్తికమాస ప్రథమపక్ష తృతీయా సోమవారమున దాన మొసంగెను. కార్తికశుక్లపక్ష తృతీయనాఁడు ఆలోచన గౌరీవ్రతమను నొక శైవవ్రతము చెప్పఁబడియున్నది. వజ్రహస్తదేవుఁడు పరమమాహేశ్వరుఁడని వర్ణింపఁబడిన పరమశైవుఁడు. అదిగాక కార్తికమాసము శైవుల కత్యంతప్రీతి. అందువలన కార్తికమాస శుక్లపక్ష తృతీయనాఁడు ఆలోచనగౌరీవ్రతసందర్భమున మహారాజైన వజ్రహస్తుఁ డీదానమును జేసియుండును. ఈపైని చెప్పిన శకవర్షము వర్తమానాబ్దమా, గతాబ్దమా? వర్తమానాబ్దమనుకొనిన తిథి, వారములు సరిపోవుటలేదు; గతాబ్దమనుకొనినసవి సరిగా సరిపోవుచున్నవి. గతాబ్దమనుకొనినచో సోమవారమునాఁడు ద్వితీయ తిథి సూర్యోదయానంతరము 33 గడియలతో నంతమై తృతీయతిథి వచ్చుచున్నది అనఁగా సోమవారము పగలు ౧౦-౧ నిగ్గులకు తృతీయవచ్చుచున్నది. అందువలన పై

1. Loc. Rec. Vol, IX p 366,
2. Ep. Coll. No. 169 of 1896 (శకము 1055)
3. Ep. Coll. No. 228 of 1896 (శకము 1053)
4. „ „ No. 230 of 1896 (శకము 1052)
5. „ „ No. 237 of 1896 (శకము 1013)

నుడివిన శకవర్షము గతాబ్దమనుట నిశ్చయము. దీనికి సరియైన ఇంగ్లీషు తేది క్రీ. శ. ౧౦౫౯ అక్టోబరు నెల ౧౧ అగుచున్నది. *

ఈ శాసనమున మఱియొక పుణ్యకాలము కలదు. ఉత్తరాయణ పుణ్యకాలమున మఱల మల్లపశ్రేష్ఠి యీగ్రామమునఁ దనకుఁ గొంత మిగుల్చుకొని తక్కినది కుద్దామను పేరన గ్రహారముచేసి ముప్పదిమంది బ్రాహ్మణులకు దానముచేసెను: అనఁగా కార్తికమాస ప్రథమ పక్ష తృతీయకుఁ దరువాత వచ్చిన యుత్తరాయణ పుణ్యకాలము: అనఁగా నిది క్రీ. శ. ౧౦౫౯వ సంవత్సరము డిసెంబరు ౨౫వ తేది శనివారమగుచున్నది.

ఇదిగాక వజ్రహస్తుని యితరశాసనములందునలెనే యీ శాసనమునఁ గూడ ఆతని పట్టాభిషేకదినము తెలుపఁబడినది. శాలివాహన శకము (వియత్ ౦; ఋతు ౬; నిధి ౯) ౯౬౦-వ సంవత్సరమున సూర్యుఁడు వృషభమున నుండఁగా, చంద్రుఁడు రోహిణితో ధనుర్లగ్నమున నుండఁగా, శుక్లపక్ష తృతీయా ఆదివారమున అనఁగా దీనికి సరియైన ఇంగ్లీషు తేది క్రీ. శ. ౧౦౩౮-వ సంవత్సరము మేనెల 3-వ తేది ఆదివారము రాత్రి గం ౪ ని ౨౮ లకు వజ్రహస్తునికి పట్టాభిషేకము జరిగెను.

అందువలన మన యీశాసనము వజ్రహస్తుని ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరము ౨౨ లోనిది.

వజ్రహస్తుని యితరశాసనములలోని వృత్తాంతము.

ఈ వజ్రహస్తుని రాజ్యాభిషేక కాలము మనకుఁ దెలియును. ఇతనితరువాత కళింగమును పరిపాలించినట్టియు ఇతని కుమారుఁడైనట్టియు దేవేంద్రవర్మ రాజరాజదేవుఁడు శకవర్షములు ౯౯౩-లో పట్టాభిషిక్తుఁడైనట్లు ఆతని శాసనమొకటి[1] తెలుపుచున్నది. అందువలన మనమూఁడవ వజ్రహస్తుఁడు శకవర్షములు ౯౬౦ మొదలు ౯౯౩ వఱకుఁ బరిపాలించినట్లు మనము నిశ్చయింపవచ్చును. ఈ వజ్రహస్తుని తల్లి వైదుంబవంశములోని వినయమహాదేవి యని మనకుఁ దెలియును. ఇతనిభార్య అనంగ మహాదేవి[2]. ముఖలింగమునందలి ముఖలింగేశ్వర దేవాలయములోని యొకశాసనము[3] ఈ మూఁడవ వజ్రహస్తుని రాణిచేసిన ధర్మమును దెలుపుచున్నది. అందామె హైహాయ వంశజయని తెలుపఁబడినది. అందువలన నీయనంగ మహాదేవి హైహాయవంశజయని తెలుపఁబడిన ఆరాణి కాదుకదా అని సంశయింప వలసి వచ్చుచున్నది. ఆశాసనము శకవర్షము ౯౯౦ లోనిది. ఈ వజ్రహస్తుని యొక్క శాసనమ్ము[4]న నిజముగా దాత యొక్క 'రాణక శ్రీ ధర్మఖేడి' అనువాఁడు. ఇతఁడు పరమమాహేశ్వర పంచవిషయాధిపతి మహామండలేశ్వర 'రాణక శ్రీ భామఖేడి' కొడుకు. ఈతఁడు కదంబవంశజుఁడు. వజ్రహస్తుని పర్లాకిమిడి తామ్రశాసనమున[5] నింకొక 'ఖేడి' కనఁ

* ఇందలి తేదులు దివాన్ బహద్దరు శ్రీయుత స్వామికన్నుపిళ్లగారి జంత్రి (Ephemeris) ననుసరించి, దాని సాయమున సరిచూడఁబడినవి.

1. Ep. Coll. Cp. No 4 of 1918-19.
2. Ibid.
3. Ep. Coll. No 248 of 1896.
4. Ep. Coll. Cp. No 12 of 1917-18.
5. Ep. Ind. Vol III, p 222.

బడుచున్నాఁడు. అతనిపేరు ఉగ్రఖేడి: కాని యీ వజ్రహస్తుఁడును మన మూఁడవ వజ్రహస్తుఁడు నొక్కరాయను విషయము విచారణీయము. ఉగ్రఖేడి కూడ 'కదంబామలకుల తిలకుఁ'డని వర్ణింపఁబడెను. దేవేంద్రవర్మ విశాఖపట్టణము తామ్రశాసనమున[1] ధర్మఖేడియొకఁడు పేర్కొనఁబడి యున్నాఁడు. ఇతఁడు కదంబామలకులతిలకుః డని వర్ణింపఁబడియుండలేదు కాని దేవేంద్రవర్మకు మేనమామయని చెప్పఁబడియున్నాఁడు. ఇట్లే కదంబ వంశజుఁడని తెలుపఁబడని 'మహాసామంత నాగఖేడి' యొకఁడు ఇంద్రవర్మ విషమగిరి శాసనమునఁ[2] బేర్కొనఁబడి యున్నాఁడు. ఈ యుదాహరణము లన్నిటిని బట్టిచూడఁగా 'ఖేడి' పద మంతమందుఁ గల వారలు, కదంబ వంశజులైనవారలు ఈకళింగ గాంగుల క్రింద అధికారులుగను, సామంతులుగనుండుటయేగాక, రాజకుటుంబమువారితోఁ గొన్నికొన్ని యెడల సంబంధబాంధవ్యములు కూడ నెఱపినట్లు తెలియఁగలదు. గాంగులకు, కదంబులతోడనేగాక వైదుంబులతోను హైహయులతోడ గూడ సంబంధ బాంధవ్యము లున్నవనుట స్పష్టము. ఈ బాంధవ్యము వైదుంబులతో నీవజ్రహస్తుని తండ్రియైన కామార్ణవుని కాలమునను, హైహయులతో నీవజ్రహస్తుని కాలమునను గలిసి నట్లూహింపనగును. ఈ వజ్రహస్తుని శాసనముల ననుసరించియే వైదుంబులతో సంబంధము చేసినవా రింకొకరు గలరు. ఈ మూఁడవ వజ్రహస్తుని యొక్క తామ్ర శాసనమున[3] 'మానాదిత్యచోట్ట' అను నొకనికి ౩౫ గ్రామములతో నున్న 'గొరసత్తివిషయము' దానముచేయఁబడినట్లు తెలుపఁబడినది. అందు ఈ మానాదిత్యచోట్టఁడు చోట్ట చోడప రాజు మనుమఁడనియుఁ జెప్పంబడినది. ఈ మూఁడవ వజ్రహస్తునికి అయితనాఖ్యుని కుమారుఁడైన శ్రీకంఠనాయకునికిని, అతని భార్య వేదవికి జనియించిన పాంగునా(నో) మయ అనునతఁడు అల్లుఁడనియు, అతఁడు వజ్రహస్తుని దండనాయకుఁడనియుఁ[4] దెలియుచున్నది.

ఈ వజ్రహస్తుని యితర శాసనములు.[5]

1. Ep Ind. XI p 147.
2. Ep. Ind. Vol IV, p 183
3. Ep. Ind Vol IX, p 94
4. Ep. coll cp nc 3 of 1918-19
5. Ep. coll cp no 12 of 1917-18.
6. Ep. coll no 248 of 1896
7. Ep. coll no 249 of 1896 [6]
8. Ep. coll no 257 of 1896

---

1. Ind. Ant. vol xviii p 145.
2. Ep. coll cp. no. 9of 1917-18
3. Ep. coll. cp. no 16 of 1908-09.
4. Ep. Ind Vol IV p. 183.
5. గవర్నమెంటు శాసనశాఖవారిచే సంపాదితములైనట్టియు, యింతవఱకు ప్రకటింపఁబడనట్టియు శాసనములు.
6. ఇందు విజయరాజ్యసంవత్సరము తప్పుగనున్నట్లు తోఁచును.

# మూలము[1]

## మొదటి రేకు: రెండవ పెడ



[ ] ఈ బ్రాకెట్టులలో నుంచిన యక్షరములు మూలములో సందేహముగ నుండునవి

[*] ఇట్టి గుఱుతుగల బ్రాకెట్టులలో వ్రాయబడిన యక్షరములు శాసనములో లేక యిప్పు డుంచబడినవి

( ) బ్రాకెట్టులలో నున్నవి మూలమున అధికమై త్రోసివేయవలసిన యక్షరములు

1. ఓం[2] స్వస్తి శ్రీమతా మఖిలభువనవినుతనయవినయదయాదానదాక్షిణ్యస
2. త్యశౌచ శౌర్య్య[3]ధైర్య్యాది[4]గుణరత్నపవిత్రకాణా మాత్రేయగోత్రాణామ్ వి
3. మలవిచారాచార పుణ్యాశలిల ప్రక్షాలిత[5] కలికాలకల్మషమ
4. షీణామ్ మహామహేన్ద్రాచల శిఖర ప్రతిష్ఠితస్య సచరాచరగురో
5. ః సకలభువన నిర్మ్మాణైకసూత్రధారస్యశశా[6]ఙ్కచూడామణే
6. ర్భగవతో గోకర్ణ్ణస్వామినః ప్రసా[7]దానమాసాదితైకశఙ్ఖభే
7. రీపఞ్చమహాశబ్ద[8] ధవలచ్ఛత్ర హేమచామరవర వృషభలాఞ్ఛనసము
8. జ్వా[9]లసమస్త సామ్రాజ్యమహిమ్నా మనేకసమరసఙ్ఘట్టనము

---

1. నావద్దనున్న రేకుల ననుసరించి
2. ఇది యొకగుర్తువలెఁ జూపఁబడినది
3. ఇచ్చట లేఖకుఁడు ముందు 'ర్య్యా' వ్రాసి కొట్టివేసి పిదప 'ర్య్య' చేసినాఁడు
4. ఇచట లేఖకుఁడు ముందు 'హి' వ్రాసి పిదప దానిని 'ది'గా దిద్దినాఁడు
5. '°సలిలప్రక్షాళిత°' అని చదువవలెను
6. '°శశాఙ్క°' అని చదువవలెను
7. '°ప్రసాద°' అని చదువవలెను
8. '°మహాశబ్ద°' అని
9. '°సముజ్జ్వల°' అని

రెండవ రేకు: మొదటిపేజ



9. పల[10]ద్వ విజయలక్ష్మీ[11]సమాలిఙ్గితోత్తుంగభుజదణ్డమణ్డితానామ్

10. త్రికలిఙ్గమహీభుజాం గఙ్గానామన్వయ మలఙ్కరిష్ణో ర్విణ్ణోరివ

11. విక్రమాక్రాన్తధరామణ్డలస్య గుణమహార్ణ్ణవ మహారాజస్య పుత్రః॥౦॥[12]పూ

12. ర్వ్వామ్ భూపతిభిర్వ్విభజ్య వ[13]సుధాయాః పఞ్చభిః పఞ్చధా [।*] భుక్తాభూరిపరా

13. క్రమోభుజ[14]వలాత్తా[15]మేక ఏవన్వయమ్ [।*] ఏకీకృత్యవిజిత్యస[16]త్రునివహా

14. న్ శ్రీవజ్రహస్తశ్చతు[।*]శ్చత్వారిమ్[17]శతమత్యుదారచరితః సర్వ్వామరక్షీత్సమా

15. ః॥ [౧॥*] తస్యతనయో గుణ్డమరాజా[18] వర్షత్రయమపాలయత మహీమ్॥ తద

నుజః కా

16. మార్ణ్ణవ దేవః పఞ్చత్రింశత మవ్ద[19]కాః॥ తస్యానుజో వినయాదిత్య [ః*]సమా

---

10. '°పలబ్ధ°' అని

11. 'లక్ష్మీసమాలిఙ్గితోత్తుంగ°' అని

12. శార్దూల వృత్తము

13. లేఖకుఁడు మొదట '°వాసుధా°' అని వ్రాసి పిదప 'వసుధా°' గ దిద్దినాఁడు

14. '°భుజబలా°' అని

15. లేఖకుఁడు మొదట '°త్తామిక' అని వ్రాసి పిదప '°త్తామేక°' అని దిద్దినాఁడు

16. '°శత్రునివహాన్' అని

17. '°చత్వారింశత°' అని

18. '°రాజో°' అని

19. '°మబ్దకాః' అని

రెండవ రేకు : రెండవ పెడ



17. స్త్రిస్ర[ః*]॥[20]తతః కామార్ణ్ణవాజ్జాతో జ[21]గతీకల్పభూరుహః। యో రాజద్రాజిత(ః)చా

18. యో వజ్రహస్తోవనీపతిః॥ [౨*॥][22] ప్రశ్యోదన్మదగన్ధలుబ్ధ[23]మధుప వ్యాలీఢగణ్డాన్న

19. జా[।*]న(౨)ధిక[24]భ్యః సమదాత్సహా స్రమ[25]తులో యస్త్యాగినామగ్రణీ[ః।*] స (ః) శ్రీమానవియఙ్క-

20. భీమన్నృపతిర్గ్గఙ్గాన్వ[26]యో తంశ[27]కః [।*]పఞ్చత్రింశతమ[28]బ్దకాన్న

21. మభునక్పృథ్వీమ్ స్తుతః పార్థివైః॥ [3॥*][29] తదగ్రసూనుః సురరాజసూ[30]నునా

22. [స*] మస్సమస్తాం స[31]మితారి మం[32]డలః [।*] స్మపాతి కామార్ణ్ణవ భూ[33]ప తిర్బ్భూర్ణవం సమృద్ధి

23. మానర్ద్ధసమాం సము[34]జ్వలః॥ [౪॥*][35]తదనుతదనుజన్మా[36] చిత్తజన్మోపమానో [।*] గుణ

24. నిధిరనవద్యోగుణ్ణా మాంఖ్యోమహీశ[37]ః [।*] సకలమిద మరక్ష[38] త్రీ ణివహా

---

20. శ్లోకము 21. లేఖకుడు మొదట '°జగతీ°' వ్రాసి పిదప '°జగతీ°' గ దిద్దినాడు 22. శార్దూల వృత్తము 23. '°లుబ్ధం' అని 24. లేఖకుడు మొదట '°న్నధికాస్య:' అని వ్రాసి పిదప దానిని '°న్నధికేభ్యః' గ దిద్దినాడు 25. లేఖకుడు ముందు '°మతులో°' లోని 'మ' అను అక్షరమును గొంచె మిందుమింద 'స' గా వ్రాసి పిదప దానిని 'మ' గ దిద్దినాడు 26. లేఖకుడు ముందు '°గంగాన్వాయో°' అని వ్రాసి పిదప దానిని '°గంగాన్వయో°' గ దిద్దినాడు 27. '°యోత్తంసకః' అని 28. '°మబ్దకాన్' అని 29. వంశస్థము 30. లేఖకుడు ముందు 'సునునా' వ్రాసి పిదప దానిని 'సూనునా' గ దిద్దినాడు 31. '°శమితారి°' అని 32. లేఖకుడు ముందు '°మణ్కలః' వ్రాసి అవస్థపడి తుడచి దానిని '°మణ్డలః' చేసినాడు 33. లేఖకుడు ముందు 'భుపతి' వ్రాసి దానిని 'భూపతి' గా దిద్దెను 34. '°సముజ్జ్వలః' అని. 35. మాలిని. 36. '°తదనుజన్మా°' అని 37. 'మహీశః' అని 38. లేఖకుడు ముందు '°రక్షీత్రిణీ°' అని వ్రాసి పిదప '°రక్షత్రీణీ°' గా దిద్దినాడు. '°రక్షత్త్రిణి°' అని చదువవలెను

మూఁడవ రేకు: మొదటి పిడ



25. ణేధాత్రి [।*] వలయమలఘుతేజో నిర్జితారాతిచక్రః ॥[౫॥*][39]తస్మా ద్వైమా
తురస్తస్యమ

26. ధుకామార్ణవో నృపః। (1)అవతిస్మావనీమేతామద్వానేకా[40]ర్ణవింశతిం॥౦॥[౬॥*]

27. [41] అథవజ్రహస్తనృపతిరగ్రసుతాదఖిలగుణిజనాగ్ర [గ*]ణ్యః [।*] కామార్ణ
వాత్కవీన్ద్ర

28. ప్రగీయమానానదాతశుభకీర్తిః[42][॥౭॥*][43] శ్రియ ఇవ వైదుమ్యా[44]న్వయపయఃప

29. యోనిధిసముద్భవాయాశ్చయః సమజనివినయమహాదేవ్యాః శ్రీవజ్రహస్త

30. ఇతితనయః॥ [౮*] [45]వియదృతునిధి సంఖ్యాం యాతిశాకాబ్ద[46] సఙ్ఘ[।*]ది

31. నకృతినృపధన్ష్ఠే రోహిణీభేసులగ్నే [।*] ధనుషిచసితపక్షేసూర్య్యవారేతృ

32. తీయా(మ్) [।*] యుజిసకలధరిత్రీమ్ రక్షితుమ్ యోభిషిక్తః॥ [౯*][47]న్యాయేన
యత్రసమమా

33. చరితుం త్రివర్గమార్గేణ రక్షతి మహీమ్ మహితప్రతాపే [।*]నివ్యాజధ

---

39. శ్లోకము
40. '౦నేకాన్న వింశతి౦' అని 41.' ఆర్యాగీతి
42. లేఖకుఁడు ముందు 'కీర్తిః' అని వ్రాసి పిదప దానిని '౦కీర్తేః' అని దిద్దినాఁడు. 43.' ఆర్యాగీతి
44. '౦వైదుమ్బాన్వయ౦' అని
45. మాలిని
46. 'శాకాబ్ద౦' అని
47. 'వసంత తిలకము.' 'న్యాయ్యేన' అని

మూఁడవ రేకు: రెండవ పెడ



34. యశ్చ నిరపాయశ్చ నిరాపదశ్చ శశ్వత్ప్రజా భువి భవన్తి విభూతి వ[48]ర్త్యః॥ [౧౦*] [49]వ్యాప్తే గగ

35. కులోత్తమస్య యశస[50] దిక్చక్రవాలేశశి [।*] ప్రద్యోతామలిసేన యస్య భువన ప్రహ్లాద[51]

36. సమ్పాదినా [।*] సై[52]న్దూరై రతిసాన్ద్రపఙ్క-పటలై [ః*] కుమ్భస్థలీ పట్టకే [।*] శ్వా[53]లిమ్పన్తి పున[ః*]

37. పునశ్చ హరితా మాధోరణావారణాః॥[౧౧*॥][54]అనురాగేణ గుణినో యస్య వ

38. క్త్రముఖా[55]బ్జయోః। ఆ[56]శీనే శ్రీసరస్వత్యా వనుకూలే విరాజత [ః*] ॥౦। [౧౨*]॥

39. లిఙ్గన [గ*]రా త్పరమ మాహే[57]శ్వర పరమభట్టారక మహారాజాధిరాజ త్రి

40. కలిఙ్గాధిపతి శ్రీమదన న్తవర్మా వజ్రహస్తదేవః కుశలీ సమస్తామాత్య

41. ప్రముఖజనపదా న్సమాహూయ సమాజ్ఞాపయతి విదితమస్తు భవతామ్॥

42. కోలువ ర్తనివిష యే॥ కుద్దమాఖ్యగ్రామః సీమావచ్ఛిన్నః సజ.

---

48. '°మర్త్యః' అని

49. శార్దూలము

50. 'యశసా' అని

51. లేఖకుఁడు మొదట '°ప్రహ్లాదా°' అని వ్రాసి దానిని 'ప్రహ్లాద°' అని దిద్దినాడు

52. 'సిన్దూరై' అని

53. '°ప్వాలిమ్పన్తి' అని

54. శ్లోకము

55. '°ముఖాబ్జయోః' అని

56. 'ఆసీనే' అని

57. లేఖకుఁడు ముందు 'మాహిశ్వర' వ్రాసి పిదప దానిని 'మాహేశ్వర' గా దిద్దినాడు

నాలుగవ రేకు: మొదటిపెడ



43. లస్థలః సర్వ్వపీడా వివర్జ్జితమాచ[58]న్ద్రార్క్కక్షితి సమకాలం యావన్మా తాపిత్రో

44. రాత్మనః పుణ్యయశోభివృద్ధయే। శరవసునిధి శాకాన్దే[59]। కార్త్తికమాస ప్రథ

45. మపక్షే తృతీయాం[60] సో[61]వారే। దత్తగోత్రస్య వైస్య[62] కులోద్భవః। మాధ వాఖ్యః

56. తస్యపుత్రః సోమనస్రే[63]ష్ఠః। తస్యభార్య్యార్ రయపా। తయోర్జ్జాతాయ

47. మల్లపస్రే[64]ష్ఠాయ ఉదకపూర్వ్వం తామ్రప్రా[65] శాసనం కృత్వా ప్రదత్త[66] మస్మాభి

48. ర్భూవిభి భూమిపాలై ర్మనునో[క్త*] ధర్మ్మ[67] గౌరవాత్పరిపాల[68] నీయమి[69]

49. తి। రాజతః[70] శాసనం లబ్వా[71] పు[72]నరయుంగ్రామః। గృహస్థానముద్యాన

50. స్థానంచ। స[73]తమురాధాన్యో[74] త్పన్నభూమిశ్చ[75] స్వస్య క్షేమయిత్వా। జల

---

58. లేఖకుఁడు ముందు 'మా' వంటి యక్షరమేదో వ్రాసి పిదప దానిని 'న' గా దిద్దినాఁడు 59. 'శాకాబ్దే' అని 60. '°తృతీయా°' అనిగాని లేక '°తృతీయాయాం°' అనిగాని చదువవలెను. 61. '°సోమవారే' అని 62. 'వైశ్య' అని 63. '°శ్రేష్ఠః' అని 64. '°శ్రేష్ఠాయ' అని 65. తామ్రశాసనం' అని 66. 'ప్రదత్తోస్మాభి°' అని 67. 'ధర్మగౌరవా°' అని 68. లేఖకుఁడు ముందు 'పాలా°' అనివ్రాసి పిదప '°పాల°'గా దిద్దినాఁడు. 69. '°పాలనీయ ఇతి' అని 70. 'రాజ్ఞః' అని 71. 'లబ్ధ్వా' అని 72. లేఖకుఁడు ముందు 'పూ' వ్రాసి పిదప దానిని 'పు'గ దిద్దినాఁడు. 73. 'శత' అని 74. లేఖకుఁడు ముందు 'ధాన్యోత్పన్న°' అనివ్రాసి దానిని మఱల 'ధాన్యోత్పన్న°' అని దిద్దినాఁడు. 75. లేఖకుఁడు ముందు 'స్వస్య' అని వ్రాసి పిదప దానిని 'స్వస్య'గా దిద్దినాఁడు.

నాలుగవరేకు: రెండవపిడ



51. ముప్వారాఖ్య గ్రామనివాసీ। వభ్య[76]సాశ్చ ఉపమన్యగోత్రస్య। ద్విజోత్తమః। పి
52. ల్లి స[77]మ్మఁః। తస్యపుత్రః కరంటమనాయకః। తస్యభార్యా రేకపా। తయో
53. ర్జాతేన। మాపయనాయకేనసహ త్రిస[78]తిభ్యః। వ్రా[79]హ్మణేభ్యః అగ్రహా
54. రంకృత్వా ఉత్తరాయణ నిమిత్తే। మల్లయ స్రే[80]ష్ఠేన ధారా పూర్వ
55. కం। కుద్దాఖ్యగ్రామం ప్రద[81]త్తమితి। అస్యగ్రామస్య ఉత్పన్న
56. కరైః రాజ్ఞా(ం) దే[82]యమ్ సతమురి[83] ధాన్యై రష్టమాడైశ్చ॥



రాజముద్రిక

రాగికడియము

76. ఈపదమునకు అర్థము బోధపడుటలేదు. 77. 'శమ్మఁః' అని 78. 'త్రింశతి' అని 79. 'బ్రాహ్మణేభ్యః' అని 80. 'శ్రేష్ఠేన' అని. లేఖకుఁడు ముందు 'స్రేష్ఠిన' అని వ్రాసి, పిదప దానిని 'స్రేష్ఠేన' అని దిద్దినాఁడు. 81. 'ప్రదత్త మితి' అని 82. లేఖకుఁడు ముందు 'దియం' అనివ్రాసి దానిని పిదప 'దేయం' అని దిద్దెను. 83. 'శతమురి' అని




లలితకళలలో సర్వమానవహృదయములను రంజింపఁజేసి రసానుభవమును, తాదాత్మ్యభావమును గలిగించునది చిత్రకళయే. ప్రాచీనకాలమునుండియు దేశకాలజాత్యాచారభేదములచేఁ గొన్ని మార్పులఁ జెందుచు వచ్చినను చిత్రకళ స్వాతిశయమును గోల్పోవక నూతనమార్గముల వెలయుచుండుట నిర్వివాదాంశము. ప్రాచీనబౌద్ధకాల (అజంతా) చిత్రములకును, మధ్యకాలపు రాజపుత్ర మొగలు చిత్రములకును, ఈనాటి ప్రాచ్య పాశ్చాత్య చిత్రములకునుగల తారతమ్య మీవిషయమును దేటపఱుచుచున్నది. కాని క్రమముగ భారతీయ చిత్రములయందు భావప్రధానములై రసానందానుభవమును గలిగించునవి మృగ్యములయ్యెను. పాశ్చాత్య చిత్రలేఖన విధానసాంకర్యమే దీనికిఁ గారణము. ఇటీవల వంగదేశచిత్రకారులచే లిఖింపఁబడిన చిత్తరువులు కొన్ని యీలోఁటలను దీర్పఁదగినవిగ నున్నవి. చిత్రకళాపరిజ్ఞానమంతగా నభివృద్ధిగాంచకుండిన యాంధ్రదేశమునఁగూడ భావప్రధానచిత్రములను జిత్రింపఁగల చిత్రకారులు కొందఱిప్పుడిప్పుడు ప్రసిద్ధికెక్కుచున్నారు. ఇది యాంధ్రమాత కభ్యుదయసూచకము. మఱియు నీచిత్రకళయొక్క యభివృద్ధికిఁ జిత్రకళాశాలలు, చిత్రకళాప్రదర్శనములు విశేషములుగఁ దోడ్పడుచున్నవి. అట్టి వాంధ్రదేశమునఁ గొన్నియే కలవు. వానిలో రాజమహేంద్రవరమునందలి చిత్రకళాశాలయు, బందరు జాతీయకళాశాలలోని చిత్రకళాశాఖయుఁ జెప్పఁదగినవి. ఈ రెండును యథాశక్తిని జిత్రకారుల నాంధ్రమాత కర్పించుచున్నవి. ఇంకను ఇట్టివెన్నియో యాయుండినఁగాని భారతీయ చిత్రకళ సత్వరాభివృద్ధిని గాంచ నేరదు. ఆంధ్రచిత్రకళకుఁ బ్రత్యేకవ్యక్తిత్వమును గలుగఁజాలదు. కావున సంపన్నులును ఉదారాశయులును నగు నాంధ్రమహాజను లీవిషయమున నధికముగ శ్రద్ధను వహించి చిత్రకళాభివృద్ధికిఁ దోడ్పడవలసియున్నారు.

ప్రస్తుత మాంధ్రదేశమున నెన్నికగాంచిన చిత్రకారులలో (1) శ్రీయుత దామెర్ల రామారావుగారు సుప్రసిద్ధులు. వీరివయస్సు 27 సంవత్సరములు. వీరిచిత్రము లించుక పాశ్చాత్య లేఖనవిధానసాంకర్యము గలిగియున్నను భావగర్భితములై భారతచిత్రకళను జక్కఁగాఁ బోషింపఁజాలినవై యున్నవి. వీరి చిత్రములలో సాకారచిత్రము లుత్తమస్థానము నలంకరించుచున్నవి. భావగర్భితములై జీవకళను వెలిపుచ్చుచున్నవి. హైందవసాంప్రదాయానుసారముగ నలంకార లక్షణ



3౯ వ అఖిల భారత జాతీయమహాసభా స్వచ్ఛంద సేవా యువతీబృందము - బెల్గాము

ఆంధ్రచిత్రకారులు



శ్రీయుత దామెర్ల రామారావుగారు

రాజమహేంద్రవరము



చామకూర భాష్యకార్లు రావుగారు

రాజమహేంద్రవరము



వరదా వెంకటరత్నం గారు

రాజమహేంద్రవరము

ములను గ్రహించి తమచిత్రములయందుఁ బొందుపఱుచుటయందు వీరికి సామర్థ్యము మెండు. వీరిచిత్రములలో నధికముగ స్వకపోల కల్పితము లగు పోకడలే కాన్పించుచుండును. వీరిచిత్రములు భారత దేశమున జరిగిన వివిధ కళా ప్రదర్శనములయం దనేకబహుమాన ములఁబడసినవి. వెంబ్లీ ప్రదర్శనమునను బహూకరింపఁబడినవి. వెంబ్లీ ప్రదర్శనమునకుఁ బంపిన వానిలో నొకదానిని కనేడియన్ జాతీయ ప్రదర్శనమువారు గైకొనిరి. ఎల్లవిషయములను స్వాతిశయమును బ్రకటించుకొను పాశ్చాత్యులు వీరిచిత్రములమొడఁ జూపిన గౌరవ భావమే వీరి పేర్పును జాటుచున్నది.

(1) కృష్ణలీల, (2) రాణి యలంకరించు కొనుట, (3) కాఠియవార్ గొల్లపడుచు, (4) సిద్ధార్థరాగోదయము, (5) కార్తికపూర్ణిమ (4,5 చిత్రములు వెంబ్లీయందుఁ బ్రదర్శింపఁబడినవి), (6) నందిపూజ, (7) పుష్పాలంకారము, (8) అజంతావిహారము, (9) అజంతాగుహలు, (10) ఎల్లోరా గుహలు, (11) భారతి (భారతిసంపుటము ౨ సంచిక ౧ అట్టపైచిత్రము) మొదలయినవి వీరియుత్తమ చిత్రములలోఁ గొన్ని.

(2) శ్రీయుత చేమకూర భాష్యకార్లు రావుగారు. వీరి వయస్సు 29 సంవత్సరములు. వీరు రూపచిత్రరచనమునఁ గడునిపుణులు. వీరి చిత్రములు స్వదేశవిదేశములయందుఁ బేరెన్నిక గాంచినవి. వెంబ్లీ ప్రదర్శనమునకుఁ బంపిన రెండు చిత్రములలో నొకదానిని కనేడియను జాతీయవస్తుప్రదర్శన సంఘము వారు గైకొనిరి. వీరిచిత్రములలో (1) లోకమాన్య తిలకుగారిరూపచిత్రము, (2) మహాత్మా గాంధిగారి రూపచిత్రము, (3) భగవద న్వేషణము (గోపికలు - వెంబ్లీలో ప్రదర్శింపఁ బడినది), (4) నటారీశ్వరుఁడు, (5) శకుంతలా దుష్యంతుల పునస్సమావేశము, (6) అనంతునియందు లీనము మొదలయినవి ప్రశస్తము లయినవి.

3. శ్రీయుత వరదా వెంకటరత్నము గారు. వీరిచిత్రవిద్యానైపుణ్యము పరంపరాగత మైనది. ఏకరూపచిత్రరచనమునందు వీరు మిగుల సమర్థులు. చెన్నపురి చిత్రకళా ప్రదర్శనములలో వీరిచిత్రములు పెక్కులు బహుమతులఁగాంచినవి. ఒకచిత్రము వెంబ్లీ ప్రదర్శనమునకును బంపబడెను. (1) విష్ణువు, (2) నటరాజు (వెంబ్లీలో ప్రదర్శింపఁబడినది), (3) వారణాసిరాజు, (4) కైలాసనాథశివ మొదలయి నవి వీరిచిత్రములలోఁ బేరుగాంచినవి.

ఈముమ్వురియొక్క రూపచిత్రము లీ సంచికయందుఁగలవు. ఈఛాయాచిత్రములను కాంగ్రెసు పత్రికాధివ్యాహకులు శ్రీయుత ముద్దూరి అన్నపూర్ణయ్యగారు భారతియందుఁ బ్రకటనార్థము దయతోఁబంపిరి.






## బారిష్టరు పార్వతీశం

ప్రథమభాగము

గ్రంథకర్త: శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు, సాహితీసమితి, తెనాలి. క్రౌను పే. 166, ఫెదర్‌వైటుకాగితం. పుస్తకం క్రొత్తతోవతొక్కి- అందంగా కనిపిస్తుంది.

వెల రు. 1-4-0.

ఆంధ్రవాఙ్మయంలో సామాన్యంగా వాడుకమాటల్లో క్రొత్తభావాలను, క్రొత్తపోకళ్లను నింపుతూ, పాటలూ, పదాలూ, పద్యాలూ, కథలూ, గుంపులుగుంపులుగా పుట్టుతూ ఉండడమూ, వాటిని వ్రాసేవారు సాహితీసమితి సభ్యులే అయిఉండడమూ దాదాపు ఆంధ్రలోకమంతా ఎరిగినవిషయమే. వాటిలో సరసాలు, విరసాలు, ఎన్నోరకాలు. అవి గ్రహించేవారి రుచినిబట్టి ఏర్పడుతూ ఉంటవి.

ఈగ్రంథకర్తగారు సాహితీసమితి సభ్యులూ, సరసులూ. వారీగ్రంథాన్ని చదివేవాళ్లకు నవ్వు పుట్టాలని హాస్యరసంతో గుచ్చెత్తి వ్రాసారు. కథానాయకుడు పార్వతీశం కుర్రవాడు అయిదోఫారందాకా చదివాడు. బారిష్టరు అయి దేశానికి యేదో యేదో చేయాలని యింగ్లాండు ప్రయాణం కట్టాడు. మొగల్తుర్రు పార్వతీశం మదరాసు, కొలంబో, మార్సెల్సులమీదుగా ఫోక్‌స్టన్ చేరాడు-అనగా ఇంగ్లాండులో అడుగు పెట్టడన్న మాటే. ఇక్కడతో యీభాగం అంత[illegible]స్తుంది.

శ్రీవీరేశలింగం పంతులుగారి ప్రహసనాల్లోకంటే, శ్రీపానుగంటి లక్ష్మీనరసింహరావుగారి హాస్యగ్రంథాల్లోకంటె యీగ్రంథంలో హాస్యరసం పొంగి పొరలి చదివేవాళ్లను ముంచేస్తుందా అన్నసందేహం బాధ[illegible]స్తుంది. ఎంచేతంటే, అయిదోఫారందాకా చదువుకొన్న పార్వతీశం నిడదవోల్లో రైలెక్కేటప్పుడూ, రైళ్లలో, మదరాసు హోటల్లో, ట్రాము ఎక్కేటప్పుడూ, స్టీమరు ఎక్కేటప్పుడూ, స్టీమరులోపలా, ఇంకా ఎన్నిచోట్లనో, చేసిన వెఱ్ఱిచేష్టలూ, చెప్పిన వెఱ్ఱిమాటలూ స్వభావసహజంగా ఉంటవా అని. అయితే పైవారిగ్రంథాల్లోకంటే దీన్లో ఒక విశేషం. ఏంటంటారా - వాడుకమాటల్లో వ్రాయడం. అంచేతనే విమర్శనంకూడా వాడుకమాటల్లోనే చేయడం. మొదటనే చెప్పేను కాదూ రుచినిబట్టి తేలాలని యిదంతా. అంచేత యీగ్రంథాన్ని అందఱూ చదివి రసం చవి యిలాటిదని నిశ్చయించాలి.

ఇంకా పార్వతీశంగారు బారిష్టరు అయి చేసే దేశసేవల్లో తెలివి తేటలు తెలిపి నవ్వించాలని గ్రంథకర్తగారిని కోర్తాం.

క. సు.




శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

భారతదేశసమస్య లపూర్వములై మహామహులనుసయితము సంభ్రమపరవశులను జేయుచున్నవి. పరదేశీయుల దురభిమాన దౌర్జన్యములు స్వదేశీయుల దైన్యదౌర్బల్యములు పరమానర్థములకు మూలములైనవి. సర్వమును విలయావస్థనాశ్రయించుచున్నవి. పునర్నిర్మాణమునకు విలయ మాధారమైనను వర్తమాన పరిస్థితులు విషాదమును గలుగ జేయుచున్నవి. భావము లతివేగమునను పరువిడుచున్నను కార్యములు మందగమనమును జేయుచున్నవి. తెల్లవారికిని భారతీయులకును, మహమ్మదీయులకును హిందువులకును, బ్రాహ్మణేతరులకును బ్రాహ్మణులకును, నిమ్నజాతులకును నున్నతజాతులకును ప్రతిఘటనము ప్రబలుచున్నది. రాజకీయ సాంఘికార్థిక రంగములందు సంరంభము ప్రబలుచున్నది. కార్యభార మహత్వము విషాదమును గలుగ జేయుచున్నది. విషాదదశయందు చేయవలసినది తోచక నిస్పృహాయును నిరాశయును గలుగుచున్నవి. ధర్మనిర్వహణ మార్గము గనుపడకున్నది. వివిధ రంగములందును పరార్థ ప్రయోజనమంతర్థానమై స్వార్థప్రయోజనము ప్రత్యక్షమగుచున్నది. పాలకజాతి నిరంకుశాధికారమునకు సహజమైనదురహంకారమును బూని దుశ్శాసన ప్రయోగమునకు గడంగినది. వంగరాష్ట్రమునందు లిట్టను ప్రభువర్గము ప్రయోగించినదుశ్శాసనమును వంగరాష్ట్ర శాసనసభ నిరాకరించినను నిరంకుశవర్గము దుశ్శాసనమును ధర్మశాసనమును జేసినది. నిర్బంధితులు విమోచనసాధనము లేకను నిర్బంధదుఃఖమున ననుభవించుచున్నారు.వివిధపత్రికలవారునుదుశ్శాసనము నేకగ్రీవముగనుఖండించినను నిరంకుశవర్గము నిర్లక్ష్యము చేయుచున్నది.సామ్రాజ్యశాసనసభయందుదుశ్శాసనమునకు సంబంధించిన ప్రస్తావములను ప్రశ్నలను నిరంకుశాధికారవర్గమునకు శిఖరమైన రీడింగుప్రభువు నిరాకరించి నిరంకుశాభిమానమును విశదముచేసెను. గ్రేటుబ్రిటనునందు ప్రధాన న్యాయాధికారిమైన రీడింగుప్రభువు భారతభూమియందు గవర్నరు జనరలు సింహాసనము నెక్కినతోడనే నూతనమైన రూపభావములను దాల్చుట విచిత్రముగ గనుపడును.

ఈపరివర్తనమునకు స్థానప్రభావము మూలముగ నున్నది. నిరంకుశావరణ ప్రవేశము భ్రమరకీటన్యాయమురీతిని నిరంకుశస్వరూపమును గలుగజేయుచున్నది. భారతీయులకు ప్రతిఘటనసామర్థ్యము లేనపుడు నిరంకుశాధికారదుఃఖము ననుభవనీయమగుచున్నది. గవర్నరుజనరలు సింహాసనమునందు మింటో ప్రభువు కూర్చున్నను, రీడింగు ప్రభువు కూర్చున్నను, భారతమంత్రి పదవియందు పీలుప్రభువున్నను, ఓలివియరు ప్రభువున్నను, బర్కెనుహెడు ప్రభువున్నను, బ్రిటీషు ప్రభువర్గము లేబరుపక్షమైనను, లిబరలుపక్షమైనను, కన్సర్వేటివుపక్షమైనను, స్థానబల మలంఘనీయమై భారతరాజ్యాంగస్వరూప మేకరూపభావములను దాల్చుచున్న విధమును నిత్యానుభవము విశదముచేయుచున్నది. మాన్చెస్టరుగార్డియను సామోపాయమును బోధించినను, సర్ మైకేలు ఓడ్వయరు దండోపాయమును బోధించినను, దృక్కోణమునందు మాత్రము భేదము గనుపడదు. బ్రిటిషురాజనీతిజ్ఞుల ప్రగల్భములైన ప్రకటనములు నేతిబీరకాయలనియు, నిరంకుశవర్గ నిరీక్షణము స్వజాతియందును స్వదేశమునందును స్వసామ్రాజ్యమునందును లగ్నమగుచుండుననియు చిరకాలానుభవము విశదము చేసినది. భారతభూమికి తరణోపాయము పరహస్తములనుండి గలుగదనియును స్వహస్తములనుండిగలుగవలయుననియును బాగుగ దెలిసినది. భారతీయుల విభేదములు దైన్య దౌర్బల్యములకు మూలములై తరణోపాయమునకు ప్రతిబంధకములుగనున్నవి. గాంధిమహాత్ముడు భారతీయుల అంతర్విభేదముల నంతరింపజేయుటకును సంయోగయోగాభ్యాసమును సాధ్యము చేయుటకును చేయుచున్న మహా ప్రయత్నములు సఫలముగాకుండుట పురాకృతకర్మఫలముగ నున్నది. భారతీయుల సకల ప్రయత్నములందును పురాకృత కర్మ ఫలము ప్రత్యక్షమగుచు విజయసాధనము దురారాధ్య మగుచున్నది. గాంధిమహాత్ము డహర్నిశము సంయోగకార్యాచరణమునకు జేయుచున్న ప్రయత్నములు ప్రజా విశ్వాసమునకు పాత్రములయ్యును నిరాదరణమును బడయుట సంతాపమునుగలుగ జేయుచున్నది. డిల్లీయందు గూడిన వివిధపక్షసభకును నీగతియే కలిగినట్లు తోచుచున్నది.

* * * *

వివిధపక్షసభ

డిల్లీయందు గూడిన వివిధపక్ష సభకు ప్రయోజనము గలుగదనువిషయ మారంభమునందే తెలిసియున్నను సభా నిర్వాహకులు చూపిన మానసభావము విషాదమును గలుగజేయుచున్నది. గతమాసాంతమునందు వివిధపక్షనాయకుల సభ డిల్లీయందు గూడినది. వివిధపక్షములవారును స్వపక్ష ప్రయోజనములను సువ్యక్తముచేసిరి. మహమ్మదీయులు వారిపక్షవాదమును బూనిరి. జిన్నాగా రత్యద్భుతముగను మహమ్మదీయ పక్షవాదమును సమర్థించిరి. హిందువులు మహమ్మదీయుల కాంక్షలను సఫలము చేయనియెడలను ప్రభుత్వము సఫలముచేయుటకు సిద్ధముగనున్నదని జిన్నాగారు బెదరించిరి. ఇంగ్లాండునందు

విన్సెంటుగారును మహమ్మదీయులు ప్రభుత్వాదరణమును గోరుచున్నారని తెలియజేసిరి. మహమ్మదీయులు వివిధరాష్ట్రములందును చేయుచున్న ప్రయత్నము లీవాసననె విశదముచేయుచున్నవి. వంగ పాంచాలరాష్ట్రములందు సమావేశమైన మహమ్మదీయసభ లీధోరణినె విశదము చేయుచున్నవి. మహమ్మదీయులదృష్టి యుద్యోగములమీదను పదవులమీదను ప్రసరించుచున్న విధమును మహమ్మదీయాభిప్రాయము విశదముచేయుచున్నది. మహమ్మదీయాశా విజృంభణము హిందువుల డెందములందు సందియములను గలుగజేసినది. మదనమోహన మాలవ్య, లజపతిరాయి, శ్రీనివాసయ్యంగారు మొదలగు నాయకులు హిందూపక్షవాదమును బలపరచిరి. మహమ్మదీయు లధికస్థానములను ప్రత్యేక ప్రాతినిధ్యముఖమునను బడయగోరుచున్నారు. హిందువు లధికస్థానముల నంగీకరించినను, ప్రత్యేకనియోజకవర్గమును నిరాకరించుచుమిశ్రమనియోజకవర్గమునుగోరుచున్నారు. లిబరలుపక్షమువారు కాంగ్రెసువిధానమును నూలునపుకొనుట లక్ష్యముచు మార్చగోరుచున్నారు. బెజంటమ్మగారు స్వరాజ్యవిధానమును నిర్ధారణచేయ గోరుచున్నారు. రామస్వామి మొదలియారుగారు బ్రాహ్మణేతర ప్రయోజనములను నిర్ణయింప గోరుచున్నారు. ఈ సంకీర్ణ ప్రయోజనముల నుండి పరమార్థప్రయోజనము బయల్పడుట దుస్తరమైనను గాంధిమహాత్ముడు యథావిధిగను ధర్మనిర్వాహణమును జేయుచూనుట మహాత్మునివిశాల హృదయమును వ్యక్తముచేయుచున్నది. గతవారపు యంగుఇండియాపత్రికయందు హిందూమహమ్మదీయ సమస్యవిషయమై మహాత్ము డాంగ్లేయునకు దెలిపిన భావమే దేశమోక్షమునకు పరమసాధనముగ నుండగలదని వివిధపక్షములవారును గ్రహించవలయును. "లౌకిక ప్రయోజనములం దధిక సంఖ్యాకులైన హిందువులు మహమ్మదీయులకు త్యాగమును జూపవలయును. ముఖ్యముగను దేశసేవా పరాయణులు రాజకీయ పదవులకు నిరపేక్షా భావమును జూపవలసి యుందురు. దౌర్బల్యమును ప్రతిఘటించుటకుగల శక్తివలన స్వరాజ్యము సిద్ధించునుగాని కొందరధికార పదవులను బడయుటవలనను స్వరాజ్యము సిద్ధించదు. ప్రజాసామాన్యమున కధికార నియంత్రణము నందును పరిపాలనమునందును గల శక్తిస్వభావమును వృద్ధిచేయుటయే స్వరాజ్యసిద్ధికి సాధనము." మహాత్మునిభావములను గ్రహించినవారలకు స్వరాజ్యసాధనము ప్రత్యక్షము గాకపోయినను మనోగతంబగుచున్నది. ఆత్మ విశ్వాసమును పరస్పర విశ్వాసమును స్వరాజ్యప్రాప్తికి సాధనంబులైనను వివిధపక్షములవారును నుద్యోగములకును పదవులకును పెనగులాడుచున్న విధమును వివిధపక్షముల సమావేశవ్యవహారములు విశదము చేసినవి. పరిపాలనమునం దధికారాశ్రయమున కవకాశములుగలవు గాని స్వతంత్ర రాజకీయవ్యవహారముల కవకాశములు లేవని నిత్యానుభవము విశదముచేయుచున్నను నధికారసమ్మోహము పరమానర్థములకు మూలమగుచున్నది. దేశసేవకులదృష్టి యధికార సమ్మోహమును

వదిలి యనన్యమైన దేశసేవయందు లగ్నమగుటకు భారతజాతి విశ్వప్రయత్నముచేయవలసియున్నది. ఈసాధన మెంతస్వల్పమైనను ప్రజాలక్ష్యమును బడయుటకు దేశాభిమానులు పాటుపడునపుడు స్వరాజ్యాగమనము సాధ్యముగా గలదు. పండిత మోతిలాలు నెహ్రూగారు దెలిపినట్టులు బెజంటమ్మగారి యుపసంఘము ఫిబ్రవరి మాసాంతమునకు స్వరాజ్యవిధానమును సిద్ధముచేసినను ఢిల్లీ సమావేశమునకు ప్రధానాశయమైన వివిధ పక్షముల సంయోగము కాంగ్రెసు వేదికయందు సమకూడునని నమ్ముటకు సూచనలు గనుపింపవు. ఈ విషమదశయందు ఖద్దరు లక్ష్యము నయితము వెనుకకుబడుటయును కాంగ్రెసు పూర్వస్థితిని దాల్చుటయును సంభవముగ గనుపడుచున్నది. రెండుమూడు మాసములందు రాజకీయపరిస్థితులందేమి మార్పులు జరుగనున్నదియును దురూహ్యముగ నున్నది. దేశపరిస్థితులెట్టులున్నను ఖద్దరుప్రచారమునైనను జేసి స్వరాజ్యానుతాపమును స్వరాజ్యార్హతను వ్యక్తముచేయుట భారతీయులకు పరమధర్మముగనున్నది. లోకోత్తరపురుషుడైన గాంధిమహాత్మునినాయకత్వము ఖద్దరు విధానముమీద నాధారపడియున్న విషయము నైనను ప్రజలును నాయకులును గ్రహించి స్వధర్మనిర్వహణమును జేయుట భావ్యముగ నున్నది. శ్రీకృష్ణభగవానుడు విషాదయోగపరవశుడైనవిజయున కుపదేశించినకర్మయోగ మార్గమునె గాంధిమహాత్ముడు విషాదపరవశులైన భారతీయుల కుపదేశించుచున్నాడు. "అకర్మణులకు శరీరయాత్రనయితము బాగుగ జరుగదు" అని శ్రీకృష్ణభగవానుడు గీతాశాస్త్రమునందు బోధించిన ధర్మము ప్రత్యక్షముగ గనుపడుచున్నది. శ్రీమతి బెజంటమ్మగారు భారతదేశము నిశ్చేష్టతను వహించిన విధమును వారి వ్యాసావళియందు విశదము చేసినది. నిశ్చేష్టతనుబోగొట్టి స్వరాజ్యనాదమును దిగంతరాళమునందును గృహాంతరాళమునందును నింపుటకు ఖద్దరుముఖ్యసాధనముగ నున్నది. ముప్పదికోట్ల ప్రజలు త్రికరణశుద్ధిగను ఖద్దరు నారాధించునపుడు స్వరాజ్యము స్వయముగ రాగలదను మహాత్ముని విశ్వాసమును భారతీయులును నారాధించి మహాత్ముని సంకల్పమును సఫలముచేసి స్వరాజ్య సందర్శనమును జేయుదురుగాత !




Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thumbu Chetty Street. G. T. Madras